గాంధీ సాహిత్య ప్రచురణ 3

# నా మతము

*

రచయిత :

ఎం. కె. గాంధి



సంకలనం :

భరతన్ కుమారప్ప

అనువాదం :

మల్లవరపు విశ్వేశ్వరరావు.

*

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ
కాకినాడ

# విజ్ఞప్తి

ద్వేషము, హింస, జాత్యహంకారముతో నిండి, స్వార్థపరత్వము కారణంగా నిత్యసంఘర్షణలకు, మానవజాతి వినాశానికి దారితీస్తూవున్న ప్రపంచానికి శాంతిదూత, ఆశాజ్యోతియై వెలసి గాంధీమహాత్ముడు సత్యయుగస్థాపనాచార్యులుగా శాంత్యహింసల సందేశాన్ని ప్రపంచాని కందించారు. ఆయన భావాలు సనాతన హిందూధర్మంలో దృఢంగా వ్రేళ్లుపాతుకొనిపోయి వున్నాయి. కాని ఆయన ఇతర మతముల సంపర్కం వలన సముపార్జించిన జ్ఞానమును సంపూర్ణంగా జీర్ణం చేసుకున్నవారు కావడం వలన ఆయన హిందూమతము ఆయనయొక్క స్వీయాభిప్రాయాలపై సనే ఆధారపడిందని చెప్పాలి. తనకు ఎదురైన ప్రతి నూతన భావాన్ని తనలో జీర్ణం చేసుకొనడం హిందూమతము యొక్క విశిష్టత. ఈ విశిష్టత గాంధీజీలో ప్రతిబింబితమయింది. గాంధీజీ ద్వారా హిందూమతము పునరుజ్జీవనము పొందినదనడం అతిశయోక్తి కాదు. ఆయన సందేశం ప్రపంచమంతటా అన్ని దేశాల దృష్టిని ఆకర్షించింది.

గాంధీజీ తాను నమ్మిన మత సూత్రాలను ఆచరణలో పెట్టుటయందే తమ జీవితమంతా కృషిచేసారు. కాన వ్యక్తి జీవితమందుకాని, సాంఘిక జీవితమందుకాని, రాజకీయ జీవితమునందుకాని ఆయన చేసిన ప్రతి కార్యానికి ఆయన

యొక్క మతవిశ్వాసమే మూలకారణము. ఆయన చేసిన పనులు, ఆయన చెప్పిన మాటలు అన్నీ ఆయన మతమే అని చెప్పవలసియుంది. Young India, Harijan పత్రికల యందు ఆయన వ్రాసిన వ్యాసములు, ఇతర గ్రంథముల యందు ఆయన వెలిబుచ్చిన అభిప్రాయములు ఆధారంగా తీసుకొని యీ పుస్తకము ఆంగ్లములో "My Religion" అను పేరుతో వెలువరింపబడినది. గాంధీ సాహిత్య ప్రచురణాలయము యొక్క ప్రచురణలలో ఇది రెండవది.

భారతదేశ స్వతంత్ర ప్రదాత, సత్యయుగస్థాపనాచార్యులే గాక ప్రపంచానికి నూతన సందేశాన్ని అందించిన మహాత్మా గాంధి రచనలు ప్రతి భాషలోనికి అనువదింపబడ వలసియున్నది. వానిని చదివి, ఆచరణలో పెట్టుట ప్రతి భారతీయుని విధి. కాన గాంధీజీ రచనలను తెలుగులోనికి అనువదించి, ప్రచురించు నుద్దేశ్యముతో గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖవారు ప్రత్యేకముగా ప్రచురణశాఖ నెలకొల్పి కృషి చేస్తున్నారు. గాంధీ సాహిత్య ప్రచురణసలహాసంఘము 1959 జూన్ మాసములో నెలకొల్పబడినది. తదుపరి సంపాదకవర్గ మేర్పరచి, ప్రచురణ కార్యక్రమము, దైనందినకార్య నిర్వాహణ యొనరించుటకు 1959 అక్టోబరు 2వ తేదీన గాంధీ సాహిత్య ప్రచురణాలయము ప్రారంభింపబడినది. ఈ కృషి ఫలితంగా కీ॥ శే॥ స్వామీ సీతారాంగారు అనువదించిన "ఢిల్లీ దినచర్య" అను గ్రంథము మొదట ప్రచురితమయినది.

ఆంధ్ర ప్రదేశమందుగల వివిధ సంస్థలు, వ్యక్తులు వీని నుపయోగించిననాడే యీ ప్రచురణలక్ష్యము సిద్ధించ గలదు. అందరు ఆంధ్రుల హృదయములందు బాపూజీ సందేశ, ఆదేశాలు ఈనాటికీ సజీవములై యున్నవి. కాన యింటింటా యీ రచనలకు స్థానముండగలదని మా హృదయ పూర్వక వాంఛ. గాంధీ సాహిత్యమును బహుళప్రచారము లోనికి తీసుకొనివచ్చు బాధ్యతను మాతోబాటు విద్యా మంత్రిత్వశాఖ, సమాచారశాఖ, జిల్లా పరిషత్తులు, పంచా యతీ సమితులు వహింపవలెనని మా విజ్ఞప్తి.

ఇట్లు
విధేయుడు
మల్లవరపు వెంకట కృష్ణారావు
అధ్యక్షుడు
గాంధి స్మారకనిధి, ఆంధ్రశాఖ
గాంధి సాహిత్య ప్రచురణశాఖ

శ్రీనగర్
కాకినాడ
3–8–1960

# సంపాదకుని విజ్ఞప్తి

గాంధీజీ జీవితమంతా కేవలం తాను నమ్మిన మత సూత్రాలను ఆచరణలో పెట్టే కృషితో నిండినది మాత్రమే అయివున్నందున, ఈ పుస్తకంలో ఆయనయొక్క మత విషయికములైన విశ్వాసాల నన్నింటిని వీలైనంత సంపూర్ణంగా ప్రతిఫలించే రీతిగా గాంధీజీ రచనల నుంచీ, ప్రసంగాలనుంచీ భాగాలను సంకలనంచేసి, పాఠకలోకానికి ప్రదర్శించడానికి ప్రయత్నం చేశాము.

మేము తలపెట్టిన ఈ పని అంత సులభమైనదికాదు. గాంధీజీ చర్యలన్నిటికీ ఆయనయొక్క మత విశ్వాసమే మూలకందమగుటచేత ఆయన బహిరంగ జీవితరంగ మంతటిలోనూ— అనగా కేవలం మత విషయికమైన సందర్భాలలోనే కాక రాజకీయమూ, ఆర్థికమూ, సాంఘికమూ అయిన సందర్భా లన్నిటిలోనూ కూడా— ఆయన చేసిన పనులూ, చెప్పిన మాటలూ అన్నీ ఈ గ్రంథాంశానికి సంబంధించినవే అవుతాయి. ఆయన దృష్టిలో జీవితంతో సర్వతోముఖమైన సంబంధం కలిగి వున్నదే మతం. అందువలన గాంధీజీ మతవిషయిక భావాల యొక్క క్రోడీకరణ ఏదికాని ఆయన యొక్క వ్యక్తిజీవితానికీ, సాంఘిక జీవితానికీ సంబంధించిన సర్వధార్మిక తత్వాన్ని ప్రతిబింబించక పోయిన యెడల అది అసంపూర్ణమూ, అసంబద్ధమూ అవుతుంది.

కావున ఈ సంకలన కార్యమునకు గాను చాలా విస్తృతమైన పరిశ్రమ అవసరమయింది. అయినా గ్రంథం ఎక్కువ పెద్దది కాకుండా చూచే నిమిత్తం బహు జాగ్రత్తగా, ముఖ్యవిషయాలను జారవిడువ కుండా, సందర్భోచిత భాగాలను క్లుప్తపరిమితిలో క్రోడీకరించవలసి వచ్చింది.

గాంధీజీ జన్మతః హిందూమతస్థుడు. అయితే ఆయన అనుస రించిన హిందూధర్మం మాత్రం ఆయనయొక్క [illegible]

మీదనే ఆధారపడింది. ఆయన భావాలు సనాతన హిందూధర్మంలో బలంగా వ్రేళ్లు పాతుకొని వున్నప్పటికీ ఆవి తదితరములైన మత సంపర్కాలయొక్క, ముఖ్యంగా క్రైస్తవమత భావాల సంపర్కం యొక్క, కాంతిలో పెరిగి పరిణతి పొందాయి. ఈ గ్రంథంలోని రెండవ భాగంలో అందుకు నిదర్శనాలు కనిపిస్తాయి. ఆయన సర్వ మతాలకును మూలకందమైన ఆధ్యాత్మిక జలధారలో ఆత్మతృష్ణను సంతృప్తిపరచుకొనుటకు యత్నమొనర్చిన వ్యక్తి కావడంవల్ల, తాను ప్రతి మతమునకును చెందినట్లుగా భావించుకున్నాడు. అయితే ఆయన నమ్మిన మత విశ్వాసాలకు ఒక ప్రత్యేక ముద్ర అవసరమని అనుకుంటే అది తనకు జన్మరీత్యా చెందినదీ, తన భావాలకు పునాది వంటిదీ, తన పూర్వీకుల నాటినుంచీ పారంపర్యంగా వచ్చినదీ అయిన హిందూ మతమే అయివుండడం సమంజసమని ఆయన అభిప్రాయం. తనకు సంపర్కం కలిగిన ప్రతి ఇతర మతంనుంచీ తాను జ్ఞానార్జన చేసికొని వున్నప్పటికీ, తద్వారా ఆయన తనదైన హిందూమతమునకు ఏ విధమైన అన్యాయంగాని చేసివుండలేదు; దాని మూలసూత్రములను ఏ విధంగా గాని తిరస్కరించివుండనూ లేదు. ఏమనగా, హిందూమతం యొక్క సుదీర్ఘమైన చరిత్రను గమనించి చూస్తే, అది తనకు ఎదురైన ప్రతి నవ్యభావాన్నీ తనలో జీర్ణించుకొని సమన్వయ పరచుకొనడమే ఏతన్మత విశిష్టతగా గోచరించగలదు. హిందూమతాన్ని నిత్యనూతనం గానూ, సజీవంగానూ, ప్రవర్ధమానంగానూ నిలిపిన ఈ యౌవన లక్షణ మునే గాంధీజీ తనలో ప్రతిబింబితం చేసుకున్నారు. అందునుబట్టి గాంధీజీలో హిందూధర్మం తన ఆత్మను పునఃప్రతిష్ఠితం చేసుకున్నదని అంటే అది సత్యదూరం కాదు.

పురాతన కాలంలో హైందవ మతమూ, దానికి మానసపుత్రిక అయిన బౌద్ధమతమూ కలిసి ఆనాటి నాగరక ప్రపంచంలోని పేరెన్నిక గన్న దేశాలన్నిటా, భారతదేశం మొదలు చీనా జపానులవరకు, తమ ప్రభావాన్ని ప్రసరించాయి. ఈ నాడు తిరిగి గాంధీజీద్వారా హైందవ

మతము పునరుజ్జీవనము పొంది, భారతదేశం యొక్క శాంత్యహింసల సందేశం అన్ని దేశముల దృష్టినీ, గౌరవాన్నీ ఆకర్షిస్తున్నది. గాంధీజీ అనుసరించిన మత ధర్మాలు మనదేశంలో దశదిశలా ప్రసరించి ఆవరించ గలిగిననాడు, ప్రస్తుతం మానవజాతి వినాశానికి దారితీస్తూవున్న భౌతిక సిద్ధాంతాల యొక్కయు, స్వార్థసంఘర్షణల యొక్కయు బారిని పడిపోకుండా ప్రపంచాన్ని భారతదేశం తిరిగి ఋజుమార్గానికి మళ్లించ గల శక్తిని పొందగలుగుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

నిజానికి గాంధీజీయొక్క సందేశం ఒక్క భారతదేశానికి మాత్రమే కాక యావత్ప్రపంచానికీ చెందినటువంటిది. ఒక్క హిందూ మత హృదయాన్నే కాక సర్వమతాల అంతరసత్యాన్నీ తనలో పునః ప్రతిష్ఠితం చేసుకోవడమే ఆయన యొక్క సాధన అనిన్నీ, దేవుని యెడల ప్రేమభావమును సోదర మానవులయెడ ప్రేమగా అభివ్యక్తం చేయడమే ఆ అంతరసత్యం యొక్క సారాంశమనిన్నీ, గాంధీజీ మాటలను బట్టియే తేటతెల్లమవుతుంది. దానినిబట్టి ఇతర మతస్థులు హిందూమతమును అవలంబించవలెనని ఆయన కోరిక కాదనిన్నీ, క్రైస్తవులును, బౌద్ధులును, ముస్లిములును, తదితరులును తమతమ మతాలలోని ఉత్తమ ధర్మాలను అనుసరించుటకు ప్రయత్నింపవలయు నని మాత్రమే ఆయన కోరిక అనిన్నీ స్పష్టమవుతుంది. మానవుడు సోదర మానవునితో కలిసి శాంతియుత జీవితం గడపడానికీ, పరస్పర సంక్షేమాన్ని పెంపొందించుకొనడానికీ అదొక్కటియే మార్గమని ఆయన విశ్వాసం. కనుక ఈ గ్రంథపరిశీలనము వలన హిందువులూ హైందవేతరులూ కూడా సన్మార్గ జీవనాన్ని గడపడానికి ప్రోద్బలాన్నీ, ఉత్సాహాన్నీ, మార్గసూచననూ తప్పక పొందగలరని చెప్పవచ్చును.

స్థల సంకోచము వలన ఈ పుస్తకంలో సాంఘిక విషయాలపై గాంధీజీయొక్క అభిప్రాయాలకు బహు స్వల్పమైన స్థానం ఒసగవలసి వచ్చింది. ఆ విషయాలను గురించి ఇంకా పూర్ణమైన వివరాలు తెలియ

గోరువారు నవజీవన్ ప్రచురణాలయం, అహమదాబాదు-14 వారిచే ప్రచురితములైన ఇతర గ్రంథాలను చూడవచ్చును. ఉదా. :— Sarvodaya, Towards Non-violent Socialism, Women and Social Injustice, Removal of untouchability, For Pacifists, Hindu Dharma.

ఈ పుస్తకంలోని విషయక్రమ నిర్ణయమునకు, విభాగ నిర్ణయమునకు, శీర్షికలకు పూర్తి బాధ్యత మాదే. అన్యభాషాపదములకు అర్థములు తెలిపే పట్టికకూడా మొదట చేర్చబడివున్నది. గాంధీజీచే ప్రచురితమైన Young India*, Harijan* వార పత్రికలలోని వ్యాసాలనుంచి సేకరించిన భాగములకు ఆయా సంచికల తేదీలు చేర్చబడినవి. గాంధీజీచే విరచితములైన గ్రంథములలోని భాగములు కూడా ఈ సంకలనంలో వున్నందున ఆయా గ్రంథముల రచన లేక ప్రచురణ తేదీలను ఈ దిగువ తెల్పుతున్నాము. Hind Swaraj 1908 సం. లోనూ, From Yeravda Mandir 1930 సం. లోను రచించబడినవి; Unto this Last: A Paraphrase అనునది మొట్టమొదట గుజరాతీ భాషలో పుస్తకరూపంగా 1908 సం. లోను, ఆంగ్లభాషలో 1951 సం. లోను ప్రచురితమైనవి. Autobiography 1927, 1929 సం. లలో ప్రచురితం. Speeches and Writings of Mahatma Gandhi అనే గ్రంథం Natesan & Co, Madras వారిచే మొదటికూర్పు 1917 సం. లోను, నాల్గవ కూర్పు 1938 సం. లోను ప్రచురితమైనవి.

బొంబాయి
నవంబరు 1955

భరతన్ కుమారప్ప.

---

* Young India పత్రిక 1919 సం. మొదలు 1931 సం. వరకును, Harijan పత్రిక మధ్య రెండు అవుదలలతో 1933 సం. మొదలు 1956 వరకును ప్రకటించబడినవి.

# విషయ సూచిక

నాల్గవ విభాగం : దేవునిలో నా విశ్వాసం



అయిదవ విభాగం : ఆచరణలో నా మతం



ఆరవ విభాగం : నా మతాచరణకు సాధనములు

# మొదటి విభాగం

# మతమంటే నా అర్థం

## 1

## మత నిర్వచనం

నేను మతం అనేమాట వాడినప్పుడు అది కర్మకాండ యొక్క అనుసరణ అనికాని, సాంప్రదాయికమైన ఆచార వ్యవహారమనికాని కాదు నా భావం. సర్వమతములకూ మూలకందమై, మనకు మన సృష్టికర్తయొక్క సాక్షాత్కార మును కలిగించే అనుభూతినే నేను మతం అని వ్యవహరిస్తాను.

ఎం. కె. గాంధి, రచన: జోసెఫ్ జె. డోక్, 1909, పే. 7.

మతం అనేది మనం ఆచరించే సర్వకార్యాలనూ ఆవరించాలి. మతం అంటే ఇక్కడ ఏదో ఒక మత శాఖ మీద అభిమానం కాదు. మత మనగా సర్వవిశ్వమును పరిపాలించే క్రమబద్ధమైన ఒక నైతిక సూత్రమని అర్థం. అది కనిపించని శాసనం కావడం వల్ల దానిని తక్కువ వాస్తవికమైనదిగా భావించరాదు. అట్టి మతం హైందవ, ఇస్లాం, క్రైస్తవ మతములనూ తదితర మతము లన్నిటినీకూడా అధిగమిస్తుంది. అయితే అది వాటి స్థానమును ఆక్రమించదు. వాటి కన్నిటికిని మధ్య సామరస్యభావమును కలిగించి, వాటికి యాదార్థ్యతను చేకూరుస్తుంది.

హరిజన్, 10-2-'40, పే. 445.

మతం అంటే నా అర్థం ఏమిటో స్పష్టపరుస్తాను. ఇతర మతములన్నిటి కంటెను హిందూమతం నాకు ఎక్కువ ప్రియతమమైనప్పటికిని, నేను మతం అని వ్యవహరించేది ఆ హిందూమతమున్నూ కాదు. ఆ హిందూమతమును కూడా అధిగమించి, మనలో నిగూఢమైన ఆంతరసత్యంతో మనలను విడరాని విధంగా బంధించే నిత్యపవిత్రకారిణి అయిన ఒకానొక ప్రభావాన్ని నేను మతం అని పిలుస్తున్నాను. సంపూర్ణమైన ఆత్మవ్యక్తతను సిద్ధింపజేసుకొనే సాధనమార్గంలో ఎంతటి కష్టనష్టాలనుగాని లెక్కించని ఒకానొక మానవాంతర్గత ప్రవృత్తిని నేను మతం అంటున్నాను. అది మానవుని నిలువనీయకుండా ఆత్మస్వరూపాన్ని తెలుసుకునేటందుకు నిరంతరం పురికొల్పుతుంది. తన సృష్టికర్తను తెలిసికొనుటకును, తన సృష్టికర్తకును తనకునుగల పోలికలను అవగతం చేసికొనుటకును అది మానవుని ప్రోద్బలపరుస్తుంది.

యంగిండియా, 12-5-'20 పే. 2.

ఏ మానవుడుగాని మతం లేకుండా బ్రతకలేడు. తమ హేతుశక్తియొక్క అహంకారంతో మతానికీ, తమకూ ఏమీ సంబంధంలేదని ఉద్ఘాటించేవారు కొందరున్నారు. వారు చెప్పేది "నేను గాలి పీలుస్తున్నాను గాని నాకు ముక్కు లేదు" అన్నట్టుగా ఉంటుంది. హేతుశక్తివల్లనైతేనేమి, అజ్ఞాతస్వభావంవల్లనైతేనేమి మూఢవిశ్వాసంవల్లనైతేనేమి, మానవుడు తనకును పరమేశ్వరునికిని ఏదో ఒకవిధమైన సంబంధం వున్నట్లు అంగీకరిస్తాడు. ఎంతటి సంశయవాదికాని,

నాస్తికవాదికానికూడా ఒకానొక నైతికసూత్రంయొక్క అవస రాన్ని గుర్తిస్తాడు; దానిని ఆచరించుటవలన సత్ఫలితాలూ, ఆచరించకపోవుటవలన దుష్ఫలితాలూ కలుగుతాయని నమ్ము తాడు. నాస్తికవాదిగా పేరుపొందిన బ్రాడ్లా ఎల్లప్పుడూ తన లోతైన ఆంతరంగిక విశ్వాసంపైన ఆధారపడిన అభిప్రాయా లను పట్టుదలగా ఉద్ఘాటిస్తూ వుండేవాడు. ఆ విధంగా తాను నమ్మిన సత్యాన్ని ఉగ్గడించినందుకు ఫలితంగా అనేకకష్టాలు అనుభవించవలసి వచ్చేది. 'సత్యము దానికి అదే ప్రతిఫలం' అని చెప్పి ఆతడు ఆయా కష్టనష్టాలను సంతోషంతో స్వీక రించేవాడు. దీనిని బట్టి చూస్తే, సత్యాచరణవలన కలిగే సంతోషానికి ఆతడు దూరుడని అనడానికి వీలుందా? అట్టి ఆనందం లౌకికమైనదికాదు; అది పారమార్థిక సంయోగం వల్ల జనిస్తుంది. అందువల్ల మతంతో తనకు సంబంధం లేదనేవాడైనా మతవిరహితంగా జీవించడు, జీవించలేడు అని చెప్పాను నేను.

యంగిండియా, 23-1-30, పే. 25.

# 2

# నీతి యొక్క ప్రాముఖ్యం

హేతుశక్తిని సంతృప్తిపరచనటువంటిదీ నైతిక ధర్మానికి ప్రతికూలమైనదీ అగు మతసిద్ధాంతాన్ని దేనినైనా సరే నేను విసర్జిస్తాను. అవినీతికరం కానంతవరకూ హేతుదూరమైన విశ్వాసాలనుకూడా నేను సహిస్తాను.

యంగిండియా, 21-7-'20, పే. 4.

నీతి అనే ప్రాతిపదికను కోల్పోయామంటే మరుక్షణం మనం మతధర్మాన్నే కోల్పోతాము. మతధర్మం నీతిని అధిగమించడం అనేది ఎక్కడా వుండదు. ఉదాహరణకి, అసత్యవాదీ, క్రూరుడూ, నిగ్రహశూన్యుడూ అయినవాడు దేవుడు తన పక్షాన వున్నాడని ఉద్ఘాటించలేడు.

యంగిండియా, 24-11-'21, పే. 385.

జీవితసంబంధమైన సమస్యలను పరిగణించనటువంటిదీ వాటి పరిష్కారానికి సహకరించనటువంటిదీ అయిన మతం మతం అనిపించుకోనదు.

యంగిండియా, 7-5'25, పే. 164.

మత విశ్వాసం గల మనిషియొక్క ప్రతిచర్యా ఆతని మత ధర్మాన్ని ప్రతిఫలించాలి. దేవునికి కట్టుబడి వుండడమే మతము. అంటే నీవు పీల్చే ప్రతి ఊపిరికూడా దేవుని శాసనానికి బద్ధమై వున్నదన్నమాట.

హరిజన్, 2-3-'34, పే. 23.

# రెండవ విభాగం

# నా మతానికి మూలకందములు

## 3

## ఇంటి వద్ద

మా తండ్రిగారు స్వసంఘాభిమాని. సత్యప్రియత్వం సాహసౌదార్యగుణాలు కలిగినవాడేగాని, కొంచెం కోపిష్టి.

ఆయనకు మతవిషయికమైన శిక్షణ అట్టేలేదు. అయి నప్పటికీ తరుచు దేవాలయానికి పోవడంవల్లా, ధర్మప్రసం గాలు వినడంవల్లా చాలామంది హిందూమతస్థులకు కలిగే మతవిషయికమైన సంస్కృతి నా తండ్రిగారికి కూడా వుంది. కుటుంబమిత్రుడైన ఒక బ్రాహ్మణపండితుని సలహాపై చివరి రోజులలో ఆయన గీతాపారాయణం చేయసాగారు. ప్రతి దినం పూజాసమయాన్ని ఆయన కొన్ని భగవద్గీతాశ్లోకా లను వల్లెవేస్తూ వుండేవారు.

మా అమ్మ విషయంలో నా మనఃఫలకంపైన ముద్రి తమై మిగిలిన ప్రధానస్మృతి ఆమెయొక్క భక్తిపరత్వం. ఆమె చాలా మతవిశ్వాసం గల వ్యక్తి. ఏ రోజునగాని దైవపూజ చేసుకోకుండా భోజనం చేసి ఎరుగదు. ఆమె విధిగా రోజూ హవేలీకి- అనగా వైష్ణవ దేవాలయానికి- వెళ్లేది. నాకు జ్ఞప్తివున్నంతవరకూ ఆమె ఎన్నడుగాని చాతుర్మాస వ్రతావలంబన ఏమరివుండలేదు. ఆమె కఠిన మైన వ్రతాలను పట్టి, వాటిని వెనుదీయకుండా నెరవేర్చేది.

సుస్తీగా వున్నప్పుడైనా సరే నియమాలను సడలించి ఎరగదు. ఒకసారి ఆమె చాంద్రాయణం వున్నప్పుడు సుస్తీపడిన సంగతి నాకు జ్ఞాపకం వుంది. వంట్లో సుస్తీగా వున్నప్పటికీ ఆమె వ్రతభంగం మాత్రం కానివ్వలేదు. వరుసగా రెండుమూడు దినాలు ఉపవాసం చేయడం ఆమెకు ఒక లెక్కలోనిది కాదు. చాతుర్మాసం నెరవేటప్పుడు రోజూ ఏకభుక్తంగా వుండటం ఆమెకు అలవాటే. దానికితోడు ఒక్కొక్క చాతుర్మాసంలో ఆమె రోజు విడిచి రోజు ఉపవాసదీక్ష కూడా పాటించేది. ఇంకొక చాతుర్మాసంలో సూర్యదర్శనం అయితేగాని భోజనం చేయనని నియమం పెట్టుకునేది. అట్టి దినాలలో పిల్లలమైన మేము సూర్యుడు కనిపించగానే మా అమ్మకు తెలిపే ఆతురతతో ఆకాశంవైపు చూస్తూ నిలబడే వాళ్లం. అవి వానలు ముదిరే రోజులు కావడంవల్ల సూర్యదర్శనం ఎంత దుర్లభమో అందరికీ తెలిసిన విషయమే. ఒక్కొక్క రోజున హఠాత్తుగా సూర్యుడు కనిపించగానే ఆమెకు తెలపడానికని మేము ఏవిధంగా పరుగెత్తుకుని వెళ్లేవారమో నాకు జ్ఞాపకం వుంది. అంతట ఆమె స్వయంగా చూచేందుకు పరుగున వచ్చేసరికి ఆ సూర్యుడుకాస్తా మరుగైపోయి, ఆమె భోజనంచేసే ఆశకూడా అడుగంటిపోయేది. ఆమె మాత్రం సంతుష్టిగానే, "ఫరవాలేదు. ఇవాళ నేను అభోజనంగా వుండడమే దైవేచ్ఛ" అని, వెంటనే నిశ్చింతగా తన దైనిక విధులు నెరవేర్చుకొనడంలో నిమగ్నురాలయ్యేది.

ఆత్మకథ, 1948, పే. 12-13.

# 4

# పాఠశాలలో

నాకు ఆరు లేక ఏడు సంవత్సరాల వయస్సు మొదలు పదహారవయేడు వరకు పాఠశాలలో విద్యార్థిదశలో గడిపాను. అక్కడ ఒక్క మతవిషయం తప్ప తక్కిన అన్ని విషయాలూ బోధింపబడేవి. ఉపాధ్యాయులు ఏ శ్రమా లేకుండా బోధించ గలిగిన ఆ మతవిషయికమైన జ్ఞానం మట్టుకు వారినుంచి నాకు లభ్యం కాలేదు. అయినప్పటికీ పరిసరాలనుంచి అదీ ఇదీ ఏదో కొంత పరిజ్ఞానం నేనే స్వయంగా సేకరించుకుంటూ వచ్చాను. 'మతం' అనే మాటను ఇక్కడ దాని అతి విశాలమైన అర్థంలో, అనగా ఆత్మసంబంధమైన జ్ఞానం అనే అర్థంలో వాడుతున్నాను.

వైష్ణవ సంప్రదాయంలో పుట్టివుండడం బట్టి నేను తరుచు 'హవేలీ'కి వెళ్లవలసి వుండేది. దాని మెరుగూ, ఆడంబరమూ నాకు ఇష్టమయేది కాదు. అంతేకాక అక్కడ అవినీతికరమైన పనులు జరుగుతూ వుంటాయనికూడా వింటూ వచ్చాను. దానితో అక్కడకు వెళ్ళడంలో ఆసక్తి నాకు పూర్తిగా పోయింది. అందుకని హవేలీవల్ల నా కిసుమంతైనా లాభం కలగలేదు.

అక్కడ నాకు లభ్యంకానిది నా ముదుసలి దాది వలన నాకు లభించింది. చిరకాలంగా కుటుంబసేవకురాలుగా వున్న ఆమె నా యెడల ఎంతటి ప్రేమ చూపేదో ఇంకా

నాకు జ్ఞాపకంలో నిలిచివుంది. దెయ్యములన్నా, భూతము లన్నా నాకు చాలా భీతావహం కలిగేదని యింతకుముందే చెప్పానుగదా. నా ముసలిదాది అయిన రంభ ఆ భయానికి మందుగా రామనామం పునశ్చరణ చేయమని నాకు సలహా చేసింది. ఆమె చెప్పిన ఔషధంలో కంటె నాకు ఆమెలో ఎక్కువ నమ్మిక వుండేది. అందుచేత ఆ చిన్నవయస్సులోనే దెయ్యాలన్నా భూతాలన్నా నాకు వుండే భయాన్ని తొల గించుకొనడానికని రామనామాన్ని పునశ్చరణ చేయడం ప్రారంభించాను. ఆ అభ్యాసం అప్పుడు స్వల్పకాలమే సాగి నప్పటికీ, చిన్నవయసున నాటబడిన ఆ బీజం వ్యర్థంకాలేదు. ఈ నాడు నాకు రామనామం దివ్యౌషధంలా ఉపకరిస్తున్న దంటే అది ఆ సహృదయ అయిన రంభ నాటిన బీజానికి ఫలితమే అని నేను భావిస్తాను.

అన్నిటికన్నా నామనస్సుపైన గాఢమైన ప్రభావాన్ని అంకితం చేసిన అనుభవం మా తండ్రిగారి సమక్షాన్ని జరు గుతూ వచ్చిన రామాయణ పఠనం. మా నాయనగారు జబ్బుపడిన రోజులలో కొంతకాలం పోర్బందరులో గడి పారు. అక్కడ ప్రతి సాయంకాలం ఆయన రామాయణ పఠనం వినేవారు. అది పఠించేఆయన గొప్ప రామభక్తుడు. మధురమైన కంఠం కలవాడు. ఆయన దోహాలను (ద్విపాత్తులు), చౌపాయిలను (చతుష్పాత్తులు) గానంచేసి వ్యాఖ్యానించే వాడు. ఆ ధోరణిలో ఆయన తాను పరవశుడగుటయే కాక

వినేవారిని కూడా తన్మయత్వంలో ముంచెత్తేవాడు. అప్పుడు నాకు పదుమూడేళ్ల ప్రాయం అనుకుంటాను. అయినా ఆయన పురాణ పఠనానికి నేను ఆనంద పరవశుణ్ణి కావడం ఇంకా నాకు స్పష్టంగా జ్ఞాపకం వుంది. రామాయణం పట్ల నాకుగల గాఢమైన భక్తిభావానికి అదే పునాది. భక్తి సాహిత్యం అంతటిలోనూ తులసీదాసు రామాయణం ఉత్కృష్టతమమైన గ్రంథంగా భావిస్తాను ఈనాడు నేను.

పై సన్నివేశానికి కొలది మాసాల తర్వాత మేము రాజకోటకు వచ్చాము. అక్కడ రామాయణ పఠనం లేదు. అయినా ప్రతి ఏకాదశి రోజునా భాగవత పఠనం మాత్రం నడిచేది. అప్పుడప్పుడు నేనుకూడా వినేవాణ్ణి. కాని పఠిత దానిని ఆకర్షణీయం చేయలేకపోయాడు. భాగవతం యొక్క భక్త్యావేశ ప్రభావాన్ని ఈనాడు గ్రహించాను. దానిని గుజరాతీ అనువాదంలో అత్యంత ఆసక్తితో చదివాను. కాని ఇరువది ఒక్క దినాల నిరశన దీక్షాకాలంలో మూల గ్రంథంలోని కొన్ని భాగాలను పండిత మదనమోహన మాలవ్యాగారు పఠించగా విన్నాను. అది విన్నప్పుడు, నా చిన్ననాడే కనక అట్టి భక్తిపరుని నోట దానిని వినగలిగి వుంటే అల్పవయస్సులోనే దానియెడల నాకు అభిరుచి ఏర్పడి వుండేది గదా అని అనుకున్నాను. ఆ వయస్సులో మనస్సుకి నాటుకున్న అభిరుచులు మన స్వభావంలో లోతుగా వేరు పాతుకుంటాయి. నా చిన్నవయస్సులో ఇంకా ఈలాటి

సద్గ్రంథాలయొక్క పఠనం వినే అదృష్టం కలగకపోయిందే అని అప్పుడప్పుడు విచారం కలుగుతూ వుంటుంది.

మొత్తం మీద మేము రాజకోటలో వున్నప్పుడే నాలో హిందూమతంలోని అన్ని శాఖలపట్ల, సోదర మతాల పట్ల సహనభావానికి తొలిపునాది ఏర్పడింది. ఏమంటే, నా తలిదండ్రులు ఒక్క హవేలీకి మాత్రమే కాక శివాలయానికీ, రామాలయానికీ కూడా వెడుతూ వుండేవారు. కుర్ర వాళ్లమైన మమ్ములనుకూడా తమతో అక్కడికి తీసుకువెళ్ల డమో లేక పంపించడమో జరుగుతూ వుండేది. జైన సన్యాసులు కూడా మా తండ్రిగారి దగ్గరకు వస్తూవుండే వారు. జైనమతస్థులం కానటువంటి మా వద్ద వారు ఆతిథ్యం పొందడానికి కూడా అంగీకరిస్తూవుండేవారు. వారు మా తండ్రిగారితో పారమార్థిక విషయాలూ, లౌకిక విషయాలూ కూడా చర్చిస్తూవుండేవారు.

మా తండ్రిగారికి ముసల్మాను మిత్రులూ, పార్సీ మిత్రులూ కూడా వుండేవారు. వారు ఆయనతో తమతమ మత ధర్మాలనుగూర్చి ప్రసంగిస్తూ వుండేవారు. వారి భాషణ లను ఆయన ఎప్పుడూ గౌరవభావంతో ఆలకించేవారు. తరుచు ఆయా విషయాలలో ఆసక్తికూడా చూపేవారు. నేను మా తండ్రిగారికి ఉపచారం చేయడానికి నియుక్తుడనై వుండడంవల్ల నాకు తరుచుగా ఆ ప్రసంగాలను వినే అవకాశం కలుగుతూ వుండేది. ఇటువంటి సందర్భాలన్నీ కలిసి నాలో సర్వమత సహనభావాన్ని పెంపొందించుటకు తోడ్పడ్డాయి.

ఆ రోజులలో ఒక్క క్రైస్తవ మతాన్ని మాత్రం నిషిద్ధంగా భావించేవాణ్ణి. దాని యెడల నాకొక విధమైన అయిష్టం ఏర్పడింది. అందుకొక కారణం వుంది. ఆ రోజులలో మా హైస్కూలు చేరువని ఒక వీధి కోణాన్ని క్రైస్తవ మిషనరీలు నిలబడి హిందూ మతస్థులనీ, వారి ఆరాధ్య దైవాలనూ దూషించుతూ ఉపన్యసిస్తూ వుండేవారు. అది నాకు దుస్సహంగా తోచేది. వారి వాగ్ధోరణి నేను ఒకే ఒకసారి విన్నానని అనుకుంటాను. కాని దానితో ఇక ఎన్నడూ వారి మాటలను వినే ఆసక్తి నశించింది. ఆ సమయాన్ని ఒక పేరుపొందిన హిందూ సంఘీయుడు క్రైస్తవ మతంలో కలిసిపోయినట్లు విన్నాను. ఆయనకు మతం యిచ్చినప్పుడు ఆయనచేత గొడ్డుమాంసం తినిపించారనీ, మద్యం త్రాగించారనీ, ఆయన వేషంకూడా మార్చివేశారనీ, అప్పటి నుంచీ ఆయన దొరటోపీతో సహా ఐరోపీయ దుస్తులతో మసలుతున్నాడనీ ఊరంతా చెప్పుకోడం మొదలుపెట్టారు. ఈ విషయాలు నాకు వొళ్లు మంటలాగు చేశాయి. గొడ్డుమాంసం తినడం, మద్యం త్రాగడం, వేషభాషలు మార్చుకొనడం, వీటిని బలవంతంచేసే మతం ఏ మాత్రమూ మతం అనిపించుకొనదని తోచింది నాకు. ఆ క్రొత్తగా మతం పుచ్చుకున్న ఆయన అప్పుడే తన పెద్దల మతాన్ని, వారి దుస్తులనీ, వారి దేశాన్నీ దూలనాడటం ప్రారంభించినట్లు కూడా విన్నాను. ఈ సంగతులన్నీ నాకు క్రైస్తవమతం అంటే అయిష్టం కలిగించాయి.

ఇతర మతముల యెడల సహనభావం అలవరచుకున్నానన్న విషయాన్ని బట్టి అప్పుడే నాకు దేవునియందు సజీవమైన భక్తిభావం ఏర్పడినట్లు అర్థంకాదు.

అయితే నాలో ఒకటి మాత్రం లోతుగా వేరుపాతుకుంది. అదేమిటంటే, అన్నిటికీ నైతికసూత్రమే మూలకందమనీ, సర్వ నైతిక సూత్రాలకీ సత్యమే సారాంశమనీ నమ్మే విశ్వాసం. సత్యం నాకు ఏకైక పరమావధి అయింది. ఆ భావం దినదినాభివృద్ధి పొందుతూ వచ్చింది. దానికి నా నిర్వచనంకూడా విశాలతరం అవుతూవచ్చింది.

ఆ విధంగానే ఒక గుజరాతీ నీతిపద్యం నా మనస్సుకీ హృదయానికీ గాఢంగా హత్తుకుంది. దాని నీతిసారం అయిన 'అపకారికి ఉపకారం' చేయమనే భావం నాకు మార్గదర్శక సూత్రం అయింది. ఆ భావం నాలో ఒక ఆవేశంగా పరిణమించి, దానికి అనేక విధములైన ఆచరణప్రయోగాలు ప్రారంభించాను. ఆ అద్భుతమైన పద్యపాదాలు ఈ క్రింద పొందుపరుస్తున్నాను :

గ్రుక్కెడు నీర మొసంగినవారికి సుష్టగు భోజన మొసంగండి,
నమస్కరించినవారికి నేలను సాష్టాంగంపడి మ్రొక్కండి;
రాగినాణె మొక్కటి మీ కొసగిన బంగరుకాసుల నీయండి,
ప్రాణము రక్షించినవారికి మీ ప్రాణమొసగ వెనుదీయకుడి.
ఇవ్విధినే జ్ఞానుల భాషణములు, చెయ్వులు నుండును, చూడండి;
ఇంచుక సేవకు నిత్తురువారు పదింతలుగా ప్రతిఫలమండి;
సర్వనరుల నొక్కటిగా జూతురు సౌమ్యులైన ఉత్తమగుణులు,
చెడ్డ యొనర్చినవారికి మంచినె చేకూర్తురు సంతోషమున.

ఆత్మకథ. 1948, పే. 47-51.

## 5

# ఇంగ్లాండులో విద్యార్థిగా

ఇంగ్లాండులో నా రెండవ సంవత్సరం ఉనికి ముగిసే ముందు ఇద్దరు దివ్యజ్ఞాన సమాజ సభ్యులతో నాకు పరిచితి కలిగింది. వారిద్దరూ అన్నదమ్ములు, అవివాహితులు. వారు భగవద్గీతను గురించి నాతో ప్రసంగించారు. ఆంగ్లభాషలో ఎడ్విన్ ఆర్నాల్డు కవి వ్రాసిన 'సాంగ్ సెలెస్టియల్' అనే భగవద్గీతయొక్క పద్యానువాదాన్ని ఆ సమయాన్ని వారు పఠనం చేస్తున్నారు. ఆ అనువాదం ప్రక్కని నన్ను సంస్కృతంలోని మూలగ్రంథాన్ని చదవవలసినదిగా వారు కోరారు. నేను అంతవరకు ఆ అమరకావ్యాన్ని సంస్కృత మూలంలో గాని, గుజరాతీ అనువాదంలోగాని చదివి వుండనందుకు చాలా సిగ్గుపడ్డాను. ఈ వరలో నేను గీతను చదివివుండలేదని అప్పుడు వారికి చెప్పుకోవలసివచ్చింది. అయినప్పటికీ దానిని ఇప్పుడు వారితో కలిసి పఠించడం నాకు సంతోషకరమే అనిన్నీ, నాకు వున్న కొలదిపాటి సంస్కృత భాషాజ్ఞానం తోటీ మూలంలోని పూర్ణార్థం అనువాదంలో ఎక్కడైనా లోపిస్తే చెప్పగలగ వచ్చుననిన్నీ వారితో అన్నాను. ఆ విధంగా వారితో కలిసి భగవద్గీతా పఠనం ప్రారంభించాను. గీత యొక్క రెండవ అధ్యాయంలోని—

If one ponders on the objects of sense.......
Till purpose, mind and man are all undone."

అనే శ్లోకాలు నా మనస్సున లోతుగా నాటుకున్నాయి. ఈ నాటికీ అవి నా చెవులలో మ్రోగుతూ వున్నాయి. భగవద్గీత ఎంత అమూల్యమైన గ్రంథమో ఆనాడు నాకు గ్రాహ్యమయింది. ఆ భావము నాటినుంచి నేటివరకు నాలో పెరిగి పెరిగి; ఈనాడు సత్యమైన జ్ఞానమును పొందుటకు అంతకుమించిన గ్రంథమింకొకటి లేదనే నమ్మిక నాలో స్థిరపడిపోయింది. నాకు నిస్పృహకలిగిన క్షణాలలో అది నాకు అమూల్యంగా సహకరించింది. పైన పేర్కొన్న ఆ సోదరులు నన్ను ఎడ్విన్ ఆర్నాల్డు కవి వ్రాసిన 'లైట్ ఆఫ్ఏసియా' ('ఆసియా జ్యోతి' అనే బుద్ధచరిత్ర కావ్యము)ను కూడా చదువలసినదిగా ప్రోత్సహించారు. ఆ రచయిత ఈ రెండవ గ్రంథమును కూడా వ్రాసి వున్నట్లు అంతవరకూ నేను ఎరగను. దీనిని నేను భగవద్గీతను పఠించినకంటెకూడా ఎక్కువ ఉత్సుకతతో చదివాను. ఒకసారి మొదలుపెట్టిన తరువాత చివరిదాకా వదలలేకపోయాను.

ఆ సోదరుల ప్రోద్బల ఫలితంగా నేను మదాం బ్లావట్స్కీ వ్రాసిన Key to Theosophy (దివ్యజ్ఞాన ప్రవేశిక) అను గ్రంథమును కూడా చదివిన జ్ఞాపకం. ఇది నాలో హిందూమతమును గూర్చిన గ్రంథాలను ఇంకను చదువవలెననే కుతూహలాన్ని పురికొల్పింది. అంతేకాక, హిందూ మతం మూఢవిశ్వాసపూరితమని చెప్తుతూ క్రైస్తవ మిషనరీలు చేసే ప్రచారం వలన నాలో కలిగిన అపోహను ఈ గ్రంథం తొలగించింది. ఆ సమయాన్నే ఒక శాఖాహార భోజనశాలలో మాన్చెష్టరు పట్నంనుంచి వచ్చిన సచ్చీలు

డైన ఒక క్రైస్తవ మతస్థుని కలుసుకోనడం జరిగింది. అతడు క్రైస్తవ మతాన్ని గురించి నాతో ప్రసంగించాడు. అతనికి నా రాజకోట అనుభవాలను గురించి చెప్పాను. అతడు విని చాలా బాధపడ్డాడు. "నేను శాకాహారిని. నేను మద్యం త్రాగను. చాలామంది క్రైస్తవులు మద్యమాంసాలు తీసుకుంటారన్నమాట నిజమే. అయితే మాంసం తినవలసినదని గాని, మద్యం త్రాగవలసినదనిగాని మా మతగ్రంథాలు ఆదేశించి వుండలేదు. మీరు బైబిలుచదివి చూడండి" అని అన్నారాయన. ఆయన సలహా అంగీకరించాను. ఆయన నా కొక బైబిలు ప్రతిని సంపాదించిపెట్టారు.

Book of Genesis (బైబిలులో వంశానుక్రమణికను తెలిపే అధ్యాయం) చదివాను. ఆ అధ్యాయాన్ని, దానిని అనుసరించిన అధ్యాయాలను ఎప్పుడు చదివినాగాని నిద్ర ముంచుకువచ్చేది. ఏమీ మనసు కెక్క-కపోయినా, ఆసక్తి కలగకపోయినా, ఎట్లాగో కష్టంమీద, చదివానని చెప్పగలగడం నిమిత్తం, అందులో మిగిలిన భాగాలుకూడా చదివాను. Book of Numbers అనే అధ్యాయం అసలు చదవడానికే అయిష్టం పుట్టింది.

కాని New Testament భాగం చదవగానే వేరు విధమైన అభిప్రాయం ఏర్పడింది. ముఖ్యంగా Sermon on the Mount (కొండపై ధర్మప్రసంగం) నా హృదయాన్ని చూరగొన గలిగింది. దానిని భగవద్గీతతో పోల్చుకుని చూచుకున్నాను. "But I say unto you, that yon

resist not evil; but whoever shall smite thee on thy right cheek, turn to him the other also. And if any man take away thy coat let him have thy cloak too." ("ఇదిగో, నే చెప్పేమాట వినండి. చెడ్డను ఎదుర్కొనకండి; మీ కుడిచెంపపైన కొట్టినవారికి రెండవ చెంపకూడా అందియ్యండి. ఎవరుగాని మీ అంగీని ఊడ దీసుకుపోతే మీ అంగరఖానుకూడా వారికి సమర్పించండి".) అనే వాక్యాలు నాకు అమితానందం కలిగించాయి. శ్యామలభట్టు విరచితమైన, "గ్రుక్కెడు నీర మొసంగిన వారికి సుష్టగు భోజన మొసగండి," వగైరా పాదాలను జ్ఞప్తికి తెచ్చాయి. నా తరుణ మనస్సు భగవద్గీతను, బుద్ధ చరిత్రను (Light of Asia), కొండపై ప్రసంగమును (Sermon on the Mount), ఈ మూడింటి యొక్క బోధ నలను సమీకరించడానికి ప్రయత్నించింది. త్యాగం అన్నిటి కంటె ఉత్తమమైన మతధర్మం అనే భావన నా మనస్సును బాగా ఆకర్షించింది.

ఈ గ్రంథావలోకనం వల్ల నాలో ఇతర మతప్రవక్తల జీవితాలను గురించి చదవడానికి కుతూహలం రేకెత్తింది. కార్లయిల్ వ్రాసిన Heroes and Hero-worship (వీరులు-వీరపూజ) అనే గ్రంథాన్ని చదవమని ఒక మిత్రుడు నాకు సలహా చేశాడు. 'వీరుడగు ప్రవక్త' అనే అధ్యాయాన్ని చదివి మహమ్మదు ప్రవక్తయొక్క గొప్పతనమును, వీరత్వ మును, తపోనియతమైన జీవితమును గురించి తెలుసుకున్నాను.

మత విషయాలతో నా పరిచయము అప్పటిలో అంత కంటె ముందుకు సాగడానికి అవకాశం లేకపోయింది. నా పరీక్షచదువు ఇతర వ్యాసంగాలకు తావీయక పోవడమే దానికి కారణం. అయితే, ఇంకా చాలా మతగ్రంథాలు పఠించవలసి వున్నదనీ, ప్రధాన మతము లన్నిటిని గురించీ తగినంత పరిజ్ఞానం కలిగించుకోనవలసి వున్నదనీ మాత్రం మనస్సులో నిశ్చయించుకున్నాను.

ఇక నాస్తిక మతమును గురించి కూడా తెలుసుకోన కుండా వుండటం ఎలాగ? బ్రాడ్లాను గురించీ, ఆయన నాస్తికవాదాన్ని గురించీ విద్యావంతులైన భారతీయులలో వినని వా రుండరు. దానిపేరు జ్ఞప్తి లేదుగాని, ఆ విషయ మును గురించికూడా ఏదో ఒక పుస్తకం చదివిచూచాను. అది నన్నేమీ కదపలేదు. అంటే, నేను నాస్తికత అనే సహారా ఎడారిని అప్పటికే దాటిపోయానన్నమాట.

ఆత్మకథ, 1948, పే. 90–93.

## 6

# రాయిచంద్‌భాయి

రాయిచంద్‌భాయి వ్యాపారం లక్షలమీద నడుస్తుంది. ఆయన ముత్యాలూ, వజ్రాలూ వ్యాపారంలో నిష్ణాతుడు. ఆయన పరిష్కారానికి అందని వ్యాపార సమస్య ఉండదు. అయితే ఈ విషయాలన్నీ కావు ఆయన జీవిత చక్రానికి కేంద్రం. పరమేశ్వర సాక్షాత్కారం పొందవలెననే తృష్ణయే ఆయనకు చైతన్య కేంద్రం. ఆయన పని బల్లమీద వుండే వస్తువులలో ఏదో ఒక మత గ్రంథమూ, ఆయన దినచర్య పుస్తకమూ మాత్రం తప్పనిసరిగా వుంటాయి. వ్యాపారపు పనులు ముగిసిన మరుక్షణం ఆయన ఆ మతగ్రంథాన్నో లేక తన దినచర్య పుస్తకాన్నో తెరుస్తారు. ప్రచురణ పొందిన ఆయన రచనలలో చాలా భాగం ఈ దినచర్య పుస్తకంలో ఆయన వ్రాసుకున్న అంశాలే. క్లిష్టమైన వ్యాపార సమస్యల చర్చ పూర్తి అయిన వెంటనే పారమార్థిక రహస్యాలను గురించి రచన సాగించగలిగిన వ్యక్తి నిజమైన సత్యాన్వేషణాపరుడై వుండవలెనే గాని, కేవలం వ్యాపారస్థుడు కానేరడు. ఒకటి రెండుసార్లు మాత్రమే కాదు, అనేకసార్లు ఆయన ఆ విధంగా వ్యాపారపు పనుల మధ్య పారలౌకిక వ్యాసంగాలలో తన్మయుడై వుండడం నేను గమనించి వున్నాను. ఆయన ఎన్నడుగాని తన మానసిక సమరసభావాన్ని కోల్పోవడం నేను చూడలేదు. ఆయనకూ నాకూ కలిపే ఏ విధమైన వ్యాపారబంధంగాని, స్వార్థసంబంధంగాని లేదు.

అయినప్పటికీ ఆయనతో బహు సన్నిహితమైన అనుబంధాన్ని నేను అనుభవించాను. ఆ రోజులలో నేను కేవలం కేసులు లేని బ్యారిస్టరునై వున్నప్పటికీ, ఆయనను నేను చూడడానికి వెళ్లినప్పుడల్లా నాతో ఆయన చాలా గంభీరమైన మత విషయాలను గురించి చర్చిస్తూ వుండేవారు. ఆ సమయాన్ని నేనింకా చీకట్లో తారట్లాడే స్థితిలోవుండి, మత విషయికమైన చర్చలలో ఇంకా చెప్పదగిన ఆసక్తి యేమీ పెంపొందించుకుని వుండకపోయినప్పటికీ, ఆయనతో జరిగే సంభాషణలు మాత్రం నాకు చాలా ఆకర్షణీయంగా వుండేవి. అటు పిమ్మట, ఈ మధ్యకాలంలో, నేను చాలామంది మత నాయకులనూ, ప్రబోధకులనూ కలుసుకొని వున్నాను. వివిధ మతములయొక్క ఆచార్యులనూ కూడా కలిసేందుకు ప్రయత్నించాను. కాని వారిలో ఏ ఒక్కరుగాని రాయిచంద్‌భాయి నాపై చూపిన ప్రభావాన్ని చూపజాలినవారు లేరు. ఆయన పలుకులు సూటిగా నా మనస్సున నాటుకొన గలిగాయి. ఆయన నైతిక గాంభీర్యంతో సమానంగా ఆయన యొక్క ధీశక్తికూడా మన గౌరవభావాన్ని చూరగొన గలిగేది. ఆయన ఎన్నడుగాని బుద్ధిపూర్వకంగా నన్ను తప్పుదారిని పెట్టడనీ, తన లోలోపలి ఆంతరంగిక భావాలను నాకు వెల్లడిస్తాడనీ నా మనస్సులో విశ్వాసం ఏర్పడింది. అందువలన నా ఆధ్యాత్మిక జీవితపు క్లిష్ట క్షణాలలో నేను ఆయనను నా సంరక్షకునిగా భావిస్తూ వచ్చాను.

ఆయన యెడల ఇంత గౌరవభావం నాకు ఏర్పడి వున్నప్పటికీ, నా హృదయపీఠంమీద ఆయనకు గురుస్థానం మాత్రం ఒసగలేకపోయాను. ఆ సింహాసనం ఇంకను కాళీగానే ఉండిపోయింది. నా అన్వేషణ సాగుతూనే వుంది.

ముగ్గురు ఆధునిక భావుకులు నా జీవితం మీద తమ తీవ్రప్రభావాన్ని ముద్రవేసి, నా మనస్సును ఆకర్షించారు. ఒకరు, సజీవ సంపర్కంద్వారా శ్రీ రాయ్‌చంద్ భాయి; మరొకరు, "The kingdom of God is within you", ("దేవుని రాజ్యం నీ అంతరంగంలోనే వున్నది") అనే గ్రంథం ద్వారా టాల్‌స్టాయి; "Unto this last" ("ఈ తుది ఘట్టానికి") అనే పుస్తకం ద్వారా రస్కిన్.

ఆత్మకథ, 1948, పే, 112–14

## 7
## దక్షిణాఫ్రికాలో

నా జీవిత భవిష్యత్తును గురించి శ్రీ బేకర్ ఆదుర్దా పడుతున్నాడు. అతడు నన్ను వెల్లింగ్టన్ కన్వెన్షనుకు తీసుకొని వెళ్లాడు. మతప్రబోధానికి లేక ఆత్మపారిశుధ్యం నిమిత్తం ప్రొటెస్టెంటు క్రైస్తవులు, కొలది సంవత్సరాల కొకసారి, అట్టి సమావేశాలు ఏర్పాటు చేస్తూ వుంటారు. ఈ కార్యక్రమాన్ని మతపునరుజ్జీవనం లేక పునరుద్ధరణ అని అనవచ్చు. ఈ వెల్లింగ్టను కన్వెన్షన్ అటువంటి ఒక సమావేశం. ఆ సభలలో ప్రదర్శితమయ్యే భక్తిపారవశ్యపూరితమైన వాతావర

ణాము, దానికి వచ్చిన జనంలో వ్యక్తమయ్యే ఉత్సాహ హార్దికభావాలూ నన్ను క్రైస్తవమతంయొక్క ఆలింగనం లోనికి ఆకర్షించగలుగుతాయని శ్రీ బేకర్ ఆశపడ్డాడు.

ఈ సభ భక్తిపరులైన క్రైస్తవమతస్థులు చేరే సమావేశం. వారి విశ్వాసాతిశయాలు నాకు చాలా ఆనందం కలిగించాయి. వారిలో చాలామంది నా నిమిత్తమై ప్రార్థనలు చేస్తూవున్నట్లు కూడా గమనించాను. వారు పాడిన పాటలు కొన్ని చాలా హృద్యంగా వున్నాయి. వాటిని వారు మిక్కిలి శ్రావ్యంగా కూడా పాడారు.

సమావేశం మూడు రోజుల పాటు సాగింది. దానికి హాజరైనవారి భక్తిభావాన్ని నేను గ్రహించాను. కాని నా విశ్వాసాన్ని, నా మతాన్ని మార్చుకోనవలసిన అవసరం మాత్రం నాకు గోచరించలేదు. కేవలం క్రైస్తవ మతం పుచ్చుకుంటేనే స్వర్గం లభ్యమవుతుందనీ, ముక్తి కలుగుతుందనీ నమ్మడం నాకు అసాధ్యంగా తోచింది. కొందరు మంచి క్రైస్తవమిత్రులతో ఈ అభిప్రాయం నేను వెలిబుచ్చేసరికి వారు పాపం, చాలా నిర్ఘాంతపోయారు. దానికి నేను చేయగలిగిన దేమీ లేకపోయింది.

నా చిక్కులు లోతైనవి. జీసను ఒక్కడే దేవుని పుత్రుడుగా అవతరించినవాడనీ, ఆతని విశ్వసించినవారికే అమరత్వం సిద్ధిస్తుందనీ నమ్మడం నాకు శక్యంగాని విషయమయింది. దేవునికి పుత్రులే వుంటే మనమంతా ఆతని

పుత్రులమే అవుతాము. ఏసుక్రీస్తు దేవుని పోలినవాడనిగాని దేవుడే అనిగాని అనుకుంటే, అప్పుడు మానవు లందరూ కూడా దేవునిపోలినవారు కాగలరు. లేదా దేవుడే కాగలరు. జీససు తన మృతివలనను, తన రక్తపాతము వలనను లోకపు పాపాలకు ప్రాయశ్చిత్త మొనర్చియున్నట్లు అక్షరాలా నమ్మ డానికి నా హేతుశక్తి అంగీకరించలేకపోయింది. ఆలంకారిక దృష్టినిబట్టి చూస్తే ఆ మాటలో కొంత సత్యం ఉండ వచ్చును. తర్వాత, క్రైస్తవ సిద్ధాంతం ప్రకారం మానవు లకు మాత్రమే ఆత్మ లున్నాయి; ఇతర జీవులకు లేవు. వాటికి మృత్యువంటే సంపూర్ణమైన శూన్యమే. నా విశ్వాసం దానికి విరుద్ధమైనది. జీససును ఆత్మబలిదానం ఒనర్చినవానిగా, త్యాగమూర్తిగా, ఆధ్యాత్మిక ప్రబోధకు నిగా, నేను అంగీకరించగలను; అంతేగాని లోకంలో జనిం చిన మానవులలోకల్లా ఉత్కృష్టపురుషునిగా అంగీకరించలేను. శిలువమీాది ఆతని మృతి లోకమున కొక ఉత్కృష్టమైన గుణ పాఠం; అంతేకాని దానిలో ఒక నిగూఢమూ అద్భుతమూ అయిన ప్రభావమేదో ఉన్నదని నా హృదయం ఒప్పుకొన లేకపోయింది. ఇతర మతములలోని భక్తుల జీవితములలో దొరకని ప్రత్యేకత ఏదిగాని క్రైస్తవ భక్తుల జీవితములలో నాకు లభ్యంకాలేదు. క్రైస్తవులలో ఏవిధమైన పరివర్తన కలుగుతుందని అంటారో అట్టిదే ఇతర మతస్థుల జీవితాల లోనున్నూ నేను చూచివున్నాను. తాత్వికంగా క్రైస్తవ సిద్ధాంతాలలో అసాధారణత ఏమీా లేదు. త్యాగదృష్టి

నుంచి చూస్తే హిందూమతస్థులే క్రైస్తవులను చాలా అధిగమించినట్లు నాకు తోచింది. క్రైస్తవమే సంపూర్ణతగల మతమనీ, ఇతరమతము లన్నిటికంటెను ఉత్కృష్టత గలదనీ అనుకోనడం నాకు సాధ్యం కాలేదు.

నా మానసికమైన ఈ మధనను గురించి నా క్రైస్తవ మిత్రులతో చర్చించాను. కాని వారి సమాధానములు నన్ను సంతృప్తి పరచలేక పోయాయి.

పైన చెప్పినరీతిగా క్రైస్తవాన్ని సంపూర్ణతగల మతంగా గాని, సర్వోత్కృష్టమైన మతంగా గాని నేను అంగీకరించ జాలకపోయానంటే, హిందూమతము నైనప్పటికీ అప్పుడు ఆ విధంగా భావించవచ్చునన్న విశ్వాసమున్నూ నాలో ఏర్పడి వుండలేదని కూడా చెప్పవలసి వుంటుంది. హిందువులలో లోపాలు నాకు ప్రత్యక్షంగా కనిపిస్తూనే వున్నాయి. అస్పృశ్యతను హిందూమతంలో ఒక భాగంగా పాటించవలసి వున్నయెడల, అది దానిలో ఒక క్రుళ్లిన అంగంగా భావించవలసి వుంటుంది. అసంఖ్యాకమైన శాఖా భేదాలూ, వర్ణభేదాలూ వుండడం కూడా నాకు సమర్థనీయంగా కనిపించలేదు. వేదములు కేవలం దేవుడు ఉచ్చరించిన వాక్కు అనడంలో అర్థమేమిటి? అవి దేవుని వాక్కయినచో బైబిలు, కొరానుకూడా ఎందుకు దేవుని వాక్కు కాకూడదు?

నా క్రైస్తవమిత్రులవలెనే నా ముసల్మాను స్నేహితులు కూడా నన్ను తమ మతంలోనికి మార్చుటకు ప్రయత్నిస్తూ వచ్చారు. అబ్దుల్లా సేత్ నన్ను ఇస్లాం మతమును గురించి చదువుమని కోరుతూవుండేవాడు. ఆతడు సర్వదా దాని స్వారస్యాలనుగూర్చి ఏదో ఒకటి చెపుతూనే వుండేవాడు.

నా యీ క్లిష్టసమస్యలను గురించి రాయిచంద్ భాయికి వెల్లడిస్తూ లేఖ వ్రాశాను. హిందూ దేశంలోని ఇతర మతాధికారులతోకూడా ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి వారినుంచి జవాబును పొందాను. రాయిచంద్ భాయి వ్రాసిన లేఖ మాత్రం నాకు కొంచెం ఉపశాంతి యిచ్చింది. ఆయన నన్ను ఓరిమితో వుండి హిందూమతమును గురించి మరికొంత లోతుగా పరిశీలన జరపవలసినదిగా సలహాచేశారు. "విషయాన్ని నిష్పాక్షికదృష్టితో ఆలోచించగా హిందూమతంలో వున్నంత నిశితమూ గంభీరమూ అయిన తాత్విక చింతనగాని, ఆత్మసాక్షాత్కారంగాని, ఉదారగుణంగాని మరే మతంలోనూ లేదని నాకు విశ్వాసం కలిగింది" అన్నది ఆయన వ్రాసిన జవాబులోని ఒక వాక్యం.

చిట్టచివరకు నా క్రైస్తవమిత్రులు నాకు ఉద్దేశించిన మార్గం కాక నేను మరొకదారి త్రొక్కినప్పటికీ, వారు మతవిషయికమైన అన్వేషణ నాలో మేలుకొల్పినందుకు మాత్రం నేను వారికి సర్వదా కృతజ్ఞభావం కలిగివున్నాను.

వారితో నాకు కలిగిన సంపర్కంయొక్క విలువను ఎల్లప్పుడూ స్మరణలో వుంచుకుంటాను.

ఆత్మకథ, 1948, పే. 169-72.

నేను ప్రయాణానుభవాన్ని పొందే నిమిత్తమూ, కథియవాడులోని కుతంత్రములనుంచి తప్పించుకునే నిమిత్తమూ, నా జీవనోపాధి ఆర్జించుకునే నిమిత్తమూ దక్షిణాఫ్రికా వెళ్లాను. కాని ఈవరలో చెప్పినట్లుగా అక్కడ దేవుని గురించిన అన్వేషణలోనూ, ఆత్మజ్ఞానశోధనలోనూ పడ్డాను.

క్రైస్తవ మిత్రులు నాలో రేకెత్తించిన జ్ఞాన తృష్ణ ఒక తీరని దాహంగా పరిణమించింది. నేను తూష్ణీభావం వహించినా వారు నన్ను స్తబ్దుగా ఉండనీయరు.

నా మతవిషయికమైన ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తూనే వున్నాయి. రాయిచంద్ భాయి నాకు దారి చూపుతున్నారు. మేక్సుముల్లరు రచించిన "India- what can it Teach us?" ('హిందూదేశము – అది మనకు ఏమి బోధించగలదు?) అను గ్రంథాన్ని, దివ్యజ్ఞాన సమాజంవారు ప్రచురించిన ఉపనిషత్తుల (ఆంగ్ల) అనువాదాన్ని నేను ఆసక్తితో చదివాను. ఇవన్నీ హిందూమతం పట్ల నా గౌరవభావాన్ని పెంచాయి. హిందూమతంయొక్క స్వారస్యాలు నాకు అవగాహన కాసాగాయి. అయినా అందువల్ల

నాకు ఇతర మతములపట్ల వ్యతిరేకభావం కలగలేదు. వాషింగ్టన్ ఇర్వింగ్ వ్రాసిన "Life of Mahomet and his successors" ("మహమ్మదు జీవిత చరిత్ర – అతని వారసులు") అనే గ్రంథాన్ని, కార్లయిలు మహమ్మదు ప్రవక్తను స్తుతిస్తూ వ్రాసిన వ్యాసాన్ని చదివాను. ఈ గ్రంథాలు మహమ్మదు పట్ల నా గౌరవాన్ని పెంచాయి. వీటితోపాటు "జరాథుస్త్రా ప్రవచనములు" అనే మరొక గ్రంథాన్నికూడా పఠించాను.

ఈ విధంగా వివిధ మతములను గూర్చి నా పరిజ్ఞానాన్ని పెంచుకున్నాను. ఈ గ్రంథపఠనము నాలో ఆత్మ పరీక్షను పురికొల్పి, నాకు ఆయా పరిశీలనలలో మనసుకెక్కిన విషయాలను ఆచరణలో పెట్టి చూచే అభ్యాసాన్ని పెంపొందించింది. ఇట్లే హైందవ గ్రంథాలనుబట్టి నేను బోధపరచుకొన గలిగినంతవరకు కొన్ని యోగాభ్యాసాలను కూడా చేయ నారంభించాను. కాని ఈ విషయంలో ఎక్కువ దూరం పోలేకపోయినందున, హిందూదేశానికి తిరిగివెళ్ళిన పిమ్మట ఎవరో ఒక మంచి సాధకునిసహాయంతో ప్రారంభిద్దామని నిశ్చయించుకున్నాను. ఈ కోరిక ఎన్నడూ తీరనేలేదు.

టాల్‌స్టాయి గ్రంథాలు కూడా నిశితంగా పఠించాను. "The Gospel in Brief–what to do" ("క్లుప్తరూపంలో క్రైస్తవ ప్రవచనాలు–విధ్యుక్తమేమిటి?") అనేదీ, ఇతర

పుస్తకాలూ నా మనసుకు బాగా నాటుకున్నాయి. విశ్వజనీనమైన ప్రేమభావంలో ఎన్నెన్ని సిద్ధులు ఇమిడి వున్నవో నేను మరీమరీ గ్రహించసాగాను.

ఆత్మకథ, 1948, పే. 197–98.

1893 సం. లో నాకు క్రైస్తవ మిత్రులతో ఆప్తమైన సంపర్కం ఏర్పడినప్పటికి నేను కేవలం సాధకుని ప్రారంభ దశలో వున్నాను. వారు జీససు సందేశాన్ని నా మనసుకు హత్తించి, నన్ను స్వీకరింపజేయవలెనని గట్టిగా ప్రయత్నించారు. నేను అడకువతోనూ, గౌరవ భావంతోనూ, తెరచుకున్న హృదయంతోనూ వారి మాటలు వినే శ్రోతగా వున్నాను. ఆ సమయంలోనే నేను సహజంగా హిందూ మతమును గురించి నా శాయశక్తులా గ్రంథావలోకనం చేయడంతోపాటు ఇతర మతములను కూడా అవగాహన చేసుకొనుటకు కృషిచేశాను.

1903 సం. లో ఆ పరిస్థితి కొంతవరకు మారింది. దివ్యజ్ఞాన సమాజపు మిత్రులు నిజంగా నన్ను తమ సమాజంలోకి ఆకర్షించవలెనని ఉద్దేశించారు. అయితే హిందూ మతస్థుడనైన నా నుంచి కొంత తెలుసుకొనవలెనని మాత్రమే వారి కోరిక. దివ్యజ్ఞాన గ్రంథ సాహిత్యమంతా హైందవ ప్రభావంతో నిండి నిబిడీకృతమై వుంటుంది. అందువల్ల నా నుంచి సహకారం లభించగలదని వారు ఆశించారు. నాకు సంస్కృత భాషాజ్ఞానం చెప్పదగినంత లేదనీ, హిందూ

మత గ్రంథాలను నేను మూలంలో చదివివుండలేదనీ, భాషాంతరీకరణాలతోనైనా నా పరిచయం మిక్కిలి స్వల్ప మనీ వారికి విశదం చేశాను. కాని వారు పూర్వసంస్కారం లోనూ, పునర్జన్మలోనూ విశ్వాసం కలవారు కావడంవల్ల నేను కొంతవరకైనా తమకు సహాయకరం కాగలనని భావించారు. దానితో నేను వారిమధ్య చిరుచేపలలో మత్స్యావతారంలాగు అయ్యాను. ఈ తాలూకు మిత్రులు కొందరితో కలిసి స్వామీ వివేకానందుని 'రాజయోగము'నూ, మరి కొందరితో కలిసి ఎం. ఎన్. ద్వివేదివిరచిత 'రాజయోగము'నూ చదువనారంభించాను. ఒక మిత్రునితో పతంజలి యోగసూత్రములను, చాలామందితో కలిసి భగవద్గీతను పఠించడం జరిగింది. మేమందరమును కలిసి శ్రద్ధాభక్తులతో గ్రంథపఠనం సాగించే ఒక విధమైన అన్వేషకుల కూటంగా ఏర్పడ్డాము. నాకు పరమాకర్షకమైన గీతంలో ఈవరలోనే నాకు విశ్వాసం ఏర్పడివుంది. ఇప్పుడు నేను దానిలో ఇంకా లోతులు తరచిచూడడం అవసరమని గుర్తించాను. నా దగ్గర వున్న ఒకటి రెండు అనువాదాల సహాయంతో సంస్కృత మూలమును అర్థం చేసికొనుటకు ప్రయత్నించాను. రోజూ ఒకటి రెండు శ్లోకాలు కంఠస్థం చేయాలని కూడా నిశ్చయించుకున్నాను. నా ఉదయకాలపు కాలకృత్యముల సమయం ఈ పనికి వినియోగిస్తూ వచ్చాను. ఈ పని మొత్తం ముప్పది అయిదు నిమిషాలు తీసుకునేది,— పదిహేను నిమిషాలు దంతధావనానికీ, ఇరవై నిమిషాలు స్నానానికిన్ని.

మొదటి పని పాశ్చాత్యుల పద్ధతిని నిలబడి చేసేవాణ్ణి. అందు వల్ల ఎదటి గోడమీద గీతాశ్లోకాలు వ్రాసిన చిన్న కాగితా లను అంటించి, జ్ఞప్తికి రానప్పుడు వాటిని చూచుకుంటూ, అవి వల్లెవేసేవాణ్ణి. ఆ రోజు కంఠస్తం చేయవలసినవి చేయు టకును, వెనుకటివి జ్ఞాపకం చేసికొనుటకును ఆ సమయం సరిపోయేది. ఆ విధంగా నేను పదమూడు అధ్యాయాలు కంఠస్థం చేసినట్లు జ్ఞాపకం. ఈ గీతాపఠనం నా మిత్రుల మీద ఎట్టి ప్రభావం చూపినదీ వారే చెప్పగలరు; కాని నా స్వవిషయంలో మాత్రం గీత నా యొక్క సర్వప్రవర్తన లకును పొరపొచ్చెములేని మార్గదర్శనిగా పరిణమించింది. నాకు బోధపడని ఆంగ్లేయపదాల అర్థం తెలుసుకొనుటకు ఆంగ్లపదకోశం తిరగవేయడం ఏ రీతి అభ్యాసమో, అదే రీతిగా నాకు జీవితరంగంలో కలిగే సర్వవిధములైన సందే హాలకూ, సమస్యలకూ ఈ భగవద్గీత అనే ప్రవర్తన కోశాన్ని తిరగవేశేవాణ్ణి. 'అపరిగ్రహం', 'సమభావం' వంటి పదాలు నా మనస్సును గట్టిగా పట్టుకునేవి. ఆ 'సమభావాన్ని' అల వరచుకొనడమూ, నిలుపుకొనడమూ ఎలాగ అనేది సమస్య అయింది. మనలను అవమానపరిచే గర్విష్టులూ, లంచ గొండ్లూ అయిన ఉద్యోగులనూ, ఒకప్పుడు మనతో సహ సేవకులుగా వుండి ప్రస్తుతం నిర్హేతుకమైన ప్రాతికూల్యం లేవదీసే వారినీ, సర్వదా మనయెడల సద్భావం ప్రదర్శించే వారినీ ఒకే విధంగా చూడడం ఎలా పొసగుతుంది? ఆస్తి

పాస్తుల నన్నిటినీ విసర్జించడం ఎలాగ ? మన తనువే ఒక పెద్ద ఆస్తి కాదా ? భార్యాబిడ్డలు మాత్రం ఆస్తికాదా ? నా పుస్తకాల సొరుగులన్నీ ముక్కలు చేయాలా ? పరమేశ్వరుని అనుసరించుటకు గాను నాకుగల సర్వస్వమును విసర్జించ వలసిన దేనా ? ఈ ప్రశ్న లన్నిటికీ జవాబు సూటిగా వచ్చింది. నాకు కలిగిన సర్వమును వదలగలిగితేనేగాని ఆ పరమేశ్వరుని అనుసరించ లేను. నేను చదివిన (English Law) ఆంగ్లేయ న్యాయశాస్త్రం నా సహాయానికి వచ్చింది. స్నెల్ (Snell) వ్రాసిన గ్రంథంలో ఆయన (Equity) న్యాయాన్ని గురించి చేసిన చర్చ నాకు స్మరణకు వచ్చింది. గీతాబోధనయొక్క వెలుగులో 'ట్రస్టీ' లేక ధర్మకర్త అనే పదంలో ఇమిడిన సూక్ష్మార్థాలు నాకు స్పష్టతరంగా బోధపడ్డాయి. నాకు ధర్మశాస్త్రం (Jurisprudence) మీద గౌరవం అధిక మయింది; దానిలో మతధర్మం కూడా ఇమిడివున్నట్లు కని పెట్టాను. ట్రస్టీ అయినవాడు తనకు విస్తారమైన ఆస్తులపైన నిర్వహణాధికారం వుండీకూడా అందులో ఒక్క లవలేశ మైనా ఏ విధంగా తన స్వంతమైన ఆస్తిగా భావించడో, అదే విధంగా ముక్తిని అభిలషించేవాడు కూడా ప్రవర్తించ వలసివుంటుందన్న విషయమే భగవద్గీతలో చెప్పిన 'అపరి గ్రహం' అనే మాటకు అర్థమని నేను బోధపరచుకున్నాను. 'అపరిగ్రహము' గాని, 'సమభావము' గాని అలవడవలెనంటే ముందు ఒక హృదయపరివర్తనమూ, ఒక భావపరివర్తనమూ

ఏర్పడవలసి వుంటుందని నాకు తేటతెల్లముగా అవగాహన అయింది. ఆ వెంటనే నేను రేవాశంకర్ భాయికి నా భీమా పోలసీకి వాయిదా కట్టకుండా నిలుపుచేయవలసినదనిన్నీ, దానికి ప్రత్యామ్నాయంగా వచ్చే డబ్బేమైనా వుంటే రాబట్టి, లేకుంటే ఇంతవరకు కట్టిన ధరావతు నష్టమయినట్లు భావించి, ఊరకోనవలసినదనిన్నీ వ్రాశాను. ఏమంటే, నన్నూ నా భార్యాబిడ్డలనూ సృష్టించిన ఆ పరమేశ్వరుడే మా పరిపోషణ కూడా చూడగలడని నాలో దృఢమైన విశ్వాసం ఏర్పడింది. నేను ఆ క్షణం వరకును నిలవచేసి వున్న డబ్బునంతను తనకు ఇచ్చివేస్తున్నాననిన్నీ, ఇకముందు ఏమైనా నిలవ ఏర్పడితే అది సాంఘిక ప్రయోజనానికి మాత్రమే వినియుక్తం చేయబడుతుంది కనక నానుంచి ఇక ఏమీ ఆశించవద్దనిన్నీ బోధపరుస్తూ నాకు ఆనాటివరకూ పితృతుల్యునిగా వర్తించివున్న నా అన్నగారికి వ్రాశాను.

ఆత్మకథ, 1948, పే. 322-24.

నేను నేటాలుకు ప్రయాణమైనాను. శ్రీ పోలక్‌నకు నా ఆంతరంగిక విషయాలన్నీ వెల్లడించాను. ఆయన నన్ను సాగనంపే నిమిత్తం స్టేషనుకు వచ్చినపుడు "ఇది మీకు తప్పక నచ్చుతుంది" అంటూ ప్రయాణంలో చదువుకొనే నిమిత్తం నాతో ఒక పుస్తకం దిగవిడిచిపోయారు. అది రస్కిన్ విరచితమైన 'Unto This Last' అనే గ్రంథం.

చదవడం మొదలుపెట్టానో లేదో, ఆ పుస్తకాన్ని ఇక విడవలేకపోయాను నేను. అది నన్ను తన్మయపరచి వేసింది. జోహాన్నెస్‌బర్గునుంచి డర్బానుకు ఇరవైనాలుగు గంటల ప్రయాణం. రైలు అక్కడికి సాయంకాలానికిచేరింది. ఆ రాత్రి నాకు ఏమాత్రం నిద్ర పట్టలేదు. ఆ పుస్తకంలోని ఆశయాల ప్రకారం నా జీవితాన్ని మార్చుకొనుటకు నిశ్చయించుకున్నాను.

తర్వాత కొంత కాలానికి ఆ పుస్తకాన్ని 'సర్వోదయ' అను పేరిట గుజరాతీలోకి అనువదించాను. నాలోలోతుగా పాతుకొన్న విశ్వాసాలలో కొన్ని రస్కిన్ విరచితమైన ఈ ఉద్గ్రంథంలో ప్రతిబింబితమైనవని నా నమ్మకం. అందుకే అది నన్నంతగా పరవశంచేసి నా జీవితంలో పరివర్తన తీసుకురా గలిగింది. మానవుల గుండెలలో మరుగు పడివున్న మంచిని మేలుకొల్పి పైకి తీసుకురాగలిగినవాడే కవి. అయితే మనుష్యులందరూ సమాన పరిణతిని పొందినవారు కానందున కవుల ప్రభావం అందరిమీదా ఒక విధంగా పనిచేయదు.

'Unto This Last' అనే గ్రంథంనుంచి నేను గ్రహించిన బోధనలు :

1. సర్వులయొక్క అభ్యుదయంలోను వ్యక్తి అభ్యుదయం ఇమిడి వున్నది ;

2. తమ తమ వృత్తులద్వారా తమ జీవనోపాధిని ఆర్జించు కొనుటకు అందరికిని సమానమైన హక్కు వున్నది ; కాబట్టి న్యాయవాది పనికి ఎంతవిలువ గలదో మంగలి వాని పనికిన్నీ అంతే విలువ ఉండాలి.

3. కాయకష్టంతో కూడిన జీవితమే— అనగా భూమి దున్నే కర్షకునివలె, చేతి పనులుచేసే పారిశ్రామికుని వలె జీవించుటే— యోగ్యమైన జీవితము.

ఇందులో మొదటి అంశం నే నెరిగినదే. రెండవది నా కింకను అస్పష్టంగా మాత్రమే అవగాహన అయిన విషయం. మూడవది నాకింతవరకు తోచని క్రొత్తవిషయం. ఈ రెండవ మూడవ అంశాలు మొదటిసూత్రంలోనే ఇమిడి వున్నట్లు ఈ "Unto This Last" గ్రంథం నాకు తేట తెల్లం చేసింది. ఈ సూత్రాలను ఆచరణలో పెట్టడానికి తీర్మానించుకొని, సూర్యోదయంతో నిద్రలేచాను.

ఆత్మకథ, 1948, పే. 364-65.



# మూడవ విభాగం

# నేను అన్ని మతములను గౌరవిస్తాను

## 8

## అన్ని మతములూ దేవుని చేరుస్తాయి

కొంచెం ఎక్కువ తక్కువగా అన్ని మతాలలోనూ కూడా సత్యం ఉన్నదని చెబుతుంది నా హైందవ సంస్కారం. అవి అన్నీ ఒకే దేవుని నుంచి ఉత్పన్నమయినా, అసంపూర్ణతతో కూడిన మానవుడనే సాధనం ద్వారా అవి మనకు చేరడంబట్టి, అవి అన్నియు కూడా అసంపూర్ణతను కలిగి వుంటాయి.

యంగిండియా, 29-5-24, పే. 180.

మతము లన్నీ కూడా ఒకే ఒక లక్ష్యమును చేరుకునే వివిధ మార్గాలు. చేరుకునే గమ్యం ఒక్కటే అయినంత వరకు మనం వేరు వేరు మార్గాలు త్రొక్కితే పోయిన దేమిటి? వాస్తవానికి, ఎందరు వ్యక్తులున్నారో మతములు కూడా అన్ని వున్నవని చెప్పవచ్చును.

హింద్ స్వరాజ్, 1939 పే. 36 & 35.
(or Indian Home Rule)

తత్వరీత్యా దేవుడు ఒక్కడే కాబట్టి ఒక్క మతానికే అవకాశం వుండాలి. కాని ఆచరణలో మట్టుకు నా ఎరికలో ఏ యిద్దరు వ్యక్తులకుగాని దేవుని విషయమై ఒకే ఒక విధమైన భావనలేదు. అందువలన వేరు వేరు మనఃప్రవృత్తు

ంకును, వాతావరణాలకును అనుగుణమైన వేరు వేరు మతము లున్నూ ఎల్లప్పుడూ వుంటూనే వుంటాయి.

హరిజన్, 2-2-34, పే. 8.

భూమి మీద అంతటా ఒకే ఒక మతం ఉండగల దనీ, ఉండబోవుననీ నమ్మువారితో నేను ఏకీభవించలేను. కావున నేను వాటి అన్నిటి మధ్యను ఒక సమానాంశమును అన్వేషించవలెననీ, పరస్పర సహనభావాన్ని ప్రోత్సహించ వల్లయుననీ ప్రయత్నిస్తున్నాను.

యంగిండియా, 31-7-'24, పే. 254.

'సహనం' అనే మాట నాకు నచ్చకపోయినా, అంత కంటె యుక్తమైన పదం నాకు స్ఫురించడంలేదు. 'సహనం' అనే మాటలో సహజసిద్ధంగా ఇతర మతాలను మన మతం కంటె తక్కువగా చూచే భావం ఇమిడి వుండడానికి అవ కాశం వుంది. కాని మన మతంతో సమానమైన గౌరవం ఇతరుల మతానికిన్నీ ఒసగవలెననిన్నీ, తద్వారా మన మతం లోని అసంపూర్ణతను కూడా అంగీకరించవలయుననిన్నీ అహింసాధర్మం బోధిస్తున్నది. ప్రేమ సూత్రమును అనుస రించే ప్రతి సత్యాన్వేషియు ఆమాట ఒప్పుకుంటాడు. పూర్ణ మైన సత్యదర్శనమే కనక మనకు సిద్ధిస్తే, ఇక మనం అన్వే షకులం కాము; సత్యమే దైవస్వరూప మగుటచే మన మప్పుడు పరమేశ్వరునితో సమైక్యమైపోతాము. కాని మనం కేవలం అన్వేషకులం మాత్రం అయివున్నందున మనం

మన అన్వేషణలు సాగిస్తూ మన అసంపూర్ణతను ఎరిగి వుంటాము. అట్లు మనమే అసంపూర్ణులమైనప్పుడు మన యొక్క మతసంభావనముకూడా అసంపూర్ణతాకలితం కాక తప్పదు. మనము దేవునితో ఏవిధంగా సమైక్యతాసిద్ధిని గడించి వుండలేదో అదే రీతిని మనం మతంయొక్క పూర్ణ స్వరూపంబును పొంది వుండలేదన్నమాట. మనం భావించు కునే మతం పైన చెప్పినట్లుగా అసంపూర్ణమైనది అయి వుండుటవలన నిరంతర పరిణతికిని, పునర్విమర్శకును అవకాశ మొసగుతుంది. అట్టిపరిణతి ద్వారానే సత్యపథంలో, అనగా దైవమార్గంలో; మనకు పురోగమనం సాధ్యపడుతుంది. ఆ విధంగా మానవ నిర్వచితములైన మతములన్నీ అసం పూర్ణతా కలితములైనప్పుడు, వాటిలో ఏదిగొప్ప ఏది క్రొద్ది అనే మీమాంసకు తావులేదు. అన్నిమతములును సత్య దర్శనంతో కూడినవే అయినా అవన్నీకూడా అసంపూర్ణ వ్యక్తత కలిగినవీ, లోపాలకు అవకాశం కలిగినవీ అయి వుంటాయి. ఇతరమతములయెడల మనం గౌరవభావం కలిగి వుండడమంటే, వాటి లోపాలను చూడకుండా కళ్లు మూసు కొన నవసరం లేదు. మన మతంలోని లోపాల విషయంలో కూడా మనం నిశితమైన విమర్శ దృష్టి కలిగివుండి, అందుకని దానిని విడనాడకుండానే, ఆ లోపాలను సరిదిద్దుకొనుటకు ప్రయత్నించాలి. సర్వమతములను సమదృష్టితో చూచి నప్పుడు, ఇతర మతములందు యోగ్యమైన ఏ అంశం కని పించినా దానిని మన మతంలో సంలీనం చేసికొనుటకు వెను దీయకపోవడమేకాక అది మన విధ్యుక్తధర్మంగా భావిస్తాము.

వృక్షమునకు కాండము ఒకటిగానే వుండి శాఖలూ, పత్రాలూ అనేకంగా వున్నరీతినే ఒకే ఒక సత్యసంపూర్ణమైన మతం వుండి, అది మానవుడనే సాధనంద్వారా వ్యక్తమైనప్పుడు అనేకత్వం పొందుతుంది. ఆ ఏకైకమతం అనిర్వాచనీయం. అసంపూర్ణులైన మానవులు దానిని తమకు చేతనయిన మాటలలో వ్యక్తం చేయడమూ, వారివలెనే అసంపూర్ణులైన ఇతర వ్యక్తులు ఆ మాటలకు వ్యాఖ్యచేయడమూ జరుగుతుంది. అందులో ఎవరి వ్యాఖ్యానం సరియైనదని భావించాలి? ప్రతివారి మాటా వారి వారి దృక్పథాలనుంచి సత్యమే కావచ్చు; అయినా ప్రతివారి మాటా సత్యంకాక పోవడం కూడా అసాధ్యం కాదు. కనుకనే సహనభావం యొక్క అవసరం. కాని పరమతసహనం అంటే స్వీయమతం పట్ల తూష్ణీభావం చూపడంకాదు; దానియెడల మనకుగల ప్రేమ మరింత నిశితమూ స్వచ్ఛమూ అవుతుంది. సహనభావం వలన మన ఆధ్యాత్మికదృష్టి మరింత పదును తేరుతుంది. ఈ విధమైన ఆధ్యాత్మిక నైశిత్యానికీ, మతోద్రేకానికీ ఉత్తర ధృవానికీ, దక్షిణ ధృవానికీ ఉన్నంత దూరం. మతమును గూర్చిన సత్యమైన జ్ఞానం వివిధమతాల నడుమను ఏర్పడిన గోడలను కూలద్రోస్తుంది.

యెరవ్డా మందిరంనుంచి, 1945, పే. 38-40.

ఎప్పుడూ నా దృక్పథంనుంచి నేను చెప్పేది సత్యమే అని నేను అనుకోనడమూ, తరుచుగా నిజాయితీగల నా విమర్శకుల దృష్టికి అది లోపభూయిష్టంగా కనిపించడమూ

నాకు అనుభవైకవేద్యమైన విషయమే. మా పరస్పర దృక్పథాలను బట్టి మా యిరువురి అభిప్రాయాలూ కూడా నిజమే అని నే నెరుగుదును. ఈ పరిజ్ఞానం మూలకంగా నా ప్రతిపక్షులకుగాని విమర్శకులకుగాని నేను ఎన్నడూ దురుద్దేశాలను ఆపాదించకుండా వుండగలుగుతాను. ఏనుగును గురించి ఏడు విధములుగా వర్ణించిన ఏడుగురు గ్రుడ్డివారి కథలో, వారందరూ కూడా వారివారి దృక్పథాలనుంచి సత్యవాదులే అవుతారు; ఒకరి దృక్పథంనుంచి మరొకరు అసత్యవాదులవుతారు; ఏనుగును గురించి పూర్తిగా తెలిసిన వ్యక్తి యొక్క దృక్పథాన్నుంచి వారు సత్యవాదులూ, అసత్యవాదులూ కూడా అవుతారు. వాస్తవికతయొక్క ఈ అనేకత్వ సిద్ధాంతం అంటే నాకు చాలా ఇష్టం. ముసల్మాను మతస్థునిగాని, క్రైస్తవ మతస్థునిగాని, వారివారి దృక్పథాలనుంచి అర్థం చేసికొనడం నేను ఈ సిద్ధాంతమును బట్టే నేర్చుకున్నాను. పూర్వం నేను నా ప్రతిపక్షుల అజ్ఞానానికి ఆగ్రహం పొందేవాణ్ణి. ఇప్పుడు వారియెడల నేను ప్రేమభావం చూపగలను. ఏమంటే, ఇతరుల దృష్టికి నేను ఎలాకనిపించేదీ, నా దృష్టిలో ఇతరులు ఎలా కనిపించేదీ, ఈ రెండూ తెలిసికొనగల లోచూపు నాకు సిద్ధించింది. లోకమంతనీ కూడా నా ప్రేమాలింగనం లోనికి తీసికొనవలె ననిపిస్తుంది ఈ నాడు నాకు.

యంగిండియా; 21-1-26, పే. 30.

9

# ఇతర మతముల యొక్క పవిత్ర గ్రంథముల విషయమై నా దృక్పథం

ఇతరమతములకు చెందిన పవిత్రగ్రంథములను గురించి విమర్శించుట గాని, వాటియొక్క లోపములను ఎత్తిచూపుట కాని నాపని కాదు. వాటిలో సత్యాంశములేమైనా వున్నచో వాటిని లోకమునకు వెల్లడి చేయుట, వాటిని ఆచరణలో పెట్టుట మాత్రమే మనం సంతోషకరమైన కార్యములుగా భావించాలి. నేను ఆవిధంగానేభావిస్తాను. కాబట్టి కొరానులో గాని మహమ్మదు ప్రవక్త జీవితంలో గాని నాకు మనస్కరించనివీ అర్థం కానివీ అయిన అంశాలేవైనా ఉంటే వాటిని నేను విమర్శించడంగాని, నిరసించడంగాని చేయను. అతని జీవితంలో నాకు నచ్చినవీ బోధపడినవీ అగు అంశాలను గురించి ప్రశంసించుటకు మాత్రం ప్రతి అవకాశాన్ని నేను వినియోగిస్తాను. ఇక, అర్థం చేసికొనడానికి కష్టమైన విషయముల సందర్భంలో, ఒకవంక, వాటిని భక్తిపరులైన నా ముసల్మాను మిత్రుల దృక్పథం నుంచి చూచి సంతుష్టిపడతాను; మరొక వంక, ఇస్లాం మత విషయాలను గురించి ప్రఖ్యాత వ్యాఖ్యాతలు వ్రాసిన గ్రంథముల సహాయంతో వాటిని అర్థం చేసికొనడానికి ప్రయత్నిస్తాను. ఇతర మతముల పట్ల అట్టి గౌరవ పురస్సరమైన దృక్పథాన్ని అవలంబించుట ద్వారానే సర్వమత సమానత్వ సూత్రాన్ని నేను అలవరచు

కొన గల్గుతాను. అయితే నా స్వీయమైన హిందూమతం విషయంలో మాత్రం అందలి పొరపొచ్చములను తొలగించి దానిని పరిశుద్ధంగా నిలిపే నిమిత్తం, దానిలోని లోపములను వెల్లడిచేయుట నా యొక్క హక్కుగానూ, విధిగానూ కూడా భావిస్తాను. కాని హైందవేతరులైన విమర్శకులే కనక హిందూమతమును విమర్శించి అందలి లోపములను బయలు పెట్టుటకు ప్రారంభిస్తే వారు హిందూమత విషయికమైన తమ అజ్ఞానాన్ని, హైందవ దృక్పథంనుంచి దానిని అవగాహన చేసికొనుటకు తమయొక్క అశక్తతనూ బయట పెట్టుకోడం జరుగుతుంది. అట్టి కార్యము వారియొక్క దృష్టిని వక్రమొనర్చి, వారి వివేచనాబుద్ధిని పెడదారి పట్టిస్తుంది. హిందూమతమును గురించి హైందవేతరులొనర్చే విమర్శనములను గమనించినప్పుడు నా పరిమితులను నేను గ్రహించుకొనగలిగి, ఇస్లాం, క్రైస్తవ మతములనూ ఆ మతకర్తలనూ గూర్చి నేను విమర్శించుటలో ఎంత జాగరూకతతో వర్తించవలసినదీ గ్రహించగలిగాను.

హరిజన్, 13-3-35, పే. 34.

మేము ప్రతిదినం (ఆశ్రమంలో) భగవద్గీతా పఠనం సాగిస్తున్నాము. ఇప్పుడు ప్రతి ఉదయమూ నియమితమైన అధ్యాయాలు చదువుతూ, వారమున కొకసారి గీత యావత్తూ ఒక పర్యాయం పూర్తిచేసే స్థితికి వచ్చాము. గీతాపారాయణం తర్వాత భారతదేశపు వివిధ భక్తాగ్రేసరులచేత

విరచితములైన కీర్తనలు పాడుతాము. వాటిలో క్రైస్తవుల పాటల పుస్తకం (Hymn Book) లోని కీర్తనలను కూడా పాడుతూ వుంటాము. ప్రస్తుతం ఖాన్‌సాహెబ్ మాతో వున్నందున కొరాన్‌లోని భాగాలనుకూడా పఠిస్తున్నాము. తులసీదాస రామాయణ పఠనం నాకు ఉత్కృష్టమైన ఉప శాంతి కలిగిస్తున్నది. న్యూటెస్టమెంటు, కొరాను కూడా నాకు మనశ్శాంతికరంగా వుంటూ వచ్చాయి. వాటిని నేను విమర్శకదృష్టితో చదవను. నాకు భగవద్గీత ఎంతముఖ్యమో అవీ అంత ముఖ్యమే. న్యూటెస్టమెంటులోని అన్ని భాగాలూ నాకు ఇష్టంగా వుండకపోవచ్చును. ఉదాహరణకి "పాల్ యొక్క ఎపిసిల్" అనే భాగమంతా పేర్కొనవచ్చును. అయితే ఆ విధంగానే తులసీదాసులోని ప్రతిభాగమూ కూడా నాకు ఇష్టమైనది కాకపోవచ్చును. అందుచేత ఏ భాగం చదవాలి అని ఎన్నుకునే ప్రశ్న లేదు.

గీతతో సహా అన్ని మతగ్రంథాల విషయంలోనూ నా వివేచనబుద్ధిని ప్రయోగిస్తాను. మత గ్రంథాలలోని ప్రవచనంగదా అని అది నా హేతువును మించిపోవడం నేనంగీకరించను. ముఖ్యమైన మతగ్రంథాలు దివ్య పారవశ్యంలో వ్రాయబడినట్లే నాకు నమ్మకం వున్నప్పటికీ, అవి రెండు వడపోతలు దిగడం జరిగిందని అనుకుంటాను. మొదట, అవి ఒక మానవుడైన ప్రవక్తద్వారా వస్తాయి; తదుపరి, వ్యాఖ్యానకర్తల రచనలద్వారా మరొక వడపోత పొందుతాయి.

వాటిలో ఏదిగాని సరాసరి దేవుని వద్దనుంచి దిగినదిలేదు. ఒక అంశానికి 'మేథ్యూ' ఒక వ్యాఖ్యానం ఈయవచ్చు; 'జాన్' మరొకటి ఈయవచ్చును. అందువల్ల దివ్యాపారవశ్య వాదం నేను అంగీకరించినప్పటికీ, నా హేతుశక్తిని వదలుకో లేను. ("The letter killeth, the spirit giveth life") 'అక్షరం చంపుతుంది, ఆత్మ జీవం పోస్తుంది' అన్నమాట అన్నిటికంటె ముఖ్యం. అందువల్ల నీవు నా భావాన్ని అపార్థం చేసుకో కూడదు. హేతువుని మించిన భక్తి భావంలో కూడా నాకు విశ్వాసం వుంది.

హరిజన్, 5-12-'36, పే. 339-345.

నేను మాటల స్థూలార్థానికి ప్రాధాన్యమిచ్చే వాదానికి చెందను. కాబట్టి నేను ప్రపంచంలోని వివిధములైన మత గ్రంథములయొక్క అంతరార్థాన్ని గ్రహించుటకు మాత్రమే ప్రయత్నిస్తాను. ఈ పవిత్రగ్రంథములలో నిర్వచిత ములైన సత్యాహింసా సూత్రములను బట్టియే ఆ గ్రంథముల అంతరార్థమును పరీక్షిస్తాను. ఆ పరీక్షకు నిలవని విషయము నంతనూ నిరాకరిస్తాను. దానికి నిలిచిన సర్వమునూ స్వీక రిస్తాను.

జ్ఞానమనేది ఏ ఒక్క వర్గానికే గాని, శాఖకుగాని ప్రత్యేకించిన హక్కు కాదు. కాని ఒకానొక ప్రాథమిక శిక్షణ పొందితే తప్ప ఉన్నతమూ సూక్ష్మతరమూ అయిన సత్యాలను అందరూ అవగాహన చేసుకొనడం సాధ్యపడక

పోవచ్చునని నేను ఊహించుకొనగలను. ముందు తరిఫీదు వుంటే తప్ప ఉన్నత శిఖరాలమీది తేలిక వాతావరణంలో సరితిగా ఊపిరి పీల్చుకొనలేరో, లేక, సులభమైన లెక్కలలో ప్రాథమిక శిక్షణ పొందని వారు క్లిష్టమైన రేఖాగణిత మునూ బీజగణితమునూ ఏ విధంగా అవగాహనే చేసికొన జాలరో, అట్లే ఈ విషయంలోనునూ.

యంగిండియా, 27-8-'28, పే. 293

సంస్కృతిగల ప్రతి పురుషుడూ, ప్రతి స్త్రీ ప్రపంచ మతముల యొక్క పవిత్రగ్రంథాలను సానుభూతి పూర్వకంగా పఠించడం తమయొక్క విధిగా భావించవలెనని నా అభిప్రా యం. ఇతరులు మన మతమును గౌరవించవలెనని మనం ఏవిధంగా కోరుతామో అట్లే మనమునూ ఇతర మతము లను గౌరవించదలచిన యెడల, ప్రపంచమతములను గురించి తెలిసికొనుట మనయొక్క పవిత్రమైన విధిగా ఎంచవలసి వుం టుంది. ఇతరమతములను గురించి నేను గౌరవపురస్సరంగా పరిశీలన చేసిన ఫలితంగా నాకు హిందూమత గ్రంథముల పట్ల గల భక్తిభావం గాని, విశ్వాసంగాని తగ్గలేదు. ఆ పరి శీలనము నాలో హిందూమత గ్రంథములను అవగాహన చేసుకొనే శక్తిని మరింత పదును పరచినదని చెప్పగలను. ఆ పఠనము నా జీవిత దృక్పథమును విశాల మొనర్చింది. హిందూమత గ్రంథాలలో దుర్బోధ్యమైన అనేకభాగములను స్పష్టంగా అర్థం చేసుకొనుటకు ఆ పరిశీలనము సహాకరిం

ఈ సందర్భాన్ని ఒక విషయం వెల్లడిస్తాను. బైబిలుకీ, కొరానుకీ నేను చేసుకునే వ్యాఖ్యానాన్ని అనుసరించి నన్ను నేను క్రైస్తవుడననీ లేక ముసల్మానుడననీ పిల్చుకొనుటకు వీలుంటే, వాటిలో ఏ పేరును ధరించుటకు గాని నేను వెను దీయను. కారణమేమంటే, అప్పుడు హిందూ, క్రైస్తవ, ముస ల్మాను పదాలు సమానార్థకాలుగా అయిపోతాయి. పర లోకంలో హిందువులనీ, క్రైస్తవులనీ, ముసల్మానులనీ ఏవిధ మైన విభేదాలూ వుండవని నా నమ్మకం. అక్కడ వారందరి మంచి చెడ్డలూ వారువారు పెట్టుకున్న వర్గనామాలను బట్టి గాని, వారు ఉద్ఘాటించే సిద్ధాంతాలనుబట్టిగాని నిర్ణయించ బడవు. వారు చెప్పే సిద్ధాంతములను అటుంచి, వారు చేసే వర్తనములను బట్టి మాత్రమే వారివారి మంచిగాని చెడ్డగాని నిర్ణయించ బడుతుంది. ఈ భూమిమీద మనము బ్రతికి వున్నంతవరకు ఈ వర్గనామాలు వుండక తప్పవు. అందు మూలమున నా-అభివృద్ధిని అరికట్టనంత వరకు, ఇతర్రతాగల మంచినంతను నేను నాలో జీర్ణించుకొనుటకు అభ్యంతర పరచనంతవరకు, నాకు వంశపారం పర్యముగా వచ్చిన వర్గ నామమునే నేను నిలుపుకొనుట శ్రేయస్కరమని భావిస్తాను.

యంగిండియా, 2-9-'26, పే. 308.

## 10

# స్వీయ మతం

మతానికీ వివాహానికీ మధ్య, అన్ని విషయములలోను కాకపోయినా, చాలా వరకు అతి సన్నిహితమైన ఉపమానోపమేయ సంబంధం వున్నట్లు గోచరిస్తుంది. వివాహ బంధం అనేది, ఈనాడు కాకపోతే పురాతన కాలంలోనైనా, తెగనిముడిగా భావింపబడుతూ వుండేది. మిగతా పురుషులందరికంటె భర్త శ్రేష్ఠతముడగుటపైన గాని, మిగతా స్త్రీలందరికంటె భార్య ఉత్తమురాలగుటపైన గాని వారిరువురి నడుమ వుండే పరస్పర ప్రేమబంధం ఆధారపడి వుండదు. అనిర్వచనీయమూ బలవత్తరమూ అగు ఒకానొక ఆకర్షణపైన అది ఆధారపడి వుంటుంది. అట్లే ప్రతివ్యక్తికి తన మతంతో ఒకానొక బలవత్తరమైన విశ్వాసబంధం ఏర్పడి వుంటుంది. తన భార్యను ప్రేమించే భర్త తనయొక్క ప్రేమబంధమును నిలుపుకొనుటకుగాను తన భార్యకంటె ఇతర స్త్రీలందరును తక్కువ వారని ఎంచవలసిన అవసరం ఏ విధంగాలేదో, అదే విధంగా, ఒక మతమునకు చెందిన వ్యక్తిన్నీ తన మతముకంటె ఇతరములన్నీ తక్కువైనవని భావించవలసిన పనిలేదు.

ఈ ఉపమానమును మరికొంచెం దూరం అనుసరిస్తే ఇంకొక పోలికకూడా చెప్పుకొనవచ్చును. భార్యను భర్త ప్రేమించడ మంటే ఆమెలోని లోపముల విషయమై ఆతడు

కళ్లుమూసికొనడమని ఏ విధంగా అర్థంకాదో, అట్లే ఎవరు గాని తమ మతం పట్ల విశ్వాసం కలిగివుండడమంటే అందలి లోపాల విషయమై కళ్లుమూసికొని వుండడం కాదని తెలుస్తుంది. నిజం ఆలోచిస్తే గ్రుడ్డిఅనుసరణ కానటువంటి విశ్వాసభావము తనకు లక్ష్యమైనదానిలోని లోపములను మరింత నిశితముగా తెలిసికొనగోరుతుంది. ఆ లోపములను తగిన రీతిగా సరిదిద్దే విషయమై కూడా ఎక్కువ శ్రద్ధాసక్తులను చూపుతుంది. మత విషయాలలో నాకు వున్న దృక్పథాన్ని బట్టి, నేను హిందూమతంలోని సుగుణములను వేరుగా వెదికి తెలిసికొనవలసిన పనిలేదు. అందలి అనేక సుగుణములు నాకు ఆత్మగతం అయివుండకపోతే నేను ఇంతవరకు హిందూమతస్థునిగా ఉండనేరకనే పోయివుందునని చదువరి గ్రహించవచ్చును. అయితే నా దృక్పథాన్ని బట్టి అట్టి సుగుణములు ఒక్క హిందూమతమునందు మాత్రమే ఉన్నవని అనుకొనవలసిన అవసరం లేదు. అందుచేత ఇతర మతముల విషయంలో కూడా నేను లోపాలను వెదికే విమర్శకుని దృష్టితో ఎన్నడూ పరిశీలన జరపను. నా మతము నందలి సుగుణముల వంటివే వాటిలో కూడా లభ్యం కాగలవనే నమ్మకతోనూ భక్తిభావంతోనూ వాటిని పరిశీలిస్తాను. నా మతమునందు కనిపించని సుగుణము లేవైనా ఆయా మతములలో కనిపిస్తే వాటిని నా మతములోనికి తీసికొనవలెననే కుతూహలంతో కూడా ఆ పరిశీలన జరుపుతాను.

హరిజన్, 12-8-'33. పే. 4.

నేను హిందూ మతమునందు గాఢ విశ్వాసము కలవాడి నైనప్పటికి నా విశ్వాసంలో క్రైస్తవ, ఇస్లామీయ, జోరోస్ట్రియన్ మతముల యొక్క బోధనలకు కూడా తావొసగుతాను. అందుమూలమున నా హిందూమతం కొందరికి అతుకులబొంత మాదిరిగా తోచవచ్చును. కొందరు నన్ను (Eclectic Philosopher) కలగాపులగపు వేదాంతివని అన్నారు కూడా. విశిష్టమైన మత విశ్వాసం ఏమీలేని వ్యక్తిని కలగాపులగపు వేదాంతి అని అంటారు. కాని నేను సువిశాలమైన విశ్వాసం కలవాడిని కావడంవల్ల, ప్లిమత్ సోదర శాఖవంటి మూఢ విశ్వాసులైన క్రైస్తవులనూ, మతోద్రేకులైన ముసల్మానులనూ అయినప్పటికి ఎదుర్కొనుటకు పూనుకోను. సాధ్యమైనంత సహాన భావానికి తావిచ్చే విశాల విశ్వాసం నాది. నేను ఇతరుల దృష్టినుంచి వారిని చూడడం అలవరుచుకొని వుండడం బట్టి, మతోద్రేకపు పనులు చేసినవారి నెవరినిగాని నిందించడానికి అనుమతించను. ఆ విశాల విశ్వాసమే నా బలం. ఇది కొంచెం దురవగాహమైన దృక్పథంగా కనిపించవచ్చునని నే నెరుగుదును,— అయితే అది ఇతరులకు, నాకు కాదు.

యంగిండియా, 22-12-27, పే. 425.

11

# క్రైస్తవ మతం

(Old Testament) "పూర్వనిబంధన" చదివి విసు గెత్తిన పిమ్మట (New Testament) "నవనిబంధన" చదివే టప్పటికి నాకు ఎంతో మనశ్శాంతి, అపరితమైన ఆనందం కలిగింది. ఎందువల్లగాని భగవద్గీత నాకు దొరకకుండా పోయి, అందలి విషయములన్నీ మరపైపోయి, అప్పుడు నా వద్ద "నవనిబంధన"లోని "పర్వత ప్రసంగం" (Sermon on the Mount) యొక్క ప్రతి ఒక్కటి మాత్రం ఉండడం తటస్థించిన పక్షంలో, భగవద్గీతవలన నాకు కలిగే ఆనందం దానివలనకూడా పొందగలనని ఈనాడు నాకు అనిపిస్తుంది.

యంగిండియా, 22-12-'27 పే. 426.

దైవాత్మను, దైవేచ్ఛను అనితరసాధ్యమైన రీతిని అభివ్యక్తం చేశాడు జీసను. ఈ దృష్టినుంచి ఆతని నేను అర్థంచేసుకుని, దేవుని పుత్రునిగా అంగీకరిస్తాను. జీసను యొక్క జీవితంలో నేను పైన సూచించిన సార్థకతా— దివ్యతా ఇమిడివున్న హేతువువల్ల, ఆతడు ఒక్క క్రైస్తవ మతస్థులకే కాక సర్వప్రపంచమునకును చెందినవాడని నా నమ్మకం. అనగా, ఎవరు ఏ పతాకంక్రింద, ఏ పేరుతో, ఏ సిద్ధాంతాలను అనుసరించి వర్తించేవారైనాసరే తమ తమ పురాతన సాంప్రదాయిక దైవాలను నమ్మి ఆరాధన చేసు కునేవారైనా సరే, ఆయా సర్వజాతులకూ ప్రజలకూ కూడా జీసను చెందగలడని నా విశ్వాసం.

ది మోడరన్ రివ్యూ, అక్టోబరు 1941, పే. 406.

శిలువపైనున్న క్రీస్తుయొక్క వర్ణచిత్ర మొకటి రోమ్ నగరంలో దర్శించిన సందర్భంలో గాంధీజీ ఈ విధంగా అన్నారు :

" వాటికన్‌లోని శిలువపడిన క్రీస్తుయొక్క మూల విగ్రహాన్ని దర్శించి శిరసువంచి నమస్కరించుటకు అవకాశం లభిస్తే, అది ఎంత విలువైన అనుభవంగా భావించివుండే వాడినోగదా! హృదయాన్ని కదిపే ఆ విషాద చిత్రాన్ని ఎంతకష్టం మీద వదలగలిగానో! వ్యక్తుల రీతినే జాతుల యొక్క అభ్యుదయం కూడా శిలువవేదన ద్వారా తప్ప ఇతర విధంగా సాధ్యంకాదనే భావం ఆ దృశ్యాన్ని చూచినప్పుడు కలిగింది నాలో. ఇతరులకు బాధ కలిగించడంలో కాక, మనం ఇష్టపూర్తిగా సహించిన బాధలోనేవుంది ఆనందం."

దిస్ వజ్ బాపు, రచయిత ఆర్. కె. ప్రభు, 1954, పే. 29.

## 12
# బౌద్ధ మతం

బుద్ధునికి దేవునిలో నమ్మకం లేదని చెప్పేవాదమును అనేకమంది ఉద్ఘాటించగా విన్నాను. బౌద్ధమతాన్ని గురించి పాండిత్య ప్రకర్షతో వ్రాయబడిన గ్రంథాలలో కూడా బుద్ధుని అవిశ్వాసిగా వర్ణించడం గమనించి వున్నాను. కాని అట్టి అభిప్రాయం బుద్ధుని బోధనలలోని కేంద్ర సత్యమునకే విరుద్ధమైనదని నా వినయపూర్వకమైన మనవి. బుద్ధుడు తన కాలంలో దేవుని పేరిట ప్రచారంలోవున్న హీనమైన భావ

ముల నన్నిటిని ఆతడు తిరస్కరించి వుండుటయే ఈ అపోహకు హేతుభూతమయింది. ద్వేషంతో వర్తించడం, తన చేతలకు తిరిగి పశ్చాత్తాప పడడం, భూమిపై రాజులవలె ప్రలోభనాలకూ నజరానాలకూ వశంకావడం, అనుచర పక్షపాతం చూపడం మొదలైన గుణములు గలిగిన ఒక వ్యక్తిగా దేవుని గురించి భావించే అభిప్రాయాన్ని ఆతడు నిశ్చితంగా ఖండించాడన్నమాట నిస్సందేహమైన విషయం. తన ఆత్మతృప్తికీ ఆనందానికీ తనచేతనే సృష్టి అయిన జీవజంతువుల ప్రాణ రక్తాన్ని ఆశించే ఒక వ్యక్తిగా దేవుని గురించి సంభావించే విశ్వాసాన్ని చూచినప్పుడు, ఆతని హృదయాంతరం నుంచి ధార్మికమైన ఆగ్రహావేశం ఉవ్వెత్తుగా పొంగి పొర్లింది. అందువలనే ఆతడు దేవుని స్వచ్ఛసింహాసనమును తాత్కాలికంగా దురాక్రమణ చేసినట్టు కనిపించే ఆ అనర్హ నామధేయుణ్ణి అచటనుండి కూలద్రోసి, సత్యమైన దేవుని అచ్చోట పునఃప్రతిష్ఠితం చేశాడు. విశ్వసర్వస్వమును పాలించే నిత్యమూ శాశ్వతమూ అగు నైతిక శాసనాన్ని బలవత్తరంగా పునరుద్ఘాటించాడు. ఆ ధర్మశాసనమే పరమేశ్వరుడని నిరాఘాటంగా ప్రకటించాడు.

దేవుని శాసనములు నిత్యమైనవీ, శాశ్వతమైనవీ, దేవునితో వేరుపరచరానివీ అయివుంటాయి. అది ఆ పరమేశ్వరుని సంపూర్ణతకు చెందిన పరమ లక్షణం. ఈ విషయం గ్రహించక పోవడం వల్ల బుద్ధుడు దేవునియెడల అవిశ్వాసి అనీ, కేవలం ఒక నైతిక శాసనమునందే విశ్వాసము

కలవాడనీ అనుకునే గొప్ప అపోహ ఏర్పడింది. అసలు పరమేశ్వరుని విషయంలోనే ఏర్పడిన ఈ అపోహ మూలకంగా ఉత్కృష్టమైన అర్థంగల నిర్వాణ పదమును అవగాహన చేసుకొనడం విషయంలో కూడా దురభిప్రాయం ఏర్పడింది. 'నిర్వాణం' అంటే అర్థం సంపూర్ణ వినాశం కాదని నేను నిస్సంకోచంగా చెప్పగలను. బుద్ధుని జీవితంలోని కేంద్ర సత్యాన్ని నేను అవగాహనచేసికొన గలిగినంత వరకు మనలో గల నైచ్యత, దౌష్ట్యము, అవినీతి, అసత్యం, వీటన్నిటి యొక్క సంపూర్ణవినాశమే నిర్వాణం. అంధకారమయమూ నిర్జీవమూ అయిన మృత్యుశాంతి వంటిదికాదు నిర్వాణమంటే. నిర్వాణమంటే సజీవమైన శాంత్యనుభూతి. నిరంతర చేతనా హృదంతర్వ్యాప్తియై తన్నుదాను తెలిసికొన్న ఆత్మయొక్క సజీవ బ్రహ్మానందమే నిర్వాణ స్థితి.

యంగిండియా, 24-11-27, పే. 393.

## 13
# ఇస్లాం మతం

క్రైస్తవ, బౌద్ధ, హైందవ మతములను శాంతి కాంక్షతో కూడిన మతములుగా ఏవిధంగా భావిస్తామో, అదే భావంలో ఇస్లాంను కూడా శాంతి కాముకమైన మతంగానే నేను భావిస్తాను. తరతమభేదములు వున్నప్పటికీ, ఈ మతము లన్నిటికిని శాంతియే పరమావధి. ఇస్లాం మతస్థులు కత్తి దూయుటలో విచ్చలవిడిగా వర్తిస్తారనే అభిప్రాయాన్ని నే నీవరలో వెల్లడించి వున్నాను. అయితే ఆ గుణానికి

కొరాన్ యొక్క బోధనలు కారణం కాదు. ఇస్లాం మతం పుట్టినప్పుడు ఏర్పడివున్న దేశకాల పరిస్థితులు అందుకు కారణమని నా అభిప్రాయం. అదేవిధంగా క్రైస్తవమతం యొక్క చరిత్రలో రక్తపాతం అనే మచ్చ ఏర్పడిందంటే అది జీససులోని లోపం వలన కలుగలేదు; ఆనాటి దేశకాల పరిస్థితులు క్రైస్తవమత ప్రచారానికి అనుకూలంగా లేకపోవడమే అందుకు కారణం.

యంగిండియా, 20-1-27, పే. 21.

## 14
## దివ్యజ్ఞానం

గాంధీజీ ఎప్పుడైనా దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులుగా వున్నారా అని ఒకరు ప్రశ్నించగా, తాను ఎప్పుడు గాని అందు సభ్యుడు కాలేదనిన్నీ, అందు సభ్యుడు కాకపోయినప్పటికీ తనకు ఆ సంస్థయొక్క ఆదర్శములైన విశ్వజనీన సోదరభావము నందును, తత్ఫలితమైన సహనభావమునందును తనకు సర్వదా సానుభూతి కలదనిన్నీ గాంధీజీ జవాబిచ్చారు.

ఈ సందర్భాన్ని గాంధీజీ ఇంకా ఈవిధంగా చెప్పారు: "నాకు దివ్యజ్ఞాన సమాజంలో చాలామంది మిత్రులు వున్నారు; వారివల్ల నేను చాలా లాభం పొందాను. మేడమ్ బ్లావెట్‌స్కీ, కర్నల్ ఆల్కాట్, డాక్టర్ బెసెంటుల యొక్క లోపాలను గురించి విమర్శకులు ఏమిచెప్పినా, వారు మానవ సమాజానికి చేసిన సేవ కలకాలం అమూల్యంగా

మిగులుతుంది. ఆ సమాజం యొక్క రహస్య విభాగం—అనగా అందలి పారలౌకిక ప్రయోగశాస్త్రం (occultism) ఒక్కటే నేను అందు సభ్యుడు కావడానికి ప్రతిబంధక మయింది. ఆ విషయం నాకెప్పుడూ మనస్కరించలేదు.”

దిస్ వజ్ బాపూ, కర్త: ఆర్. కె. ప్రభు, 1954, పే. 13.

## 15

## మృతాత్మలతో ప్రయోగాలు (Spiritualism)

మృతిపొందినవారి ఆత్మలనుంచి నేనెప్పుడూ వార్తలు అందుకోను. అట్టి ఉత్తర ప్రత్యుత్తరాల సాధ్యతను నమ్మక పోవడానికి తగిన రుజువు మాత్రం నాకు కనిపించదు. అయితే అట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటనుగాని, అందుకు ప్రయత్నించుటనుగాని ఎంతమాత్రం ఆమోదించను. తరచు అట్టి యత్నములు మోసపు ప్రయోగములో లేక ఊహాజనిత ములో అయివుంటూ వుంటాయి. అట్టి ఉత్తర ప్రత్యుత్తర ముల యొక్క సాధ్యతను అంగీకరించినప్పటికీ, ఆ ప్రయోగాలు వాటిలో మధ్యవర్తిగా (medium) ఉపకరించే వ్యక్తికిన్నీ, ఆ మృతాత్మలకున్నూ కూడా హానికరంగా పరిణమిస్తాయి. మృతాత్మలు భూమినుంచి విడివడి ఉన్నతస్థితిని చేరుటకు ప్రయత్నించవలసి వున్నది. అయితే ఈ ప్రయోగ ముల ద్వారా ఆహూతమైన ఆత్మ భూమికి ఆకర్షింపబడి, బంధింప బడుతుంది. దేహరహితమైనంత మాత్రాన మృతాత్మ నిష్కలుషం కాదు. భూమిమీాద జీవించి వున్న

ప్పుడు ఏయే దౌర్బల్యాలకు లోనై వుండెడిదో వాటిలో చాలాభాగం మృతి అనంతరం కూడా ఆ ఆత్మను అనుసరించే వుంటాయి. అందువలన మృతాత్మనుంచి పొందే వార్తలు గాని, సలహాలు గాని నిజమైనవీ సరియైనవీ అయివుండ నవసరం లేదు. మృతాత్మ భూమిమీద వున్నవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు నెరపడానికి ఇష్టం చూపితే అది సంతోషపడవలసిన విషయం కాదు. పైగా అట్టి అసహజ సంపర్క వాంఛనుంచి వాటికి విముక్తి కలుగునట్లు చేయుట అవసరం. దీనిని బట్టి ఈ ప్రయోగములవల్ల మృతాత్మలకు ఎట్టి హాని కలుగుతుందో గ్రహించవచ్చును.

ఇక అట్టి ప్రయోగాలలో వాహనంగా (medium) వర్తించే వ్యక్తి విషయం. అట్టి ప్రయోగాలను చేసినవారు గాని, చేస్తున్నామని భావించినవారు కాని అవి చేసినంత కాలం మనోవైకల్యం పాలుకావడమో, దుర్బలమేధస్కులయిపోవడమో, పనిపాట్లకు పనికిరానివారు కావడమో జరిగి తీరుతుందని నా ప్రత్యక్షానుభవం వల్ల నేను స్పష్టంగా తెలుసుకున్నాను. అట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన నా మిత్రులలో ఒక్కరైనా తద్వారా ఏవిధమైన లాభంగాని పొందినట్లు నే నెరగను.

యంగిండియా, 12-9-'29, పే. 302.

# 16

## మతముల మధ్య గొప్ప కొద్ది భావాలు

వేరువేరు మతములంటూ వున్నంతవరకూ, నాటిలో ప్రతీదీ ఏదో ఒక ప్రత్యేకతాపూర్వకమైన బాహ్య చిహ్నమును అవలంబించడం అగత్యమవుతుంది. అయితే ఆ చిహ్నమే అర్థంలేని ప్రాముఖ్యతను పొంది, ఇతర మతములన్నిటికంటె తన మతమే గొప్పదని నిరూపించుటకు సాధనంగా రూపొందినప్పుడు, అది కేవలం త్యాజ్యమౌతుంది.

ఆత్మకథ, 1948, పే. 480.

వివిధములైన విశ్వాసాలను అనుసరించే భక్తుల ఉనికిని బట్టి భగవంతుడు వివిధములైన మతాలను సృష్టించివున్నాడు. అట్టిచో, నా పొరుగుమనిషి విశ్వసించే మతం నా మతంకంటె తక్కువైనదనే భావానికి నా మనస్సులో రహస్యంగానైనా ఎలా స్థానమొసగగలను? ఆతడు తన విశ్వాసమును విసర్జించి నా మతమును అవలంబించవలసినదని ఎలా కోరగలను? అతడికి నేను నిజమైన, నమ్మకమైన మిత్రుడినైతే ఆతడు తనయొక్క విశ్వాసమునే అనుసరించి సంపూర్ణసిద్ధి పొందవలెనని ఆశిస్తూ భగవంతుని ప్రార్థించగలనంతే. దేవుని గృహవాటికలో అనేక భవనములున్నాయి; అవి అన్నీకూడా సమానమైన దివ్యభవనములే.

హరిజన్, 20-4-,34, పే. 73.

మన క్రైస్తవ మిత్రులు ఈ రోజులలో హిందూమతం అసత్యమతమనే తమ అభిప్రాయాన్ని బహిరంగంగా వ్యక్తం చేయడమూ, అంగీకరించడమూ మానుకున్నప్పటికీ, తమ మనస్సులో మట్టుకు హిందూమతం తప్పులతడక అనిన్నీ తాము విశ్వసించే క్రైస్తవమతం ఒక్కటే సత్యమైన మత మనిన్నీ అనుకోకమానరని నా భయం. అటువంటి భావ మేదో వుంటేతప్ప నేను ఈ మధ్య ఈ పత్రికలో కొన్ని సాభిప్రాయమైన భాగాలను ప్రచురణ చేసివున్న సి.ఎం.ఎస్* వారి విజ్ఞాపన పత్రం యొక్క ధోరణిని అర్థం చేసికొనడానికి గాని, అందలి భావాన్ని అవగాహన చేసికొనడానికి గాని సాధ్యపడదు. హైందవ జీవితములోనికి ప్రవేశించివున్న అస్పృశ్యతను, అట్టి ఇతరములైన లోపములను గురించిన ఖండనమును ఎవరుగాని అర్థం చేసికొనవచ్చును. మన మతమునందు వున్నట్లుగా మన మంగీకరిస్తూవున్న ఆ లోపము లను తొలగించి దానిని నిష్కళంక మొనర్చుటకు వారు సహాయపడిన పక్షంలో, ఆ విధమైన వారి నిర్మాణాత్మక సహకారాన్ని కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించగలము. కాని వారి ప్రస్తుత ప్రయత్నం యొక్క ఆంతర్యాన్ని అర్థం చేసికొన్నంతవరకు, హిందూమతమును పునాదులనుంచి సమూలంగా పెకలించివైచి దానిస్థానే మరొక మతమును నాటుటయే వారి ఉద్దేశంలా గోచరిస్తుంది.

---

* చర్చి మిషనరీ సొసైటీ, ఇంగ్లాండు అనే సంస్థవారిచే ప్రచురితమైన విజ్ఞాపన పత్రం. దీనిలోని కొన్ని భాగములు 26-12-'36 తేదీగల హరిజన్ పత్రికలో పునర్ముద్రితమైనవి.

ఒకడు తన యింటికి తగిన మరమత్తులు లేకపోయినా అది తనకు బాగానే వున్నదనీ, వాసయోగ్యమేననీ అనుకుంటూ వుండగా దానిని వేరొకడు కూలద్రోయుటకు యత్నించినట్లుగా వుంది వీరి ప్రయత్నం. ఎవరుగాని ఆ యింటిని ఎలా మరమ్మత్తు చేయవలెనో తెలిపినా, ఆ పని చేయుటకు వారే ముందుకు వచ్చినా గాని ఆ గృహస్థు తప్పక సంతోషపడతాడు. ఎన్ని మరమ్మత్తులు చేసినా ఆ యిల్లు ఇక నివాసయోగ్యం కాదని అందులో నివసించే వాడు స్వయంగా తీర్మానం చేసికొనివుంటే తప్ప, తరతరములనుంచీ తన పెద్దలకూ తనకూ ఉపకరించిన ఆ యింటిని ఇతరులు వచ్చి కూలద్రోస్తామంటే ఆతడు వారిని తప్పకుండా ఎదుర్కొని తీరుతాడు. క్రైస్తవలోకం హైందవ గృహాన్ని గురించి అట్టి అభిప్రాయం కలిగివున్న పక్షంలో "సర్వమత ప్రాతినిధ్యసభ" (Parliament of Religions), "అంతర్జాతీయ సోదర సమితి" (International Fellowship) వంటి సంస్థలు బూటకము లనిపించుకుంటాయి. ఎందుకంటే, ఆ సంస్థల పేర్లలోనే మతముల మధ్య సమానమైన తాహతు, సమానమైన వేదిక అనే భావాలు ఇమిడి వున్నాయి. గొప్ప వారికీ కొద్దివారికీ మధ్యగాని, విజ్ఞానులకూ అజ్ఞానులకూ మధ్యగాని, పవిత్రులకూ అపవిత్రులకూ మధ్యగాని, ఉచ్ఛ జన్ములకూ నీచజన్ములకూ మధ్యగాని, కులీనులకూ కులహీనులకూ మధ్యగాని సమానవేదిక వుండడమనేది సాధ్యపడదు. నేను చెప్పిన పోలికలలో లోపముండవచ్చును;

అవి ఇతరులను నొప్పించవచ్చును కూడా. నా హేతువాదం అసమర్థంగా తోచినా తోచవచ్చును. కాని నేను ప్రతిపాదించిన విషయం మట్టుకు నిలుస్తుంది.

హరిజన్, 13-3-'37, పే. 36.

"వివిధమత సోదరసమితి" (Fellowship of Faiths) అనబడే ఈ సంస్థయొక్క ఆశయము హైందవమతస్థుని మరింత మంచి హిందువునిగా చేయడమూ, ముసల్మాను మతస్థుని మరింత మంచి ముసల్మానునిగా చేయడమూ, క్రైస్తవమతస్థుని మరింత మంచి క్రైస్తవునిగా చేయడమూ అయి వుండాలి. ఇతరులయెడల ఆత్మాధిక్యంతో కూడిన సహనభావాన్ని ప్రదర్శించే వైఖరి అంతర్జాతీయ సోదర భావానికి అనుగుణమైనది కానేరదు. ఒక వంక నా మతంలో ఎంతో కొంత మాత్రమే సత్యం వున్నదని అనుకుంటూ, మరొక వంక ఇతరుల మతాలలో మాత్రం ఎంతో కొంత సత్యం వున్నదనుకోడానికి బదులు ఎంతో కొంత అసత్యమే వున్నదని అనుమానం పెట్టుకుంటే, వారికీ నాకూ మధ్య ఏదో ఒక విధమైన సోదరత్వం వుండగలిగితే వుండవచ్చునేమోగాని, దానికీ మన "అంతర్జాతీయ సోదర సమితి" (International Fellowship) లో వుండవలసిన సోదర భావానికీ ఏమీ పోలికవుండదు. ఇతరుల నిమిత్తం మనం చేసే ప్రార్థన "దేవా, నాకు నీవు ఎట్టి కాంతినొసగితివో అదే అతనికిని ఒసగుము" అని వుండకూడదు; "ఆతని

యొక్క ఉత్కృష్ట పరిణతికి ఎట్టి కాంతి, సత్యము అవసరమో అట్టి కాంతిని, సత్యమును అతనికి పూర్ణ పరిమితిలో ఒసగుము" అని వుండాలి. నీ మిత్రులు ఏయే మతములకు చెందినవారైనప్పటికీ వారు మరింత సత్పురుషులుగా పెంపొందవలసినదని మాత్రమే నీవు ప్రార్థన చేయవలసినది.

వారి పరిణతి మార్గం ఏదైనప్పటికిని నీకు తెలియకుండానే నీ అనుభూతి కూడా వారి అనుభూతిలో అంతర్గర్భితమై ఇమిడిపోగలదు.

సబర్మతి [అంతర్జాతీయ సోదర సమితుల సమాఖ్య (Federation of International Fellowships) యొక్క ప్రథమ సంవత్సర సభానివేదిక.]

1928, పే. 17-19.

# మత పరివర్తన

సి. ఎఫ్. ఆండ్రూసు : తగినంత ఆలోచనా, ప్రార్థనా చేసిన ఫలితంగా ఒకానొక వ్యక్తి తాను క్రైస్తవ మతమును స్వీకరిస్తే తప్ప తనకు శాంతిగాని మోక్షముగాని సిద్ధించవనే విశ్వాసాన్ని వెల్లడిస్తే, అతనికి మీరు ఏమి చెపుతారు ?

గాంధీజీ : క్రైస్తవ మతానికి చెందని ఒక వ్యక్తి ఒక క్రైస్తవుని వద్దకు వచ్చి పై విధంగా వెల్లడించడమే కనక జరిగితే, ఆ క్రైస్తవుడు ఆ హిందువునకు మతాంతరత వలన మంచి కలుగుతుందని అనుకోనడం కంటె హిందూ మత ధర్మమును మంచిగా అనుసరించడమే శ్రేయస్కరమని సలహా చేయవలసినదని కోరుతాను.

సి. ఎఫ్. ఆండ్రూస్ : ఈ విషయాలలో నా అభిప్రాయాలు మీా కెరిగినవే. అయినా, ఈ సందర్భంలో మట్టుకు మీారు చెప్పిన దానితో నేను పూర్తిగా ఏకీభవించలేక పోతున్నాను. క్రీస్తుద్వారా తప్ప ముక్తి లేదన్న నమ్మకాన్ని నేను వ్యక్తిగతంగా చాలాకాలం క్రితమే విడనాడి వున్నాను. అయినా ఒకవేళ "ఆక్సుఫర్డు సంఘోద్యమం" (Oxford Group Movement People) వంటి సంస్థకు చెందినవారు మీా కొమారుని జీవితంలో ఒకానొక సత్పరివర్తనమును కలిగించిన ఫలితంగా మీా కొమారుడే కనక మతాంతరతను ఆశిస్తే, అప్పుడు మీా రేమంటారు?

గాంధీజీ: ఆక్సుఫర్డు సంఘంవారు తమ యిష్టం వచ్చినంతమందిలో జీవిత పరివర్తన కలిగించనియ్యండి; కాని మత పరివర్తన మట్టుకు అప్రస్తుతమని చెబుతాను. వారు ఎవరెవరి మతంలోని ఉత్తమగుణాలను వారివారి దృష్టికి తెచ్చి, ఆ ప్రకారం వారు జీవించేలాగ వారివారి జీవితాలలో పరివర్తన తీసుకురావచ్చును. ఒకసారి బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన ఒకవ్యక్తి నా దగ్గరకు వచ్చి, మీారు వ్రాసిన ఒకానొక గ్రంథం చదవడంవల్ల తనకు క్రైస్తవ మతం పుచ్చుకొనవలెనని అభిలాష కలిగినట్లు తెలియజేశాడు. అప్పుడు అతడిని నేను తన పెద్దలనుంచి తనకు సంక్రమించిన మతం చెడ్డదిగా తోచినదా అని ప్రశ్నించాను. లేదని అతడు జవాబిచ్చాడు. అయితే బైబిలును ప్రపంచం

లోని గొప్ప మతగ్రంథములలో ఒకటిగాను, క్రీస్తును గొప్ప మత ప్రబోధకులలో ఒకడుగాను భావించుటకు నీకు ప్రస్తుతం ఆటంకమేమి వచ్చింది? అని అడిగాను. తర్వాత, మీరు మీ గ్రంథముల ద్వారా ఎన్నడుగాని భారతీయులు బైబిలును చేపట్టి క్రైస్తవ మతం పుచ్చుకొనవసిలదిగా ప్రోద్బలం చేసి వుండలేదనిన్నీ, ఆతడు మీ గ్రంథములను అపార్థం చేసుకున్నట్లు కనిపిస్తుందనిన్నీ కూడా చెప్పాను. 'విశ్వాసి అయిన ముసల్మాను మతస్థుడు, అతని జీవితం ఎంత చెడ్డగా వున్నాగాని, సచ్ఛీలుడైన హైందవమతస్థునికంటె శ్రేష్ఠుడ'ని కీ. శే. మౌలానా మహమ్మదాలీగారు ఒకప్పుడు వ్యక్తం చేసివున్న అభిప్రాయంలోని భావం మీకుకూడా సమ్మత మయ్యే పక్షంలో మాత్రం నా మాటలు పొరపాటైపోతాయి.

సి. ఎఫ్. ఆం: మౌలానా మహమ్మదాలీగారి అభిప్రాయంతో నేను ఏ మాత్రం ఏకీభవించను. కాని ఒకవ్యక్తి తనకు మతం మార్పు నిజంగా అవసరమని తలచినప్పుడు, నే నతడికి అడ్డునిలవరాదని మాత్రం అనుకుంటాను.

గాంధీజీ: కాని అప్పుడు మీరు ఆ వ్యక్తికి తన మతం యొక్క మంచిచెడ్డలను తెలుసుకొనడానికి ఏమీ అవకాశం కలిగించడం లేదని నాకు తోస్తుంది. మీరు అతడిని ఎదురు ప్రశ్నలువేసి అతని మనస్థితి స్పష్టపరచడానికైనా ప్రయత్నించడం లేదన్నమాట. ఒక క్రైస్తవ మతస్థుడే కనక నా దగ్గరకు వచ్చి, హైందవమత గ్రంథమైన

భాగవతమును చదివి పారవశ్యం పొందిన ఫలితంగా తాను హిందూమతమును స్వీకరించుటకు తీర్మానించుకున్నట్లు చెపితే నే నాతనితో ఏమంటానో వినండి. 'అది సరికాదు. భాగవతం వల్ల నీకు కలిగే లబ్ధి బైబిలు వల్లకూడా కలుగు తుంది. అది పొందడానికి నీ వింతవరకు ప్రయత్నించి వుండ లేదు. ఇకముందు ఆ ప్రయత్నంచేసి, మంచి క్రైస్తవునిగా వుండు' అని చెప్తాను.

సి.ఎఫ్. ఆం: ఏమి చెప్పాలో నాకు తెలియడంలేదు. ఏ వ్యక్తిగాని తాను మంచి క్రైస్తవుడుగా అవుతానని అంటే, నేను బహుశా "నీవు కావచ్చున"ని అంటానేమో. కాని నా జీవితంలో ఇంతవరకు, మతం మార్చుకోవలెననే ఉత్సాహంతో నా వద్దకు ఎవరు వచ్చినా, వారిని నేను వద్దని నిరుత్సాహపరుస్తూ వచ్చిన సంగతి మీా రెరిగినదే. అట్టివారితో నేను 'నా మూలకంగా మాత్రం అట్టిపని చేయ బోకండి' అని చెప్తుతూ వచ్చాను. అయినా, మానవస్వభా వానికి పట్టుగొమ్మగా ఏదో ఒక స్పష్టమైన విశ్వాసం తప్ప కుండా అవసరమని నా అభిప్రాయం.

గాంధీజీ: ఒక వ్యక్తికి బైబులును విశ్వసించవలెనని వుంటే ఆ మాట చెప్పమనండి; అంతేకాని ఆతడు తన మతాన్ని విసర్జించవలసిన పనేమిటి? ఒక మతమునకు చెందిన వారిని వేరొక మతంలోనికి కలుపుకొనడమనే ఈ కార్యం ప్రపంచశాంతికి భంగకరమైన పని. మతం చాలా వ్యక్తిగత

మైన విషయం. మనమంతా ఎవరి జ్ఞానదీప్తినిబట్టి వారు బ్రతుకుతూ, ఒకరి మార్గంలోని మంచిని ఇంకొకరికి పంచి యిస్తూ, తద్వారా దేవుని చేరుకొనుటకు జరిగే మానవ సాధనయొక్క మొత్తమును పెంచాలి.

ఇంకా వివరిస్తూ గాంధీజీ ఇలా అన్నారు: "మీరు అంగీకరించే భావం పరస్పర సహనమేనా, లేక సర్వమత సమానత్వమా, అనే విషయం బాగా ఆలోచించండి. ముఖ్యమతములన్నీ మూలతత్వంలో పరస్పర సమానతగలవే అన్నది నా అభిప్రాయం. మన అంతరంగంలో ఇతర మతముల యెడల కూడా మన మతంతో సమానమైన గౌరవ భావం నెలకొని వుండాలి. మనలో నెలకొనవలసినది పరస్పర సహనంకాదు, సమాన గౌరవమని గ్రహించగోరుతాను."

హరిజన్, 28-11-'36, పే. 330.

మనస్సాక్షి అనేది అందరికీ ఒకే రీతిగా వుండదు. అందువలన అది ఒక్కొకరి వ్యక్తిగత ప్రవర్తనకు మార్గ దర్శకంగా మాత్రమే ఉపకరిస్తుంది. కాని ఒకవ్యక్తియొక్క ప్రవర్తనా సూత్రమును సర్వులకూ వర్తించవలెనని బలాత్కరించడమనేది ఇతర వ్యక్తులందరి యొక్క మనస్సాక్షి స్వాతంత్ర్యాన్ని భంగపరిచే దుర్భర నిరోధంగా పరిణమిస్తుంది.

యంగిండియా, 23-9-'26, పే. 334.

## 18

# ఉత్తమ పద్ధతి

అహింసా సత్యముల యొక్క ప్రచారకార్యం గ్రంథాల ద్వారా కంటె, ఆ సూత్రములను వాస్తవ జీవితంలో ఆచరణలో పెట్టుటద్వారా ఎక్కువ బాగా జరుగుతుంది. సత్యమార్గాన్ని అనుసరించి గడిపిన జీవితం గ్రంథముల కంటె మిన్న.

హరిజన్, 13-5-'39, పే. 122.

సుదీర్ఘమైన గ్రంథావలోకన ఫలితంగాను, అనుభవ ఫలితంగాను నేను కొన్ని నిశ్చితాభిప్రాయాలకు వచ్చి వున్నాను. అవి ఏమనగా— (1) సర్వమతములును సత్య సమన్వితములే. (2) సర్వమతములును కొన్ని లోపములను కలిగినవే. (3) సర్వమానవకోటిని నా ఆత్మబంధువులతో సమానులుగా భావించవలసినదిగా ఎట్లు కోరుకుంటానో, అట్లే నేను సర్వమతములను కూడా నా స్వీయమతంతో సుమారుగా సరిసమానమైన ఆదరభావంతో చూస్తాను. నాకు వ్యక్తిగతంగా నా మతమంటే ఎంత గౌరవభావమున్నదో ఇతర మతములన్నను అంతే గౌరవభావమున్నది.

సబర్మతి, 1928, పే. 17.



# నాల్గవ విభాగం
# దేవునిలో నా విశ్వాసం

## 19
## దేవుడున్నాడు

మనం ఉన్నామని అనుకుంటే, మన పితరులూ ఆ పితరుల పితరులూ ఉండి వున్నారని అనుకుంటే, అప్పుడు ఈ సర్వసృష్టికిని పితరుడైన పరమేశ్వరుడొకడున్నాడని అనుకోడం సబబైన విషయమే అవుతుంది. ఆతడు లేడంటే, అప్పుడు మనకూ ఎక్కడా ఉనికి లేదన్నమాటే. ఆతడు కేవలం ఏకేశ్వరుడే అయినా అనేక మూర్తులు కలిగివున్నాడు. ఆతడు అణువుకంటెను అల్పరూపిగాను, హిమాలయముల కంటెనువిశాల స్వరూపిగాను కూడా గోచరిస్తాడు. సముద్రపు చిన్ని జలకణంలో ఆతడు ఇముడుతాడు ; కాని ఏడు సముద్రములు కలిపినా ఆతని పరివేష్టించలేకపోతాయి. ఆతని తెలియుటకు హేతువు శక్తిహీనము. ఆతడు హేతువుయొక్క పరిమితులకు, అవగాహనాశక్తికి మించినవాడు. ఆతని గూర్చి ఇంతకు మించి వర్ణించనవసరం లేదు. ఆతని తెలియుటకు విశ్వాసమే పరమ సాధనము. నా తార్కికశక్తి ఎన్ని సిద్ధాంతాలనైనా సమర్థించనూ గలదు, ఖండించనూ గలదు. నాస్తికుడొకడు వచ్చి వాదంలో నన్నూ పడగొట్టవచ్చును. కాని నా హేతుశక్తికంటె ఎన్నిరెట్లు వేగంతోనో ముందుకి పోగల నా యొక్క విశ్వాస బలంతో నేను ప్రపంచమంతనూ ఎదురొడ్డి, "దేవుడు ఇప్పుడున్నాడు, పూర్వం ఉన్నాడు, ఎల్లప్పుడూ ఉన్నాడు" అని ఉద్ఘాటించగలను.

ఆ పరమేశ్వరుని అస్తిత్వాన్ని నిరాకరించగోరే వారికి అట్లు నిరాకరించుటకున్నూ స్వతంత్రం వుంది. ఆతడు కృపాపూర్ణుడు, దయాసముద్రుడు. తన ఆధిపత్యాన్ని అంగీకరింపజేయుట కాతనికి భూమీశులవలె సైనికబలం అవసరంలేదు. ఆతడు మనకు స్వాతంత్ర్య మొసగినప్పటికిని, ఆతని దయాశక్తి మనలను ఆతని ఇచ్ఛను అనువర్తించునట్లుగా చేసుకుంటుంది. మన మెవరంగాని ఆతని ఇచ్ఛను శిరసావహించక తిరస్కరించినను ఆతడు, 'అలాగే కానియ్యి; నీవు తిరస్కరించినా నా సూర్యుడు నీ కోసం ఎప్పటిలాగే ప్రకాశిస్తాడు. నా మేఘాలు నీ కోసం ఎప్పటివలెనే వర్షిస్తాయి. నా ఆధిపత్యాన్ని అంగీకరించుటకు నిన్ను బలవంతం చేయవలసిన పనిలేదు,' అంటాడు. అటువంటి పరమేశ్వరుని ఉనికినిగురించి అజ్ఞానులు నిరాకరిస్తే నిరాకరించవచ్చును. ఆతని అస్తిత్వాన్ని నమ్మే లక్షలాది జ్ఞానులలో ఒకడినైన నేను మాత్రం ఆతనికి నిరంతరం ప్రణమిల్లి, ఆతని మహాత్మ్యాన్ని గానం చేస్తాను.'

యంగిండియా, 21-1-'26, పే. 30-31.

అనిర్వచనీయమైన ఒక అగోచరశక్తి విశ్వవ్యాప్తమై వున్నమాట తథ్యం. నేను దానిని కంటితో చూడలేక పోయినా హృదయంలో అది వున్నదని ఎరుగుదును. ఈ అగోచరశక్తి ఇంద్రియజ్ఞానం ద్వారా నేను తెలిసికొనగల ఏ వస్తువునకు గాని పోలినది కానందున, అది ఉన్నట్లు అంతరంగంలో గ్రాహ్యమవుతుందే గాని బహిరంగమైన రుజువులకు లొంగదు. అది ఇంద్రియజ్ఞానానికి అతీతమైనశక్తి

అయినా పరమేశ్వరుని అస్తిత్వాన్ని హేతుశక్తివల్ల కొంతవరకు సాధించడానికి వీలుంది. లోకవ్యవహారంలో కూడా సామాన్య ప్రజలకు తమ పరిపాలకు డెవరో, ఎందుకు ఏ విధంగా పాలిస్తున్నాడో తెలియనే తెలియదని మనం గమనిస్తూ వుంటాము. కాని తమ్ము పరిపాలించే ఒక అధికారి వున్నట్లు మాత్రం వా రెరుగుదురు. గత సంవత్సరంలో నేను మైసూరు రాజ్యంలో సంచార మొనర్చినప్పుడు, గ్రామీణులైన పేదప్రజలను ప్రశ్నించగా, వారికి మైసూరు రాష్ట్రాన్ని పరిపాలిస్తున్నదెవరో తెలియనే తెలియదని గమనించాను. నా ప్రశ్నకు వారు సునాయాసంగా 'ఎవరో ఒక దేవుడు పాలిస్తున్నాడ'ని జవాబు చెప్పారు. తమ రాష్ట్రపాలకుడైన ప్రభువును గురించి ఆ పేదప్రజల యొక్క పరిజ్ఞానమే ఇంత పరిమితంగా వున్నప్పుడు, వారిని వారి పరిపాలకునితో పోలిస్తే ఎంత తక్కువవారో అంతకంటె అపారంగా పరమేశ్వరుని ముందు అల్పాల్పుడనైన నాకు ప్రభువులకు ప్రభువులైన ఆతని గూర్చిన ప్రత్యక్ష జ్ఞానము సిద్ధించకపోతే అందులో ఆశ్చర్యమేమీ లేదు. అయినప్పటికిని ఆ పేద ప్రజలు మైసూరు రాజ్యాన్ని గురించి అనుకున్నట్లే, నేను కూడా ఈ విశ్వప్రపంచంలో ఒకానొక నియమబద్ధమైన సూత్రం ఇమిడి వున్నదనిన్నీ, ఈ సృష్టి సర్వస్వంలో వున్న ప్రతివస్తువునూ, జీవిస్తూవున్న ప్రతివ్యక్తినీ మార్చరాని శాసనమొకటి పరిపాలిస్తున్నదనిన్నీ తలుస్తాను. అది ఒక గుడ్డిశాసనం కాదు ; గుడ్డిశాసనమైనదేదీ సజీవసృష్టియొక్క

వర్తనమును పాలించలేదు. సర్ జె. సి. బోసుగారి అద్భుత పరిశీలనల ఫలితంగా భౌతిక పదార్థం కూడా సజీవమే అయినట్లు ఈ నాడు రుజువుకావడం బట్టి, సృష్టియావత్తూ సజీవమే అని స్పష్టమవుతుంది. అట్టి చైతన్య ప్రపంచాన్నంతనూ పరిపాలించే సూత్రమే పరమేశ్వరుడు. సూత్రమూ, సూత్రకారుడూ ఒకటే. దానిని గురించికాని, ఆతని గురించిగాని నాకు తగినంత తెలియదు కదా అని ఆ సూత్రముయొక్క, ఆ సూత్రకారుని యొక్క ఉనికిని నిరాకరించడానికి వీలులేదు. భూమిని పాలించే ఒక రాజ్యాధికారిని గురించిన నా అజ్ఞానముగాని, నా అపనమ్మకముగాని, ఆతని అధికారమునుంచి నన్ను ఏ రీతిగా తప్పించలేదో అదేరీతిగా దేవునియొక్క, ఆతని శాసనముయొక్క ఉనికిని నేను కాదన్నంతమాత్రాన వాని ప్రభావం నుంచి నేను తప్పించుకొనలేను. అంతేకాక భూపాలకుని అధికారాన్ని అంగీకరించుట ద్వారా ఆ అధికారం క్రింది మన బ్రతుకు ఏ విధంగా సుకరమవుతుందో ఆ విధంగానే పరమేశ్వరుని అధికారాన్ని వినమ్రభావంతో శిరసావహించడం ద్వారా మన జీవనయాత్ర సులభతరమవుతుంది. నన్ను పరివేష్టించి వున్న ఈ సృష్టి అంతా సర్వదా మార్పుపొందుతూ, నాశం పొందుతూ వున్నప్పటికి, ఆ మార్పు అంతకీ అడుగున మార్పులేనిదీ, సృష్టికారణమైనదీ, లయకారకమైనదీ, పునఃసృష్టికారమైనదీ అగు ఒక శాశ్వతమైన చైతన్యశక్తి వున్నట్లుగా నాకు అస్పష్టంగా ద్యోతకమవుతూవుంది. ఆ జీవప్రదాయకమైన శక్తి లేక ఆత్మయే

పరమేశ్వరుడు. నేను కేవలం నా ఇంద్రియములద్వారా చూచే తదితరమైనదేదిగాని శాశ్వతత్వం కలిగినది కాకపో బట్టి, కలిగివుండలేదు కాబట్టి, శాశ్వతుడైనవాడు దేవు డొక్కడే.

అయితే ఆ శక్తి హితకారకమైనదా; లేక అహిత కారకమైనదా? అది కేవలం హితకారకమైనదిగానే నేను భావిస్తాను. కారణం, మృత్యుమధ్యమందే జీవచైతన్యం వికసితమవుతున్నది; అసత్యమధ్యమందే సత్యం నిలుస్తున్నది; అంధకారమధ్యమందే కాంతి ప్రకాశిస్తున్నది. దానిని బట్టి పరమేశ్వరుడంటే జీవచైతన్యము, సత్యము, కాంతి అని నేను గ్రహిస్తాను. ఆతడే ఉత్కృష్టతమమైన హితకారి.

అది సాధ్యమైనా కాకపోయినా కేవలం మేధస్సును మాత్రమే తృప్తిపరచగలిగినవాడు దేవుడు కాజాలడు. దేవుడు దేవు డనిపించుకొనవలెనంటే మన హృదయాన్ని వశంవదం చేసికొని పరివర్తన కలిగింపజాలినవాడై వుండాలి. భక్తునియొక్క ప్రతి స్వల్పతమ చేష్టలోను తన్ను తాను వ్యక్తం చేసుకోవాలి. పంచేంద్రియముల ద్వారా కలిగే జ్ఞానమంతటికంటెను సత్యతరమూ, స్పష్టతరమూ అయిన సాక్షాత్కారం కలిగితే తప్ప అట్టి పరిస్థితి సాధ్యపడదు. ఇంద్రియజ్ఞానం ద్వారా తెలిసే విషయములు ఎంత వాస్తవ మైనట్లుగా మనకి కనిపించినప్పటికి అవి అసత్యమైనవిగాను, మోసగించునవిగాను వుండవచ్చును; తరుచు ఆవిధంగానే

వుంటాయికూడా. ఇంద్రియాతీతమైన సత్యదర్శనం శాశ్వత యాదార్థ్యాన్ని కలిగి వుంటుంది. అది బాహ్య సాక్ష్యాల ద్వారాకాక, అంతరంగమందు పరమేశ్వర సాక్షాత్కారం పొందినవారి శీలవర్తనములలో ద్యోతకమగు మార్పువలననే రుజువవుతుంది.

అన్ని దేశకాలములలోను జన్మించివున్న ప్రవక్తల యొక్క, భక్తవరులయొక్క చిరపరంపరాగతమైన అనుభూతిలో అట్టి సాక్ష్యం దృగ్గోచరమవుతుంది. ఆ సాక్ష్యమును తిరస్కరించుట కేవలం ఆత్మతిరస్కరణమే కాగలదు.

అట్టి సాక్షాత్కారం కలుగుటకుముందు అచంచలమైన విశ్వాసం ఏర్పడి వుండాలి. దైవ సాన్నిధ్యమును తన ఆంతర్యమున రుజువుపరచుకొనగోరినవాడు సజీవమైన విశ్వాసం ద్వారా దానిని సిద్ధింపజేసికొనగలడు. విశ్వాసమనునదికూడా బాహ్య సాక్ష్యముల మూలకంగా రుజువుకాని దగుటచేత ప్రపంచమంతను పాలించే ఒకానొక నైతికసూత్రముయొక్క ఉనికిని నమ్మి, సత్యప్రేమాస్వరూపమైన ఆ నైతికసూత్రం యొక్క ఉత్కృష్టతను విశ్వసించుటయే క్షేమతమమైన మార్గం. సత్యమునకును ప్రేమకును విరుద్ధమైన దేనినిగాని తిరస్కరించుటకు దృఢనిశ్చయం కలిగివుంటే, విశ్వాసమే అన్నిటికన్నా క్షేమకరమైన సాధనంగా ఉపకరించగలదు.

లోకంలో కనిపించే దుష్ప్రవృత్తియొక్క ఉనికికి హేతువును ఏవిధమైన తర్కవిధానంవల్లగాని నేను తెలుసు

కొనలేను. అట్లు తెలిసికొన యత్నించుట నేను పరమేశ్వరు నితో సరిసమానుడనగుటకు ప్రయత్నించుటయే అవుతుంది. కావున నేను అడకువతో ఆ దుష్ప్రవృత్తియొక్క ఉనికిని అంగీకరించి ఊరుకుంటాను. లోకంలో దుష్ప్రవృత్తిని ఉండనిచ్చుటనుబట్టియే దేవుడు చిరవేదనా సహిష్ణువని అంటాను. పరమేశ్వరునిలో దుష్ప్రవృత్తికి స్థానం లేదు. దానికి కర్త ఆతడే అయినప్పటికీ, అది ఆతని సోకజాలదు.

ప్రాణమొడ్డి ఎదుర్కొని అయినా దుష్ప్రవృత్తితో సమర మొనర్చినగాని పరమేశ్వరుని ఎన్నడును తెలిసికొన జాలనని కూడా నే నెరుగుదును. అల్పమునూ పరిమితమునూ అయినప్పటికీ, నా ఆత్మానుభూతియే నాలో ఆ విశ్వాసమును బలపరుస్తున్నది. నా స్వభావమును ఎంతగా పరిశుద్ధమొనర్చు కొనుటకు కృషిచేస్తే అంతగా నేను పరమేశ్వరునికి చేరువ అయినట్లుగా భావిస్తాను. నేటివలె నా విశ్వాసము కేవల నామమాత్రమే కాక హిమాలయమంత అచంచలమును, ఆ పర్వతాగ్రమందలి హిమఖండములంత స్వచ్ఛమును కాంతి వంతమును అయినవాడు నేను దేవుని కింకను ఎంతగా చేరిక కాజాలుదునోగదా! ఈ లోపున న్యూమన్ కవీశ్వరుడు స్వానుభవపూర్వకంగా గానం చేసిన ఈ ప్రార్థనాజీవితంతో గొంతు కలపవలసినదిగా విలేఖరిని (correspondent) ఆహ్వా నిస్తున్నాను :

*"క్రమ్ము తిమిరమ్ములో, కారుణ్యదీప్తి!, నీ*
*కే లొసగి నడిపించి దారిజూపుము నాకు;*

కటికచీకటి రేయి, కడుదూరము గృహమ్ము,
దారిజూపుము, ముందుదారి తెల్పుము నాకు;
కాలు తడబడనీకు, కనగోరనే దూర
తీరదృశ్యము, ఒక్కమూర సాగినచాలు."

యంగిండియా, 11-10 '28, పే. 340-41.

హేతువాదులు చాలా శ్లాఘనీయులే కాని, హేతువాదము మాత్రం తానే సర్వశక్తివంతమైనట్లు విర్రవీగే క్షణాలలో భయంకరమైన రాక్షస స్వరూపం దాలుస్తుంది. రాయిరప్పలను దేవునిగా నమ్మి చేసే విగ్రహారాధనం ఎంత మూర్ఖమైన పని. అయితే హేతుశక్తిని అణగద్రొక్కమని నా వాదం కాదు; హేతువును పవిత్రీభూత మొనర్చే ఒకానొక అంతశ్శక్తి మనలో వున్నట్లుగా అంగీకరించమని మాత్రమే నా మనవి.

యంగిండియా, 14-10-'26, పే. 359.

'దేవునిలో నాకు నమ్మకము లేదు' అని అనివేయడం చాలా సులభం. తననుగూర్చి ఏమాట అనడానికి సాహసించినాగాని దేవుడు ఏమీ అనుకోడు. ఆతడు మనయొక్క చేతలను మాత్రం గమనిస్తాడు. ఆతని శాసనాన్ని మనం ఏపాటిగాని ధిక్కరించినయెడల తత్ఫలితంగా ద్వేషరహితమూ, పాపప్రక్షాళకమూ అయిన ఒక బలవంతమైన శిక్షానుభవాన్ని మనం పొందక తప్పదు.

యంగిండియా, 23-9-'26, పే. 333

## 20
# దేవుని స్వభావ లక్షణం

దేవుని నే నొక వ్యక్తిగా సంభావించను. సత్యమే నాకు దేవుడు. భూమి నేలే రాజులూ, వారి శాసనములూ వేరగు నట్లుగా దేవుడును ఆతని శాసనములు వేరు వేరు వస్తువులుగాని, వేరు వేరు విషయములుగాని కావు. ఎందు వలన అనగా, దేవుడే ఒక భావము, ఆతడే శాసనము. అందువలన దేవుడు తన శాసనమును ఉల్లంఘించుట అనే ఊహకే అవకాశం లేదు. కాబట్టి ఆతడు మన వర్తనలను పాలిస్తూ, తాను ఎక్కడనో దూరముగా ఉండబోడు. ఆతడు మన వర్తనలను పాలించునని అన్నప్పుడు, మనం మానవ భాషలో వర్ణించి ఆతని పరిమిత స్వభావుని చేస్తున్నాము. నిజంగా చూస్తే, ఆతడూ ఆతని శాసనముకూడా సర్వ వ్యాప్తమై సర్వసృష్టినీ పాలిస్తాయి. ఆతడు మన ప్రార్థన లన్నింటినీ ప్రతి అంశంలోను తీరుస్తాడని నే ననుకోను; కాని ఆతడు మన యొక్క ప్రతిచర్యనూ శాసిస్తా డన్నమాట మాత్రం నిస్సందేహం. ఆతడు ఇచ్ఛించినగాని, ఒక గడ్డి పోచ అయినను పుట్టి పెరగజాలదని నేను అక్షరాలా నమ్ము తాను. మనకు వున్న ఇచ్ఛాస్వాతంత్ర్యం జనంతో క్రిక్కి రిసిన పడవలోని ప్రయాణీకుని స్వాతంత్ర్యంకన్న అల్ప మైనది.

"మీరు భగవంతుని ధ్యానించేటప్పుడు ఒక విధమైన స్వేచ్ఛాభావాన్ని అనుభవించరా?"

అనుభవిస్తాను. క్రిక్కిరిసిన పడవలో ప్రయాణీకునివలె ఒత్తిడి పొందను. నా స్వేచ్ఛ అట్టి ప్రయాణికుని స్వేచ్ఛ కంటె తక్కువే అని ఎరిగినప్పటికిని, భగవద్గీతయొక్క ప్రధాన సందేశంలో అంతర్గర్భితమై వున్నట్లు నేను గ్రహించిన సత్యాన్ని అనుసరించి నా వ్యక్తి స్వేచ్ఛ యొక్క సమన్వయాన్ని సాధించుకుంటాను. గీతాబోధన ప్రకారం మానవునికి తన స్వేచ్ఛను ఎట్లు వినియోగించుకునేదీ తీర్మానం చేసుకొనుటకు స్వతంత్రం వున్నది. ఆ అర్థంలో మానవుడు తన భవిష్యద్గతికి తానే కర్త. అయితే ఫలితాలు మాత్రం ఆతని వశంలో వుండవు. ఫలితాలకు తానే అధికారినని అనుకున్న యెడల, మరుక్షణం ఆతడు బాధల పాలౌతాడు.

హరిజన్, 23-3-40, పే, 55.

పరిపూర్ణత సర్వశక్తివంతుడైన పరమేశ్వరుని లక్షణం. అయినప్పటికీ ఆతడు ఎంతగా ప్రజాస్వామ్యవిధానాన్ని అనుసరిస్తాడో గమనించండి! మనలోగల ఎన్ని తప్పులను, ఎంతబూటకమును ఆతడు సహిస్తాడో చూడండి! ఆతడు మన పరిసరములలో, మన చుట్టు మన లోలోపల ప్రతి అణువునందు తాను గర్భితుడై వున్నప్పటికిని, ఆతని విశ్వసృష్టిలో అల్పజీవులమైన మనము ఆతని ఆస్తిక్యమునే సందేహించినప్పటికిని, ఓరిమితో సహిస్తున్నాడు. అయినా తనకు ఎన్నికైన వారికి తన సాక్షాత్కారం ఒసగే హక్కు ఒక్కటి మాత్రం తనకు మిగుల్చుకున్నాడు. తాను కరచరణాద్యవ

యవ రహితుడైనప్పటికీ, తన దర్శనభాగ్యమును పొందుటకు ఎవరినైతే అర్హులుగా భావిస్తాడో అట్టివారు ఆ పరమేశ్వరుని సాక్షాత్కారం పొందగలరు.

హరిజన్, 14-11-'36, పే. 316.

కేవలం శాస్త్ర దృష్ట్యా, మంచిచెడ్డలు రెండిటికీ కూడా దేవుడే మూలకందం. శస్త్రవైద్యుని కత్తినీ, హంతకుని బాకునూ కూడా ఆతడే నడిపిస్తాడు. అయినా మానవ ప్రయోజనాలకు సంబంధించినంతవరకు మంచిచెడ్డలు వెలుగు చీకట్లకును దేవత్వ రాక్షసత్వములకును ఉపమానోపమేయ సంబంధం కలిగివుండుటచే విభిన్నతను, వైరుధ్యమును సూచిస్తాయి.

హరిజన్, 20-2-'37, పే. 9.

ప్రకృతి సూత్రములు మార్పులేనివిన్నీ, మార్పజాలనివిన్నీ అయివుండుటచేత, వాటియొక్క ఉల్లంఘనము లేక నిరోధము అనే అర్థంలో అద్భుత మహిమలు అని పిలువదగిన కార్యము లేవీ ఉండజాలవు. అయితే పరిమిత వ్యక్తులమైన మనం అటువంటివిన్నీ ఊహించుకుని, తద్వారా మన పరిమిత జ్ఞానాన్ని దేవునికికూడా ఆపాదిస్తాము.

హరిజన్, 17-4-'37, పే. 87

నా భావంలో దేవుడనగా సత్యము, ప్రేమ; దేవుడనగా న్యాయము, నీతి; దేవుడనగా నిర్భయత్వం. కాంతికిని, చైతన్యముకును దేవుడే మూలకందం. అయినను ఆతడు

వీటన్నిటికంటెను ఎంతయో సమున్నతుడు, సుదూరుడు. దేవుడే మనస్సాక్షి. నాస్తికుని నాస్తికత్వంకూడా ఆతడే. ఏమనగా, తన అపారమైన ప్రేమావరణంలో నాస్తికునికి కూడా ఆశ్రయ మొసగుతున్నాడు. ఆతడు మన హృదయాంతరంగ సంవేది. అవాఙ్మనసగోచరుడు. ఆతడు మన ప్రవృత్తులనూ మన హృదయాలనూ మనకంటె బాగుగా గ్రహించగలడు. అందువల్లనే కొందరము తెలిసి, కొందరము తెలియక, మనం మాట్లాడే మాటలన్నిటికిని ఆతడు పట్టుదలపట్టడు. ఆతనియొక్క వ్యక్తి సాన్నిధ్యం అవసరమైన వారి నిమిత్తం ఆతడు మూర్తి భావంపొంది వ్యక్తుడౌతాడు. ఆతని స్పర్శను ఆశించే వారి కొరకై ఆతడు, రూపం దాలుస్తాడు. ఆతడు పరిశుద్ధభావనా స్వరూపి. భక్తులకు నిత్యసులభుడు. ఆతడు సర్వమానవులకును సర్వరూపములలోను ద్యోతకమవుతాడు. ఆతడు మనలో అంతర్యామిగా వున్నప్పటికిని, మనకంటె సమున్నతుడూ సుదూరుడూ కూడా. 'దేవుడు' అనే మాట బహిష్కృతం చేసినా, ఆ మాటలో గర్భితమైన భావాన్ని బహిష్కరించుటకు మనం అశక్తులం. మూడక్షరముల కూడికతో ఏర్పడిన 'దేవుడు' అనే సులభసాధ్యమైన మాటకు మన మనస్సాక్షి అనేది ఒక దుర్బలమైన, క్లిష్టమైన వ్యాఖ్యాన సదృశం మాత్రమే. ఆతని పేరిట అసహ్యాకరమైన అవినీతి ప్రవర్తనలూ, అమానుషములైన క్రూరకృత్యములూ జరుపబడుచున్నప్పటికిని, అందువలన ఆతడు లేడని రుజువుకాదు. ఆతడు చిరవేదనా సహిష్ణువు. ఎంత క్షమాసంకలితుడో

అంత శత్రుభీకరుడుకూడా. ఆతనితో సమానమైన చండ శాసనుడు ఇహపరలోకములు రెండిటను వేరొకడుండడు. మన ఇరుగుపొరుగున జీవించే మానవులనూ జంతుకోటినీ మనం ఏవిధంగా చూస్తే, మనలనుగూడా ఆతడు ఆవిధం గానే చూస్తాడు. ఆతడు అజ్ఞానాన్ని క్షమార్హంగా భావిం చడు. ఇన్ని చెప్పినాగాని, మనకు నిరంతర పశ్చాత్తాపావ కాశం ఒసగుటద్వారా ఆతని అపారక్షమాశీలం రుజువవు తుంది. సదసద్వివేచన విషయంలో మనకు 'విశృంఖలమైన' స్వాతంత్ర్యం ఒసగుటద్వారా లోకంలోని ప్రజాస్వామిక పాలకు లందరికంటె ఆతడు మిన్నయైన ప్రజాస్వామికునిగా వర్తిల్లుతున్నాడు. తిరిగి ఒక్కొక్కప్పుడు మనము త్రాగ బోవు పాత్రికను పెదిమెలనుంచి ఊడలాగి గిరాటవైచి, మన ఇచ్ఛా స్వాతంత్ర్యంయొక్క అల్పత్వాన్ని అవహేళన పాలొ నర్చి సంతసపడే పరమనిరంకుశునిగా గోచరమవుతాడు కూడా. అందువల్లనే హైందవమతంలో ఆ పరమేశ్వర చేష్టి తము లన్నిటినీ 'లీల' లేక 'మాయ' అని పిలుస్తారు. మనకు ఉనికి లేదు. పరమేశ్వరు డొక్కడే ఉన్నాడు. ఆతనియొక్క నిరంతర భజన ద్వారానే, ఆతని ఇచ్ఛను నిరంతరం అను సరించుట ద్వారానే, మనకు నిత్యత సిద్ధిస్తుంది. ఆ పరమే శ్వరుని మురళీగానాన్ని అనుసరించి మనం నాట్యమొనర్చి నంతవరకు మనకు ఏ శ్రేయమును లోపించదు.

యంగిండియా, 5-3-'25, పే. 81.

[లండను నగరమునందు రౌండు టేబిలు సమావేశంలో పాల్గొని తిరిగి వచ్చేటప్పుడు, స్విడ్జెర్లండు దేశంలో ఒక సభలో ప్రశ్నింపగా, గాంధీజీ ఇలా జవాబిచ్చారు.]

భగవంతుని సత్యస్వరూపిగా నే నెందుకు భావిస్తానని మీారడిగారు. హిందూమత గ్రంథాలలో దేవుని "సహస్ర నామావళి" అని ఒకటుంది. నా చిన్నతనంలో దానిని పఠించడం నాకు నేర్పారు. కాని దేవునికి ఆ సహస్రనామాలు కూడా ఇంకా చాలవని నా అభిప్రాయం. సృష్టిలోని భూత జాలం ఎంత అసంఖ్యాకమో దేవుని పేర్లున్నూ అంత అసంఖ్యాకమని మేము నమ్ముతాము— అదే నా నమ్మకంకూడా. అందువల్ల, దేవుడు నామరహితుడనికూడా మే మంటాము. అట్లే దేవుడు అసంఖ్యాకమైన రూపములుకూడా కలిగివుండుటనుబట్టి ఆతడు రూపరహితుడనీ, అసంఖ్యాకమైన భాషలలో మనకు వ్యక్తుడగుచుండుటచే అవ్యక్తుడనీకూడా అంటాము. ఇస్లాం మతాన్ని గురించి పఠించినప్పుడు, ఆ మతంలోకూడా దేవునికి అనేక నామము లున్నట్లు నేను గమనించివున్నాను. దేవుని ప్రేమ స్వరూపిగా భావించేవారితోపాటు, దేవుడు ప్రేమస్వరూపి అని అనడం నాకూ ఇష్టమే. అయితే నా అంతరాంతరంలో మాత్రం 'దేవుడు ప్రేమస్వరూపి కావచ్చునుగాని, అన్నిటికంటె ఎక్కువగా దేవుడు సత్యస్వరూపి' అని అనుకుంటూ వుంటాను. మానవభాషలో పరమేశ్వరుని సర్వతోముఖంగా వర్ణించడం సాధ్యమైన పక్షంలో నా మట్టుకు నేను దేవుడు 'సత్యస్వరూపి' అని చెప్పవలసి

వుంటుందనే నిశ్చయానికి వచ్చాను. కాని రెండేళ్ళ క్రితం నేను ఇంకొక అడుగు ముందుకి సాగి 'సత్యస్వరూపమే దేవుడు' అని నిశ్చయించుకున్నాను. "దేవుడు సత్యస్వరూపి" అనే నిర్వచనానికీ 'సత్యస్వరూపమే దేవుడు' అనే నిర్వచనానికీ గల సూక్ష్మ వ్యత్యాసం మీరు గ్రహించగలరనుకుంటాను. ఏభది వత్సరాల క్రితం నేను ప్రారంభించిన విరామ మెరుగని, పట్టుదల వీడని, సత్యాన్వేషణయొక్క ఫలితంగా నేను ఆ తుది నిర్ధారణకు చేరుకున్నాను. అప్పుడు, ఆ సత్యమును చేరుకొనుటకు చేరువదారి ప్రేమమార్గమని గ్రహించాను. ఉదాహరణకు, కనీసం ఇంగ్లీషు భాషలో 'ప్రేమ' అనే శబ్దానికి వివిధార్థములున్నవనిన్నీ, కామోద్రేకం అనే భావంలో మానవప్రేమ హీనార్థమునుకూడా వ్యక్తం చేయవచ్చుననిన్నీ కూడా గమనించాను. అహింసతో సమానార్థంలో ప్రేమభావమును అవగాహన చేసుకున్నవారు ప్రపంచంలో అల్పసంఖ్యాకులే అన్న సంగతి కూడా తెలుసుకున్నాను. ఇక 'సత్యము' అనే మాటలో ఏవిధమైన ద్వంద్వార్థముగాని ఉన్నట్లు నాకు పొడకట్టలేదు. పైగా నాస్తికులుకూడా సత్యముయొక్క, సత్యప్రభావముయొక్క అగత్యాన్ని నిరాకరించి వుండలేదు. అయితే సత్యమును వెదకిపట్టుకొనవలెననే ఆవేశంలో దేవుని ఆస్తిక్యము నైనను నిరాకరించుటకు వారు వెనుదీయలేదు— అది వారి దృక్పథంనుంచి సమర్థనీయమే. ఈ హేతువిధానంయొక్క ఫలితంగా 'దేవుడు సత్యస్వరూపి' అనుటకంటె

'సత్యస్వరూపమే దేవుడు' అనుటయే ఎక్కువ సమంజసమని గ్రహించాను. ఈ సందర్భంలో తాను నాస్తికుడనని సంతోషంగా ప్రకటించుకున్న ఛార్లెస్ బ్రాడ్లా పేరు ఉదాహరణార్థం స్మరణకు తెస్తాను. ఆయననుగూర్చి బాగా నాకు తెలిసినదానినిబట్టి, ఆయన నాస్తికుడనే మాటను నే నెన్నటికిని అంగీకరించను. ఆయన నా ఆపాదనను నిరాకరిస్తాడని నే నెరిగినప్పటికిని, ఆయనను దేవునియెడల భయభక్తులుగల సత్పురుషునిగా నేను పేర్కొంటాను. ఆయన సమక్షమందే కనక "నేను బ్రాడ్లాగారూ, మీరు సత్యము యెడల భయభక్తులు గలవారుకాబట్టి దేవునియెడలకూడా భయభక్తులు గలవారే" అని అంటే, ఆయన ముఖం తప్పక కందగడ్డలా ఎఱ్ఱబారుతుంది. అప్పుడు నేనూ, నావద్దకు వచ్చిన అనేకమంది యువకులయొక్క విమర్శనలను నిరాయుధమొనర్చిన విధంగానే "సత్యస్వరూపమే దేవుడండీ", అని వెంటనే చెప్పి, ఆయన విమర్శనమునుకూడా నిరాయుధం చేస్తాను. దేవునిలో నమ్మకమున్న లక్షలాది జనులు దేవునిపేరిట చెప్పరాని ఘాతుక కృత్యా లొనరుస్తున్నారనే విషయం మరొక గొప్ప చిక్కుని తెచ్చిపెడుతుంది. అయితే సత్యం పేరిట, విజ్ఞాన శాస్త్రజ్ఞులున్నూ అనేక క్రూరకార్యాలు చేయరనికాదు. సత్యం పేరిటను, విజ్ఞానశాస్త్రం పేరిటను, జంతువులపైన చేసే శస్త్రప్రయోగాలద్వారా ఎంతటి అమానుషమైన క్రూరకాండ జరుగుతున్నదీ నే నెరుగుదును. దేవుని ఏ విధంగా నిర్వచించినప్పటికి, ఈ విధమైన చిక్కులు అనేకం

ఎదురవుతాయి. అయినప్పటికి, మానవమనస్సు పరిమితమగు టచే, మానవాతీతమైన వ్యక్తినిగూర్చిగాని వస్తువునుగూర్చి గాని మనము పరిమితజ్ఞానముతో మాత్రమే ఊహించుకొన గలుగుతాము.

ఇక హైందవతత్వశాస్త్రంలో ఇంకొక విషయంకూడా వుంది. అదేమనగా, 'దేవుని కొక్కనికే అస్తిత్వముఉన్నది, మిగిలిన దేనికిని లేదు' అనే భావం. ఈ సత్యమే ఇస్లాం లోని 'కల్మా' లో నొక్కి చెప్పబడి వున్నది. అందులో 'దేవు డొక్కడే ఉన్నాడు, మరేదీ లేదు' అని విస్పష్టంగా ఉగ్గడించబడింది. నిజానికి సంస్కృతభాషలో సత్యము అను మాటకు మూలమైన 'సత్' అనే ప్రాతిపదికకే 'ఉన్నటు వంటిది' అని అర్థం. పైన చెప్పిన ఈ హేతువులనుబట్టిన్నీ, ఇంకా నేను చెప్పగలిగిన ఇతర హేతువులను బట్టిన్నీ, 'సత్యమే దేవుడు' అనే నిర్వచనమే నాకు అధికతమమైన సంతృప్తిని ఇవ్వగలదనే నిర్ణయానికి వచ్చాను. అయితే సత్యమే దేవుడను భావమును అనుభవవేద్యము చేసికొనవలె నంటే మాత్రం, దానికి ఏకైక సాధనం ప్రేమ, అనగా హింసారాహిత్యం. ఇక తుట్టతుదిని సాధ్య సాధన భేదం నశిస్తుందని నేను నమ్ముటను బట్టి, 'దేవుడు ప్రేమ స్వరూపి' అని అనడానికిన్నీ నేను సంకోచ పడనవసరం లేదు.

"అయితే మరి సత్యమంటే ఏమిటండీ?", అని ప్రశ్నించగా గాంధీజీ ఇలా చెప్పారు :

ఇది కష్టమైన ప్రశ్నే. కాని నాకు సంబంధించినంత వరకు, మన అంతరంగవాణి ఏమిచెపితే అదే సత్యమని

చెప్పుకుని, ఈ ప్రశ్నకు పరిష్కారం పొందివున్నాను. అయితే మరి వేరువేరు వ్యక్తులు వేరువేరు సత్యములను, పరస్పర విరుద్ధమైన సత్యములను ఎందుకు ఊహించుకుంటారని మీరడుగుతారు. మానవ మనస్సు అసంఖ్యాకములైన వాహనముల ద్వారా పనిచేస్తుంది. అందరు మనుష్యులకూ మానసిక పరిణతి ఒకే స్థాయిలో వుండదు. అందువల్ల ఒకరికి సత్యమైనది ఇంకొకరికి అసత్యము కావచ్చును. అందువలన ఈ విషయములను గురించి ప్రయోగము లొనర్చినవారు ఈ ప్రయోగములను చేయుటలో కొన్ని నియమాలను అనుసరించడం అవసరమని తీర్మానించి వున్నారు. విజ్ఞానశాస్త్ర సంబంధమైన ప్రయోగములను నడపుటకు శాస్త్రీయమైన శిక్షణ ఏ విధంగా తప్పనిసరి అవుతున్నదో, అదే విధంగా ఆధ్యాత్మిక రంగంలో ప్రయోగములు జరుపు వ్యక్తికిన్ని, అట్టి అర్హతను పొందుటకుగాను, ముందుగా అలవరచుకొనవలసిన విధ్యుక్తమైన శిక్షణ వున్నది. ఎవరుగాని తమ అంతర్వాణిని గురించి ప్రస్తావించుటకు ముందు, తమ పరిమితులను గ్రహించుకొని మరీ మాట్లాడడం మంచిది. సత్యస్వరూపమే దేవుడని తెలిసికొనుటకు వ్యక్తిగతమైన అన్వేషణ జరుపగోరువారు కొన్ని వ్రతములను అనుష్ఠించవలసి వున్నదని మా మతంలో అనుభవపూర్వకమైన విశ్వాస మొకటి వున్నది. సత్యము మొడల, దేవునిమొడల నీవు లగ్నమొనర్పవలసిన అఖండ ప్రేమభావము తదితర విషయములవైపు ప్రసరించి ఖండితము కాకుండుటకుగాను అట్టి వ్రతసంకల్పం అవసరం. సత్యపాల

నము, బ్రహ్మచర్యము లేక ఆత్మ పారిశుద్ధ్యం, అహింసా దీక్ష, ధనరాహిత్యం (Poverty), అపరిగ్రహం (Non-possession) అను అయిదును ఆ వ్రతములు. ఈ వ్రతపంచకమును అవలంబిస్తే తప్ప, ఎవరుగాని అట్టి ప్రయోగములను ప్రారంభించుటకు ఏమాత్రం వీలుకాదు. ఇంకా చాలా విధ్యుక్తములైన నియమము లున్నవికాని, వాటి నన్నిటిని చెప్పుట కిప్పుడవకాశము లేదు. అందువలన, ఎవరు పడితే వారు తాము తమ మనస్సాక్షియొక్క వాణిని వింటున్నామని ప్రకటించడము సరికాదని అట్టి ప్రయోగము లొనర్చినవారి అభిప్రాయమని చెబితే ప్రస్తుతం సరిపోతుందని భావిస్తాను. ప్రస్తుత క్షణాన్ని ఏ విధమైన నియమ శిక్షణముగాని లేకుండానే అందరూ తమ మనస్సాక్షి హక్కును ప్రకటిస్తూ వుండడం వల్లను, ఈ నాడు ప్రచారమయ్యే అసత్య సమూహం లోకమును చీకాకుపాలుచేస్తూ వుండడం వల్లను, నేను వినీత భావంతో మీ సమక్షంలో నివేదించగలిగినది ఒక్కటే మాట. వినమ్ర మనస్కతతో తమ అల్పజ్ఞతను అనల్పముగా గుర్తించినవారు తప్ప సత్యదర్శనమును పొందజాలరు. సత్య సముద్ర వక్షాన ఈదగోరినచో నీవు సున్నకన్న తేలిక అయిపోవాలి. అత్యంతా కర్షణీయమైన ఈ పరిశీలనా పథంలో ప్రస్తుతం ఇంతకు మించిపోలేను.

యంగిండియా, 31-12-'31, పే. 427–28.

దేవుడు అసంఖ్యాకమైన రూపములలో అభివ్యక్తమగుచుండుటచేత, దేవునికి అసంఖ్యాకమైన నిర్వచనములు

ఏర్పడివున్నవి. ఆతడు అభివ్యక్తమగు ఆ రూపము లన్నీ యును నన్ను అద్భుత భక్తిభావంలో ముంచెత్తి, ఒక్కొక్క క్షణంలో ముగ్ధునిగా చేస్తూ వుంటాయి. అయితే నేను పరమేశ్వరుని సత్యస్వరూపునిగానే పూజిస్తాను. ఇంకా నేను దేవుని సాన్నిధ్యమును పొందలేదు; అన్వేషకుని స్థితిలోనే వున్నాను. ఈ అన్వేషణా మార్గంలో నాకు ప్రియకరమైన వస్తువులన్నిటినీ విసర్జించుటకు సంసిద్ధుడనై వున్నాను. అట్లు త్యజించవలసిన వస్తువు నా ప్రాణమే అయినప్పటికిని, నేను దానిని సమర్పించుటకు సంసిద్ధుడనై వుండగలనని ఆశిస్తాను. ఆ పరమమైన సత్యము నాకు అనుభవవేద్యం కానంతవరకు, నా భావనకు సాధ్యమైన తత్సామీప్య సత్యమునే నా పట్టు గొమ్మగా స్వీకరించవలసి వున్నది. అంతవరకు ఆ సామీప్య సత్యమే నాకు దీపస్తంభముగా, రక్షాకవచముగా ఉపకరించ వలసి వున్నది. ఈ మార్గము సూక్ష్మమైనదీ, సన్నమైనదీ, కత్తి అంచువలె పదునైనదీ అయినప్పటికిని అదియే నాకు చేరువైనదిగాను, సులభసాధ్యమైనదిగాను భావిస్తాను. ఈ మార్గ మును ఏ మాత్రమూ తప్పకుండా అనుసరించుటవలననే, నా హిమాలయ సమానమైన పొరపాట్లను కూడా తేలికగా భరించగలుగుతున్నాను. ఈ మార్గము నన్ను విపత్తులపాలు కాకుండా రక్షిస్తూ వున్నందున, అందు నా జ్ఞానదీపము దారి జూపినంతవరకు నేను ముందుకు సాగగలిగాను. అప్పు డప్పుడు నా పురోగమన మార్గంలో నాకు ఆ పరమసత్య స్వరూపుడగు పరమేశ్వరుని దర్శనభాగ్యం లభించుచుండు

టచే 'యథార్థమైనది ఆతడొక్కడే, తదితరమంతా అయథార్థం' అనే విశ్వాసం నాలో దినక్రమంగా దృఢతరమవుతూ వున్నది.

దానితోపాటు మరొక విశ్వాసం, నాకు సాధ్యమైనది పసిబాలునికి కూడా సాధ్యమవుతుందనే విశ్వాసం ఒకటి నాలో ఏర్పడుతూవున్నది. ఈ మాటను బలపరచుటకు నేను తగిన హేతువులు కూడా చూపగలను. సత్యాన్వేషణమునకు అవసరమైన ఉపకరణములు ఎంత సామాన్యమైనవో అంత క్లిష్టమైనవి. అవి అహంకారపూరితుడైన వానికి కేవలం అసాధ్యములుగా కనిపించవచ్చును; అమాయిక బాలునికి అతిసులభములుగా తోచవచ్చును. సత్యమును అన్వేషించు వాడు తాను ధూళికంటెను అల్పుడు కావలసివుంటుంది. లోకము ధూళిని తన పాదములక్రింద త్రొక్కిపారవేస్తుంది. కాని సత్యాన్వేషి తాను ఆ ధూళియొక్క పాదములక్రింద త్రొక్కబడునంతటి అల్పాల్పుడననే వినీతభావమును అలవరచుకోవాలి.

నావంటివారు వందలు నశించనిండు, సత్యమొక్కటే వర్ధిల్లుగాక !

'ఆత్మకథ' పరిచయవాక్యములనుండి, పే. 6-7.

# 21
# దేవుని విషయమైన నా అనుభూతి

మీరూ నేనూ ఈ గదిలో కూర్చుని వున్నామనే విషయంలో కంటె, దేవుడున్నాడనే విషయంలో నాకు

ఎక్కువ నమ్మకం వున్నది. గాలీ నీళ్లూ లేకపోయినా బ్రతుక వచ్చునుగాని, ఆతడు లేనిదే బ్రతకడం మాత్రం అసాధ్య మని నేను ఉగ్గడించగలను. మీరు నా కళ్లు పీకివేయవచ్చును, అది నన్ను చంపలేదు; మీరు నా ముక్కునుకోసి పారవేయ వచ్చును, అది నన్ను చంపబోదు; కాని దేవునియందలి నా విశ్వాసమును భగ్నమొనర్చగలిగితే మాత్రం నా జీవం నశిస్తుంది. మీరు దీనినొక మూఢవిశ్వాసమని పిలువ వచ్చును. కాని నా చిన్ననాడు ఏదైనా అపాయహేతువు గాని, విపత్సూచనగాని తోచినప్పుడు నేను రామనామమును ఏ రీతిగా పట్టుగొమ్మగా హత్తుకొనువాడనో, అదే రీతిని ఇదిన్నీ నేను నా హృదయమునకు హత్తుకునే మూఢవిశ్వాస మని మనవి చేస్తాను.

హరిజన్, 14-5-'38, పే. 46.

ఒక సూర్యాస్తమయపు అద్భుతదృశ్యమునుగాని, చంద్రోదయపు సౌందర్యమునుగాని చూచి పరవశమగు నప్పుడు, సృష్టికర్త యెడల పూజ్యభావముతో నా ఆత్మ విశాల మవుతుంది. ఈ సృష్టివైచిత్ర్యములన్నిటిలోను నేను ఆ పరమేశ్వరుని మూర్తి భావములను, కృపాకటాక్షములను దర్శించుటకు యత్నిస్తాను.

యంగిండియా, 13-11-'24, పే. 378.

నేను సాధించగోరునదీ, గత ముప్పది సంవత్సరము లుగా నేను తీరని తృష్ణతో సాధించ యత్నించుచున్నదీ ఏమనగా— ఆత్మజ్ఞానము, దైవసాక్షాత్కారము, మోక్షసిద్ధి

మాత్రమే. ఈ పరమావధియొక్క అన్వేషణయే నా ప్రాణము, నా ప్రవర్తనము, నా ఉనికి. నేను నా వచనరచనలద్వారా చేయు సర్వమునకు, రాజకీయరంగమందలి నా సాహస ప్రయోగము లన్నిటికి ఈ ప్రయోజనసాధనయే లక్ష్యము. ఏ మూలకందమునుండి నేను ప్రభవించివున్నానో, ఎవరు నా ప్రతి ప్రాణోచ్ఛ్వాసమును పాలించుచున్నట్లు నాకు సంపూర్ణజ్ఞానమున్నదో, అట్టి పరమేశ్వరునియొక్క సన్నిధానమునకు నే నింకను ఎంత దూరముగా వున్నానో భావించుకొన్నప్పుడు, నేను ఎడతెరపిలేని ఘోరవేదన పాలౌతాను. నా లోలోపలి దుష్టోద్రేకములే నన్నాతని కింత దూరము చేస్తున్నట్లు నే నెరిగివున్నప్పటికిని, వాటి బారినుండి నేను తప్పించుకొనలేకున్నాను.

'ఆత్మకథ' పరిచయవాక్యములనుండి, పే. 8.

దేవుడొక్కడే మార్గదర్శకుడుగా నేను యాత్ర సాగించాలి. ప్రభువు నేను మరొకదారి త్రొక్కితే సహించడు. తన అధికారములో ఎవరుగాని పాలు పంచుకొనుటకు ఆత డనుమతించడు. కావున ఆతని సమక్షంలో ఏ వ్యక్తిగాని తనలోని దౌర్బల్యము నంతను బయలుపెట్టి శూన్యహస్తములతో, సంపూర్ణవశంవదభావంతో నిలబడవలసి వుంటుంది. అప్పుడు ఆతడు నీకు లోకమంతనూ ఎదుర్కొని నిలవగల శక్తి నిచ్చి, సర్వవిపత్తులనుంచీ రక్షణ ఒసగుతాడు.

నాకు భవిష్యత్తును ముందుగా తెలిసికొనవలెననే కోరికలేదు. ప్రస్తుత కార్యములందు జాగరూకతవహించుటే నా విధి. మరుక్షణంమీద దేవుడు నాకు అధికారం ఒసగలేదు.

యంగిండియా, 26-12-'24, పే. 427.

నన్ను రక్షించడానికి ప్రయత్నించకండి. మనలనందరను రక్షించుటకు ఉన్నతోన్నతుడైన ఆ భగవంతుడున్నాడు. నా కాలం ముగిసినప్పుడు ఎవరుగాని, లోకంలో కల్లా ఎంతటి గొప్పవారైనాగాని, నాకూ ఆ భగవంతునికీ మధ్య నిలవజాలరని నమ్మండి.

యంగిండియా, 2-4-'31, పే. 54.

ఈ దేహంలో నే నుండుట భగవదేచ్ఛ అయినంత కాలం ఆతడే నన్ను కాపాడుతాడు. ఆతని పనులు తీరిన మరుక్షణం ఎన్ని జాగ్రత్తలు తీసికొన్నను అవి నన్నురక్షించ నేరవు.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 91.

దేవుడు అంతటి కఠిన పరీక్షకుని ఈ భూప్రపంచంలో ఎక్కడా నేను చూడలేదు. ఆతడు మనలో లోతులను పరిశోధిస్తాడు. మన విశ్వాసము సడలుతున్నట్లుగాని, మన దేహం నిలబడలేక మనం క్రుంగిపోతున్నట్లుగాని తోచినప్పుడు, ఆతడు ఏదో ఒక విధంగా మన సహాయమునకు వచ్చి మన విశ్వాసాన్ని రుజువుపరచి, దానిని నిలబెట్టుకునే బలమొసగుతాడు. అతడు నీవు పిలిచిన వెంటనే పలుకుటకు

నిత్యము సంసిద్ధుడుగానే వుంటాడు; అయితే ఆతని సహాయము నీ నిబంధనల ప్రకారము కాక, ఆతని నిబంధనల ననుసరించియే లభిస్తుంది.

గాంధీ మహాత్ముని ప్రసంగములు, రచనలు, 4వ కూర్పు, పే. 1069

గీతను అనుసరించువాడు నైసర్గిక ఘటనలను సహజముగనే స్వీకరించి, సరిగా నడిచే యంత్ర మెట్లు యాంత్రికుని ఉద్దేశ ప్రకారము తిరుగునో అట్లే తానును ఒకానొక మహాయాంత్రికుని శక్తివలన నడుపబడినట్లుగా తన విధులను నిర్వర్తిస్తాడు. సచేతనుడైన వ్యక్తి యంత్రసదృశంగా వర్తించడం కష్టతమ కార్యమే. కాని తన వ్యక్తిత్వము సున్నతో సమానమగునట్లు చేసికొనుటలో ఆదర్శసిద్ధి పొందగోరువాడు పై విధముగా కేవలం యంత్ర సమానుడే కావలసివుంటుంది. యంత్రమునకును మనిషికిని తేడా ఏమనగా :- యంత్రము ప్రాణరహితమైనది; మానవుడు సర్వదా సచేతనుడగుటచే తన ఇష్టపూర్తిగనే ఆ ఉత్కృష్ట యాంత్రికుని చేతులలో తానొక యంత్రమువలె వర్తించగలడు. పరమేశ్వరుడు జీవులందరను యంత్రమునందలి భాగము లట్లు నడిపిస్తాడని శ్రీకృష్ణభగవానుని ప్రవచనం.

మీరాకుబాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 288–39.

గత అర్థశతాబ్ద కాలమూ నేను ఆ చండశాసనుడైన ప్రభునికి ఇచ్ఛాపూర్వకమైన దాసునిగా గడిపి వున్నాను. ఏళ్లు గడచినకొలదీ ఆతని వాణి నాకు క్రమక్రమముగా స్పష్ట

తరముగా శ్రవణగోచర మవుతున్నది. నన్ను నిరాశాతమస్సు ఆవరించిన క్షణములలో కూడా ఆతడు నన్ను విసర్జించలేదు. అనేక పర్యాయములు నా కోరికకు వ్యతిరేకముగా కూడా నన్ను కాపాడి, నా వ్యక్తిస్వాతంత్ర్యమును హరించి వున్నాడు. ఆతని ఇచ్ఛకు ఎంతసంపూర్ణముగా ఆత్మసమర్పణ చేసుకుంటే అంత ఎక్కువగా నేను ఆనందానుభూతి పొందుతూ వచ్చాను.

హరిజన్ 6-5-'33, పే. 4.

భగవంతుడు, తనకు ఇతర బాధ్యతలేమీ లేవన్నట్లుగా, నిత్యం మనకు తోడునీడగా వుండి, మన సంక్షేమమునే చూస్తూవుంటాడు. ఈ కార్యమును ఆతడేవిధంగా నెరవేరుస్తాడో నాకు తెలియదు. కాని అది జరుగుతూనే వుంటుందని మాత్రం నాకు రూఢిగా తెలుసును. భక్తులైనవారు, తమ క్లేశభారమంతా తమ భుజములనుంచి తొలగింపబడి, ప్రశాంతిని అనుభవిస్తారు.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 267.

అపజయము నన్ను నిరుత్సాహపరచనేరదు; నేన్ను మరింత సుశిక్షితునిగా చేయగలదంతే. దేవుడే నాకు మార్గదర్శకుడు కాగలడని నే నెరుగుదును.

యంగిండియా, 3-7-'24, పే. 218.

ఎవని దృష్టికి గోచరముకాని వస్తువేదియును లేదో, ఎవని ఇచ్ఛకు అనుగుణంగా వర్తించుటకు నేను నిరంతర కృషిని సల్పుతున్నానో, అట్టి సర్వసాక్షి అగు భగవంతుని సాన్నిధ్యమును నేను అనుభవించని క్షణం లేదు.

దేవుని వలన విసర్జితుడనైనానన్న భావము నా జీవిత మంతటిలోనూ ఒక్కసారైనా నాకు కలిగి వున్నట్లు జ్ఞప్తి లేదు.

హరిజన్, 24-12-'38, పే 395.

నా అంతరంగంలో నిత్యం భగవత్సాన్నిధ్యాన్ని అనుభవిస్తూ వుండుటవలన తప్ప, లేనిచో నా దైనందినానుభవంలో నాకు కనిపించే దుఃఖనైష్ఫల్యాలవల్ల నేను మనోవైకల్యంపాలై పోయి, నాకు ఈ హుగ్లీనదియే గతి అయి వుండేది.

యంగిండియా, 6-8-'25, పే. 275.

దినములు గడిచిన కొలదీ నాకు ఈ సజీవమైన భగవత్సాన్నిధ్య భావం ప్రతి రక్తనాళంలోనూ అనుభూత మవుతూ వున్నది. ఆ అనుభూతి లేనిచో నేను ఉన్మాదిగా అయిపోయివుందును. నా మనశ్శాంతిని భగ్నంచేసే విషయాలు అనేకం వున్నాయి. ఆ భగవత్సాన్నిధ్యానుభూతే కనక లేనిపక్షంలో, ఈ జరిగే అనేక సంఘటనలు నన్ను పునాదులనుంచి కదిల్చి పారవేయగలిగేవి. కాని ఇప్పుడవి నన్ను ఏ మాత్రమును సోకనట్లే నడిచిపోతున్నాయి.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949. పే. 268.

ఇతర విషయానుభవము లన్నిటిని త్రోసిపుచ్చి, కేవల భగవత్సాన్నిధ్యమునే అనుభూత మొనర్చుకొన గలిగిన, వర్ణనాతీతమూ పాపరహితమూ అగు పరమానందస్థితి ప్రతి మానవ వ్యక్తికిని సాధ్యమని నా నమ్మకం.

## 22

# అంతర్వాణి

భగవద్వాణి నాకు వినిపిస్తుందని నేను చేసే ఉద్ఘాటన కొత్తదేమీ కాదు. అయితే దురదృష్ట మేమిటంటే, ఫలితముల వలన తప్ప దానియొక్క యాథార్థ్యమును నిరూపించుటకు మార్గాంతరము నాకు కనిపించడం లేదు.

హరిజన్, 6-5-'33, పే. 4.

అనేకమందిని కలతపెట్టిన మొదటి ప్రశ్న భగవద్వాణి విషయికమైనది. అది ఏమిటి? నేను ఏమిటి విన్నాను? నాకు ఎవరైనా కనిపించారా? లేనియెడల దేనిద్వారా విన్నాను? ఇవన్నీ సందర్భోచితమైన ప్రశ్నలే.

భగవద్వాణి అన్నా, మనస్సాక్షియొక్క లేక సత్యముయొక్క వాణి అని అన్నా, అంతర్వాణి లేక 'నిశితమైన నీరవవాణి' అని అన్నా, ఇవన్నీ నాకు ఒకటే అర్థమిస్తాయి. నేను ఏ రూపమును గాని చూడలేదు. నేను ఎల్లప్పుడూ దేవుని రూపరహితునిగానే భావనచేస్తూ వుండుటచే, అట్టి ప్రయత్నమును కూడ చేయలేదు. నేను విన్నటువంటిది సుదూరవాణివలె తోచిన క్షణంలోనే అత్యంత సన్నిహితమైనదిగా కూడా తోచింది. మానవకంఠం నాతో మాట్లాడితే ఎంత స్పష్టంగా వుంటుందో, ఆ వాణియు అంత విస్పష్టంగా వినిపించి, నన్ను వశంవదం చేసుకుంది. ఆ వాణిని వినెడి సమయంలో నేను స్వప్నావస్థలో లేను. అది

వినిపించుటకు ముందు నా అంతర్యంలో భయంకర సంఘర్షణ అనుభూతమయింది. అప్పుడు హఠాత్తుగా ఆ వాణి నన్ను ఆవహించింది. దానిని ఆలకించి, అది అంతర్వాణియే అని రూఢిపరచుకొన్నాను. ఆ వెనువెంటనే నా అంతర సంఘర్షణ అంతా అడగిపోయింది. ప్రశాంతి నన్నావరించింది. దాని ప్రకారం మనోనిశ్చయం గావించుకొనడమూ, నిరశన దీక్షారంభమునకు దినమూ సమయమూ నిర్ణయించుకొనడమూ కూడా జరిగాయి. అంతట నన్నేదో ఆనంద పారవశ్యం ముంచెత్తింది. ఇది అర్ధరాత్రి 11 గంటలు 12 గంటలు మధ్యలో జరిగింది. అప్పుడు మనస్సు తేటపడి, ఈ సంఘటనను గురించిన నా వ్యాసమును వ్రాయ నారంభించాను. అది చదువరులు ఈ సరికి చూచియే వుంటారు.

అది నిజముగా దైవవాణియే అనిన్నీ, నా ఉద్రిక్త భావనయొక్క ప్రతిధ్వని కాదనిన్నీ రుజువుపరచుటకు ఇంతకు మించి నే నొసగగల సాక్ష్యమేమైనా వున్నదా? సందేహపరులను తృప్తిపరచుటకు ఇంతకంటె నే నొసగగల సాక్ష్యమింకేమీ లేదు. అట్టి వా రెవరుగాని ఇది సర్వమూ ఆత్మవంచనమనిగాని, ఊహా వైపరీత్యమనిగాని అనుటకు వారికి స్వాతంత్రమున్నది. వారిమాటయే నిజమైనను కావచ్చును. అట్లు కాదని నేను ఏవిధమైన రుజువును చూపలేను. అయినను లోకమంతా ఏకమై నాకు వ్యతిరేకంగా తీర్పు ఒసగినప్పటికిని, నేను వినినది సత్యమైన దైవవాణియే అను నా విశ్వాసమును అది ఏమాత్రం గాని చలింపజేయలేదు.

కాని భగవంతుడే మన భావనాశక్తియొక్క సృష్టి అని భావించేవారు కొందరున్నారు. ఆ దృక్పథం ఒప్పు కుంటే ఏదీ నిజంకాదు, అంతా మన ఊహాజనితమే అవు తుంది. ఆ ప్రకారంగా అయినప్పటికిని, నేను నా ఊహా శక్తికి వశవర్తినైనప్పుడు దాని ప్రభావానుసారమే నడచుకొన గలుగుతాను. వస్తువుల యాథార్థ్యం తారతమ్య సూత్ర మును బట్టే వుంటుంది. నాకు ఆ వాణి నా ఆస్తిక్యంకన్న యథార్థమైనదిగా తోచింది. అది నన్నెన్నడూ విడనాడ లేదు; నన్నే కాదు, ఎవరినీ అది విడనాడబోదు.

కోరిన వా రెవరుగాని ఆ వాణిని వినగలరు. అది అందరి అంతరంగాలలోనూ అధివసించి వుంటుంది. అయితే అన్ని కార్యములకును వలెనే, దానిని వినగలుటకు కూడా నిర్దిష్టమైన ప్రారంభశిక్షణ అవసరం.

హరిజన్, 8-7-'33, పే. 4.

నా ఆంతర్యంలోని ఆ 'నిశిత నీరవవాణి'ని అరికట్టిన మరుక్షణం నా ఉనికి నిరర్థకమైపోతుంది.

యంగిండియా, 3-12-'25, పే. 422.

కొందరు వ్యక్తులకు ఈ అంతర్వాణి అనేది అనుభవ వేద్యం కావచ్చుననే విషయమును గురించి, నేనెరిగినంత వరకు, వ్యతిరేకించిన వారెవరుగాని వున్నట్లు కనిపించదు. నిజముగా అంతర్వాణి నెరిగి తాను పలుకుతున్నట్లు విశ్వసింప దగిన వ్యక్తి ఒక్కడున్నప్పటికిని, అది అంతవరకు లోకానికి

లాభదాయకమే కాగలదు. అట్టి విశ్వాసాన్ని ప్రకటించే వారు అనేకులున్నాగాని, వారందరును దానికి నిదర్శనపూర్వకమైన సమర్థన చూపలేరు. అసత్యప్రచారకులను దూరము చేసే నిమిత్తం దానిని అడచివేయుట సాధ్యమైన పనికాదు, యోగ్యమైన పనికాదని గ్రహించాలి. సత్యముగా తమ అంతర్వాణికి ప్రాతినిధ్యం వహించగలిగినవారు అధిక సంఖ్యలో వున్నను, అది లోకానికి ఏ మాత్రమూ నష్టకరం కాదు. అయితే బూటకమునకు ప్రతిక్రియ ఏమీ లేకపోవడం మాత్రం చిక్కువిషయమే. అయితే బూటక నటకులున్నారుగదా అని సద్గుణాన్ని అణగద్రొక్కుటకూడా తగిన పని కాదు. తాము అంతర్వాణికి ప్రతినిధులమని ప్రకటించుకునే వ్యక్తులు లోకమంతటా ఎల్లప్పుడూ కనిపిస్తూనే వుంటారు. కాని కొలదిపాటికాలం సాగే అట్టివారి ప్రచారంవల్ల లోకానికి ఇంతవరకూ ఏమీ హానికలగలేదు. ఆ దివ్యవాణిని వినగలుగుటకు ముందు దీర్ఘతరమూ కఠినతరమూ అయిన శిక్షణ అవసరం; తుదిని సత్యముగా అంతర్వాణి వినిపించినప్పుడు అది నిర్దుష్టంగా తెలుస్తుంది. ప్రపంచాన్ని మోసగించడం ఎల్లకాలమూ సాగదు. అందువల్ల నావంటి ఒక దీనమానవుడు తాను అంతరంగవాణిని విన్నానని నమ్మి, ఆ విశ్వాసమును లోకము నెదుర్కొని ప్రకటించుటకు సాహసించుటవలన అరాజకం ఏర్పడిపోతుందని భయపడనవసరం లేదు.

హరిజన్, 18-3-'33, పే. 8.

మానవుడు భ్రమ ప్రమాదాలకు లోనైన వ్యక్తి. ఆతని నడవడి లోపభూయిష్టం కాజాలదని అనుకోడానికి వీలులేదు. ఆతడు తన ప్రార్థనకు ప్రత్యుత్తరమని తలచినది ఆతని అహంకారమునకు ప్రతిధ్వని మాత్రమే కావచ్చును. కేవలం నిర్దుష్టమైన మార్గదర్శనమును పొందదలచినవాడు సంపూర్ణంగా నిష్కళంకమైన అమాయక హృదయాన్ని కలిగివుండాలి. నాకంత అర్హతలేదు. నా ఆత్మ ఘర్షణలతో, యత్నములతో, లోపములతో కూడి అసంపూర్ణమైనది.

యంగిండియా, 25-9-'24, పే. 313.

ఆత్మపారిశుధ్యాన్ని గడించుటకు నిర్విరామంగా చేసిన సాధనా ఫలితంగా నా అంతరాంతము యొక్క 'నిశిత నీరవవాణి'ని స్వచ్ఛముగాను, స్పష్టముగాను వినగలశక్తిని ఇసుమంత ఆర్జించగలిగాను.

ది ఎపిక్ ఫాస్ట్, రచన: ప్యారీలాల్, 1933, పే. 34.

పరమేశ్వరుడు ప్రతి దినమూ ప్రతి మానవ వ్యక్తికిని ప్రత్యక్ష దర్శనం ఒసగుతూనే వుంటాడని నా దృఢవిశ్వాసం. అయినా మనం ఆ 'నిశిత నీరవవాణి' ని ఆలకించకుండా చెవులు మూసుకుంటాం.

యంగిండియా, 25-5-'21, పే. 162.



# అయిదవ విభాగం

# ఆచరణలో నా మతం

## 23

## ప్రేమ ధర్మం

ప్రేమ ఎక్కడ వుంటే దేవుడు కూడా అక్కడ వుంటాడు.

దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం, 1950. పే. 360.

అహింస అన్నిటికన్నా ఉన్నత స్థాయికి చెందిన క్రియాశక్తి. దానినే ఆత్మశక్తి అనిగాని, మన అంతరంగ నివిష్టమైన దైవశక్తి అనిగాని అనవచ్చును. మనము అహింసా భావమును ఎంతవరకు అనుభవేద్యం చేసుకుంటే అంతవరకు దైవలక్షణ లక్షితులం కాగలుగుతాము.

హరిజన్, 12-11-'38, పే. 326.

మన భూమి గోళమునందలి అణుసందోహం మధ్య వాటిని సమైక్యమొనర్చే సంపుటీకరణశక్తి ఒకటి వున్నదనీన్నీ, అది లేనిచో భూగోళమంతా భగ్నభూతమై మన ఉనికే ఉండదనీన్నీ విజ్ఞానశాస్త్రజ్ఞులు చెపుతారు. అంధమూ నిశ్చేతనమూ అయిన భౌతికపదార్థంలో ఏ విధంగా ఏకీకరణ శక్తి వున్నదో అట్లే సచేతన వస్తువులందును అట్టి శక్తి వుండి తీరుతుంది. సచేతన జీవులందుగల అట్టి సామరస్యశక్తినే ప్రేమ అని అంటారు. తండ్రీకొడుకులమధ్య, అన్నాచెల్లెళ్ల

నడుమ, మిత్రులమధ్య ఆ ప్రేమభావము మనకు ద్యోతక మవుతుంది. కాని ఆ శక్తిని మనం సర్వజీవలోకమునకూ వర్తింపజేయుట ఎట్లో తెలుసుకొనవలసి వున్నది. దానిని ఆ రీతిగా ప్రయోగించుటలోనే దేవునిగూర్చిన జ్ఞానం మనకు లభ్యమవుతుంది.

యంగిండియా, 5-5-'20, పే. 7.

మానవుని ఉత్కృష్టసాధన అంతా దేవుని తెలుసు కొనుటకే వినియుక్తమయింది, అన్నారు గాంధీజీ. మానవ నిర్మితములైన ఆలయములలోగాని, విగ్రహములందుగాని, ఆరాధన స్థలములందుగాని ఆతడు లభ్యంకాడు. వివిధము లైన విసర్జనా నియమాలలోను ఆతడు దొరకడు. కేవలం ప్రేమమార్గావలంబన ద్వారానే— భౌతికంకాని అలౌకిక ప్రేమద్వారానే— దేవుని తెలిసికొనగలము.

హారిజన్, 23-11-'47, పే. 425.

సంఘనిర్మాణం ఇంకను అంగీకారపూర్వకమైన అహింసాసూత్రం మీాద ఆధారపడి నడవకపోయినప్పటికిని, ప్రస్తుతక్షణంలో లోకమంతటా మానవసమాజం యొక్క క్షేమజీవనమున్నూ, వారి వ్యక్తిగతమైన ఆస్తిపాస్తుల సుర క్షితయున్నూ పరస్పరసహానభావం మీాదనే ఆధారపడివున్న దని నేను ఉద్ఘాటిస్తాను. అట్లుకాని పక్షంలో మానవాళిలో మిక్కిలి స్వల్పసంఖ్యాకులున్నూ, అందరికంటే క్రూర స్వభా వులైన వారున్నూ మాత్రమే మిగిలి వుండేవారు. కాని ఆ విధంగా జరగలేదు. కుటుంబాలు ప్రేమబంధంతో ఒక

టిగా కట్టుబడివున్నాయి. నాగరికత కలిగినదిగా పేర్కొన బడే సంఘనిర్మాణంలోకూడా జాతు లనబడే ప్రజాకూటము లున్నా అట్టి సమీకరణబంధంతోటే కట్టబడి వున్నాయి. ఆయా సంఘటనలు ఇంకను అహింసాసూత్రంయొక్క సర్వాధిక్యతను పూర్ణంగా గ్రహించలేదన్న దొక్కటే లోపం. అనగా వారింకను ఆ సూత్రంయొక్క విశాలప్రయోజనాలను పరిశోధించి తెలిసికొనలేదన్న మాట. ఇంతవరకును మనము అపరిగ్రహాది త్యాగనియమావళిని అవలంబించిన కొలదిమందికి మాత్రమే సంపూర్ణమైన అహింసాచరణం సాధ్యమవుతుందని అనుకుని, అక్కడితో ఊరకొనివుంచుట మన అలసభావాన్ని మాత్రమే సూచిస్తుందని చెప్పకతప్పదు. అట్టి సాధకులైనవారే ఆ విషయమై పరిశీలనము సాగించి, మానవవర్తనమును పాలించే ఆ శాశ్వత శాసనంయొక్క నూతన సాధ్యతలను అప్పటప్పట లోకానికి వెల్లడించ గలుగుదురన్న విషయం నిజమేకాని, ఆ సూత్రం నిజమైన సూత్రమైన యెడల అందరికీ సమంగా ఆచరణసాధ్యం కావలసి వుంటుందనిమాత్రం మరువకూడదు. మనకు గోచరించే వైఫల్యతలన్నీ ఆ శాసనానికి చెందినవికావు; ఆ శాసన పాలితులకే అవి వర్తిస్తాయి. దారిలో చాలామంది తాము ఏదో ఒక విధంగా ఆ శాసనమునకు బద్ధులై వున్నట్లు ఎరుగనే ఎరగరు. తన శిశువుకొరకై తన ప్రాణమొసగే తల్లి తనకు తెలియకుండానే ఆ శాసనాన్ని అనువర్తిస్తున్నది. వైఫల్యాలను లెక్కించకుండా ఆ శాసనమును ఇష్టపూర్తిగా

అంగీకరించ వలసినదనిన్నీ, మనఃపూర్వకంగా ఆచరించవల సినదనిన్నీ వాదిస్తూ గడిచిన ఏబది సంవత్సరాలనుంచీ నేను ప్రచారం చేస్తున్నాను. ఈ ఏబది సంవత్సరాల కృషిఫలి తంగానూ కలిగిన అద్భుతపర్యవసానములు నా విశ్వాసాన్ని బలతరం చేశాయి.

హరిజన్, 22-2-'42, పే. 48.

స్త్రీ వ్యక్తి అహింసకు మూర్తీభావమని ఈ వరలో ఈ పత్రికా ముఖాన్ని ప్రకటించివున్నాను. అహింస అనగా అపారమైన ప్రేమభావమని అర్థం. మరి, ప్రేమభావమంటే కష్టములను ఓర్చుకొనగల అమితమైన సహనశక్తి అనిఅర్థం. మానవునికి జన్మదానమొసగే ఆ స్త్రీమూర్తిలోతక్క అట్టి ఉత్కృష్ట సహనశక్తి ఇకెవరిలో ప్రదర్శితమవుతుంది? ఆమె తన గర్భమందు శిశువును వహించి, నవమాసములూ పోషించి, ఆ భారమును సంతోషముగా నిర్వహించుటలో మన కాశక్తి ద్యోతక మవుతుంది. ప్రసవవేదనకు మించిన వేదన వేరేమున్నది? కాని ఆయమ ఆ బాధనంతను శిశు సృష్టివలన కలిగే ఆనందాతిశయంలో మరచిపోతుంది. తన కన్నబిడ్డ దినదినప్రవర్ధమాన మగుటకు ఆమెవలె దైనందిన త్యాగమును ఇంకెవరు చూపగలరు? తాను కేవలము పురు షుని కామవాంఛకు లక్ష్యమనిగాని, లక్ష్యము కాగలదని గాని విస్మరించి, ఆ స్త్రీమూర్తియే కనక తన ప్రేమభావ మును సర్వమానవ లోకమునకును ప్రసరించిననాడు ఆమె పురుషుని పజ్జగా ఆతని మాతృమూర్తిగా, సృష్టికారిణిగా

ప్రశాంతమైన నాయకురాలుగా నిజస్థానమును సగర్వముగా పొందగలదు. యుద్ధకాండలతో అలసి శాంతిపిపాసులై నిలిచిన యావత్ప్రపంచమునకును శాంతియుతజీవనమనే ఉత్కృష్ట కళను బోధించే గురుత్వపదవి ఆయమ జన్మహక్కు.

హరిజన్, 24-2-'40, పే. 13.

## 24

# త్యాగయుక్తమైన సేవద్వారా ప్రేమసాధన

## (అ) సేవ

ఆతని సృష్టిలో ఆతని దర్శించి, ఆ సృష్టిసర్వస్వముతోను ఐక్యభావము నలవరచుకొనుట ఒక్కటియే దేవుని తెలియుటకు మార్గము. ఇది సర్వులకును సేవ ఒనర్చుట ద్వారానే సాధ్యమవుతుంది. నేను ఆ సృష్టి సర్వస్వములో ఒక భాగమగుటచే, విశ్వమానవసంఘానికి వేరుగా ఆతని యొక్క దర్శనము పొందజాలను. నా దేశస్థులైన ప్రజానీకం నాకు అందరికంటెను సన్నిహితమైన ఇరుగుపొరుగువారు. వారు అత్యంత నిస్సహాయులూ, దుర్బలులూ, నిర్జీవులూ అయిపోయివున్నందున వారికి సేవ ఒనర్చుటలో నాయొక్క సర్వశక్తులను కేంద్రీకరించవలసి వున్నది. భగవంతుని హిమవత్పర్వతపు ఒకానొక గుహలో దర్శింపగలనని నాకు నమ్మకము కలిగించుకొనజాలినచో, తప్పక నేను తక్షణం అక్కడికే ప్రయాణమవుతాను; కాని మానవ సంఘానికి వేరుగా ఆ పరమేశ్వరుని కన్గొనజాలనన్న విషయము నాకు స్పష్టముగా తెలుసును.

హరిజన్, 29-8-'36, పే. 226.

నేను భారత దేశపు ప్రజలమధ్య జన్మించి జీవించవల సినదిగా దేవుడు విధించివుండుటనుబట్టి, వారికి నేను సేవ చేయనియెడల నా సృష్టికర్త ఇచ్ఛకు నేను విరుద్ధముగా చరించినవాడ నవుతాను. వారికి సేవచేయుట ఎట్లో నాకు తెలియనియెడల, విశ్వమానవసంఘానికి ఎట్లు సేవచేయవలెనో కూడా తెలియనివాడ నవుతాను.

యంగిండియా, 18-6-'25, పే. 211.

పరమేశ్వరుడు తాను సృష్టించిన జీవకోటిలోని ఉన్న తులూ, శక్తివంతులూ అయినవారిలోకంటె దీనులూ, హీనులూ అగువారిలోనే ఎక్కువగా మూర్తీభవించి వుంటా డని నే నెరిగివుండుటచే, నేను అట్టివారితో సమానస్థాయిని అందుకొనుటకు అత్యంతము సాధనచేస్తున్నాను. వారికి సేవ చేయుటద్వారాతప్ప ఆ పని నెరవేరదు. దళితవర్గముల సేవలో నాకు గల ఉద్రిక్తమైన అభిలాషకు అదే హేతువు. ఈ సేవాకార్యము రాజకీయములలో ప్రవేశించకుండా నెరవేరదు కనుక, నేను వాటిలో అడుగుపెట్టడం జరిగింది.

యంగిండియా 11-9-'24, పే. 298.

భారత దేశంలో అందరికంటె హీనాతి హీనులతో, అంతేకాదు, లోకమంతటిలోను దీనాతిదీనులతో నేను సమైక్య భావమును అలవరచుకొనవలసివున్న పక్షంలో, అట్టి శక్తే నాకు వున్నపక్షంలో, ప్రత్యక్షంగా నా బాధ్యతక్రింద నాకు సన్నిహితముగా వున్నటువంటి దీనదరిద్రులతో ముం దుగా నన్ను సమైక్యభావం సాధించనియ్యండి. వినమ్ర

భావంతో ఆ కార్యమును సాధించుటద్వారానే ఏనాడో ఒక నాడు నేను భగవంతునియొక్క, సత్యముయొక్క ప్రత్యక్ష దర్శనాన్ని పొందగలుగుతానని నా ఆశ.

యంగిండియా, 3-12-'25, పే. 422.

మీకు నేనొక మంత్రం చెప్తాను. మీ మనస్సు సందేహస్థితిలో పడినప్పుడుగాని, మీలో అహంకారం ప్రకోపించినప్పుడు కాని, ఈక్రింది చెప్పిన అవసర ప్రయోగాన్ని చేసి చూడండి :

మీరు చూచినవారిలోకల్లా దీనదరిద్రుడూ అత్యంత నిస్సహాయుడూ అయిన వ్యక్తియొక్క మొగాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని, మీరు తలపెట్టబోతున్నచర్య ఆ వ్యక్తికి ఏ మాత్రంగాని ఉపకరించగలదా అని మిమ్ముల్ను మీరు ప్రశ్నించుకోండి. అతడికి దానివల్ల ఏ మాత్రమైనా లాభం కలుగుతుందా ? అతడు తన జీవితాన్నీ, తన భవిష్యత్తునీ తన వశంలోకి తెచ్చుకొని మలుచుకొనుటకు ఆ పని తోడ్పడుతుందా ? అనగా, ఆ పని ఆకలితోనూ ఆత్మదౌర్బల్యంతోనూ అలమటించే లక్షలాది మన దేశప్రజలకు స్వారాజ్యమును, అనగా ఆత్మపరిపాలనాశక్తిని, చేకూర్చడానికి దారి జూపుతుందా ? అని ప్రశ్నించుకోండి.

ఆ వెంటనే మీ సందేహాలూ, స్వార్థబుద్ధీ కరిగి మాయం కాగలవు.

మహాత్మాజీతో మాట్లాడుతూ యువకుడైన ఒక అమెరికన్ మిషనరీ, "మీరు విశ్వసించేమతం ఏమిటి?" అనీన్నీ, "భవిష్యత్తులో భారతదేశపు మతం ఏ రీతిగా పరిణామం పొందవచ్చును?" అనీన్నీ ప్రశ్నించాడు.

మహాత్మాజీ ఆతనికి బహుక్లుప్తంగా జవాబిచ్చారు. ఆ గదిలో పడుకొనివున్న ఇద్దరు వ్యాధిగ్రస్థులవైపు చూపించి, "సేవ చేయడమే నా మతం. భవిష్యత్తు విషయం నే నెక్కువ ఆలోచించి బాధపడను" అని ఊరుకున్నారు.

'దిస్ వజ్ బాపు' కర్త ఆర్. కె. ప్రభు, 1954, పే. 4.

మతమనగా నిస్సహాయులకు సేవచేయడమే. నిస్సహాయులూ, వ్యథాగ్రస్థులూ అయినవారి రూపంలో దేవుడు మనకు ప్రత్యక్ష దర్శనం ఒసగుతాడు.

ప్రత్యేక నామధేయాలతో ప్రచారమయ్యే మతములను అనుసరించుటకంటె నూలు వడుకుట అనేది తప్పకుండా ఎక్కువ విలువైనదిగా భావించాను నేను. అందుకని ఆయా మతాలను విసర్జించమని అర్థంకాదు. అన్ని మతాలకు చెందినవారూ కూడా సమానంగా అవలంబించదగిన ధర్మం ఆ విభిన్న మతము లన్నిటినీ మించిన విలువగలిగినవని మాత్రమే నా అభిప్రాయం. కాబట్టి సేవాభావంతో రాట్నం త్రిప్పే బ్రాహ్మణుడుగాని, ముసల్మానుడుగాని, వైష్ణవ మతస్థుడుగాని మరింత మంచి బ్రాహ్మణుడూ, ముసల్మానుడు, వైష్ణవుడు కాగలడని చెప్పగలను.

పక్కమీద పరున్న సమయంలోకూడా రాట్నం త్రిప్పుటకు వీలైనయెడల, అట్టికార్యము దేవునిపై మనస్సును కేంద్రీకరించుటకు సహకరిస్తుందని తోచినయెడల, నేను తులసిమాలను వదలి రాట్నమునే త్రిప్పుతాను. దారిద్ర్యమూ క్షుద్బాధ దేశాన్ని ఆవరించివున్నంతవరకు, తులసిమాలను త్రిప్పడమా, రాట్నమును త్రిప్పడమా అని ప్రశ్న వస్తే, నాకు శక్తివున్నంతదనుక రాట్నమునే తులసిమాలగా భావించి, దానిని త్రిప్పుటకే తప్పక హెచ్చువిలువ ఇస్తాను. రామనామోచ్చారణ కూడా ఒక అడ్డంకుగా భావించే స్థితి కోసం నేను ఎదురుచూస్తున్నాను. రాముడు వాగతీతుడని అనుభవేద్యమైననాడు ఆతని నామధ్యానం నాకిక అవసరముండదు. రాట్నమూ, తులసిమాలికా, రామనామమూ, ఇవన్నీ నాకు సమానార్థకాలే. అవన్నీ నాకు ఒకే ప్రయోజనాన్ని సిద్ధింపజేస్తాయి. అది సేవాధర్మాన్ని నాకు బోధించే సాధనాలు. సేవాధర్మాన్ని అనుసరించడంద్వారా తప్ప అహింసా సూత్రాన్ని ఆచరణలో పెట్టలేను. అహింసాధర్మాన్ని పాటిస్తేతప్ప సత్యసిద్ధి పొందజాలను. సత్యము తప్ప వేరే మతమన్నది లేదు.

యంగిండియా, 14-8-'24, పే. 267.

చేతితో దారం వడికే పని ప్రస్తుతం అమలులోవున్న ఏ ఇతర పరిశ్రమతోనూ పోటీచేయడంగాని, దాని స్థానాన్ని ఆక్రమించుకోడం గాని చేయదు ; దాని ఉద్దేశంకూడా అది కాదు. జీవనోపాధిని ఆర్జించే ఏ ఇతరపనులుగాని కలిగివున్న

దార్ఢ్యవంతులైన ఏ ఒక్కరినిగాని వాటినుంచి తప్పించడానికి కూడా ఇది ఉద్దేశింపబడినదికాదు. వ్యవసాయవృత్తి ఒక్కటే జీవనోపాధిగా బ్రతికే భారతదేశపు అసంఖ్యాక ప్రజానీకానికి ఏడాదిలో ఆరుమాసాలు ఏపనీలేకుండా కాళీగా వుండవలసి వుంటుంది. వారికి ఏ ఇతరసహాయక వృత్తీ లేదు. అందు వలన వారు నిత్యదారిద్ర్యం పాలవుతూవుండడం జరుగుతూ వున్నది. భారతదేశాన్ని ఎదుర్కొనే సర్వప్రధానమైన ఈ సమస్యకు తక్షణసాధ్యమూ, ఆచరణయోగ్యమూ, సర్వదా ఉపయుక్తమూ అయిన పరిష్కారంగా మాత్రమే నూలు వడకడం అనే ప్రతిపాదన ఉద్దేశింపబడింది.

యంగిండియా. 21-10-'26, పే. 368.

దేశంలో దార్ఢ్యవంతులైన ఒక్కపురుషుడుగాని, స్త్రీ గాని పనీ తిండీ లేకుండా వున్నంతవరకు మనం విశ్రాంతిని గాని, పూర్ణభోజనమునుగాని అనుభవించడానికి సిగ్గుపడవలసి వుంటుంది.

యంగిండియా, 5-2-'25, పే. 48.

పనిలేక అలమటించే 30 కోట్ల ప్రజానీకం వుండి, ప్రతి దినం వారిలో లక్షలాదిజనులు వృత్తిలేమివలన ఆత్మవిశ్వాసాన్ని, భగవద్విశ్వాసాన్ని కోల్పోయినవారై పోతూవున్న పరిస్థితి ఎంత దౌర్భాగ్యమైనదో ఊహించుకోండి. కళ్ళు కాంతిహీనమై, అశనమే ఆరాధ్యదైవమైన ఆ ఆకలిగొన్న కోట్లాది ప్రజలముందు పరమేశ్వరుని గురించి సందేశాలు

పలకడంకంటె ఆ మూలనున్న కుక్కముందు పలకడంనయం. వారికి దేవునిగూర్చి మాటలు చెప్పడంకన్న ముందు వారికి ఏదో ఒక జీవనోపాధిని చూపడం ఎక్కువ పవిత్రమైన సందేశం అవుతుంది. చక్కని ఫలహారాలు సేవించి, తదుపరి ఇంకా చక్కని భోజనం సిద్ధంగా వున్నదని యెరిగి, యిక్కడ మనం చక్కగా కూర్చుని భగవద్విషయాలు చర్చించుకోవడం చాలా చక్కగానే వుంటుంది. కాని రోజుకు రెండు భోజనాలకు నోచుకోని ఆ లక్షలాది ప్రజల సమక్షాన్ని దేవునిగూర్చి నే నేవిధంగా మాట్లాడగలను? వారికి దేవుడు అన్నపానాలు రూపంగానే కనిపించగలుగుతాడు.

యంగిండియా, 15-10-'31, పే. 310.

పేదవారిలోకల్లా పేదవారితో ఐక్యభావం అలవరచుకుని, వారికి సేవచేయుటద్వారా తప్ప ఆత్మజ్ఞానం సిద్ధింపజాలదని నా నమ్మకం.

యంగిండియా, 12-10-'26, పే. 364.

## (ఆ) త్యాగం

మానవకాయం కేవలం త్యాగానికే ఉద్దేశింపబడింది; భోగానికి కాదు. త్యాగంలోనే సుఖజీవన రహస్యం ఇమిడి వుంది. త్యాగమే బ్రతుకు; భోగం మృత్యు సమానం. కావున ప్రతిఫలాపేక్ష లేకుండా సేవాచరణంలో గడిపే నిమిత్తం ప్రతివారూ 125 ఏళ్లు బ్రతకవలెనని కోరవచ్చును.

అట్లు కోరుటకు ప్రతివారికీ హక్కువుంది. అట్టి జీవితం కేవలం సేవాచరణానికే పూర్తిగా అంకితమై వుండాలి. సేవాచరణంకోసం చేసిన త్యాగం చెప్పరాని ఆనందాన్ని చేకూరుస్తుంది; అంతరంగజనితమైన జీవదాయిని ఆ ఆనందామృతం. ఆ ఆనందం మనఃక్లేశాలను హరిస్తుంది; ఓరిమిని చేకూరుస్తుంది. ఆ ఆనందసిద్ధి పొందనిదీ దీర్ఘాయువు అసాధ్యం ; ఒక వేళ సాధ్యమైనా అది కేవలం నిరర్థకం.

హరిజన్, 24-2-'46, పే 19.

కావున, సర్వసృష్టిజాలానికీ మనం సేవచేయగలుగుటకే మనకీ దేహం ఇవ్వబడింది.

బానిసీడు తాను సేవచేసే యజమాని తన కొసగిన అన్నవస్త్రాదులను ఏవిధంగా స్వీకరిస్తాడో, అదే విధమైన కృతజ్ఞభావంతో మనమున్నా సర్వవిశ్వాధినాథుడైన పరమేశ్వరుడు మనకు నిర్దేశించిన కానుకలను స్వీకరించవలసి వుంటుంది. దేవునివలన మనం పొందేదేనినిగాని కానుకగానే భావించాలి. మనం దేవునికి ఋణపడివున్నందున ఆతనికి మనం చేసే సేవలకు ప్రత్యామ్నాయాన్ని ఆసించుటకు మనకేమాత్రం హక్కులేదు. కనుక అట్టి కానుకలను మనం పొందని పక్షంలో మన మాతని నిందించుటకూడా అసంబద్ధమవుతుంది. తన ఇచ్ఛానుసారం మన శరీరాన్ని పరిపోషించుటకుగాని నాశమొందించుటకుగాని ఆతనికి దానిపై పూర్ణాధికారమున్నది. దీని నొక బాధాకరమైన సంగతిగా

గాని, జాలికరమైన సంగతిగాగాని భావించవలసిన పనిలేదు. దేవుని సృష్టిసంకల్పంలో మన అర్హస్థానాన్ని మనం గ్రహిం చుకున్ననాడు, ఈ సంబంధం ఎంత సహజమూ, సంతోష ప్రదమూ, అభిలషణీయమూ అయిన విషయమో మనం తెలిసికొనగలుగుతాము. ఈ పరమానందస్థితిని అనుభూతం చేసికొనవలెనంటే మనకు బలవత్తరమైన విశ్వాసం అవసరం. "నిన్ను గురించి నీవు మనఃక్లేశముతో క్రుంగిపోకు ; నీ క్లేశము లన్నిటినీ పరమేశ్వరునికే వప్పగించు" అన్నదే మతము లన్నీ ఒసగే ప్రబోధసందేశమని ద్యోతకమవుతుంది.

ఈ సాధనవిషయమై భయపడ నవసరంలేదు. నిర్మల మైన అంతఃకరణతో సేవాతత్పరతను అలవరచుకునే వ్యక్తి క్రమక్రమంగా అట్టి సేవాచరణంయొక్క అవసరాన్ని అధిక తరంగా గ్రహించుకో గలుగుతాడు. తద్వారా ఆతని విశ్వాసంకూడా, దినదినప్రవర్ధమానమై వెలుగొందుతుంది. స్వార్థాన్ని విసర్జించడానికి సంసిద్ధుడు కానివాడూ, తనయొక్క జన్మసార్థకతను గ్రహించలేనివాడూ, సేవామార్గాన్ని అను సరించడానికి కేవలం అసమర్థుడవుతాడు. తెలిసియో లేక తెలియకుండగనో మనలో ప్రతి ఒక్కరమూకూడా ఏదో ఒక సేవాకార్యాన్ని ఆచరిస్తూనే వున్నాము. ఈ సేవాచరణాన్ని మనం బుద్ధిపూర్వకంగా చేయడం అభ్యసించినచో సేవ యెడల మన అభిలాష దినదినప్రవర్ధమానంగా పెరుగుతుంది. అట్టి పరిణతియొక్క ఫలితంగా ఆత్మానందమూ, లోకకల్యా ణమూ కూడా సిద్ధిస్తాయి.

సహజ సచ్ఛీలురైనవారు మాత్రమేకాక మనలో అందరమూకూడా మన సర్వశక్తులనూ విశ్వమానవ సంఘం యొక్క ప్రయోజనాలకు సమర్పితం చేయవలసి వున్నది. స్పష్టంగా ద్యోతకమవుతూన్న ఈ ధర్మసూత్రాన్ని గ్రహిస్తే మన జీవితంలో భోగలాలసత వైదొలగి, త్యాగశీలతకు తావొసగుతుంది. ఈ త్యాగమనే విధ్యుక్తధర్మమే మానవుని పశుజాతినుంచి వేరుపరుస్తుంది.

పై రీతిగా జీవితాన్ని అన్వయించుటవల్ల బ్రతుకు రస రహితమూ, కళావిహీనమూ అయిపోతుందనిన్నీ, కుటుంబ జీవితానికి తావులేకుండా పోతుందనిన్నీ కొందరు అభ్యంతరం చెవుతారు. కాని ఇక్కడ పేర్కొనే త్యాగభావానికి లోక పరిత్యాగమని కాని, అరణ్యవాస స్వీకారమనికాని అర్థం కాదు. కేవలం త్యాగశీలత, జీవితకర్మల నన్నిటినీ పరిపాలించవలసివుంటుంది. బ్రతుకును భోగపరత్వంగాకాక విధి నిర్వహణంగా భావించడంవల్ల ఎవరికిగాని కుటుంబజీవితానికి భంగం కలగదు. త్యాగభావంతో వర్తించే వ్యాపారస్థుడు, తన చేతులమీద కోట్లకొలది ధనం నడుస్తూవున్నప్పటికీ, పై సూత్రానుసారంగా తన శక్తిసామర్థ్యాలను లోకసేవా కార్యాలకే వినియోగిస్తాడు. ఆతడు మోసకార్యాలను, సాహసవ్యాపారాలను చేయడు ; నిరాడంబరంగా జీవిస్తాడు ; ఏ ప్రాణికిని హాని కలిగించడు ; తనవల్ల ఏ వ్యక్తిగాని నష్ట పడుటకంటె తనకు లక్షలు నష్టమైనా లెక్కసేయడు. ఈవిధమైన వ్యాపారస్థుడు కేవలం నా ఊహాలోకంలోనే గాని

భూలోకంలో మాత్రం దుర్లభుడని అనుకోకండి. అదృష్ట వశాత్తు ఆరకం వ్యక్తులు పాశ్చాత్యలోకంలోనూ, ప్రాచ్య లోకంలోనూకూడా కొందరు కనిపిస్తూనే వున్నారు. అట్టి వారు వ్రేళ్ళపై లెక్కింపదగినంత స్వల్పసంఖ్యలో వుండే మాట నిజమేకావచ్చు. అట్టి సజీవోదాహరణం ఒక్కటి దొరికితే చాలు, నా వర్ణన కేవలం ఊహాచిత్రమని త్రోసి వేయడానికి తావుండదు. ఈ త్యాగధనులు తమ వృత్తి ద్వారా తమ భుక్తినికూడా పొందుతారనడం నిస్సందేహ మైన విషయమే అయినా, జీవనోపాధి వారి ముఖ్య లక్ష్యం కాదు ; అది వారు తమ వృత్తిధర్మాన్ని అనుసరించడంలో కలిగే ఉపలబ్ధిమాత్రమే అవుతుంది. త్యాగయుత జీవితమే కళకు పరాకాష్ఠ ; అదే సత్యానందసంధాయకం.

సేవాభావానికి అంకితమైనవాడు స్వసౌఖ్య సాధనకు ఙణమైన వ్యయపరచడు; తనకు సౌఖ్యమునో అసౌఖ్యమునో ఒసగే అధికారం తనకు ప్రభువైన ఆ పరమేశ్వరునికే వదలి పెడతాడు. అందువలన ఆతడు తనకు లభ్యమైన సర్వమూ తనదే అనుకుని తనకు బరువుచేసుకోడు ; తనకు దానిలో కేవలం అవసరమైనంతవరకే తీసికొని, తక్కినది వదలివేస్తాడు. తనకు అసౌకర్యములు కలిగినప్పుడుకూడా ప్రశాంతతతో, ఆగ్రహోద్రేకములకు వశంకాకుండా, అచంచల మనస్కతతో వుంటాడు. 'సుగుణం దానికదే ప్రతిఫలం' అన్నట్లుగా, ఆతని సేవాపరత్వంకూడా దానికదే ప్రతిఫలమని భావించుకుని, ఆత్మసంతృప్తి పొందుతాడు.

ఇతరులకు మనం ఇష్టపూర్తిగా చేసే సేవ మనకు సాధ్యమైనంత ఉత్తమసేవ అయి వుండాలి; మన స్వంత ప్రయోజనాలకంటె అది తొలి ప్రాధాన్యత కలిగివుండాలి. నిజానికి, పూర్ణభక్తుడైనవాడు సంపూర్ణమైన నిస్వార్థబుద్ధితో సేవాచరణమునకు తన జీవితాన్ని అంకితమొనర్చుకుంటాడు.

"యెరవ్డా మందిరంనుంచి" 1945, పే. 54-60.

త్యాగాచరణంలో వివిధములైన విధానా లుండవచ్చును. వాటిలో 'భుక్తిశ్రమ' (Bread-labour) అనేది కూడా ఒకటికావచ్చును. అందరూ కేవలం తమ భుక్తి సంపాదనకు అవసరమైనంత మాత్రపు దేహశ్రమ చేస్తే, తత్ఫలితంగా అందరికిన్నీ తగినంత భుక్తీ, తగినంతవిశ్రాంతీ కూడా లభ్యమవుతాయి. అప్పుడు జనసంఖ్య పెరుగుతున్నదనే భయంగాని, వ్యాధి బాధలుగాని, ఈనాడు నలుదిక్కులా మనకు కనిపించే దారిద్ర్యస్థితిగాని వుండవు. అట్టి దేహశ్రమ ఉత్తమోత్తమమైన సేవావిధాన మనిపించుకుంటుంది. ఈ పనికి మించి మనుష్యులు అదనంగా దైహికమూ, మానసికమూ అయిన ఇంకా ఎన్నో కార్యాలు నెరవేర్చవచ్చును. అయితే ఆ కార్యాచరణమంతా 'ప్రీతిపూర్వక పరిశ్రమ' (Labour of Love) అవుతుంది. అప్పుడు ధనికులూ దరిద్రులూ అనికాని, గొప్పవారూ కొద్దివారూ అనికాని, స్పృశ్యులూ అస్పృశ్యులూ అనికాని భేదభావ ముండదు.

ఇది అందరాని ఆదర్శమైతే కావచ్చును. అయినా అందుకని మన ప్రయత్నాన్ని మనం విరమించుకొనవలసిన

పనిలేదు. మన జీవితపరమార్థమైన సేవాసూత్రాన్ని సంపూర్ణంగా నెరవేర్చలేకపోయినప్పటికీ, మన దైనందిన భుక్తి సంపాదనకు అవసరమైనంత దైహికశ్రమను మనం ఆచరించినట్లయితే, అప్పుడు పరమాదర్శసాధన మార్గంలో మనం చాలా దూరం ప్రయాణించినవార మవుతాము.

ఈవిధంగా మనం వర్తించడం ద్వారా మన అవసరాలు వీలైనంతవరకూ తగ్గడమూ, సామాన్య భోజనంతో మనం సంతృప్తిపొందడమూ జరుగుతుంది. అప్పుడు బ్రతకడానికి తింటామేకాని, తినడానికి బ్రతకం. ఈ ప్రతిపాదన యొక్క నిజాన్ని సందేహించే ఏవ్యక్తిగాని తన భుక్తికి అవసరమైన శ్రమను స్వయంగాచేసి, చెమటోడ్చి చూచుకోవచ్చును. అప్పుడు అతడు తన శ్రమఫలితమైన భుక్తిని అత్యంత రుచ్యమైనదిగా భావిస్తాడు; ఆరోగ్యవంతు డవుతాడు; ఈవరలో తాను సేవించే అనేకమైన వస్తువులు తనకు అనవసరమని తెలుసుకుంటాడు.

అయితే మానసికమైన శ్రమద్వారా భుక్తిసంపాదనం చేయకూడదా అని ప్రశ్నిస్తే, కూడదని నేను జవాబిస్తాను. శారీరకావసరాలను శరీరమే తీర్చాలి. "సీజరుకు చెందినది సీజరునకే అర్పించండి" (Render unto Caesar that which is Caesar's) అనే నానుడి ఈ సందర్భానికి చక్కగా సరిపోతుందనుకుంటాను.

కేవలం మేధశ్శక్తితోచేసే, అంటే మానసికమైన పరిశ్రమ ఆత్మసంబంధి; అది దానికదే సంతృప్తం. కాదగి

నది. అట్టి శ్రమ మూల్యాన్ని ఆశించకూడదు. ఆదర్శ రాజ్యంలో వైద్యులూ, న్యాయవాదులూ మొదలైనవారు, స్వార్థానికి కాక, కేవలం సంఘశ్రేయానికే పని చేస్తారు. 'భుక్తిశ్రమ' సూత్రాన్ని అవలంబించడం జరిగిననాడు, తద్వారా సంఘవ్యవస్థలో ఒక ప్రశాంతవిప్లవం జరిగి పోతుంది. ఏ మనిషి కామనిషి బ్రతుకు నిలద్రొక్కుకొన డానికి పడే ఘర్షణకు బదులుగా, పరస్పర సేవాసహకా రాల నిమిత్తం చేసే పరిశ్రమయే మానవవిజయానికి చిహ్న మవుతుంది. పశుధర్మానికి బదులుగా మనుష్యధర్మం ప్రతి ష్ఠిత మవుతుంది.

హరిజన్, 29-6-'35, పే. 156.

సాధ్యమైనంత తక్కువ అవసరాలతో బ్రతుకు గడప డమే తన ఆనందంగా భావించే ఒక తరహావ్యక్తి కనిపిస్తూ వుంటాడు భారతదేశంలో. కొంచెం పిండీ, కాస్త ఉప్పూ మిర్చి పైగుడ్డలో మూటకట్టుకుని, దానిని బుజానవైచుకొని పోతా డామనిషి. ఒక లోటా, దానికి కట్టి బావినీరు తోడు కునేందుకు ఒక త్రాడూమాత్రం ఆతనితో వుంటాయి. అత డికి ఇంకేమీ అవసరంలేదు. రోజుకు 10, 12 మైళ్ళలెక్కని తీర్థప్రయాణం చేసుకుంటూ పోతాడు. తన పైగుడ్డలో ఆ పిండి కలుపుకుని, కాసిని చితుకులు పోగుచేసి నిప్పు చేసు కుని, ఆ పిండితో రొట్టెచేసి దానిమీద కాల్చుకుంటాడు. ఆ రొట్టెని 'బాటీ' అంటారు. దాని రుచి ఆ రొట్టెలో వుండదు. ఆతనియొక్క నిష్కల్మషమైన శ్రమవలనా, ఆతని

మనస్సులోని సంతృప్తివలనా కలిగే ఆకలిలో వుంటుంది. అట్టి వ్యక్తితోకూడా భగవంతుడు ఎల్లప్పుడూ సహచరుడుగా సఖుడుగా వుంటాడు. తాను రాజులకన్నా, చక్రవర్తులకన్నా ఎక్కువ ఐశ్వర్యవంతుడైనట్లుగా ఆ మనిషి సంతసపడతాడు. లోలోపల ఇతరుల సంపదకు లోభపడేవారికి దేవుడు మిత్రుడు కాజాలడు. పైన వర్ణించిన ఉదాహరణాన్ని ప్రతివారూ అనుసరిస్తే, తద్వారా వర్ణనాతీతమైన శాంతిసౌఖ్యాలను తాము అనుభవించడమేకాక, ఆ సుఖశాంతుల కాంతిని ఇతరులకుకూడా ప్రసరించగలుగుతారు. అట్లుకాక, సిరిసంపదలకోసమే ఆశిస్తే, ప్రతివారూ ఏదో ఒక విధమైన పరద్రవ్య చౌర్యవిధానం (exploitation) అవలంబించక తప్పదు. అప్పటికి కోట్లకొలదిగా వున్న ప్రజానీకమంతా లక్షాధికారులు కాలేరు. సంతుష్టిని, దేవుని సఖ్యతను, అలవరచుకున్నప్పుడే నిజమైన సౌఖ్యానుభూతి కరతలామలక మవుతుంది.

హరిజన్, 21-7-'40, పే. 232.

నమ్రభావం అంటే సరియైన అర్థం అహంభావశూన్యత. అహంభావరాహిత్యమే మోక్షసిద్ధి. నమ్రతావిరహితమైన సేవ స్వార్థనిష్ఠమూ, అహంభావపూరితమూ అవుతుంది.

ఆత్మకథ, 1948, పే. 483.

స్వసంతుష్టిభావం (Self-satisfaction) మనిషిని ఆవరించినదంటే అతడిలో పెరుగుదల ఆగిపోయిందన్నమాట; అట్టివాడు స్వతంత్రతకు అర్హతను కోల్పోతాడు. భక్తిభావం

తోనూ వినయభావంతోనూ కొలదిపాటిగా అయినా త్యాగ మొనర్చినవాడు, ఆ వెనువెంటనే తా నొనర్చిన త్యాగం యొక్క అల్పతను గ్రహించుకుంటాడు. ఒక్కసారి మనం త్యాగపథంలో అడుగుపెట్టామంటే, మనలో ఎంత స్వార్థం దాగివున్నదీ మనకు మానసగోచర మవుతుంది. తద్వారా మనలో మరింత త్యాగమొనర్చేందుకు అభిలాష ప్రవృద్ధ మవుతుంది. తుదకు సంపూర్ణమైన ఆత్మసమర్పణం ఒనర్చే టంతవరకూ సంతృప్తి కలుగదు.

యంగిండియా, 29-9-'21, పే. 306.

మన అహమికను శూన్యమొనర్చుకుంటే తప్ప మన లోని చెడుగును జయించలేము. మనకు సార్థకమైన కేవల మోక్షసిద్ధిని ఒసగుటకు మూల్యంగా పరమేశ్వరుడు మన యొక్క సంపూర్ణమైన ఆత్మసమర్పణాన్ని కోరుతాడు. ఆ విధంగా తన్నుదాను పూర్ణంగా సమర్పితమొనర్చినవాడు ఆ వెనువెంటనే సర్వజీవకోటియొక్క సేవాపరత్వంలో తన్ను దాను తెలుసుకుంటాడు. అదే అతడికి ఆనందోల్లాసములను చేకూరుస్తుంది. భగవత్సృష్టిలోని ప్రాణకోటియొక్క సంసే వనంలో విసుగు విరతి లేకుండా తన సర్వశక్తులను వ్యయ మొనర్చగల నూతనవ్యక్తిగా ఆతడు పరివర్తన పొందుతాడు.

యంగిండియా, 20-12-'28, పే. 420.

# 25
# ప్రేమసూత్రంతో అధర్మ నిరోధం
## (అ) ద్వేషానికి ప్రతిగా ప్రేమభావం

ఖడ్గాన్ని విసర్జించిన వాడనగుటచే నన్ను ఎదుర్కొనిన వారిని తిరిగి ఎదుర్కొనుటకు నా వద్ద ప్రేమామృతకలశం తప్ప వేరేమియులేదు. ఆ కలశము నందించుట ద్వారా వారిని నాకు ఆప్తులుగా ఆకర్షించుకొన గలుగుతానని ఆసిస్తాను.

యంగిండియా, 2-4-'31, పే. 54.

స్నేహితులతో మైత్రి నెరపుటలో కష్టమేమీలేదు. కాని మనతో శత్రుత్వం పూనినవానియెడల మిత్రభావ మును చూపుటయే సత్యమైన మతసారము.

హరిజన్, 11-5-'47, పే. 146.

మనలను ప్రేమించిన వారిని మాత్రమే ప్రేమించుట అహింసకాదు. మనలను ద్వేషించినవారిని ప్రేమించగలిగి నప్పుడే అది అహింస అనిపించుకుంటుంది.

ఒక వ్యక్తిగతమైన లేఖనుండి, ది 31-12-'34.

ప్రత్యక్షరూపంలో అహింస అనగా అపారమైన ప్రేమా, ఉత్కృష్టమైన ఔదార్యమూ అని అర్థమిస్తుంది. నేను అహింసా ధర్మానుసారినే కనక అయినచో నా శత్రువును నేను ప్రేమించితీరాలి. నా తండ్రిగాని, కొడుకుగాని దుర్మా ర్గాన్ని అవలంబించిన యెడల వారిపట్ల నేను ఏ విధానం అను

సరిస్తానో అదే విధానం నాకు శత్రువూ, అపరిచితుడూ అయిన దుష్ప్రవర్తనుని పట్ల కూడా అవలంబించాలి.

"మహాత్మాగాంధీ ప్రసంగాలూ, రచనలూ", జి. ఎ. నటేశన్, మద్రాసు, 1933, పే. 346.

మీ హృదయాలను పరిశుద్ధమూ, ఔదార్య పూరితమూ ఒనర్చుకొనమని నా విజ్ఞప్తి. మీ హృదయాలను సముద్రమంత విశాలమొనర్చుకోండి... ఇతరుల తప్పులెన్నునప్పుడు మీ తప్పులు కూడా ఎన్నబడగలవని జ్ఞప్తివుంచుకోండి. పరమాత్ముడనే ప్రాడ్వివాకుడు మీకు ఉరిశిక్ష విధించగలిగినా, మిమ్ములను, ప్రాణాలతో వదలుతున్నాడు. నీకు లోపలా వెలుపలా కావలసినంతమంది శత్రువులు పొంచివున్నారు; కాని ఆ పరమేశ్వరుడు నీకు రక్షణ ఒసగి, దయావీక్షణంతో కనిపెడుతున్నాడు.

యంగిండియా, 2-4-'31, పే. 59.

"సాధనాలు సాధనాలేకదా," అంటారు కొందరు. "సాధనాలే సర్వమూ కదా," అని నేనంటాను. సాధనాలెట్టివైతే ఫలితమ్మూ అట్టిదే అవుతుంది. సాధనాలనూ ఫలితాలనూ వేరు పరచే అడ్డుగోడ ఏమీలేదు. సృష్టికర్త అయిన దేవుడు మనకు సాధనాలమీద, అతిస్వల్ప పరిమితిలోనే అయినప్పటికి, స్వాతంత్ర్యం అనేది యిచ్చినమాట నిజమే. సాధనము లెట్టివో ఆ మేరకే లక్ష్యసిద్ధి కలుగుతుంది ఈ ప్రతిపాదన తిరుగులేనిది.

యంగిండియా, 17-7-'24, పే 236.

అందువల్ల నేను తగిన సాధనాలను చేకూర్చుట, వాటిని క్రమపరిణతంగా ప్రయోగించుట విషయంలో ప్రధానంగా శ్రద్ధవహించాను. వాటి విషయమై మనం జాగరూకత చూపినయెడల మనకు గమ్యసిద్ధి నిశ్చితమని నే నెరుగుదును. మన సాధనాలెంత పరిశుద్ధమైనవో, గమ్యప్రాప్తి దిక్కుగా మనయొక్క ప్రగతియున్నూ అంత మేరలోనే వుంటుందని నేను భావిస్తాను.

ఈ విధానం దీర్ఘమైనదిగా, బహుశా బహుదీర్ఘమైనదిగా, గోచరించవచ్చును; కాని అదియే అన్నిటికంటె ఎక్కువ దగ్గరదారి అని నా గట్టి విశ్వాసం.

అమృతబజారుపత్రిక, 17-9-'33.

అహింసావిధానం నెమ్మదిగా నడిచే సుదీర్ఘమైన మార్గమని మీరు భయపడనవసరం లేదు. అదే సునిశ్చితమైన మార్గం; అందున, లోకంలోని ఇతరమార్గా లన్నిటికన్నను అదియే వేగతరమైన మార్గం.

యంగిండియా, 30-4-'25, పే. 153.

ప్రేమతో ప్రతిఘటించే పద్ధతి వ్యక్తులూ, సంఘాలూ కూడా ప్రయోగించదగిన శక్తివంతమైన విధానం. రాజకీయ రంగంలోనూ, కుటుంబ వ్యవహారాలలోనూ కూడా దానిని అవలంబించవచ్చును. దాని సార్వత్రికప్రయోజనమే, దానియొక్క శాశ్వతమూ, అజేయమూ అయిన శక్తిని చాటుతుంది. పురుషులూ, స్త్రీలూ, పిల్లలూకూడా దానిని ప్రయోగించవచ్చును. అది, హింసావిధానమును హింసావిధాన

ముతో ఎదుర్కొనలేనప్పుడు, శక్తిహీనులు ఉపయోగించ దగినది మాత్రమే అని చెప్పడం కేవలం సత్యదూరమైన మాట... ...అంధకారమునకు వెలుగు ఎట్టిదో హింసావిధానానికిని, తద్వారా సర్వవిధములైన నిరంకుశత్వాలకూ అన్యాయాలకునూకూడా, ఈ శక్తి అటువంటిది.

యంగిండియా, 3-11-'27, పే. 369.

ప్రతివ్యక్తీ, ఎంతటి భ్రష్టుడైనప్పటికీ, దయాపూర్వకమూ నిపుణమూ అయిన వర్తనలవల్ల మంచివాడుగా మారడం సాధ్యమని అహింసావిధానాన్ని అవలంబించినవారెవరుగాని నమ్మవలసి వుంటుంది.

హరిజన్, 22-2-'42, పే. 49.

హత్యాకారుడు, దొంగ, దోపిడికాడు అయినవ్యక్తినైనా సరే శిక్షించడమనేది నా మత సూత్రానికి విరుద్ధం.

యంగిండియా, 2-4-'31, పే. 55.

తాను అహింసాపరుడినని నమ్మినవాడు, తనను ఇంకొకడు నొప్పించినప్పుడు, ఆగ్రహించి అతడికి హాని కోరడు; ఆతని మంచినే కోరుతాడు. అతడిని దూషించడు; ఆతనికి దైహికమైన బాధ కలిగించడు. దుర్జనునివలన తనకు కలిగే బాధ లన్నిటినీ అతడు సహిస్తాడు. ఈవిధంగా అహింస అనునది సంపూర్ణమైన అమాయికత్వంతో సమాన మవుతుంది. అంటే, సర్వజీవకోటియెడల సంపూర్ణమైన అసద్భావరాహిత్యమే సంపూర్ణమైన అహింసాదర్శం అవుతుంది. అందున,

మన జాతికంటె హీనములైన ప్రాణులు, దుష్టకీటకములు, జంతువులు సహా అహింసాధర్మంయొక్క ఆలింగనంలో ఇముడుతాయి. అవి మన సంహారకప్రవృత్తులను సంతృప్తి పరచే నిమిత్తం సృష్టింపబడి వుండలేదు. సృష్టికర్తయొక్క సంకల్పాన్ని మనం అవగాహన చేసికొన్నయెడల ఆతనిసృష్టి జాలంలో వాటికిగల స్థానమేమిటో మనకు అర్థమవుతుంది. కావున, సర్వజీవలోకం యెడలను సద్భావం కలిగివుండడమే అహింసాధర్మంయొక్క ఆచరణరూపమని ద్యోతకమవుతుంది. పరిశుద్ధ ప్రేమభావమే అహింస. హైందవ ధర్మ శాస్త్రాలలోనూ, బైబిలు కొరానులలోనూ నేను చదివి తెలిసిన సత్యం ఇదే.

అహింస అనేది ఒక సంపూర్ణ సిద్ధి. మానవజాతి సర్వమూ, తనకు తెలియకుండానే, అహింసాలక్ష్యం దిక్కుగా సహజసిద్ధంగానే ప్రయాణిస్తున్నది. మానవుడు అమాయికతకు మూర్తిభావముగా పరిణతుడైనంతనే దివ్యుడుకాడు. అట్టి పరిణతివలన ఆతడు నిజమైన మానవుడవుతాడు. మన ప్రస్తుత పరిణామస్థితి సగం మానవత్వం, సగం పశుత్వంతో కూడి వున్నది. మన అజ్ఞానకారణంవల్లా, గర్వకారణంవల్లా దెబ్బకు దెబ్బ కొట్టునప్పుడును, అందుకు అవసరమైన ఆగ్రహావేశాన్ని కలిగించుకొనునప్పుడును, మనం మానవజాతి ధర్మాన్ని నిరూపిస్తున్నామని అనుకుంటూ వుంటాము. ఏ ధర్మశాస్త్రంలో గమనించినప్పటికీ ప్రతీకారం అనేది అనుమతనీయంగా తప్ప, విధిగా నిర్వచింపబడివుండలేదు. అయి

నను మనం ప్రతీకారం మన జీవితధర్మమని నమ్ముతున్నట్లు నటిస్తాము. నిగ్రహమే మన విధ్యుక్త ధర్మం. ప్రతీకార వర్తనం విపులమైన నిబంధనలలో కట్టుబడి వుండదగినది. నిగ్రహం అనేది మన ఆత్మధర్మం. ఏమనగా, ఉత్కృష్టమైన నిగ్రహశక్తి ఉంటేతప్ప ఉత్కృష్టమైనపరిణతి సాధ్యం కాదు. దీనినిబట్టి బాధాసహనమే మానవజాతియొక్క చిహ్నమని తేటతెల్లమవుతుంది.

గమ్యం ఎప్పుడూ దూరదూరమవుతూనే వుంటుంది. మన పరిణతి ప్రవృద్ధమైనకొలదీ, మన అనర్హతను గూర్చిన మన జ్ఞానంకూడా ప్రవృద్ధమవుతూ వుంటుంది. సంతృప్తి అనేది ప్రయత్నంలోనేకాని ఫలసిద్ధిలో లేదు. సంపూర్ణ ప్రయత్నమే సంపూర్ణ విజయం.

యంగిండియా, 9-3-'22, పే. 141.

చారిత్రకంగా మన మెరిగిన ఆరంభకాలం నుంచి ఈ రోజులదాకా దృష్టిసారించి చూస్తే, మానవుడు అహింస దిక్కునకే క్రమపరిణతిని పొందుతూవున్నట్లు తెలుసుకుంటాము. మన తొలి పూర్వీకులు నరమాంస భక్షకులుగా వుండేవారు. అటుపిమ్మట, వారు నరమాంస భక్షణ అసహ్యకరమని యెంచి, వేటపై బ్రతకనారంభించారు. దాని తర్వాత, మానవుడు మృగయునిగా అడవులుపట్టి తిరిగే బ్రతుకు తనకు అయోగ్యమైనదిగా భావించే స్థితిని చేరుకున్నాడు. అందువలన వ్యవసాయవృత్తిని అవలంబించి, తన భుక్తికి ప్రధానంగా భూమాతపై ఆధారపడసాగాడు. ఈ

విధంగా మానవుడు సంచారజీవితాన్ని వదలి, స్థిరమైన నాగరిక జీవితంలోపడి, గ్రామాలూ పట్నాలూ నిర్మించుకుని, ఒక కుటుంబంలో సభ్యుడుగా వుండడం నుంచి ఒక సంఘంలోనూ, ఒక జాతిలోనూ సభ్యుడుగా పెంపొందాడు. ఇవన్నీ హింసాభావంయొక్క తరుగుదలకూ, అహింసాభావంయొక్క క్రమపరిణతికీ చిహ్నాలు. అట్లు కాని పక్షంలో, సృష్టిలోని అనేక హీనతరగతి జీవులు నశించివున్నట్లే, మానవజాతి కూడా ఈ సరికి పూర్తిగా వినాశంపాలయి వుండేది.

ప్రవక్తలూ అవతార పురుషులూ కూడా ఈ అహింసా సందేశాన్నే, కొంచెం ఎక్కువ స్థాయిలోనో కొంచెం తక్కువ స్థాయిలోనో, ప్రబోధించి వున్నారు. వారిలో ఏ వొక్కరుగాని హింసాభావాన్ని బోధించడానికి పూనుకోలేదు. ఇంతకంటె సహజమేముంటుంది ? హింసను బోధించ వలసిన పనేలేదు. మనిషి, జంతుజాతికి చెందినంతవరకు, సహజంగానే హింసాత్మకుడు ; ఆత్మగా అహింసాత్మకుడు. ఆత్మచే తను మేల్కొన్న తక్షణం ఆతడింక హింసాత్మకుడుగా ఉండజాలడు. అహింస దిశగా ఆతడు పురోగమనమైనా చేస్తాడు, లేదా వినాశనగహ్వరంలో మునిగిపోతాడు. అందు మూలముననే ప్రవక్తలును, అవతారపురుషులును అహింసకు ఉపాంగములైన సత్యము, సామరస్యము, సోదరభావము, న్యాయబుద్ధి మొదలైన విషయములను ప్రబోధించివున్నారు

అయినప్పటికీ, నా పృచ్ఛకుడైన ఈ విలేఖరివంటి ఆలోచనాపరులైనవారు కూడా హింసయే చివరకు మిగిలే

ఆయుధమని భావించేటంతగా, హింసాత్మకత ఇంకను వేరు పాతుకొని వున్నట్లు కనిపిస్తుంది. అయితే, నేను పైన చెప్పినట్లు, చరిత్ర, అనుభవమూకూడా వారి అభిప్రాయాన్ని ఖండిస్తున్నాయి.

మానవజాతి అహింసదిశగా క్రమమైన పురోగమనం సాగిస్తున్నట్లు మనం నమ్మినయెడల, ఆ దెసగా ఇంకా పురోగమించవలసి వున్నదన్నమాటను కూడా మనం అంగీకరించవలసివుంటుంది. ఈ జగత్తులో ఏదిగాని స్థాణువుగావుండదు; ప్రతీదీ గతిప్రవృత్తికి లోనైవుంటుంది. ప్రగతి లేనియెడల తిరోగతి తప్పదు. ఎవ్వరుగాని, ఒక్క దేవుడైతే తప్ప, ఈ అనంతగతిచక్రానికి వెలపలగా వుండలేరు.

హరిజన్, 11-8-'40, పే. 245.

వినాశంమధ్యనే బ్రతుకు నిలద్రొక్కుకుని వుండగలగడం నేను గమనించాను. దానినిబట్టి వినాశమునకుమించిన వేరొక ఉన్నత సూత్రం వున్నదని రూఢి అవుతుంది. ఆ సూత్రము ననుసరించి యోగ్యసంఘటితమైనప్పుడే, సంఘజీవితం సార్థకతను గడిస్తుంది, బ్రతుకు మూల్యవంత మవుతుంది. అదే జీవితసూత్రమని గ్రహించినయెడల దానిని మన దైనికజీవితంలో ప్రయోగించవలసి వుంటుంది. 'కలతలూ ఘర్షణలూ కలిగినప్పుడుగాని, ప్రత్యర్థిని ఎదుర్కొనవలసివచ్చినప్పుడు గాని, వానిని ప్రేమసూత్రంతో జయించండి' అని చెప్పే ఈ మొండిపద్ధతినే నేను నా జీవితంలో

ప్రయోగిస్తూవచ్చాను. అయితే దీనితో నా కష్టక్లిష్టతలన్నీ పరిష్కారమైపోయినవని కాదు. హింసావిధానం ఎన్నడు కాని కలిగించని ఫలితాలను ఈ ప్రేమమార్గం సాధించగలిగినదని మాత్రం నేను గమనించాను. ఈ సూత్రాన్ని అనుసరించినకొలదీ ఈ జీవితంలోగల మాధుర్యాన్నీ, ఈ విశ్వపథకంలోని ఆనందాన్ని ఇతోధికంగా అనుభూతంచేసికొనగలుగుతున్నాను. ఇది నాకొక వర్ణనాతీతమైన శాంతినీ, ప్రకృతి రహస్యాల కొక అర్థాన్నీ ఒసగుతున్నది.

యంగిండియా, 1-10-'31, పే. 286-87.

ఈ గంభీర జీవిత సూత్రాన్ని అనుసరించడం ఎంత కష్టమో నాకు తెలుసు. అయితే అన్ని గొప్పకార్యాలనూ, మంచి పనులనూ చేయడం కష్టతరమేగదా? అన్నిటికన్నను కష్టతరమైనది ద్వేషిని ప్రేమించడం. కాని మనకు అట్లు చేయవలెనను దీక్ష, దేవుని దయ వున్నయెడల ఈ కష్టతమమైన కార్యంకూడా సులభసాధ్యమవుతుంది.

[ఒక వ్యక్తిగతమైన లేఖనుంచి, ది 31-12-'34.]

అద్భుతముల కాలవాలమైన ఈ యుగంలో ఒక వస్తువుగాని, ఒక భావంగాని కొత్తదికావడం బట్టి విలువ లేనిదని ఎవ్వరూ అనబోరు. ఏదిగాని కష్టంకావడంబట్టి అది అసాధ్యమైనదని అనుకోవడమున్నూ ఈ యుగధర్మానికి అనుగుణ్యంకాదు. కలలోనైనా కనివిని యెరగని విషయాలు ప్రతి దినం మన కళ్లకు కడుతున్నాయి. అసాధ్యమనుకున్న

వన్నీ నిత్యం సాధ్యం కావడం మనం చూస్తూనే వున్నాం. ఈ రోజులలో హింసారంగంలో కనిపెట్టబడుతూవున్న అద్భుతప్రక్రియలు మనలను నిరంతరం నిర్ఘాంతపరుస్తు న్నాయి. కాని మున్ముందు ఇంతకంటె ఇంకా కలలోనైనా కనివిని యెరగనివీ, పైకి అసాధ్యమనిపించేవీ అయిన అద్భుత క్రియలు అహింసారంగంలో జరుగనున్నవని నేను ఉగ్గడించ గలను.

హరిజన్, 28-1-'39, పే. 443.

# ప్రత్యక్షచర్య

## (ఆ)

## నిష్క్రియాత్మకం కాదు

ప్రత్యక్ష క్రియాపూర్వకం కానిదే ఈ భూప్రపంచం మీద ఏపనీ జరిగివుండలేదు. 'నిష్క్రియాత్మక ప్రతిఘటన' (Passive Resistance) అనే మాట అసంపూర్ణ భావ ప్రతిపా దకమైనదీ, అది అశక్తుల ఆయుధం అనే అపోహకు తావా సగునట్టిదీ అగుటచేత, ఆ మాటను నేను విసర్జిస్తున్నాను.

యంగిండియా, 12-5-'20, పే. 3

యావత్ప్రపంచంతోటీ మైత్రి సాధనయే నా పరమ గమ్యం. అత్యున్నతమైన ప్రేమభావాన్నీ, అసత్యముపట్ల అత్యధికమైన ప్రతిఘటనాభావాన్నీ నేను సమన్వయించ గలను.

యంగిండియా, 10-3-'20, పే. 5.

"దుష్టత్వంపట్ల నిజమైన ప్రతిఘటననుంచి పూర్తిగా నైదొలగడం కాదు" అహింసాత్మకత అంటే. అంతే కాదు. దౌష్ట్యమును పెంచుటయే నిజస్వభావముగాగల ప్రతిక్రియా కాండకంటె నేను సంభావించే అహింసావిధానం ఎక్కువ నిశితమూ వాస్తవమూ అయిన ప్రతిఘటనాశక్తి. అవినీతు లను ఎదుర్కొనే నిమిత్తమై నేను ప్రతిపాదించే ప్రతిఘటన మానసికమైనది కావడంబట్టి, అది నైతికమైనదికూడా. నిరం కుశుని ఖడ్గాన్ని అంతకంటె పదునైనకత్తితో ఎదుర్కొనడం ద్వారాకాకుండా, నేను భౌతిక ప్రతిఘటన చూపుతానని ఎదురుచూచే అతని ఊహను నిరర్థకమొనర్చడం ద్వారానే ఆ నిరంకుశుని ఖడ్గాన్ని నేను మొండిచేయడానికి ప్రయత్ని స్తాను. నేను చూపే ఆత్మశక్తియుతమైన ప్రతిఘటన ఆతనికి పట్టుచిక్కని ఆయుధమవుతుంది. మొదట అది ఆతని కళ్లను మిరుమిట్లు గొల్పి, తుద కాతని వశపరుచుకొని తీరుతుంది. అయితే దానికి వశం కావడం ఆనేది ఆశక్తికి అవమానాన్ని కలిగించడానికి బదులు, ఆతని మనస్సును ఉచ్ఛస్థాయికి తీసుకుపో గలుగుతుంది.

యంగిండియా, 8-10-'25, పే. 346.

క్రియాస్థితిలో అహింస అనగా బుద్ధిపూర్వకమైన బాధాసహనం అని అర్థం ఏర్పడుతుంది. అంతేగాని దుష్టా త్ముని ఇచ్ఛకు దుర్బలంగా లోబడడం అని అర్థమియ్యదు. నిరంకుశుని ఇచ్ఛకు సంపూర్ణమైన ఆత్మశక్తితో ఎదురొడ్డి నిలవడమని అర్థమిస్తుంది. మన జీవితసూత్రమైన ఈ విధా

నాన్ని అనుసరించినయెడల తన గౌరవమును, మతమును, ఆత్మను కాపాడుకొనుటకుగాను ఒక్క ఒంటరి వ్యక్తిఅయినా సరే ఒక అక్రమ సామ్రాజ్యంయొక్క సంపూర్ణశక్తిని ఎదుర్కొని, దాని పతనమును సాధించడమో అభ్యుదయమును చేకూర్చడమో సుసాధ్యమవుతుంది.

యంగిండియా, 11-8-'20, పే, 3.

## భీరుత్వానికి స్థానంలేదు

నా అహింసా సిద్ధాంతం అత్యంతక్రియాత్మకమైన శక్తి; భీరుత్వానికిగాని, దౌర్బల్యానికిగాని అందులో తావులేదు. హింసావర్తునునికి ఏ నాడుగాని అహింసావర్తునుడగుటకు అవకాశమున్నదేమో కాని, భీరువునకు ఏ మాత్రమూ లేదు. అందువల్లనే మనం అహింసాత్మకమైన బాధా సహనశక్తితో మనలను, మన స్త్రీజనమును, మన పూజాస్థలాలను సంరక్షించుకొనడం ఎట్లో ఎరగని పక్షంలో, కనీసం సాయుధ పోరాటంవల్లనైనా వాటిని సంరక్షించుకొనగలిగి వుండడం పురుషకారమవుతుందని నేను ఈ పత్రికా పత్రాలలో అనేక సార్లు వ్రాసివున్నాను.

యంగిండియా, 16-6-'27, పే. 96.

దౌర్జన్య రాహిత్యమూ, పిరికితనమూ పరస్పర విరుద్ధమైనవి. పైకి పూర్తిగా సాయుధుడైనవాడు గుండెలలోపల భీరువై వుండడం నేను ఊహించుకొనగలను. ఆయుధధారణ కార్యంలోనే, భీరుత్వం కాకపోయినా, భీతిభావం మాత్రం

ఇమిడివున్నది. వీసమైనా కల్తీలేని నిర్భయత్వం కలిగివుంటే తప్ప నిజమైన దౌర్జన్యరాహిత్యం అసాధ్యం.

హరిజన్, 15-7-'39, పే. 20.

దైహికశక్తినుంచి బలంరాదు. అజేయమైన మన శ్శక్తి నుంచే వస్తుంది.

యంగిండియా, 11-8-'20, పే. 3.

తమ ఉద్యమపరమావధిలో తమకుగల చల్లారబోని విశ్వాసవహ్నితో రగిలే కొలదిమంది నిశ్చయాత్మల కూటం వుంటే చాలు, అది చరిత్ర ప్రవాహాన్ని మళ్ళించివేయ గలుగుతుంది. హరిజన్, 19-11-'38, పే. 343.

అహింసావిశ్వాసి భీతిభావంనుంచి విముక్తుడు కావలె నంటే ఉత్కృష్టమైన త్యాగశక్తిని అలవరచుకోవలసి వుంటుంది. అట్టివాడు తన భూమిని, తన ధనసంపదను, తన ప్రాణమును అయినను కోల్పోవుటకు ఏమాత్రమును లెక్క చేయడు. సంపూర్ణముగా భీతిని జయించినవాడు తప్ప అహింసాధర్మాన్ని సంపూర్ణరూపంలో ఆచరణలో పెట్ట లేడు. అహింసావిశ్వాసికి ఉండగల భీతి ఒక్కటే, అది దైవభీతి. హరిజన్, 1-9-'40, పే. 268.

భీతిభావానికి తావున్నచోట మతవిశ్వాసానికి తావు లేదు. యంగిండియా, 2-9-'26, పే 308.

ఈ జగత్తులో కించిత్తైనా మనది కాదు. మనమే ఆ పరమేశ్వరాధీనులం. ఇక మనం భయభీతులకు వశం కావడం దేనికి? యంగిండియా, 11-9-'20, పే. 2.

దైవభీతి అలవరచుకున్ననాడు మనలో మనుష్యభీతి నశిస్తుంది.

"మహాత్మాగాంధీ ప్రసంగాలూ, రచనలూ", జి. ఎ. నటేశన్, మద్రాసు, 1933, పే. 346.

ఆధ్యాత్మికత అంటే ధర్మశాస్త్రాలు చదవడమూ, తాత్వికచర్చలు చేయడమూ కాదు. అది హృదయసంస్కారంతో కూడినది. అపారశక్తిని కలిగించేది. ఆధ్యాత్మికతకు తొలిమెట్టు భయరాహిత్యం. భీరువు లెన్నడూ నీతిమార్గం అనుసరించలేరు.

యంగిండియా, 13-10-'21, పే. 323.

సత్యాగ్రహి అయినవాడు భయాన్ని పూర్తిగా విసర్జిస్తాడు. అందువల్ల ఆతడు తన ప్రత్యర్థిని నమ్మడానికి భయపడడు. తన ప్రత్యర్థి యిరువది పర్యాయములు మోసకారిగా ప్రవర్తించినప్పటికీ, ఇరువది ఒకటవసారి తిరిగి అతడిని విశ్వసించడానికి సత్యాగ్రహి సంసిద్ధుడై వుంటాడు. ఏమంటే, మనుష్యస్వభావంలో నమ్మిక వుంచడమే ఆతడు విశ్వసించిన ధర్మంలోని సారం.

దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం, 1950, పే. 246.

ప్రతి ఉదయమును మనం ఆ దిన ప్రవర్తనకు ఒరవడిగా ఈ క్రింది తీర్మానాన్ని చేసుకుందుముగాక : "భూప్రపంచంలో ఎవరికీ నేను భయపడను. ఒక్క దేవునికి మాత్రమే నేను భయపడతాను. ఎవరిమొడలను ద్వేషభావం అవలంబించను. ఎవరివలనగాని అన్యాయానికి లొంగను.

అసత్యాన్ని సత్యంతో జయిస్తాను. అసత్యాన్ని ప్రతిఘటించుటలో కలిగే సర్వబాధలను సహిస్తాను."

సత్యాగ్రహపత్రము, 4-5-'19, పే. 14,

## ఏకాకినై నిలుచుటకు జంకను

నన్నెన్నడుగాని మోసగించని నాలో లోని అంతస్సు నాకిప్పుడు చెప్పుతున్న సందేశమిది :

"నీవు ఏకాకివై నిలువవలసివచ్చినాసరే, లోకం యావత్తును నీవు ఎదురొడ్డి నిలువబడవలసినదే. లోకం నీ దెస నిప్పులు క్రక్కుతూ గ్రుడ్లురిమినాగాని నీవు దానిని నీ నిశితవీక్షణలతో ఎదుర్కొనవలసినదే. భీతికి తావొసగ వద్దు. 'మిత్రులను, భార్యను, అందరినీ వదలవలసివచ్చినా సరే, నీవు దేనికొరకు నీ జీవితాన్ని అంకితమొనర్చివున్నావో, దేనికొరకు ప్రాణముల నర్పించుటకు సంసిద్ధుడవో ఆ ధర్మాన్ని మాత్రం నిరూపించు' అని నీ హృదయాంతర్వర్తిని అగు ఆ అల్పాల్పవాణి ఒసగే సందేశాన్ని నమ్ము."

ది బోంబే క్రానికల్, 9-8-'42.

సంఖ్యాబలం పిరికివారికి సంతోషకరం. ఆత్మశక్తి యుతులైన ధీరులకు ఒంటరి సమరమే కీర్తిప్రదం.

యంగిండియా, 17-6-'26, పే. 217.

లోకంలో మహాపురుషులు ఏకాలంలోగాని ఒంటరిగానే నిలబడ్డారు. ఉదాహరణకు జొరోస్టరు, బుద్ధుడు, జీససు, మహమ్మదు వీరందరూ ఒంటరిగానే నిలబడ్డారు. వీరేకాదు, ఇంకా చాలామంది పేర్లు నేను చెప్పగలను. కాని వారంద

రికీ తమలోనూ, తమ దేవునిలోనూ సజీవమైన విశ్వాసం వుంది. దేవుడు తమ పక్షాన వున్నాడని నమ్మినవారు కావడంవల్ల వారెప్పుడూ తాము ఒంటరిగా వున్నట్లు భావించుకొనలేదు. యంగిండియా.10-10-'29, పే. 330.

## దేవుని మీదనే ఆధారపడాలి

మనకు దేవునియందు సజీవమైన విశ్వాసం వున్నప్పుడే అహింసావిధానం నెగ్గుతుంది.

హరిజన్, 28-1-'39, పే. 443.

ధర్మసంగ్రామంలో దేవుడే దండయాత్రలు పన్నుతాడు, యుద్ధాలు నడిపిస్తాడు. ధర్మయుద్ధం దేవునిపేరిట మాత్రమే సాగగలదు. సత్యాగ్రహి అగువాడు కేవలం నిస్సహాయుడై, కొనఊపిరితో నిలిచి, అంధకారవలయంలో చిక్కుపడిపోయినట్లుగా కనిపించినప్పుడే దేవుడు ఆతని రక్షణకు దిగివస్తాడు.

దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం, 1950, పే. 5

నేను ఈ ఒక్కపాఠం ముఖ్యంగా నేర్చుకున్నాను. మనిషికి అసాధ్యమనిపించేది భగవంతునికి శిశుక్రీడవంటిది. తన సృష్టిలోని అతి అల్పాల్పజీవియొక్క విధివిధానమునకూ, కూడా తానే అధినేతయై వెలసిన పరమాత్మలో మనకు విశ్వాసమే వున్నచో సర్వమూ సాధ్యం కాగలదని నేను నిస్సందేహంగా ఉగ్గడించగలను. ఆ పరమమైన ఆశలోనే నా జీవితం, నా కాలం గడిపి, ఆ పరమేశ్వరుని ఇచ్ఛను అనసరించుటకు ప్రయత్నిస్తున్నాను.

యంగిండియా, 19-11-'31, పే. 361.

మార్గమెటువంటిదో నాకు తెలుసు. అది సూక్ష్మైన సన్ననిదారి. అది కత్తి అంచువంటిది. దానిపై నడచుటయే నా ఆనందం. అడుగుతడబడినప్పుడే నాకు ఖిన్నత కలుగుతుంది. 'సాధనాజీవి ఎవ్వడుగాని వినాశము పొలుకాడు' అన్నదే భగవద్వచనం. ఆ వాగ్దానంలో నాకు సంపూర్ణ విశ్వాసం వున్నది. అందువల్ల నా స్వీయదౌర్బల్యం ఫలితంగా వేయిసార్లు విఫలీకృతుడినైనప్పటికి నేను నా విశ్వాసాన్నిమట్టుకు కోల్పోను. యంగిండియా, 17-6-'25, పే. 215.

సత్యాగ్రహి అగువాడు తనకు సహాయంపై ఆశ క్షీణించిన క్షణంలోనే తనకు సహాయం ప్రత్యక్షమవుతుందని గ్రహించాలి. తన భక్తుని అగ్నిపరీక్షలో శోధించడమున్నా, ఆతని ధూళీవినమ్రునిగా ఒనర్చి ఆనందించడమున్నా కాఠిన్య కారుణ్యాభావములు రెండిటికీ మూర్తీభావమైన ఆ పరమేశ్వరుని లీలావిలాసం.

యంగిండియా, 4-6-'25, పే. 189

## స్వీయబాధా సహనం ద్వారా ప్రబోధం

ప్రేమ ఇస్తుందేగాని ఇమ్మనికోరదు. ప్రేమ బాధలను సహిస్తుందే కాని ప్రతీకారం తలపెట్టదు.

యంగిండియా, 9-7-'25, పే. 540.

"నిజంగా విలువైన పని ఏది చేయవలెనన్నాగాని, కేవలం హేతువును మాత్రమే సంతృప్తిపరిస్తే చాలదు, హృదయాన్ని కూడా కదిలించాలి; అనే మౌలికమైన నిశ్చ

తాభిప్రాయానికి వచ్చాను. హేతువుకి జరిగే ప్రబోధం మేధస్సుకి మాత్రమే చేరుతుంది. హృదయంలో ప్రవేశించడం వేదనాఫలితంగా జరుగుతుంది. అది మనిషి అంతస్సు యొక్క అవగాహనశక్తిని వికసిత మొనరుస్తుంది.

యంగిండియా, 5-11-'31, పే. 341.

ప్రజానీకానికి మౌలికమైన ప్రాధాన్యతగల విషయాలు ఒక్క హేతుశక్తివల్లనే చేకూరజాలవు. వారు తమ బాధా సహనశక్తిని మూల్యముగా ఒసగినగాని వాటిని పొంద జాలరు. ఈ విశ్వాసం నాలో క్రమంగా బలపడుతూన్నది. బాధాసహనం మానవుల జీవనసూత్రం ; పోరాటం ఆటవిక విధానం. ప్రత్యర్థిలో పరివర్తన కలిగించి, హేతువాణిని ఆతడు వినునట్లు చేయుటకు ఆటవిక విధానంకంటె బాధా సహనమే అత్యంతశక్తివంతమైనది. త్యాగదర్శనంవల్లగాని ఆతని హేతుశ్రవణాలు తెరచుకోనవు.

యంగిండియా, 5-11-'31, పే, 341.

మనకు అత్యధికమైన అసౌకర్యమూ, తుదకు ప్రాణ నష్టమూ కలిగినాగాని సహించి, ఇతరులకు వీలైనంత తక్కువ అసౌకర్యం కలుగునట్లు వర్తించడంలోనే అహింసాధర్మం ఇమిడివుంది.

యంగిండియా; 2-12-'26, పే. 422

ద్వేషక్రోధ విరహితమైన ఆత్మవేదనయొక్క సూర్యోదయకాంతిలో ఎంతటి శిలాకర్కశమైన హృదయకాఠిన్యం గాని, ఎంతటి మూర్ఖతరమైన అజ్ఞానంగాని కరగి మాయమై తీరుతుంది.

యంగిండియా, 19-2-'25, పే. 61.

## ప్రత్యర్థిలో పరివర్తన కలిగించడమే లక్ష్యం

అధర్మవర్తనునికి చిక్కులు కలిగించడం సత్యాగ్రహ లక్ష్యం కాదన్న సంగతి సామాన్యంగా విస్మరిస్తూవుంటారు. సత్యాగ్రహ ప్రబోధం ఎల్లప్పుడూ అతని హృదయానికే గాని, ఏమాత్రమూ ఆతని భయప్రవృత్తికి కారాదు. ఆ ధార్మికునిలో పరివర్తన కలిగించుటేకాని, ఆతని బలాత్కరించుట కాదు సత్యాగ్రహ లక్ష్యం.

హరిజన్, 18–3–'39, పే 58.

కేవలం సచ్ఛీల ప్రవర్తనంవల్లనూ, స్వీయబాధా సహనంవల్లనూ ప్రత్యర్థిని మార్చుటకు సత్యాగ్రహి ప్రయత్నిస్తాడు. ఎంత స్వచ్ఛహృదయెమూ, సహనశీలత కలిగి వుంటే అంత వేగంగా ఫలసిద్ధి కలుగుతుంది.

యంగిండియా, 18–9–'24, పే. 306.

ఇతరునిలో పరివర్తన కలిగించుటే అహింసాసాధకుని నిరంతర లక్ష్యం. అయితే దానికోసం కలకాలం వేచి ఊరకుండ నవసరంలేదు. మితిమించిన సమయంలో అతడు సాహసించి, సత్యాగ్రహోద్యమ ప్రణాళికలను అవలంబించవచ్చును. అట్టి కార్యక్రమం శాసనోల్లంఘనాది రూపాలు దాల్చవచ్చును.

యంగిండియా, 6-2-'30, పే. 44.

## సత్యాగ్రహము *

సత్యాగ్రహం అనేది ప్రత్యక్షచర్య లన్నిటిలోకి బలవత్తర పద్ధతి అగుటచే; సత్యాగ్రహిఅగువాడు ఇతర సాధనాల నన్నిటినీ ప్రయోగించి చూచినపిమ్మటనే సత్యాగ్రహ విధానాన్ని అవలంబిస్తాడు. కావున ఆతడు నిరంతరం నిర్విరామంగా శాసనప్రతిష్ఠాపితమైన అధికారవర్గంతో సంప్రతింపులకు యత్నిస్తాడు. ప్రజామనస్సుకి విజ్ఞప్తి సలుపుతాడు. ప్రజాభిప్రాయాన్ని ప్రబోధిస్తాడు. తన మాటలను వినుటకు ఇచ్ఛగించే ప్రతివారికీ తన ఉద్యమహేతువును శాంతంగా ఓరిమితో బోధపరుస్తాడు. ఈ మార్గము లన్నిటినీ అనుసరించి చూచినపిమ్మటనే సత్యాగ్రహచర్యకు దిగుతాడు. తన అంతరంగవాణియొక్క బలవత్తరమైన పిలుపు వినిపించి, సత్యాగ్రహోద్యమమునకు ఒకసారి దిగినాడంటే, తాను ఏరు దాటిన తెప్పలను తగులబెట్టినవానికివలెనే సత్యాగ్రహికిన్ని ఇంక వెనుదిరగడమనేది వుండదు.

యంగిండియా, 20-10-'27, పే. 353.

ఆనందం పోరాటంలోనే, ప్రయత్నంలోనే, అందు నిమిత్తమైన ఆవేదనలోనే వుంది. కేవల విజయంలో లేదు.

హరిజన్, 23-12-'39, పే, 383.

---

* సత్యాగ్రహము లేక దౌర్జన్యరహిత ప్రత్యక్షచర్య అనునది గాంధీజీ విషయంలో నిరశనవ్రతము, సహాయనిరాకరణము, శాసనోల్లంఘనము, అను రూపాలలో అభివ్యక్తమవుతుంది, ఈ మూడు విధానములను గురించియు క్లుప్తముగా ఈ క్రింద క్రోడీకరింప బడినది.

సత్యాగ్రహోద్యమంలో వేలమంది ఇష్టపూర్తిగా ప్రాణాలు సమర్పించడం నేను ఆమోదిస్తున్నానంటే, నాకు ప్రాణాల విలువ తెలియక కాదు. ఈ విధానంవల్ల ఫలసిద్ధికి జరిగే ప్రాణనష్టం తుదిలెక్కలో చాలా స్వల్పంగా వుంటుం దనే విషయంకూడా తెలియబట్టిమాత్రమే. అంతేకాక ఈ విధానం అందునిమిత్తం ప్రాణాలు సమర్పించేవారి జీవితాలను ఉదాత్త మొనరుస్తుంది. వారి త్యాగం ప్రపంచానికికూడా నైతికాభ్యున్నతి చేకూరుస్తుంది.

యంగిండియా, 8-10-'25, పే. 365.

## నా నిరశన వ్రతాలు

సంస్కరణాత్మకమైన ఉద్దేశంతో ఒకపాటి దీర్ఘమైన నిరశన ప్రయోగాలు చేయడం నేను 1913 లో ప్రారంభించి నట్లు చెప్పవచ్చును. నేను అంతకుపూర్వంకూడా అనేక సార్లు ఉపవాసాలు సలిపివున్నాను కాని అవియేవీ ఈ 1913 సం॥ నాటి నిరశనదీక్షను పోలినవి కావు. నేను చేసివున్న వివిధములైన ఉపవాసచర్యలన్నీకూడా మొత్తంమీద నిస్సం శయంగా సత్ఫలితప్రదములే అయివున్నవని నా దృఢాభి ప్రాయం. నా ఉపవాసముల విలువను పరిగణించిన వారి యొక్క, వారి ప్రభావాన్ని అభిలషించినవారియొక్క అంతః కరణను ఎక్కువ నిశితంచేయడానికి అవి ఉపకరించాయి. ఆ ఉపవాసదీక్షలవల్ల ఏవిధమైన అన్యాయంగాని జరిగినట్లు నాకు ఎరికలేదు. ఏ సందర్భంలో గాని, ఎవరిమీద గాని

బలాత్కారం ప్రయోగించే ఉద్దేశంమాత్రం నాకు లేదని చెప్పగలను. ప్రస్తుత విమర్శకు లక్ష్యమైన ఈ ఉపవాస దీక్షలు ఇతరులపై చూపే ప్రభావానికి బలాత్కారమనేపేరు అప్రయోగ మవుతుందని నా అభిప్రాయం. ఒకనిపై అతనికి బాధాకరమైన శక్తిని ప్రయోగించి ఆ ప్రయోక్తయొక్క కోరికప్రకారం ఆతడు వర్తించునట్లు చేయుట, అని అర్థమిస్తుంది బలాత్కారమనే పదం. ప్రస్తుతాంశమైన నిరాహారదీక్షల సందర్భంలో ప్రయోగ్యమైనశక్తి నాకు బాధాకరమైనదేగాని, ఇతరులకు బాధాకరమైనది కాదు. ఎవరినిలొంగదీయవలెనో వారిపై ప్రయోగించే బాధావిధానాన్ని, తనమీదనే ప్రయోగించుకునే బాధావిధానాన్ని ఒకే తరగతిలో చేర్చడం అసందర్భమని తలుస్తాను. నిస్సంశయంగా తప్పుదారి త్రొక్కుతూవున్న ఒక మిత్రుని మనస్సాక్షిని మేలుకొల్పుటకుగాను నేను నిరశనదీక్షపూనితే, తద్వారా నేనాతనిపై సామాన్యార్థంలో బలాత్కారం ప్రయోగించడంలేదు.

ఆధ్యాత్మిక స్థాయిలో జరిగే నిరశనదీక్ష లేవిగాని ఎప్పుడూ వాటి ప్రభావపరిధిలో వున్నవారిని వశంవదం చేసుకుంటూనే వుంటాయి. అందుకే ఆధ్యాత్మిక ప్రయోజనాలకు చేయబడే ఉపవాస వ్రతాలు తపస్సుగా వర్ణితమైవున్నాయి. అన్నివిధములైన తపశ్చర్యలును అవి ఎవరినిమిత్తం చేయబడినవో వారిని నిష్కలుష మొనర్చే ప్రభావాన్ని చూపుతాయి.

ఉపవాసాలు చేయడంద్వారా ఇతరులపై బలాత్కారం జరగడానికి అవకాశమే లేదని చెప్పడానికికూడా వీలులేదు. స్వార్థపూర్వకమైన లక్ష్యాలకోసం చేసే ఉపవాసాలు అట్టివి. ఒకనివద్ద డబ్బు గుంజుకొనుటకుకాని, అట్టి ఇతర స్వప్రయోజనాలకుకాని చేసే ఉపవాసచర్యలు బలాత్కారం, లేక అక్రమ నిర్బంధం క్రిందకు వస్తాయి. అట్టి అక్రమ నిర్బంధమును నిరోధించవలసినదనియే నేను నిష్కర్షగా చెపుతాను. నాకు వ్యతిరేకంగా చేయబడిన, చేస్తానని బెదరించిన, అట్టి ఉపవాసచర్యలను నేను విజయవంతంగా నిరోధించివున్నాను. సామాన్యంగా స్వార్థప్రయోజనానికీ, నిస్వార్థప్రయోజనానికీ గల వ్యత్యాసం చాలా స్వల్పమైనదిగా వుంటూవుంటుందని వాదించేవారికి నా జవాబిది. ఒక నిరశనదీక్ష స్వార్థప్రయోజనానికిగాని మరియే హీనలక్ష్యానికిగాని ఉద్దేశింపబడివున్నట్లు భావించే వ్యక్తి, ఆ నిరశనపరుడు తత్ఫలితంగా ప్రాణం కోల్పోయినాసరే లెక్కించకుండా, దానిని తప్పక నిరోధించవలసినదే అని చెపుతాను. ప్రజలు తమ అభిప్రాయంలో అయోగ్యప్రయోజనాలకు గాను చేయబడినవిగాతోచిన నిరశన దీక్షలను లెక్కచేయకుండా ఉండడం అలవరచుకున్నచో, ఆ దీక్షలలో బలాత్కారమూ, అక్రమనిర్బంధమూ అనే దుర్గుణాలకు తావులేకుండాపోతుంది. అన్ని మానవ సంస్థలవలెనే నిరశనవిధానమునూ్న క్రమబద్ధంగానూ, అక్రమబద్ధంగానూకూడా ప్రయోగించడానికి అవకాశం వుంది. అయితే దానిని దుర్వినియోగంకూడా చేయవచ్చునుకదా

అని, సత్యాగ్రహ ఆయుధాగారంలో ఒక గొప్ప అస్త్రంగా దానికిగల ప్రాధాన్యాన్ని వదలిపెట్టడానికి వీలులేదు. దౌర్జన్య పద్ధతికి ఒక ప్రత్యామ్నాయవిధానంగా సత్యాగ్రహమనేది రూపొందించబడింది. ఈ ప్రయోగం ప్రస్తుతం బాల్యావస్థలో వున్నందున ఇంకా నిర్దుష్టమైన పరిణతి పొందివుండలేదు. వినయపూర్వకమైన అన్వేషణాశీలంతో ఈ అస్త్ర ప్రయోగమును సక్రమమార్గాన నడిపించగలననే నా విశ్వాసాన్ని కోల్పేతేతప్ప, ఈ ఆధునిక సత్యాగ్రహవిధానానికి కర్తనైన నేను దానియొక్క బహుళ ప్రయోజనాలను వదలుకొనజాలను.

హరిజన్, 9-9-'33, పే, 5.

## సహాయ నిరాకరణము

నా సంపూర్ణ సిద్ధాంతంలో ఒక భాగంగా నేను అవలంబించే సహాయనిరాకరణవిధానం సహకారానికి ప్రాతిపదికవంటిదని గ్రహించాలి. నా సహాయనిరాకరణ వ్యవస్థలతోనూ విధానాలతోనూ మాత్రమేగాని, ఎన్నడూ వ్యక్తులతో కాదు.

యంగిండియా, 12-9-'29, పే. 300.

నా సహాయనిరాకరణానికి వెనక ఎల్లప్పుడూ నా ప్రత్యర్థులలోకల్లా మిక్కిలి చెడ్డవానితోనైనాసరే, ఏ మాత్రం అవకాశమేర్పడినాగాని, సహకరించవలెననే తీవ్రమైన అభిలాష దాగివుంటుంది.

యంగిండియా, 4-6-'25, పే. 193.

నా సహాయనిరాకరణం ద్వేషమునందుకాక, ప్రేమలో వేరుపాతుకుని వుంటుంది. నా వ్యక్తిగతమైన మత విశ్వాసం ఇతరులను ద్వేషించుటను ఖండితంగా నిషేధిస్తుంది. సామాన్యమైనదైనప్పటికిని అత్యుత్కృష్టమైన ఈ సిద్ధాంతాన్ని నేను నా పన్రెండవయేట ఒక స్కూలు పుస్తకంలో నేర్చుకున్నాను. ఆ విశ్వాసం నాలో ఇంతవరకు చలనంలేకుండా నిలిచింది. అది నాలో దినదినప్రవర్ధమానం అవుతూవున్నది. అది నా లోలోపల ఒక తీవ్రతరవాంఛగా ప్రజ్వలితమవుతూ వున్నది. యంగిండియా, 6-8-'25, పే. 272.

## దుష్ప్రభుత్వాన్ని ఎదుర్కొనే సాత్వికోల్లంఘన

సాత్వికశాసనోల్లంఘనం అనేది ప్రతి పౌరునికి స్వతస్సిద్ధమైన హక్కు. పురుషకారమును చంపుకుంటే తప్ప అతడు దానిని వదలుకోనజాలడు. సాత్విక శాసనోల్లంఘన ఫలితంగా ఎన్నడూ అరాజకంరాదు. హింసాత్మకోల్లంఘనం దానికి దారితీయవచ్చును. ప్రతి ప్రభుత్వమూ దౌర్జన్యయుతమైన ఉల్లంఘనాన్ని బలప్రయోగంతో నిరోధిస్తుంది. అట్లు చేయనిచో ఆ ప్రభుత్వం అంతరిస్తుంది. కాని సాత్వికోల్లంఘనమును అరికట్టడమనేది మనస్సాక్షిని చెరబెట్టుటకు యత్నించడమే అవుతుంది. యంగిండియా, 5-1-'22, పే. 5.

పూర్తిగా సాత్వికనిరోధానికి తలపడ్డవాడు ప్రభుత్వాధికారాన్ని కేవలం లేనట్లుగానే భావిస్తాడు. ప్రభుత్వం యొక్క ప్రతి అధర్మశాసనంపట్ల ధిక్కారమును ప్రకటించిన

శాసనోల్లంఘకుడవుతాడు. ఉదాహరణకు, ఆస్థితిలో ఆతడు పన్నులను నిరాకరించవచ్చును; దైనికవ్యవహారాలలో ప్రభుత్వాధికారాన్ని తిరస్కరించవచ్చును; అతడు అనధికార ప్రవేశశాసనమును ఉల్లంఘించి సైనికులతో మాట్లాడుటకుగాను సైన్యశిబిరప్రదేశాలలో ప్రవేశించ యత్నించవచ్చును; పికెటింగు నిర్బంధాలను తిరస్కరించి, నిషిద్ధస్థలాలలో పికెటింగు చేయవచ్చును. ఈ కార్యము లన్నిటినీ చేయుటలో ఆతడు ఎన్నడుగాని బలప్రయోగానికి దిగడు. తనపై బలప్రయోగము జరిగినచో ఎదుర్కొనడు.

యంగిండియా, 10-11-'21, పే. 362.

సాత్వికనిరోధం సక్రమాందోళవపద్ధతులలో కల్లా పరిశుద్ధమైన విధానమని నా దృఢాభిప్రాయం. అయితే దాని సాత్వికమైన, లేక అహింసాత్మకమైన స్వభావం కేవలం కృత్రిమమైన ఆచ్ఛాదనమాత్రమే అయినయెడల, అది నీచమూ హేయమూ అయిన పద్ధతిగా దిగజారుతుంది.

యంగిండియా, 15-12-21, పే.419.

ఉల్లంఘనం సాత్వికమైనదని అనిపించుకొనడానికి అది హృదయపూర్వకమూ, సగౌరవమూ, నిగ్రహాయుక్తమూ అయివుండవలెనేగాని, ఎన్నడును ధిక్కారపూర్వకమైనదగా వుండకూడదు; సుగమమైన ప్రవర్తనా సూత్రాలను అనుసరించి వుండవలెనేగాని, తోచినరీతిగా నడుపబడరాదు; అన్నిటికన్నా ముఖ్యంగా అది అపకారబుద్ధిపైనా, ద్వేషంపైనా ఆధారపడి వుండకూడదు.

యంగిండియా, 24-3-'20, పే. 4.

సాత్వికనిరోధంతో కూడిన పోరాటానికి ఎంత తక్కువ సైనికదళంవున్నా చాలు. చెడ్డలను మంచితో ఎదుర్కొనే పోరాటంలో జయమును సాధించుటకు ఒక్క నిష్కళంక సాత్వికనిరోధకుడు ఉన్నప్పటికీ చాలు.

యంగిండియా, 10-11-'21, పే. 362.

# యుద్ధానికి ప్రత్యామ్నాయం

## (ఇ)

### ఆత్మరక్షణకు ఖడ్గం అనవసరం

నేను ఊహావిహారినికాదు. నన్ను నేను క్రియాపూర్వకాదర్శవాదిగా (Practical idealist) నిర్వచించుకుంటాను. అహింసాధర్మం కేవలం యోగులకూ, భక్తులకూ మాత్రమే ఉద్దేశింపబడినదికాదు. అది జనసామాన్యానికి కూడా సులభసాధ్యమైనదే. హింస అనేది మృగజాతికి సహజధర్మమైనట్లే, మానవజాతికి చెందిన మనకు అహింస సహజధర్మం. మృగజాతిలో ఆత్మ నిద్రాణమై వుండుటచే వాటికి దైహికబల సంబంధమైన ధర్మంతప్ప తదితరం తెలియదు. మానవునిలో వికసితమైన ఆత్మగౌరవం దానికి తగిన ఉన్నతతరమైన ధర్మాన్ని-అనగా ఆత్మశక్తిని-అనుసరించగోరుతుంది.

కావుననే నేను భారతదేశసమక్షాన్ని సనాతనమైన ఆత్మత్యాగధర్మాన్ని ప్రతిపాదించడానికి సాహసించాను. సత్యాగ్రహం అనేదిగాని, దాని ఉపశాఖలైన సహాయనిరా

కరణం, సాత్వికోల్లంఘన విధానం అనేవిగాని ఆ త్యాగ ధర్మానికి మారుపేర్లుమాత్రమే. హింసాత్మకతమధ్యంలో అహింసాధర్మాన్ని కనిపెట్టిన ఆ పురాతన ఋషుల ప్రతిభా శక్తి ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞుడైన న్యూటన్ ప్రతిభకంటె గొప్పది. వెలింగ్టన్ సేనానికంటె వారు ఉదాత్తవీరులు. వారు అస్త్రప్రయోగశక్తిని కలిగివుండి కూడా దాని నిరర్థకతను గ్రహించి అలసిపోయిన ప్రపంచమునకు ముక్తిమార్గం అహింసద్వారానేగాని హింసద్వారాకాదని ప్రబోధించి వున్నారు.

దీనినిబట్టి నేను అహింసావిధానాన్ని అనుసరించమని చేసే ప్రతిపాదన భారతదేశం దుర్బలస్థితిలో వున్నదనే హేతువువలనకాదని గ్రహించవచ్చును. మనకు బలమూ శక్తీవున్నవనే ఆత్మవిశ్వాసంతోనే అహింసాధర్మాన్ని అనుసరించవలసినదిగా కోరుతున్నాను. మన బలమును తెలిసికొనడానికి ఆయుధప్రయోగశిక్షణ అవసరంలేదు, మనం ఉత్తమాంసపుముద్దలమని భావించినప్పుడే ఆయుధకౌశలం అవసరమని తలుస్తాము. తనలో అనశ్వరమైన ఆత్మచైతన్యం ఇమిడివున్నదనీ, అది సర్వదైహిక దౌర్బల్యాలనూ జయించి, సకల ప్రపంచంయొక్క భౌతికబలమున్నూ కలిసి తనపైకి ఎత్తివచ్చినా దానిని ఎదుర్కొని నిలువగలదనీ భారతదేశం తెలిసికొనవలయునని నా కోరిక. మానవమాత్రుడైన రాముడు, తన వానరబలంతో, దశదిశావలయితమైన ఉత్తుంగ జలధితరంగ సంరక్షితుడనై వున్నానని విర్రవీగిన దశకంధరు

డైన రావణుని బలమునంతను ఎదురొడ్డి నిలుచుటలోని అంతరార్థమేమిటి? ఆత్మశక్తితో భౌతికబలాన్ని జయించడమనికాదా దాని ఆంతర్యం? భారతదేశం ఖడ్గవాదాన్ని చేపట్టినచో క్షణికవిజయం పొందితేపొందవచ్చును. అప్పుడు భారతదేశం నా ఆత్మగర్వానికి హేతుభూతం కాజాలదు. భారతమాతయే నాలోని సర్వశక్తులకూ మూలాధారమని నమ్మివుండబట్టే, నేను ఆయమను అంటిపెట్టుకొనివున్నాను. ఆయమ ప్రపంచమున కందీయవలసిన ఉదాత్తసందేశమొకటున్నదని నాసంపూర్ణవిశ్వాసం. ఆమె ఐరోపీయ లోకాన్ని గ్రుడ్డిగా అనుసరించవలసిన పనిలేదు. భారతదేశం ఖడ్గధారణాన్ని స్వీకరించిన క్షణం నాకు అగ్నిపరీక్షాసమయమవుతుంది. అప్పుడు నేను విశ్వాసలోపంపాలు కానని ఆశిస్తాను. నేను నమ్మిన ఆధ్యాత్మికధర్మానికి భూగోళపరిమితులేమీ లేవు. నాకు దానిలో సచేతన విశ్వాసంవుంటే, నాలో పాతుకునివున్న భారతమాతృప్రేమనే అది అధిగమించగలుగుతుంది. హిందూధర్మానికి మూలకందమైనదిగా నేను నమ్మే అహింసాసూత్రంద్వారానే నేను భారతమాతృసంసేవనమునకు నా జీవితాన్ని అంకితమొనర్చుకుని వున్నాను.

యంగిండియా, 11-8-'20, పే. 3,4.

## యుద్ధంలో భాగస్వామ్యత

నేను స్థిరమైన యుద్ధనిరోధకుడనై వున్నందున, సంహారణాయుధశిక్షణం పొందడానికి అవకాశాలు కలిగివున్నప్ప

టికీ, ఎన్నడుగాని నేను వాటి ప్రయోగంలో తరిఫీదు పొంది వుండలేదు. బహుశా తద్వారా నేను మానవప్రాణహరణ కార్యంలో ప్రత్యక్ష భాగస్వామ్యతను తప్పించుకున్నానని తలుస్తాను. బలప్రయోగంపై ఆధారపడిన ప్రభుత్వవిధానం క్రింద నేను బ్రతుకుతూవుండి, దానివల్ల కలిగే వివిధ సౌకర్యాలనూ, హక్కులనూ ఇష్టపూర్వకంగా అనుభవిస్తూ వున్నంతకాలం, అట్టి విధానంతో సహాయనిరాకరణమొనర్చి దానివల్ల కలిగే హక్కులను సాధ్యమైనంతవరకు విసర్జించడానికి సంసిద్ధుడనై తేతప్ప, ఆ ప్రభుత్వం యుద్ధంలో చిక్కుకుని వున్నప్పుడు దానికి నేను నా శక్త్యానుసారం సహకరించవలసిన బాధ్యత నామీద వుంటుంది.

ఒక ఉదాహరణ తీసుకుందాం. నేను ఒక సంస్థలో సభ్యుడుగా వున్నాను. ఆ సంస్థకు కొన్ని ఎకరాల భూమి వుంది. ఆ భూమిమీది పంటను కోతులు సంపూర్తిగా ధ్వంసంచేసే పరిస్థితి ఏర్పడింది. సర్వజీవుల ప్రాణమూ సమానమైన పవిత్రతకలదే అని నేను విశ్వసిస్తాను. అందువల్ల ఆ కోతులకు ఏవిధమైన హానినిగాని కలిగించిడం అహింసాధర్మానికి భంగకరమని నేను భావిస్తాను. అయినాగాని ఆ పంటలను రక్షించే నిమిత్తం ఆ కోతులపై దాడి సలుపుటకుగాని, అట్టి కార్యాన్ని ప్రోత్సహించుటకుగాని నేను వెనుదీయను. ఈ దుష్కార్యం చేయకుండా తప్పించుకొనగలిగితే అది నాకు సంతోషకరమే. ఆ సంస్థను నేను వదలిపోవుట వలనగాని, ఆ సంస్థను నిలిపివేయునట్లుచేయుటవలనగాని ఆ

దుష్కార్యమును చేయవలసిన అవసరాన్ని తొలగించుకొన వచ్చును. కాని నేనట్టి పని తలపెట్టను. ఎందువల్లనంటే, వ్యవసాయంతో అవసరంలేనట్టి, తద్వారా ఎంతో కొంత ప్రాణహాని కలిగించకుండునట్టి సాంఘికవ్యవస్థ ఎక్కడగాని వుండగలదని నాకు తోచదు. కావున భయప్రకంపాలతో, వినమ్రభావంతో, తపనతో ఆ కోతులకు హాని కలిగించే కార్యక్రమంలో నేను పాల్గొంటాను. కాని ఏదో ఒకనాడు ఈ సమస్యకు కూడా ఉత్తమ పరిష్కారమార్గం లభ్యంకాగల దని మాత్రం ఆశిస్తూ వుంటాను.

పై రీతిగానే నేను మూడుయుద్ధచర్యలలోనూ పాల్గొని వున్నాను. నేను చెందివున్నసంఘంనుంచి నా సంబంధాన్ని తెగగొట్టుకోవడమనేది నేను చేయలేని పని. అట్లు చేయడం ఉన్మాదం అనిపించుకుంటుందని కూడా నా అభిప్రాయం. పైన చెప్పిన మూడు సందర్భాలలోనూ బ్రిటిషుప్రభుత్వంతో సహాయనిరాకరణం సలిపే తలంపు నాకు లేదు. ఆ ప్రభుత్వ విషయమై ఇప్పటి నా పరిస్థితి వేరు. అందువల్ల నే నిప్పుడు వారి యుద్ధాలలో ఇష్టపూర్వకంగా పాల్గొనడం అసందర్భ మవుతుంది. ఇప్పుడు వారికొరకు నేను ఆయుధంపట్టుటకు గాని, ఇతరవిధంగా వారి యుద్ధసన్నాహాలలో పాల్గొనుటకు గాని నిర్బంధింపబడినపక్షంలో, నేను నా నిరంగీకార ఫలి తంగా కారాగృహవాసానికయినా, ఉరిశిక్షకయినాసరే, సం సిద్ధుడనై వుండాలి.

అదికూడా ఈ సమస్యకు ఇంకా పూర్తి పరిష్కారం ఒసగదు. దేశంలో జాతీయప్రభుత్వమే కనక ఏర్పడివున్న పక్షంలో, నేను స్వయంగా ఏయుద్ధక్రియలోనూ ప్రత్యక్షంగా పాల్గొనడానికి ఇచ్ఛగించపోయినప్పటికి, ఇష్టమైనవారు సైనిక శిక్షణపొందడానికి నేను వోటుచేయడం నా విధిగా భావించ వలసిన సందర్భాలు వుండగలవని ఊహించుకోగలను. ఎందు వల్లననగా, ఆ ప్రభుత్వసభ్యులందరూ దౌర్జన్యరాహిత్య విష యంలో నాతో సమానంగా విశ్వాసం కలిగివుండరని నాకు తెలుసు. ఒక వ్యక్తినిగాని, ఒక సంఘాన్నిగాని బలవంతంగా అహింసాత్మకం చేయడం సాధ్యంకాదు.

అహింసావిధానం చాలా విచిత్రమైన రీతిగా పని చేస్తుంది. అనేక సందర్భాలలో అహింసాధర్మందృష్ట్యా ఒక్కొక్క వ్యక్తిచర్యలను అర్థంచేసికొనడం దుస్సాధ్య మవుతూవుంటుంది. అట్లే అనేక సందర్భాలలో ఒక్కొక వ్యక్తి చర్యలు, ఉత్కృష్టమైన అర్థంలో సంపూర్ణంగా అహింసాత్మకము లైనప్పటికీ, కాలక్రమాన అవి అహింసా త్మకములే అని రుజువవుతూన్నప్పటికీ, స్థూలదృష్టికి అప్పట్లో అవి హింసాత్మకమైవున్నట్లు కూడా కనిపిస్తూ వుంటాయి. కావున పైన ఉదహరించిన సందర్భంలో నేను తీసుకున్న చర్య అహింసాధర్మానికి అనుగుణమైన ఉద్దేశంతోనే ఆచ రింపబడివున్నట్లు మాత్రమే నేను ఉగ్గడించగలను. దానిలో నీచస్వార్థంతోకూడిన జాతీయభావంగాని, అట్టి తదితర భా మేదిగాని లేదు.

యంగిండియా, 13-9-'28, పే. 30

## నిరాయుధీకరణము

ఐరోపాఖండం, తాను ఆత్మహత్య పాలుకాకుండా మిగలవలెనంటే, ఏదో ఒకనాడు ఆయుధవిసర్జన చేయవలసి వుంటుంది. అట్టి సార్వత్రికనిరాయుధీకరణం ప్రారంభమగుటకు ముందు ఏదో ఒక దేశం, అపాయాలను పరిగణించకుండా సాహసించి, తనమట్టుకు తాను నిరాయుధీకరణచర్య తీసికోవలసివుంటుంది. అట్టి పరిస్థితి ఏనాడుగాని రాదలుచుకుని వున్నట్లయితే, ఆ దేశంలో దౌర్జన్యరాహిత్యం అనే భావం సార్వజనీనగౌరవాన్ని చూరగొనగలిగేటంత హెచ్చుస్థాయికి పెరిగివుండవలసి వుంటుంది. అట్టిదేశం స్వచ్ఛమైన వివేచనాశక్తినీ, దృఢమైన నిశ్చయబుద్ధినీ, ఉత్కృష్టమైన త్యాగశూరతనూ అలవరచుకుని, తన అభ్యుదయంనిమిత్తమే కాక సర్వదేశాల అభ్యుదయంకొరకు కూడా తాను జీవిస్తున్నట్లు భావించుకునే స్థితికి రావలసివుంటుంది.

యంగిండియా, 8-10-'25, పే. 345.

నల్లమందు తయారీవలెనే ఖడ్గముల తయారీనికూడా అరికట్టవలసివున్నది. లోక దౌర్భాగ్యానికి నల్లమందుకంటె బహుశా ఖడ్గమే ఎక్కువ హేతుభూతమయిందని చెప్పవచ్చును.

యంగిండియా, 19-11-'25, పే. 397.

లోభగుణం నశించిననాడు ఆయుధబలం అవసరముండదు.

హరిజన్, 12-11-'38. పే 328.

## ప్రపంచశాంతి

మారణాయుధయంత్రాలపై అధికారులైన ప్రఖ్యాత మానవనాయకులు సంపూర్ణ పూర్వాపరజ్ఞానంతో వాటి ప్రయోగాన్ని విసర్జించుటకు పూనుకున్ననాడు శాశ్వతశాంతికి అవకాశ మేర్పడుతుంది. సజీవమైన దైవభావంలో సజీవమైన భక్తిభావం లోపించడమే ఈ దోషానికంతటికీ మూలకారణమని నా దృఢమైన డనమ్మకం. ఏసుక్రీస్తుని శాంతిదూతగా వర్ణించి, ఆతని సందేశంలో విశ్వాసం ప్రకటిస్తూవున్న ప్రపంచదేశాలు ఆ విశ్వాసాన్ని ఏ మాత్రం వాస్తవాచరణలో పాటించకపోవడం అగ్రగణ్యమైన లోక దౌర్భాగ్యమని చెప్పకపత్పదు. భక్తిపరులైన క్రైస్తవ మతాచార్యులు కూడా క్రీస్తుయొక్క సందేశప్రయోజనం కొందరు ప్రత్యేకవ్యక్తులకు మాత్రమే వర్తిస్తుందనే సంకుచితాభిప్రాయాన్ని కలిగివుండడం చూస్తే చాలా శోచనీయంగా తోస్తుంది. సామాన్య మానవధర్మాలను అలవరచుకొనడం నరజాతిలో ఎంతటి హీనాతిహీనులకైనా సాధ్యతలోగల కార్యమే అన్నమాట చిన్ననాటినుంచీ నేను నేర్చుకున్నసత్యమేకాక, నా స్వానుభవపూర్వకంగా కూడా రుజువుపరచుకున్న విషయం. సర్వజనసాధ్యమైన ఈ విశిష్టతయే దైవసృష్టిలోని తదితరజీవకోటి అంతటికంటె మానవునికిగల ఉత్కృష్టతను చాటుతుంది. ఒక్క రాజ్యమైనా నిస్సంకోచంగా ఈ ఉత్కృష్టమైన విసర్జనచర్యను అవలంబిస్తేమాత్రం,

మనలో చాలామంది తమ జీవితకాలంలోనే భూతలంలో వాస్తవికమైన శాంతిస్థాపనాన్ని కళ్లజూడగలుగుతారు.

హరిజన్, 18-6-'38, పే. 153.

యుద్ధకాండలూ, వాటితోపాటుపుట్టే భయంకరమైన మోసాలూ, దగాలూ వదలిపెట్టి, సర్వజాతులయొక్కయు రాజ్యాలయొక్కయు సమానతాస్వాతంత్ర్యాలపై ఆధారపడిన వాస్తవశాంతిస్థాపనా పథకాన్ని రూపొందించుటకు సునిశ్చితులై తేతప్ప, మిత్రమండలిరాజ్యాలకూ లోకసర్వస్వానికీ ఏ మాత్రమూ శాంతిచేకూరజాలదనే నా నమ్మకాన్ని తిరిగి ఉద్ఘాటిస్తున్నాను.

ది బొంబేక్రానికిల్, 18-4-'45.

## 26

# జంతులోకం విషయంలో ప్రేమధర్మం

## (అ) జంతువులను చంపకుండుట

అహింసాసూత్రం సర్వతోముఖమైనది. మనం హింస అనే దవానలంలో చిక్కుకునివున్న దుర్బలమర్త్యులం. జీవహింసమీదనే జీవుల బ్రతుకు ఆధారపడివున్నదని నుడివే సుభాషితంలో చాలా గూడార్థం ఇమిడివున్నది. తెలిసియో తెలియకనో బాహ్యమైన హింసాచరణం చేయకుండా మానవుడు ఒక్క క్షణమైనా జీవించివుండలేడు. బ్రతుకుట-అంటే తినుట, త్రాగుట, సంచరించుట అనునదే, ఎంతస్వల్ప పరిమాణంలో అయినప్పటికి, ఎంతోకొంత హింసతోనూ

ప్రాణహరణంతోనూ కూడుకుని వుంటుంది. అహింసావాది అయినవాడు తన విశ్వాసాన్ని సత్యంగా ఆచరించవలెనంటే, ఆతని సర్వకార్యములకును దయాభావం మూలకందమై వుండాలి. ఎంత అల్పజీవికైనాగాని ప్రాణహానికలిగించకుండా వుండుటకు సాయశక్తులా ప్రయత్నించడమే కాక, దానిని రక్షించుటకు కూడా యత్నంచేయాలి. ఆ విధంగా ఆతడు తనను చుట్టుకొనివున్న హింసఅనే భయంకర రజ్జువుయొక్క బంధనములనుండి విముక్తుడగుటకు యత్నించాలి. తద్వారా ఆతని నిగ్రహశక్తి, దయాభావమూ దినదిన ప్రవర్థమానమై పెరుగుతూ వుంటాయి. అప్పుడైనా ఆతడు బాహ్యమైన హింసాచరణం నుంచి ఎన్నటికీ సంపూర్ణమైన విముక్తి పొందజాలడు. అంతేకాక, చేతనాత్మకమైన ప్రపంచసర్వస్వం యొక్క ఐక్యభావంమీద అహింసాధర్మం ఆధారపడి వుండడంవల్ల, ఏ ఒక్క వ్యక్తి దుష్కర్మ ఆచరించినాగాని దాని యొక్క దుష్ప్రభావం అందరికీ కూడా వర్తించకతప్పదు. ఈ కారణంవల్లకూడా ఏ మనుష్యుడుగాని సంపూర్తిగా హింసనుంచి విముక్తుడు కాజాలడు. అతడు సాంఘికజీవిగా వున్నంతవరకు సంఘంయొక్క ఉనికిలోనే ఇమిడివున్న హింసాచరణంలో తాను భాగస్వామి కాకుండా వుండలేడు.

ఆత్మకథ, 1948, పే 427-29.

ప్రాణహరణం ఒక్కొక్కప్పుడు విధికూడా కావచ్చును. ఈ ప్రతిపాదన దృష్ట్యా చర్చించిచూద్దాం.

మన దేహపోషణానికి అవసరమనుకున్నంతపాటి జీవ హారణం మనం చేస్తూనేవున్నాం. ఆహారానికి కూరగాయలూ తదితరములూ వాడుటద్వారాను, ఆరోగ్యానికి దోమలు మొదలైన వాటిపై విషౌషధప్రయోగాల ద్వారాను ప్రాణ హారణం చేస్తున్నాము. అయినా అట్టి పనుల మూలంగా మనకు అధర్మదోషం కలిగినట్లు మనం భావించం.

పైని చెప్పినది వ్యక్తిగతమైన విషయం. అది కాక ఇతరుల నిమిత్తం అనగా స్వజాతిరక్షణార్థం మనం మాంసా శనములైన జంతువులను సంహరిస్తాము. సింహవ్యాఘ్రాది క్రూరమృగాలు తమ గ్రామాలలో చొచ్చి బాధించినప్పుడు, గ్రామస్థులు వాటిని చంపుట లేక చంపించుట తమ విధిగా భావిస్తారు.

మరికొన్ని సందర్భాలలో మనుష్యసంహరణ కూడా అవసరం కావచ్చును. ఒక మనిషి రౌద్రంతో ఖడ్గధారి అయి వీధిని బడి, కంటబడిన ప్రతివారినీ, తన కత్తికి ఎర చేస్తూ విశృంఖలంగా విహరిస్తున్నాడనుకోండి. అతడిని ప్రాణాలతో పట్టుకునే సాహసం ఎవరికీ లేదనుకోండి. అట్టి పరిస్థితిలో ఆ ఉన్మత్తుని సంహరింపజాలినవాడు మొత్తం సంఘంయొక్క కృతజ్ఞతను చూరగొనడమేకాక, దయాళు వుగాకూడా సంభావించబడతాడు.

అహింసా దృక్పథంనుంచి చూస్తే, అట్టి వ్యక్తిని సంహరించడం ప్రతిమనిషికీ స్పష్టమైన విధి అవుతుంది.

అయితే దీనికి వుంటే ఒక్కటే ఆక్షేపణ వుండగలదు. మారణకారి అయిన ఆ ఉన్మత్తుని ఉగ్రతను శమింపజేయ గల యోగసాధకు డెవరైనా వుంటే, ఆతడుమాత్రం వానిని చంపబనిలేదు. కాని మనం ఇక్కడ అట్టి ఉత్కృష్టపరిణతిని చేరుకొన్న వ్యక్తులనుగురించి మాట్లాడడం లేదు. సామాన్య పామరజనులతో కూడిన సంఘంయొక్క విధులను గురించి చర్చిస్తున్నాము.

నేను ఇస్తున్న ఉదాహరణలయొక్క యుక్తియుక్తత విషయంలో అభిప్రాయభేదానికి అవకాశం వుండవచ్చును అవి సరిగా సరిపోని పక్షంలో ఇతరములైన ఉదాహరణము లను మీరే సులభంగా ఊహించుకోవచ్చును. ప్రాణహరణం చేయకుండుట అనేది ఏపరిస్థితిలోకాని కేవల విధి కాజాలదని చూపుటకుమాత్రమే పై ఉదాహరణలు ఉద్దేశింపబడ్డాయి.

అసలు విషయం, అహింస అంటే కేవలం అసంహా రణం అని అర్థంకాదు. హింస అనగా, క్రోధమూలంగానో, స్వార్థప్రయోజనానికో నష్టపరిచే ఉద్దేశంతో ఏ జీవికిగాని బాధకలుగజేయుట లేక ప్రాణహాని కలిగించుట అని అర్థం. అట్టి పనులు చేయకుండుటయే అహింస.

వ్యాధినివారణార్థం నీకు చేదుమందు ఒసగే వైద్యుడు నీకు బాధ కలిగిస్తున్నాడు. కాని, అతడు హింస గావించుట లేదు. అవసరమైనప్పుడు నీకు చేదుమందు ఒసగినియెడల, ఆతడు తన అహింసావిధిని నిర్వర్తించుటలేదన్న మాట. తన వద్దకు వచ్చిన రోగికి బాధ కలిగిస్తానని భయపడి, అతని

క్రుళ్లిన అంగాన్ని తెగగొట్టుటకు వెనకాడే శస్త్రవైద్యుడు హింసానేరం చేసినవాడవుతాడు. ఒకడు తన రక్షణలోవున్న వానిని చంపవచ్చిన హంత్యాకారుని, ఇతర నివారణోపాయం సాధ్యం కానప్పుడు, తాను సంహరించకుండా ఊరుకున్న యెడల, ఆతనిచర్య పుణ్యకార్య మనిపించుకోదు; పాపమే అవుతుంది. అతని చర్య అహింసాచరణం కాజాలదు; అహింసను మూర్ఖత్వంవల్ల అపార్థం చేసికొనుటమూలంగా జరిగిన హింసాచరణమే అవుతుంది.

ఇప్పుడు మనం అహింసయొక్క మూలభావాన్ని పరిశీలిద్దాం. పరిపూర్ణమైన స్వార్థరాహిత్యమే అహింస. దైహికవిషయ బంధనాలనుంచి సంపూర్ణమైన విముక్తియే స్వార్థరాహిత్యం. మానవుడు తన దైహికసుఖాభిలాషను తృప్తిపరచుకొనుటకు ఉచ్చనీచవ్యత్యాసం లేకుండా అసంఖ్యాకమైన జీవకోటిని సంహరించడం చూచిన ఏమహర్షియో ఆ చర్యలో ప్రదర్శితమైన అజ్ఞానానికి నిర్విణ్ణుడై వుంటాడు. ఈ మర్త్యశరీరంలో ఆచ్ఛాదితమైవున్న అమరమైన ఆత్మను విస్మరించి నిత్యమైన ఆత్మానందానికి బదులుగా క్షణికమైన దైహికసుఖాన్ని అపేక్షించిన ఆ మానవునిపై ఆ ఋషీశ్వరునికి జాలికలిగివుంటుంది. ఆ అనుభవంనుంచి ఆతడు స్వార్థపరిత్యాగమే విధ్యుక్తధర్మమనే నిర్ణయానికి వచ్చివుంటాడు. మానవుడు ఆత్మజ్ఞానమును, అనగా తనలోని సత్యమును తెలిసికొనగోరినచో ఆతడు దేహావిషయములనుంచి విముక్తిని

పొందవలసి వుంటుందని, అనగా తనవల్ల ఇతరమైన సర్వ జీవకోటికి హాని కలుగకుండునట్లు జీవించవలసి వుంటుందని, ఆ ఋషీశ్వరునికి గ్రాహ్యమై వుంటుంది. అదే అహింసా మార్గనిరూపణము.

ఈ ధర్మసూత్రాన్ని అర్థం చేసుకున్నట్లయితే, నశ్వరమైన మన శరీరసుఖం నిమిత్తం ప్రాణహాని కలిగించడంలో హింసా, పాపమూ ఉన్నవి. కాని, కేవల ప్రాణ హరణంలో లేవని స్పష్టమవుతుంది. ఆహార పానీయాదుల ద్వారా జరిగే ప్రాణహాని స్వప్రయోజనార్థం జరుగుటచే అది హింసయే అవుతుంది; కాని మానవుడు అది తప్పనిసరి అని తలచుటచే దానిని భరిస్తున్నాడు. అంతే కాని, దుర్భర మైన దైహికవేదనను తొలగించి ఆత్మ శాంతిని చేకూర్చే నిమిత్తం ఒక జీవి దేహాన్ని చంపినా, మన రక్షణలో వున్న వాని ప్రాణరక్షణార్థం తప్పనిసరి అయినప్పుడు ఆ హంతకుని సంహరించినా, అది హింసగా పరిగణించుటకు వీలుపడదు.

ఈ విధమైన హేతువాదాన్ని మిక్కిలి అనర్థకమైన రీతిగా ప్రయోగించడానికి కూడా అవకాశం వున్నమాట నిజం. కాని అది ఆ హేతువాదలోపం కాదు; ఏ మాత్రం వీలు చిక్కినా స్వప్రయోజనానుకూలంగా అపార్థాలు లాగి ఆత్మవంచన చేసుకునే మానవాంతర్గత దౌర్బల్యమే దానికి కారణమవుతుంది. అయితే అట్టి ఆపత్తు కలుగవచ్చును గదా అని, అహింసా స్వభావాన్ని గురించి మనం సత్యమైన

నిర్వచన మొనర్చుకొనుటకు భయపడనవసరం లేదు. ఇక, పైన చేసిన చర్చాఫలితంగా ఈ క్రింది పర్యవసానాలను తేల్చుకొన వచ్చును.

(1) ఎంతోకొంత పరదేహ వినాశం జరపకుండా స్వదేహపోషణం అసాధ్యం.

(2) సర్వులూ ఈ క్రింది హేతువులకు గాను కొంత జీవహరణం చేయక తప్పదు.

అ. స్వదేహపోషణార్థం ;

ఆ. తమ రక్షణలోనివారి రక్షణార్థం ;

ఇ. ఒక్కొక్క సందర్భంలో ప్రాణనష్టం పొందే వారి ఆత్మశాంతి నిమిత్తం.

(3) పై 2వ అంశంలోని (అ) (ఆ) ఉపాంశాలలోని హింస తరతమ భేదాలు కలిగివుంటుంది. (ఇ) ఉపాంశం హింసాకలుషితం కాదు ; కావున అది అహింస. పై (అ.) (ఆ.) లలోని హింస తప్పనిసరి అయినటువంటిది.

(4) అందువలన అహింసాసాధకుడు (అ) (ఆ) లలోని హింసను, ఇతర నివారణోపాయము లేవీ లేనప్పుడు, జాగరూకమైన ఆలోచనానంతరం, అది తప్పనిసరి అనే నిర్ణయానికి వచ్చినపుడు, సాధ్యమైనంత తక్కువగా జరుపుటకు ప్రయత్నిస్తాడు.

యంగిండియా, 4-11-'26, పే. 384-85

ఇతరులను నొప్పించుట, లేక వారికి అపకారము తలపెట్టుట, లేక క్రోధంవలనగాని స్వార్థంవలనగాని ఏ ప్రాణి

నైనా సరే ప్రాణహాని కలిగించుట హింసఅవుతుంది. రెండవ దిక్కున, శాంతమైన స్పష్టమైన వివేచనజ్ఞానంతో ఒక ప్రాణి యొక్క ఆత్మశాంతికిగాని దైహికలాభానికిగాని నిష్కలుషమూ నిస్వార్థమూ అయిన బుద్ధితో బాధకలిగించుట పరిశుద్ధమైన అహింసావిధానం కావచ్చును. అట్టి ప్రతి సందర్భమును దేనికది, దాని మంచిచెడ్డలనుబట్టి, నిర్ణయించవలసివుంటుంది. ఒక సందర్భము హింసాయుతమా అహింసాయుతమా అని నిర్ణయించడానికి ఆ చర్యకు మూలమైన ఉద్దేశమే తుది ప్రమాణంగా భావించవలసివుంటుంది.

యంగిండియా, 4-10-'28, పే 331.

మనోవైఖరియే అహింసాభావానికి మూలప్రమాణమన్నమాట యదార్థమైనప్పటికీ, అది ఒక్కటే దానికి ప్రమాణంకాదు. సజీవమైన ఏ వ్యక్తికిగాని ఏ ప్రాణికిగాని, ఆతనియొక్క లేక దానియొక్క సంక్షేమానికికాకుండా మరే ఇతర ప్రయోజనానికిగాని ప్రాణహాని కలిగించడమనేది దాని ఉద్దేశం, ఇతర దృక్పథాలనుంచి ఎంత ఘనమైనదైనప్పటికీ, హింస అవుతుంది. ఒకడు మరొకనియెడల అపకారబుద్ధి కలిగివుండి, సంఘభయంవల్లనో అవకాశాభావం వల్లనో దానిని ఆచరణలో పెట్టలేకపోయిన హేతువునుబట్టి, అతడిలోని హింసాదోషం ఏమాత్రం తక్కువకాదు. దీనినిబట్టి, ఒకానొక కార్యంయొక్క ఆచరణగాని నిరాచరణగాని అహింసక్రిందకు వస్తుందా రాదా అని తేల్చుకొనుటకు, లోని ఉద్దేశమునూ పైకార్యస్వరూపమునూకూడా పరిశీలించి మరీ తుది నిర్ణయానికి రావలసివుంటుంది.

యంగిండియా, 18-10-'28, పే. 352.

ఈ దేహంలో మన మనుగడ నిరంతర హింసాగర్భి తమని నాకు తెలుసు. ఆ విషయం తలుచుకుంటే నాకు బాధకలుగుతూనే వుంటుంది. అందువల్లనే నాయీ భౌతిక దేహంపట్ల నాకు అధికాధికంగా ఔదాసీన్యం పెరుగుతూ వున్నది ఉదాహరణకి, ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసంలోనూ గాలిలో తేలే అసంఖ్యాకములైన అదృశ్యసూక్ష్మజీవులు నావల్ల నాశమవుతువాన్నయని నే నెరుగుదును. కాని నేను ఊపిరి పీల్చుడం మానుటలేదు. శాకములను భుజించడంలో కూడా హింస ఇమిడివుంది. కాని వాటిని విసర్జించడం సాధ్యంకాదని గమనిస్తున్నాను. అంతేకాక క్రిమిహరకౌషధములవాడకం హింసాకరమైనప్పటికీ, దోమలు మొదలగువానివల్ల బాధను తప్పించుకొనుటకు, కిరోసినునూనె వంటి క్రిమిసంహారక ద్రవ్యాల ప్రయోగమును విడనాడలేకపోతున్నాను. ఆశ్రమంలో పాములువచ్చినప్పుడు, వాటిని పట్టుకొని దూరముగా వదలుట అసాధ్యమైనప్పుడు, వాటిని చంపుటకు అంగీకరిస్తున్నాను. ఆశ్రమంలోని ఎద్దును తోలుటకు కర్రను ఉపయోగించుటకును కూడా సహిస్తున్నాను. ఈ విధంగా నా వలన పరోక్షంగానూ ప్రత్యక్షంగానూ అంతులేని హింసాకాండ జరుగుతూ వున్నది. ఇక ఇప్పుడు ఈ కోతుల సమస్యకూడా నాకు ప్రత్యక్షమయింది. వాటిని చంపడమనే అంతిమ చర్యను ఆచరణలో పెట్టుటకు నేను తొందరపడుతున్నానని చదువరి భయపడ నవసరంలేదు. నిజానికి, చిట్టచివరకువాటిని చంపవలెనని నిశ్చయించుకొనడానికి నేను సాహసించగలనని

కూడా నాకు నమ్మకం లేదు. ప్రస్తుతం కొందరు మిత్రులు ఒసగుతున్న కొన్ని సలహాలను అనుసరిస్తే, వాటిని మేము చంప నవసరంలేకుండానే ఈ చిక్కు-పరిస్థితికి తాత్కాలికంగా నైనా పరిష్కారం లభించవచ్చును. ఆశ్రమభూమిలోని పంట లన్నిటినీ అవి నష్టపరిచినా ఆ కోతులను నే నెన్నటికీ చంపబోననిమాత్రం నేనీరోజున మాట ఇవ్వలేను. వినమ్ర భావంతో నేను చేసే ఈ దౌర్బల్యప్రకటన చూచి నా మిత్రులు నామీద ఆశవదలుకొనదలిస్తే విచారిస్తాను కాని, అహింసాధర్మాచరణం విషయంలో నాలో కలిగిన దోషాలను దాచిపెట్టుకొనడంమట్టుకు నాకు చేతకానిపని. అహింస వంటి మహదాశయాల అంతరార్థాన్ని అవగాహనచేసికొని, వాటిని మనోవాక్కర్మలలో ఆచరించుటకు నిరంతర ప్రయత్నం సాగిస్తున్నవాడననీ, ఆ సాధనలో కొంతవరకు సాఫల్యసిద్ధి పొందివున్నవాడననీ మాత్రమే నేను ఉగ్గడించగలను. కాని ఈ మార్గంలో ఇంకా నేను చాలాదూరం యాత్రసలుపవలసివున్నదని నాకు తెలుసును.

యంగిండియా, 1-11-'28, పే. 361

విషసర్పాదులను కూడా చంపరాదనే నియమం ఫోనిక్సు* ఆశ్రమంలోనూ, టాల్‌స్టాయ్ ఫారమ్‌లోనూ,* సబర్మతీ† ఆశ్రమంలోనూ చాలా వరకు ఆచరణలో పెట్ట

---

* దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు గాంధీజీచే నడుపబడిన ఆశ్రమాలు,

† హిందూదేశంలోని గుజరాతు రాష్ట్రంలో గాంధీజీ స్థాపించిన ఆశ్రమం.

బడింది. ఈ ఆశ్రమాలన్నీ బంజరుస్థలాలలో నెలకొల్పడం జరిగింది. అయినా అక్కడ ఎప్పుడుగాని పాముకాటువలన ప్రాణహాని కలిగివుండలేదు. ఈ విషయంలో నా యొక్క విశ్వాసదృష్టికి కారుణ్యస్వరూపుడైన పరమేశ్వరుని అభయహస్తం గోచరమవుతుంది. దేవునికి ఎన్నడూ పక్షపాతం వుండదని చెప్పిగాని, మనుష్యుల సామాన్యలౌక్యవిషయాల కోసం దేవుడు కాలంవ్యర్థపుచ్చడని చెప్పిగాని వాదించి, నా మాటలు కేవలం తీసివేయకండి. నాకు నిరంతరాయంగా అనుభవవేద్యమైన ఈ విషయాన్ని, దాని ఆంతర్యాన్ని ఇంకేవిధమైన మాటలలో వ్యక్తీకరించడానికి వీలున్నదో నాకు తెలియదు. దేవుని విధానాలను సంపూర్ణంగా అభివర్ణించుటకు మానవభాష అశక్తమైనది. ఆతని విధానాలు వర్ణనాతీతములనీ, అజ్ఞేయములనీ నాకు తెలుసును. కాని వాటిని వర్ణించసాహసించిన మానవునికి తన అవ్యక్తభాషా సాధనం తప్ప తదితర మార్గంలేదు. పాతిక సంవత్సరాల కాలం చంపకూడదనే నియమాన్ని సుమారుగా సర్వత్రా పాటిస్తూవున్నప్పటికీ ఒక్కసారైనా ఆపత్తు వాటిల్లకుండా వుండడమనేది ఏదో అదృష్టవశాత్తూ జరిగిన సంఘటనకాక, దైవకృపాపూర్వకమైన అభయప్రదానంగా భావించడం ఒక వేళ మూఢవిశ్వాసమే అయినయెడల, నేను ఆ మూఢవిశ్వాసాన్నే గుండెలకు హత్తుకుంటాను.

ఆత్మకథ, 1948, పే. 524-25.

నా అహింసాసమన్వయం నాదే. జంతువులను చంపరాదనే సిద్ధాంతాన్ని సంపూర్ణరూపంలో నేను అంగీకరించలేకున్నాను. మనుష్యులకు ఆపత్కరమైన లేక మనుష్యభక్షకమైన జంతువులను చంపరాదనే భావం నాలో నాటుకొనలేకున్నది. వాటి సంతతి పెరుగుటకు సహకరించడం తప్పని నా అభిప్రాయం. అందువలన నేను చీమలకుగాని, కోతులకుగాని, కుక్కలకుగాని ఆహారదానం చేయను. వాటి ప్రాణరక్షణకొరకు మానవప్రాణాన్ని నేనెన్నడూ త్యాగంచేయను.

ఈ విధమైన సమాలోచనాఫలితంగా నేను మనుష్యుల సంక్షేమానికి భంగకరమైన సందర్భంలో, కోతులనుచంపుట క్షమార్హమైన కార్యమే అవుతుందనే నిర్ణయానికి వచ్చియున్నాను. అట్టి మారణచర్య విధ్యుక్తధర్మం అవుతుంది. అయితే ఈ సూత్రాన్ని మనుష్యులకు మాత్రం ఎందుకు వర్తింపజేయరాదనే ప్రశ్న పుట్టవచ్చును. కాని, ఎంత చెడ్డవారైనా, మనుష్యులు మనవంటివారే అనే హేతువునుబట్టి అక్కడ ఈ సూత్రం అనుచితమవుతుంది. జంతువులకు విభిన్నంగా దేవుడు మనుష్యునికి హేతుశక్తిని ప్రసాదించియున్నాడు. హరిజన్, 5-5-'46, పే. 123.

## (ఆ) శాకాహారసేవనము

నా భావంలో ఒక గొర్రెపిల్లప్రాణం ఒక మనుష్యుని ప్రాణంకంటె తక్కువ విలువైనదికాదు. మనుష్యదేహపోషణార్థం గొర్రెపిల్ల ప్రాణాన్ని బలిచేయడం నేనంగీకరించ

లేను. ఒక ప్రాణి ఎంత దుర్బలమైనదైతే అంత ఎక్కువగా మానవకాఠిన్యమునుంచి మానవునిచే రక్షణపొందుటకు అది అర్హత కలిగి వుంటుందని నా నమ్మకం.

ఆత్మకథ, 1948, పే. 290.

అది యుక్తమైనా అయుక్తమైనాగాని, మనుష్యుడు మాంసమూ గ్రుడ్లూ మొదలైనవి తినరాదనే నమ్మకం నా మతవిశ్వాసంలో ఒక భాగమైపోయింది. మన ప్రాణాలను నిలబెట్టుకునే సాధనాలకుకూడా ఒక మితి అవసరం. ప్రాణం నిలుపుకోడానికైనాసరే మనం చేయకూడని పనులు కొన్ని వుండవచ్చును. ఆత్మకథ, 1948, పే. 302-03.

మానవజాతియొక్క సామాన్య జీవితానికి అనుకూలమైన ఏ భూభాగంలోగాని, ఏ పరిణామస్థితిలోగాని మనకు మాంసాహారం అవసరమని నేను తలచను. మాంసాహారం మనజాతికే అనుగుణం కాదని నా అభిప్రాయం. హీన పరిణతిగల జంతులోకం కంటె మనకు ఆధిక్యంవుందనితలిస్తే వాటిని అనుకరించడం పొరపాటని అంగీకరించవలసి వుంటుంది. తమ ఇంద్రియోద్వేగాలపై నిగ్రహశక్తిని ఆర్జింపగోరే వారికి జంతుమాంసభక్షణం అయోగ్యాహారమన్న సంగతి అనుభవజ్ఞులకు తెలిసిన విషయమే.

అయినప్పటికి, శీలనిర్మాణంగాని, ఇంద్రియనిగ్రహంగాని పెంపొందించుకునే సందర్భంలో ఆహార విషయానికి అత్యధిక ప్రాధాన్యత ఒసగడంకూడా పొరపాటు. నియమితా

హారం శ్రద్ధవహించవలసిన ముఖ్యవిషయాలలో ఒకటన్న మాట నిజమే. కాని ఆహారవిషయంలో ఏ నియమమూ పాటించకుండా కేవలం ఇష్టానుసారంగా వర్తించడం ఎంత తప్పో, భారతదేశంలో తరుచుగా కనిపించే రీతిని సర్వమత సారమూ భోజనంలోనే ఇమిడివున్నట్లు భావించడంకూడా అంతే తప్పు. శాకాహారనియమం హిందూమతం ఒసగిన గొప్పవరాలలో ఒకటి. అది అనాలోచితంగా వదలుకో వలసినది కాదు. అందువల్ల, శాకాహారం మనలను మానసికంగానూ దైహికంగానూ దుర్బలులను చేసినదనికాని, కార్యశూరత్వాన్ని చంపి నిర్వీర్యుల నొనర్చినదనికాని అనుకునే పొరపాటు అభిప్రాయాన్ని తొలగించుకొనవలసివున్నది. హైందవ సంస్కర్తలలో అగ్రగణ్యులైనవారంతా వారి వారి తరాలలోని జనులందరిలోకీ ఎక్కువగా కార్యశూరతను ప్రదర్శించినవారే; కాని వారందరును శాకాహారులే అయివున్నారు. శంకరాచార్యునికంటె, దయానందునికంటె వారి కాలంలో ఎక్కువ కార్యశూరతను చూపినవారు మరొకరు కనిపిస్తారా ?

మన ఆహారపదార్థాల ఎన్నిక మతవిశ్వాసంపై ఆధారపడిన విషయం కాదు. అది ఎల్లరూ తమకు తాము ఆలోచించుకొని నిర్ణయించుకొనవలసిన విషయం. శాకాహార విధానాన్నిగూర్చి ముఖ్యంగా పాశ్చాత్యభాషలలో తగినంత గ్రంథం ప్రకటితమై వున్నది. సత్యాన్వేషణపరులైన వారెవరుకాని దానిని పఠించి లాభం పొందవచ్చును. చాలా

మంది ప్రసిద్ధ వైద్యశాస్త్రజ్ఞులుకూడా ఈ విషయమై రచించి వున్నారు. మన భారతదేశంలో శాకాహారాభ్యాసానికి అదనంగా ప్రోత్సాహావసరం ఏమీలేదు. అది ఇక్కడ అన్నిటిలోకీ అభిలషణీయమూ గౌరవపాత్రమూ అయిన ఆహారంగా నేటివరకూ పాటించబడుతూనే వున్నది.

యంగిండియా, 7-10-'26, పే. 347.

జీవదయాభావం ఒక్కటే మనలోని కామక్రోధలోభమదమాత్సర్యము లనే అరిషడ్వర్గాన్ని జయించుటకుచాలదు. పరిపూర్ణమైన ఆత్మనిగ్రహశక్తిని సాధించి, సర్వులయెడల స్నేహసద్భావాలతో విలసిల్లి, సకల కార్యములందు ప్రేమ సూత్రము ననుసరించి వర్తించే వ్యక్తిని నాకు చూపండి; ఆతడు మాంసభక్షకుడైనప్పటికీ నా మట్టుకు నేను ఆతనికి నా గౌరవపురస్సరమైన పూజనములు సమర్పిస్తాను. రెండవ వంక తాను కామక్రోధలోభమోహాదులకు వశుడై, దేనినీ చంపకూడదను నియమమొక్కటీమాత్రం పాటిస్తూ, రోజూ చీమలకు కీటకాలకూ నూకలుపోస్తూవుండే వ్యక్తియొక్క జీవదయలో పరిగణించవలసిన మూల్యమేమీ లేదు. అట్టి ఆచరణ ఆధ్యాత్మిక మూల్యరహితమైన యాంత్రికచర్యవంటిది. కాదా, అంతకంటెను హీనతరమైన రీతిని లోని కుళ్ళును తెరచాటున కప్పిపుచ్చే వంచనాకృత్యమైనను కావచ్చును.

హరిజన్, 15-9-'40, పే. 285

## (ఇ) పాలు

"మీరు పాలు తీసుకుంటేతప్ప మీ శరీరానికి పోయిన బలాన్ని తిరిగి తీసుకురాలేను. దానితోపాటు అయిరన్,

ఆర్సెనిక్ ఇంజెక్షనులు కూడా తీసుకుంటే, మీ శరీరారో గ్యం మళ్లీ ఎప్పటివలెచేయడానికి నేను మాట యివ్వగలను."

"మీరు నాకు ఇంజెక్షన్లు ఇవ్వవచ్చును. కాని పాల విషయంవేరు; అవి తీ సు కో కూ డ ద ని నేను ప్రతినపట్టి వున్నాను."

"సరిగా మీరుపట్టిన ప్రతిజ్ఞ ఎటువంటిదో చెప్పండి"

ఆయనకు నేను ఈ విషయమైన చరిత్ర సర్వమూ వివ రించి, నా ప్రతినకు కారణం చెప్పాను. ఆవులకూ గేదెలకూ 'ఫూకా' అనే ప్రయోగంచేసి బాధించి, బలాత్కారంగా పాలుతీస్తారని విన్నప్పటినుంచీ పాలపేరుచెపితే నాకు పరమా సహ్యం ఏర్పడిందని ఆయనకు తెలిపాను. అంతేకాక, పాలు మనిషికి సహజమైన ఆహారద్రవ్యం కాదనే అభిప్రాయం నాకు పూర్వంనుంచీవుంది. అందువల్ల దాని ఉపయోగాన్ని పూర్తిగా విసర్జించి వున్నాను. అంతసేపూ ఈ సంభాషణ వింటూ కస్తూర్బా నా మంచంప్రక్కనే నిలబడివుంది.

"అయితేమరి మేకపాలకు మీకేమీ అభ్యంతరం వుండనవసరంలేదుకదా?" అని ఆమె మధ్యలో ఒక మాట వేసింది.

వైద్యుడు కూడా ఆ మాట అందుకుని, "మీరు మేక పాలు తీసుకున్నా నాకు చాలు," అన్నాడు.

నేను దిగజారాను. సత్యాగ్రహ సమరాన్ని తిరిగి కొనసాగించవలెననే తీవ్రమైన కుతూహలం నాలో బ్రతకా

లనే వాంఛను బలపరిచింది. అందువల్ల నా ప్రతిజ్ఞను కేవలం అక్షరాలా మాత్రం నిలుపుకుని, ఆంతర్యాన్ని విసర్జించాను. నేను ప్రతిన పూనినప్పుడు ఆవులయొక్క, గేదెలయొక్క పాల విషయమే నా మనస్సులోవుండి వున్నప్పటికీ, సహజసందర్భాన్నిబట్టి అన్ని జంతువుల పాలవిషయానికీ కూడా నా ప్రతినయొక్క భావం వర్తిస్తుంది. పైగా పాలు మనుష్యులకు సహజాహారంకాదనే అభిప్రాయం కలిగివున్నంతకాలం, పాలను ఉపయోగించడమే నాకు తగని పని. ఇదంతా ఎరిగి వుండికూడా, నేను మేకపాలను తీసికొనుటకు ఒప్పుకున్నాను. బ్రతకాలనే ఇచ్ఛ సత్యంపట్లగల విశ్వాసంకంటె బలవత్తరమయిపోయింది. ఈ ఒక్క సందర్భంలోనూ, సత్యాగ్రహ సమరాన్ని కొనసాగించవలెననే ఉత్సాహాతిశయంలో, ఒక సత్యారాధకుడు తన పవిత్రాదర్శనంనుంచి సమయానుకూలంగా దిగజారాడు. ఈ చర్యయొక్క స్మృతి ఇప్పటికీ నా గుండెలలో ములుకులా బాధించి, నన్ను పశ్చాత్తాపంలో ముంచెత్తుతూనేవుంది. నేను ఇంకా మేకపాలను కూడా ఏరీతిగా విసర్జించగలుగుదునా అని నిరంతరం ఆలోచిస్తూనే వున్నాను. సేవాభిలాష అనే పరమసూక్ష్మమైన ప్రలోభనమునుండి నేనింకా విముక్తుడనుకాలేకున్నాను. ఆ అభిలాష ఇంకను నన్ను పట్టుకుని వదలుటలేదు.

నా అహింసాపరిశోధనలలో భాగముగా నేను చేసే యోగ్యాహారవిషయికమైన ప్రయోగాలను నాకు చాలా

ప్రియమైనవిగా భావిస్తాను. అవి నా కొక క్రీడాసదృశం గానూ, ఉల్లాసకారణంగానూ ఉపకరిస్తాయి. అయితే ఈ మేకపాలు వాడకం అనేది ఈనాడు నన్ను ఆహారవిషయిక మైన అహింసాదృష్టినుంచి బాధించడంలేదు కాని, సత్యదృష్టి నుంచిమాత్రం నేను చేసినపని ప్రతిజ్ఞాభంగంతో సమాన మైనదిగా తలచి, అందుకు విచారపడుతున్నాను. అహింసా ధర్మంకంటె సత్యాదర్శవిషయమై నాకు ఎక్కువ అవగాహన వున్నదని అనుకుంటాను. సత్యమునే కనక జారవిడిచినచో, అహింస అనే సూక్ష్మ సమస్యకు అసలే ఎన్నటికీ పరిష్కారం లభ్యంకాదని నా అనుభవజ్ఞానం తెలుపుతున్నది. ప్రతినలు పట్టినప్పుడు సత్యాదర్శం ప్రకారం, వాటిని స్థూలార్థంలోనే కాక సూక్ష్మార్థంలోకూడా పాటించడం అవసరం. ప్రస్తుత సందర్భంలో నేను సూక్ష్మార్థాన్ని, అనగా నా ప్రతిజ్ఞయొక్క బాహ్యార్థానికి మాత్రమే విలువనొసగి దాని అంతరాత్మను, చంపేశాను. అదే నాకు విషతుల్యంగా వ్యధ కలిగిస్తున్నది. ఈ స్పష్టజ్ఞానం నాకు వున్నప్పటికీ, ముందుదారి సూటిగా చూడలేకపోతున్నాను. ఇంకొక విధంగా చెపితే, బహుశా సూటిదారిని అనుసరించుటకు నాకు ధైర్యం చాలదేమో? ఈ రెండిటి అర్థమూ అట్టడుగున ఒకటే. ఏమంటే, సంకోచ మనేది ఎప్పుడూ విశ్వాసాభావానికో లేక విశ్వాసదౌర్బల్యా నికో ఫలితంగా కలుగుతుంది. అందువల్లనే, "ప్రభూ, నాకు విశ్వాస మొసగుము," అనే నేను రాత్రింబగళ్లుచేసే ప్రార్థన.

ఆత్మకథ, 1948, పే, 556-58.

## (ఈ) శాస్త్రప్రయోగములకై జంతుహింస

"వివిసెక్షన్" అనబడే జంతువులపైన చేసే శస్త్రప్రయోగవిధానం అంటే నా అంతరాత్మ జుగుప్సాభావంతో నిండిపోతుంది. విజ్ఞానశాస్త్రం పేరిటనూ, కపటమానవత్వం పేరిటనూ అమాయిక ప్రాణులపైన చేసే ఆ క్షమింపరాని మారణకర్మ నాకు పరమదుస్సహమైన విషయం. ఆ అమాయిక రక్తసితమైన విజ్ఞానశాస్త్ర ఫలితాలన్నిటినీ నేను కేవలం నిరర్థకములైనవిగా పరిగణిస్తాను. జంతువులపై శస్త్రప్రయోగంయొక్క అవసరంలేకుండా రక్తప్రసార సిద్ధాంతం కనిపెట్టబడుట అసాధ్యమే అయివుండేపక్షంలో, అది లేకపోయినా మానవజాతికి నష్టంలేదని భావిస్తాను. ఋజువర్తనులైన పాశ్చాత్యవిజ్ఞానశాస్త్రజ్ఞులు ప్రస్తుతం అమలులోవున్న పరిశోధనావిధానాలకు మితిమేరలు నిర్ణయించే అభ్యుదయకాలం చేరువనేవున్నదని నా దృష్టికి స్పష్టంగా కనిపిస్తున్నది. భవిష్యత్తులో ఏ సమాలోచనంలోగాని, ఒక్క మానవజాతి శ్రేయస్సునేకాక, సర్వజీవరాశి శ్రేయస్సునూ లెక్కలోనికి తీసుకొనవలసివుంటుంది. హిందూసంఘం తమలోని అయిదవ వంతు ప్రజలను పతనావస్థ పాలుచేయడంద్వారా తమకు అభ్యున్నతి కలుగునని తలచుటకాని, పాశ్చాత్యలోకం ప్రాచ్య దేశాలనూ ఆఫ్రికాజాతులనూ అణగద్రొక్కి దోపిడీచేయుట ద్వారా తాము సమున్నతిపొంది జీవించగలమనుకొనుటగాని పొరపాటు అభిప్రాయమని మనం ఏ రీతిగా, క్రమక్రమంగా

అయినా సుస్పష్టంగా, తెలిసికొనగల్గుతున్నామో, అదేరీతిని సృష్టిలోని తక్కినజీవులపై మనకుగల ఆధిక్యత, వాటిని మారణవిధానము పాలుచేయుటకాక, మనతోపాటు వాటికి కూడా సమానక్షేమం చేకూర్చుటకే అనే విషయాన్నికూడా మనం కాలక్రమేపి గ్రహించగలుగుతాము. నా వలెనే అవన్నీ ఆత్మసమన్వితములే అను నిశ్చయజ్ఞానంతో నేనీ మాటలు చెపుతున్నాను.

యంగిండియా, 17-12-'25, పే. 440.

భూమికి వంగి ప్రణమిల్లుటద్వారా మనమున్నా ఆ భూమాతవలె నమ్రంగా వుండవలెననే గుణపాఠం నేర్చుకుం టాం; కానిచో అది నేర్చుకొనదగిన గుణపాఠమని గ్రహిం చాలి. తనపై త్రొక్కినడచే జీవరాశిని ఆమె పోషించి భరి స్తుంది. అందుకే ఆమె నిజంగా విష్ణుమూర్తికి సహధర్మిణి అవుతున్నది. ఈ మాటలో సత్యహాని ఏమీలేదు. పైగా ఇది చాలా అందమైన ఆలంకారికవర్ణనం. అంతేకాక పరమేశ్వ రుడు సర్వాంతర్యామి అనే భావాన్ని పూర్తిగా ప్రతిఫలి స్తుంది. ఈశ్వరదృష్టిలో అచేతనమన్న దేదీ లేదు. మనం మన్నులో పుట్టి మన్నులో పెరిగినవాళ్లం. మన్ను లేనిదే మనమూ లేము. భక్తిభావంతో మంటి కెరగునప్పుడు నాకు పరమేశ్వరసాన్నిధ్యం అనుభూత మవుతుంది. భూమాతకు ప్రణమిల్లే క్షణంలో పరమేశ్వరునికి నేనెంత రుణపడివున్నదీ నాకు గ్రాహ్యమవుతూ వుంటుంది. నే నా మాతృమూర్తికి తగిన బిడ్డనైనచో వెంటనే నేను ఆ ధూళికణ సమానమైన

నా అల్పత్వాన్ని అంగీకరించుకుని, మానవసంతానంలోని అల్పాల్పులతోనే కాక, సృష్టిసర్వస్వంలోని అల్పాల్ప జీవ రాశితో కూడా బాంధవ్యం కల్పించుకుని ఆనందించగలుగుతాను. ధూళిలో ధూళిగా కలిసిపోవలసిన చరమ భౌతికపరిణామంలో వాటితోపాటు నేనూ పాలుపంచుకోనవలసినదే అని గ్రహిస్తాను. నా అంతరాత్మ ఏవిధంగా అనశ్వరమో, సృష్టిలోని అల్పతమజీవకణంకూడా అదేవిధంగా అనశ్వరమైనదని నేను విశ్వసిస్తాను.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 147-48,



# ఆరవ విభాగం

# నా మతాచరణముకు సాధనములు

## 27

## ఉపవాసము - ప్రార్థన

ఇది చాలా పురాతనమైన సాధనావిధానం. మనః పూర్వకమైన ఉపవాసవ్రతం దేహమునూ, మనస్సునూ, ఆత్మనీ కూడా పరిశుద్ధమొనర్చగలదు. ఉపవాసం దేహాన్ని ఎంతకృశీభూతమొనరుస్తుందో ఆత్మని అంతగా విముక్తం చేస్తుంది. హృదయపూర్వకమైన ప్రార్థన అద్భుతఫలితాలను కలిగించగలదు. ఇంకా ఇంకా పరిశుద్ధం కావలెనని ఆత్మ పొందే తీవ్రమైన తపనానుభూతియే ప్రార్థన. ఆ విధంగా పొందిన పారిశుధ్యమహత్తును ఏదో ఒక ఉత్కృష్ట ప్రయోజనసిద్ధికి వినియుక్తం చేసినప్పుడు అది కూడా ప్రార్థన అవుతుంది. అందువల్ల ఉపవాసప్రార్థనములు బలవత్తరమైన పవిత్రతా సాధనములని చెప్పవచ్చును. పవిత్రతాసాధనమైనది ఏదిగాని తప్పక మన విధినిర్వాహణమునకును, గమ్యసిద్ధికిని అత్యంతసహకారకము కాగలదు. ఒక్కొక్క సమయంలో ఉపవాసప్రార్థనముల వలన ఫలితము కలగనట్లుగా తోచినను, అంతటితో అవి బూటకములు కాబోవు. వాటికి వెనుక వుండవలసిన ఋజుమనస్కత లోపించివుండుటయే ఆ వైఫల్యానికి కారణమైవుంటుంది.

ఉపవాసం సత్యనిష్ఠం కావలెనంటే, దానితోపాటు సదాలోచనలకు అనుకూలమైన మనస్థితిని పెంపొందించుకుని, దుష్టప్రలోభనములనన్నిటిని నిగ్రహించుకొనుటకు సునిశ్చితులమై వుండాలి. అట్లే ప్రార్థనమున్నూ సత్యనిష్ఠం కావలెనంటే, అది సుగమమూ సుస్పష్టమూ అయివుండాలి. దానితో మనం సంలీనంకావాలి. మనస్సు చంచలమై నలుదిశలా విహరిస్తూ, పెదవులతో అల్లానామం ఉచ్చరిస్తూ జపమాలత్రిప్పడం కేవలం నిష్ప్రయోజనమైన పని.

యంగిండియా. 24-3-'20, పే. 1.

తీరని వ్యథ కలిగినప్పుడు ఉపవాసప్రార్థనము లొక్కటే నివారణౌషధమని నా మతధర్మం బోధిస్తుంది.

యంగిండియా, 25-9-'24, పే. 319.

## (అ) ఉపవాసములు

శరీరాన్ని ఎంత శోషింపజేస్తే, దానికి తగినంత హెచ్చుగా ఆత్మశక్తి పెరుగుతుందని నా గట్టినమ్మకం.

యంగిండియా, 23-10-'24, పే, 354.

దైవభీతితో మెలగాలనీ, ఈశ్వర సాక్షాత్కారం పొందాలనీ అభిలషించే సాధకునికి మనస్సులోనూ మాటలోనూ ఏవిధంగా నిగ్రహం అవసరమో, అట్లే ఆహారం యొక్క గురుత్వంలోనూ గుణంలోనూకూడా నిగ్రహం అత్యవసరం.

ఆత్మకథ, 1948, పే. 334.

ఉపవాసతత్వాన్ని సాధ్యమైనంత విస్తృతార్థంలో అవగాహన చేసుకోవాలి. దేహాన్ని ఉపవసింపజేసేటప్పుడు దానితోపాటు సర్వేంద్రియాలనుకూడా ఉపవసింపజేయాలి. గీతలో చెప్పబడిన "అల్పాహారం"కూడా దైహికమైన ఉపవాసవిశేషమే అవుతుంది. గీతలో నిర్దేశింపబడినది ఆహారం యొక్క మితత్వంకాదు. అల్పత్వం. అల్పాహారం అనేది నిత్యోపవాసంతో సమానమవుతుంది. 'అల్ప'మంటే ఈ దేహం తన విధ్యుక్త సేవాధర్మాన్ని నిర్వహించడానికి కేవలం సరిపోయేపాటి ఆహారమని అర్థమిస్తుంది. దృష్టాంతం ద్వారా ఈ నిర్వచనాన్ని స్పష్టీకరించవలెనంటే, ఆహారాన్ని ఔషధప్రాయంగా నిర్దిష్ట పరిమాణంలో నిర్ణీతసమయాలలో రుచి సంతృప్తికి కాకుండా శరీరపోషణావసరాల ననుసరించి మాత్రమే తీసికొనవలసి వుంటుందని చెప్పవచ్చును. 'అల్పం' అనే మాటకు 'నియమిత పరిమాణంలో' అని అనువదిస్తే బాగా సరిపోతుందని తోస్తుంది. ఆర్నాల్డు కవి అనువాదం ఏమిటో నాకు జ్ఞప్తి లేదు. అందువలన 'నిండైన' భోజనం అనేది దేవునియెడలా మనిషియెడలాకూడా అపరాధ మనిపించుకుంటుంది. నిండైనభోజనం చేసేవారు, తద్వారా తమ పొరుగువారి భాగాన్ని తరిగించడం జరుగుతుంది. కనక, వారు మనిషియెడల అపరాధంచేసినవా రవుతారు. దేవుని మితవ్యయవిధానం సర్వులకూ దినదినమూ కేవలం అవసరమైనంతమాత్రపు ఆహారాన్నే ఔషధప్రమాణాలలో ఒసగుతుంది. మనమంతా నిండు భోజనం చేసే జాతికి

చెందినవారమే. తల్లిదండ్రులు చేసిన అభ్యాసబలంవల్ల మన మంతా తిండిపోతుల మయిపోయివున్నందున, మనకు అవసరమైన ఔషధప్రమాణం ఎంతో తెలిసికొనడం మనశక్తికి మించిన పని అయిపోయింది. ఇక, కాలాతీతమైన వెనక, మనలో కొందరికి ఆహారమనేది సుఖతృప్తికి ఉద్దేశింపబడినది కాదనీ, ఈ దేహాన్ని మనకు బానిసగా ఉపయోగించుకొనేందుకు కావలసినపాటి పోషణ ఒసగుటకుమాత్రమే ఉద్దేశింపబడినదనీ జ్ఞానోదయమవుతుంది. ఆ క్షణంనుంచీ, పూర్వ ప్రస్తుత సంస్కారాల ఫలితంగా మనలో పాతుకొనివున్న సుఖభోజనాభ్యాసాన్ని జయించే నిమిత్తం ఒక ఘోరయుద్ధం ప్రారంభమవుతుంది. అందుకనే అప్పుడప్పుడు పూర్ణోపవాసాలూ, నిత్యం పాక్షికోపవాసమూ చేయడం చాలా అవసరమవుతుంది. పాక్షికోపవాసం అనేదే గీతలో అల్పాహారమనీ లేక ప్రామాణికభోజనమనీ పేర్కొనబడింది.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 241-42.

"Spare diet" (తక్కువ ఆహారం) అనే మాట బాగానే వుంది. "అల్ప" శబ్దానికి చాలినదానికంటె తక్కువ అని అర్థం. 'చాలిన' అనేది ఏమిటో ఊహించుకొనవలసిన విషయమే అయివున్నందున, దాని స్వరూపం కేవలం మనోజనితం. సత్యదర్శనం గల ఏ మహాత్ముడో, మనుష్యుడు సామాన్యంగా ఇంద్రియలాలసుడని యెరిగి, ఆ ఇంద్రియలాలసత్వాన్ని జయించుటకుగాను తాను చాలుననుకొనినదానికి కొంచెం తక్కువగా ఆహారం తీసుకొనడం మంచిదనినీ,

తద్వారా తనకు నిజంగా ఎంత కావలెనో అంతమాత్రమే తినుటకు ఎక్కువ అవకాశమున్నదనిన్నీ బోధించాడు. దీనిని బట్టి చూస్తే, ఒక్కొక్కప్పుడు మనం తక్కువలనీ అల్పపరిమాణమనీ ఊహించుకునేది నిజంగా మనకు కావలసినదానికంటె హెచ్చుకూడా అవుతూవుండడానికి వీలుంది. ఎక్కువ మంది లోకులు అల్పాహారంవలనకంటె అధికాహారం వలనను, అక్రమాహారంవలనను మాత్రమే దుర్బలు లవుతూవున్నారు. మనం సక్రమాహారం అలవరచుకుంటే అప్పుడు మన ఆరోగ్యపోషణకు ఆహారం ఎంతతక్కువ పరిమాణంలో సరిపోతుందో గమనించి ఆశ్చర్యం పొందుతాము.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 254.

వెనుక ఇచ్ఛాశక్తియొక్క ప్రోద్బలంలేని రిక్త ఉపవాసంలో ఏ మాత్రం విలువలేదు. అది ఆంతరంగికమైన ఉపవాసానికి బహిరంగమైన ప్రతిబింబంగా వుండాలి. అనగా, కేవలసత్యమగు అంతరంగానుభూతిని అభివ్యక్తంచేసే తీరని తపన అయివుండాలి. హరిజన్, 6-5-'33.

నా నిష్ఠానియమాలూ, నా ఉపవాసాలూ ప్రార్థనలూ, నేను వాటిపై నాలో మార్పు తేవడానికి స్థూలంగా ఆధారపడివున్నట్లయితే, నిరుపయోగమైనవే అవుతాయి. అవన్నీ, నేను ఆశించేటట్లుగా, అలసిసొలసిన ఒక వ్యక్తి సృష్టికర్త ఒడిలో తన శిరసువాల్చి విశ్రాంతి పొందవలెనని కోరే ఆధ్యాత్మికతృష్ణకు చిహ్నములైనప్పుడే చెప్పరాని విలువను గడిస్తాయి. హరిజన్, 18-4-'36, పే. 77.

దేహేంద్రియాలు మనపై తిరుగుబాటు చేసినప్పుడు దేహాన్ని శోషింపజేయడం అవసరమవుతుంది. అవి మనకు వశంవదమై సేవాచరణానికి తగిన సాధనాలుగా వర్తించే టప్పుడు, దేహశోషణ పాపమవుతుంది. ఇంకో విధంగా చెప్పాలంటే కేవల దేహశోషణలో అంతర్గతసార్థకత ఏమీ లేదని అనవచ్చును. హరిజన్, 2-11-'35, పే. 299.

హైందవమతగ్రంథాలలో ఉపవాససాధన విషయమై అసంఖ్యాకమైన ఉదాహరణలు కనిపిస్తాయి. ఈనాటికీ వేలాది హిందూమతస్థులు ఏ మాత్రం సాకుచిక్కినా ఉపవాసం చేయడం ఆచారంగానేవుంది. ఏమాత్రంగాని హాని కలి గించని ఆచారం అదొక్కటే. అన్ని మంచిపనులవలెనే ఉపవాసాచరణాన్నికూడా దుర్వినియోగం చేయవచ్చునని చెప్పడానికి సంకోచపడ నవసరంలేదు. అది సర్వసామాన్య మైన విషయమే. మంచిని తెరచాటుచేసికొని చెడ్డ కొనసా గుతూ వుంటుందికదా అని, సత్కార్యాచరణాన్ని విడనాడ లేము.

శరీరశోషణ ఆత్మోన్నతిని పెంపొందించుకొనడానికి ఒక అవసరసాధనమన్న విషయం ప్రపంచవ్యాప్తమైన విశ్వా సమే. పూర్ణోపవాసమంటే సంపూర్ణమైన స్వార్థవిసర్జనమని అక్షరాలా అర్థమిస్తుంది. సత్యతమమైన సంప్రార్థనము అందులో అంతర్గర్భితమైవుంది. "నీకే నా ప్రాణసమర్పణ. అది సర్వదా కేవలం నీ కొరకే వినియుక్తమగుగాక" అనే

ప్రార్థన ఉత్త పెదిమెల కదలికకాని, ఉత్త అలంకారికవాక్యం కాని కాదు : కారాదు. అది ఏమాత్రమూ కొరవలేకుండా విశృంఖలంగా, సంతోషంగా ఒసగే సమర్పణఅయివుండాలి. తిండి, దానితోపాటు నీరుకూడా విసర్జించడం కేవలం మొదటి మెట్టు ; ఆ పూర్ణసమర్పణలో అది హీనాంశము.

వ్యక్తిపరంగాగాని, లోకపరంగా గాని ఉపవసించే దీక్షావిధానంలో నాకు అగాధమైన విశ్వాసం వున్నది.

హారిజన్, 15-4-'33, పే. 4.

ఎంతకాలదిపాటిలో అయినా ఉపవాసదీక్షతో కలిస్తే తప్ప, ప్రార్థన సార్థకం కాజాలదనేసంగతి ఇదివరలో ఎన్నటి కంటేకూడా ఇప్పుడు నాకు బాగా గ్రాహ్యమయింది. ఈ ఉపవాసక్లేశము ఒక్క రసనేంద్రియానికే కాక, సర్వేంద్రియాలకూ, అవయవాలకూ కూడా వర్తించవలసిన విషయం. ప్రార్థనలో పూర్ణంగా లీనంకావడానికి, దైహికవ్యాపారము లన్నీ మాటుమణగి. మన సర్వచైతన్యమూ ప్రార్థనాభావమునకు వశంవదం కావాలి. అప్పుడు మనం, దైహికక్రియలన్నిటినుంచీ విముక్తులమై, ఇంద్రియచేతనను అధిగమించగల్గుతాము. అట్టిస్థితి నిరంతరమూ, బుద్ధిపూర్వకమూఅయిన శరీరశోషణాభ్యాసం ద్వారానే సిద్ధించగలదు. దీనినిబట్టి, ఉపవాసదీక్షను ఒక ఆధ్యాత్మికసాధనగా ఆచరించినప్పుడు, అది తపస్సంపన్నమైన ప్రార్థనాచరణంతో సమానమనిగాని, దానికి సోపానప్రాయమనిగాని చెప్పవచ్చును. అది మూలా

ధారమైన ఆధ్యాత్మిక చైతన్యగర్భంలో సంలీనమగుటకు జీవాత్మ ఒనరించే తపశ్చర్య అని భావించాలి.

హరిజన్, 8-7-'33, పే, 4.

## (ఆ) ప్రార్థన

ప్రార్థన మతమునకు జీవసారమువంటిది. ఏ మానవుడుగాని మతవిశ్వాసరహితుడై జీవించలేడు కనుక, ప్రార్థన అనేది మానవజీవితానికి అంతఃకేంద్రమై వుండాలి.

యంగిండియా, 23-1-'30, పే, 25,

పరమేశ్వరుడు సహస్రాధికనామాలతో పిలవబడతాడు; అందుకే అతని కొక పేరేమీలేదు. మనకు ఇష్టమైనపేరిట ఆతని నారాధించి ప్రార్థన సలుపవచ్చును. కొందరాతని రాముడనీ, కొందరు కృష్ణుడనీ పిలుస్తారు; ఇంకా కొందరాతని కేవలం దేవుడంటారు. అందరి ఆరాధనకు లక్ష్యమైనదీ ఒకటే భావం. కాని, అన్ని తినుబండారాలూ అందరి తత్వాలకూ సరిపడనట్లుగానే, అన్ని భగవన్నామాలూ అందరికీ రుచించవు. ప్రతి ఒక్కరూ తమ తమ మానసికాభ్యాసాలనుబట్టి నామనిర్ణయం చేసుకుంటారు. పరమేశ్వరుడు అంతర్యామి, సర్వశక్తుడు, సర్వజ్ఞుడు అగుటచే అతడు మన యోగ్యతల ననుసరించి ఫలితాలను ప్రసాదిస్తాడు.

కావున ఆరాధనగాని, ప్రార్థనగాని పెదవులతో చేయునదికాక హృదయపూర్వకమైనదై వుండాలి. అందువల్లనే అది మూగవానికిని, నత్తివానికిని, పామరునికిని, మందబుద్ధి

కిని కూడా సమానసాధ్యమైన కార్యము. అంతేకాక, నాలుక చివర తేనెలొలుకుతూ హృదయములు విషకుంభములైన వారి ప్రార్థనలు ఎన్నటికీ దేవుని చెవికెక్కవు. అందువల్ల దైవప్రార్థన సలుపదలచినవాడు హృదయమును నిష్కల్మష మొనర్చుకోవాలి. భక్తిభావమే కల్లోలతరంగాలలో దారి జూపే చుక్కాని. భక్తిభావము పర్వతములను కదల్చగలదు; పయోధిని లంఘించగలదు. అంతరంగమందు సజీవమూ, నిర్నిద్రమూ అయి భాసించే ఈశ్వరచైతన్యమే ఆ భక్తి భావం. ఆ భక్తిభావమును సాధించినవాడు తదితరమేమీ కోరడు. దైహికముగా రోగార్తుడైనచో ఆతడు ఆధ్యాత్మిక ముగా ఆరోగ్యపూర్ణుడై వుంటాడు; శారీరక పారిశుధ్యం కలిగివున్నచో పారమార్థికైశ్వర్యంలో మునిగి తేలగలడు.

"అయితే అంత హృదయనైర్మల్యమును సాధించుట ఎట్లు?" అని అడుగవచ్చును. పెదిమెలనుంచి పలికేభాషను నేర్పుట సులభమేగాని హృదయమునుంచి పలికే భాషను ఎవరు నేర్పగలరు? నిజమైన భక్తుడొక్కడే ఆ భాషను తెలి సినవాడు, దానిని నేర్పగలవాడు. భగవద్గీత అంతటను భక్తుని గురించి చెప్పబడివున్నదికాని, అందులో మూడు చోట్ల భక్తునియొక్క నిర్వచనం ముఖ్యంగా గోచరిస్తుంది. అయితే భక్తుని నిర్వచనజ్ఞానం ఒక్కటే మార్గదర్శకంగా ఉపకరించదు. భక్తులు భూలోకదుర్లభులు. అందుననే నేను సేవాధర్మాన్ని సులభసాధనంగా సూచించాను. తమ తోడి

మానవులకు సేవచేసేవారి హృదయాలను పరమేశ్వరుడే కని పెట్టి తెలిసికొని, వాటిని తన పీఠస్థానములుగా చేసుకుంటాడు. ప్రార్థనభావంతో నిండిన హృదయం సేవాచరణానికి వాహన ప్రాయమవుతుంది. అట్లే సేవాచరణమున్నూ హృదయాన్ని భక్తిభావంతో నింపుతుంది. ఈ యుగంలో హిందూ సంఘీయు లెవరుగాని నిండుహృదయంతో అస్పృశ్యులకు సేవచేసినచో, అది నిజమైన ప్రార్థన అనిపించుకుంటుంది. హిందువులును తదితరులునుకూడా నిరుపేదలను నిర్ధనులను మనసులో వుంచుకొని, నిండుభక్తితో నూలువడికినచో, అదిన్నీ నిజమైన ప్రార్థన అవుతుంది.

యంగిండియా, 25-9-'25, పే. 331-32.

లక్షలాది హిందువులూ, ముసల్మానులూ, క్రైస్తవులూ, యూదులూ, తదతరులూ పరమేశ్వరారాధన నిమిత్తం ఏర్పాటైన సమయాలలో ప్రతిదినమూ చేస్తున్న దేమిటి? వారు ఆ ఆరాధన ద్వారా తమ సృష్టికర్తతో తాము సంలీనం కావలెననే హృదయాతపనను వెలిబుచ్చుతున్నారనీ, ఆతని ఆశీస్సులకై వేడ్కోలు చేస్తున్నారనీ నే ననుకుంటాను. ఈ విషయంలో, వారు స్పష్టంగా పలికినా అస్పష్టంగా గొణిగినా, వారి మాటలు ప్రధానం కాదు; వారి మనోవైఖరి ప్రధానం. అనాదికాలంనుంచీ అందీయబడిన మాటలను ఈ నాటి మన మాతృభాషలలోనికి అనువదించనయెడల, చిరకాల వ్యవహారంవలన వాటిలో గర్భితమైన వ్యంజనశక్తిని అవి పూర్తిగా కోల్పోతాయి. ఉదా

హారణకు, గాయత్రీమంత్రమును గుజరాతీలోనికి భాషాంతరీ కరణంచేసి పఠిస్తే, మాతృకలో గర్భితమైన ప్రభావం అందులో గోచరించదు. 'రాముడు' అనే మాట ఉచ్చరించి నంతనే లక్షలాది హిందూమతస్థుల హృదయాలు పులక రిస్తాయి. కాని 'దేవుడు' అనే మాటయొక్క అర్థం వారికి తెలిసినప్పటికి, అది వారిలో హృదయస్పందన కలిగించదు. చిరకాలరూఢమైన ప్రయోగంవలనా, పూజ్యభావాపాదనం వలనా మాటలకు సహజమైన ఒక మహత్వం అబ్బుతుంది. అందువల్ల విస్తృతవ్యాప్తిలోవున్న మంత్రములను, శ్లోకము లను సంస్కృతభాషోక్తంగానే వాడవలెననే అభిప్రాయం సముచితంగానే కనిపిస్తుంది. వాటిలో గర్భితమైన భావాన్ని మాత్రం సరిగా అర్థంచేసికోవడం అవసరమన్నమాట వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ ఆరాధన కార్యాలకు ఇంతసేపు వినియోగించవలె ననే కాలనియమం ఒకటి నిర్ణయించడం సాధ్యంకాదు. అది వ్యక్తిగతమైన చిత్తవృత్తినిబట్టి వుంటుంది. అందుకు వినియుక్తమైన క్షణాలుమాత్రం దైనికజీవితంలో అమూల్య మైనవి. ఈ సాధనలు మనలను స్థిరచిత్తులనూ వినమ్రులనూ చేయుటకున్నూ, ఈశ్వరేచ్ఛలేనిదే ఏదీ జరుగనేరదనిన్నీ, మనం కేవలం పరమేశ్వరుడనే కుంభకారుని చేతులలో మట్టి ముద్దలవంటివారమనిన్నీ తెలియుటకున్నూ ఉద్దేశింపబడినవి. అంతవరకు గడచిన మన జీవితచర్యలను సమీక్షించుకుని, దౌర్బల్యముల నంగీకరించి అందుకు క్షమార్పణలగోరి, ఇతః

పూర్వమునకంటె ఎక్కువ సద్గుణవంతులమూ సద్వర్తనులమూ అగుటకు తగిన బలమును ప్రసాదింపుమని భగవంతుని వేడుకొనే క్షణములవి. కొందరికందుల కొక్కక్షణం చాల వచ్చును; కొంతరికి ఇరువదినాలుగు గంటలైనను చాలకపో వచ్చును. తమ ఆత్మలు పరమాత్మచైతన్యంతో నిండిన వారికి శ్రమించుటే ప్రార్థించుట అవుతుంది. అట్టివారి బ్రతుకే ఒక నిరంతర ప్రార్థనగా, ఆరాధనాకార్యంగా పరిణమిస్తుంది. ప్రతి చర్యనూ పాపకార్యాలకూ ఇంద్రియసుఖాలకూ వినియుక్తంచేసి, స్వార్థమే జీవితపరమార్థంగా భావించే మరికొందరికి ఎంతకాలమైనా సరిపోకనేపోవచ్చును. కాని ఓరిమి, విశ్వాసం, కల్మషరహితం కావలెననే ఇచ్ఛవున్నచో, అట్టివారైనప్పటికీ, తమ అంతరంగంలో పాపభంజకమైన పరమేశ్వర సాక్షాత్కారం స్పష్టంగా అనుభవవేద్యం అయ్యేవరకూ ప్రార్థనసల్పుతూనే వుండవచ్చును. మనవంటి పామరజనులకు ఈ రెండు అతిశయవిధానములకు నడుమగల మధ్యేమార్గం ఒకటి వుండాలి. మన సర్వకర్మలూ పరమేశ్వరార్పణములని అనుకోగలిగేటంత ఔన్నత్యమూ మనలోలేదు; స్వార్థమే జీవితపరమార్థమనుకునేటంత నైచ్యమూ బహుశా మనలో లేదు. అట్టివారి నిమిత్తమే మతములన్నిటిలోనూ ఆరాధనా విధులొనర్చుటకుగాను కొన్ని నియమితసమయాలు నిర్ణయించబడివున్నాయి. దురదృష్టవశాత్తూ అవి కూడా ఈ రోజులలో, శుద్ధబూటకంకాని సందర్భంలో, కేవలం అలవాటు చొప్పున చేసే స్థూలమైన ఆచారరూపం దాల్చాయి. దీనిని

బట్టి చూస్తే, ఈ చర్యలయొక్క వెనుకవుండవలసిన మనో వైఖరియొక్క ప్రాధాన్యం స్పష్టపడుతుంది. కేవలం వ్యక్తి సంబంధమైన ప్రార్థనలకు, అనగా దేవుని ఏదో ఒక స్వీయాభీప్సితమును కోరునప్పుడు, అది తప్పకుండా స్వభాషలోనే వుండాలి. మనలను సర్వజీవులయెడల న్యాయసమ్మతమైన రీతిగా వర్తించేటట్లు చేయవలసినదిగా దేవుని అడుగుటకంటె ఉదాత్తమైన కోరిక ఇంకొకటుండదు.

యంగిండియా, 10-6-'26, పే. 211.

పూర్వాభ్యాసాలను జయించుట, తనలోని చెడుగును నిర్మూలించుట, మంచిని అర్హస్థానమందుంచుట మానవుని జన్మధర్మం. ఈ విజయమును ఎట్లుసాధించుటో తెల్పనిచో, మతము మనకు తెల్పునది ఇంకేమీ లేదు. జీవితములోకెల్ల సత్యతరమైన ఈ సాహసయాత్రలో ఫలసిద్ధికి రాజమార్గమేదీ లేదు. మనలను ఆవేశించే దుర్గుణాలలోకల్లా చెడ్డది పిరికితనం. అది పరమహింసాత్మకమైనది కూడా కావచ్చును. హింసాత్మకతకు పేరుపొందిన రక్తపాతాది క్రూరకృత్యాలకంటె కూడా భీరుత్వంలో ఎక్కువ హింసాత్మకత ఇమిడివున్నదని రూఢిగా చెప్పవచ్చును. ఎందువల్ల అంటే, పిరికితనం అనేది దేవునిలో విశ్వాసం లేకపోవుటవలనా, దేవుని గుణగణములను గూర్చిన అజ్ఞానంవలనా ఉద్భవిస్తుంది. పిరికితనమును, అట్టి ఇతరములైన పూర్వదుష్ప్రవృత్తులను జయించుటకు మానవునికిగల మహత్తర సాధనం హృదయపూర్వకమైన ప్రార్థన ఒక్కటే అని స్వానుభవజ్ఞానంతో నేను ఉగ్గడించ

గలను. అంతరంగమందలి ఈశ్వరచైతన్యంలో సజీవమైన విశ్వాసంలేనిదే ప్రార్థన అసాధ్యకార్యమవుతుంది.

మనము ముందుగా దుష్టశక్తులతో చేతులు కల్పుటో లేక సత్యబలాలతో మైత్రిసల్పుటో నిర్ణయించుకొనవలసి వుంటుంది. అంధకార రాజ్యాధిపతియొక్క పాశబంధనాల నుంచి విముక్తిని చేకూర్చగల నర పరమేశ్వరానుబంధమే దైవప్రార్థనము. హృదయపూర్వకమైన ప్రార్థనము కేవలం పెదిమెలపై మెదిలే పఠనాభ్యాసం కాదు. అది ఒక వ్యక్తి యొక్క ప్రతి మాటలోనూ, ప్రతి చేష్టలోనూ మాత్రమే కాక, ఆతని ప్రతి మనోభావనలోనూ కూడా అభివ్యక్త మయ్యే అంతరంగ పరిదేవనము. కలుషభావ మొక్కటి అతని వశంవద మొనర్చుకొనజాలినచో, ఆతని ప్రార్థనము పెదిమెల కదలికను మించలేదని గ్రహించుకొనవచ్చును. ఒక దుర్భాషణము నోరుదాటినా, ఒక దుష్కార్యము చేయి దాటినాకూడా అట్లే అన్వయించుకొనవచ్చును. నిజమైన ప్రార్థన ఈ దుష్టత్రయంనుంచీ సంపూర్ణమైన రక్షణచేకూర్చే అభేద్యకవచంవంటిది. అట్టి సార్థకమూ సజీవమూ అయిన ప్రార్థన ప్రథమసాధనలోనే సర్వదా సాఫల్యసిద్ధిని కలిగించక పోవచ్చును. మనతో మనమే ఘర్షణపడి, మనలోని వ్యతి రేకశక్తులను విశ్వాసబలంతో అధిగమించి, మాసములను వత్సరదీర్ఘములుగా తోపించే సాధనాక్లేశానికి సంసిద్ధులం కావాలి. కావున ప్రార్థనా సాఫల్యతను అనుభవవేద్యమొ

నచ్చుకోనవలెనంటే, అపరిమితమైన ఓరిమినీ అలవరచుకోన వలసివుంటుంది. అంధకారమూ, వైఫల్యమూ, ఇంకాఅంత కంటెను కఠోరానుభూతులుకూడా మన పాలుకావచ్చును. అయినను పిరికితనమునకు వశంవదులంకాకుండా వాటి నన్నిటిని ఎదుర్కొని పోరాడే ధైర్యమును చూపవలసివుంటుంది. ప్రార్థనాపరుడైన వ్యక్తికి వెనుకంజవేయడమనేది వుండదు.

నేను చెపుతున్నది ఏమాత్రమూ అభూతకల్పితమైన కథకాదు. ఊహాచిత్రాన్ని నేను వ్రాయడంలేదు. తమ ఉన్నతపరిణతిమార్గంలో ఎదురైన సర్వకష్టములను ప్రార్థనాశక్తివల్ల జయించిన వ్యక్తుల అనుభవసాక్ష్యాన్ని మాత్రమే నేనిక్కడ క్రోడీకరించాను. జీవనయాత్ర సాగినకొలదీ నాకు సమానార్థకములైపోయిన విశ్వాసప్రార్థనములు రెండును నాకెంతగా చేయూతఅవుతున్నది తెల్పుతూ, నా స్వీయానుభవ సాక్ష్యాన్నికూడా ఈ సందర్భాన్ని వినమ్రభావంతో నివేదిస్తున్నాను. నేను ఉదహరిస్తున్న నా స్వీయానుభవం కొన్ని గంటలకో, దినములకో, వారములకో పరిమితమైనది కాక, సుమారు 40 సంవత్సరముల నిరంతరసాధనాఫలితమై వున్నదని చెప్పవలసివున్నది. నేను కూడా నాకు తటస్థించిన అనేక నైష్ఫల్యాలను, ప్రగాఢమైన అంధకారాన్ని, నిస్పృహాజనకములైన సమాలోచనములను, జాగరూకతా ప్రతిపాదకములైన సలహాలను, సూక్ష్మతమమైన అహంభావావేశాలను ఎదుర్కొని వున్నాను. తుట్టతుదకు నా విశ్వాసబలం,

అది ఎంత అల్పాల్పమైనప్పటికిని, నా పరమాశయమున కదెంతగా తీసిపోయినాగాని, ఈ కష్టక్లిష్టతల నన్నింటినీ ఇంతవరకూ నిగ్రహించుకుని సఫలీకృతం కాగలదనియే చెప్పగలను. మనలోనేకనక విశ్వాసమూ, ప్రార్థనాభావంతో నిండిన హృదయమూవుంటే, మన నిమిత్తమై పరమేశ్వరుని క్రిందికి దింపి రాజీమార్గము ననుసరించవలసిన పనిలేదు. మనమే శూన్యబిందు పరిమాణానికి దిగాలి. మన అహంభావమును అభావస్థితికి దింపుకొనగలిగితే తప్ప, మనలోని కలుషతను జయించలేము. మనకు ఏకైకవాంఛితార్థమైన యథార్థమోక్షసిద్ధికి మూల్యంగా భగవంతుడు మనయొక్క సంపూర్ణమైన ఆత్మార్పణమునే కోరుతాడు. ఆ రీతిగా తన ఆత్మను సంపూర్ణంగా దైవపరంచేసిన వ్యక్తి, ఆవెనువెంటనే సర్వజీవలోక సంసేవనంలో తన్నుతాను తెలిసికొంటాడు. ఆ సేవాకార్యమే ఆతనికి అత్యంతానందప్రదమూ, క్రీడా సదృశమూ అవుతుంది. ఆతడొక వినూతన మానవత్వమును పొంది, పరమేశ్వరసృష్టియొక్క సంసేవనమునకు, విసుగు విరామము లెరుగకుండా, తన సర్వశక్తులనూ ధారపోయ గలుగుతాడు. యంగిండియా, 20-12-'28, పే. 420

పొగరుబోతులైనవారి ప్రార్థనలకుగాని, బేరంపెట్టే వారి ప్రార్థనలకుగాని దేవుడెన్నడూ జవాబివ్వడు. ......ఆతని సహాయం నీకు కావలెనన్నయెడల ఆతని సమక్షంలో నీ యొక్క వ్యక్తిత్వాన్ని దిగంబరమొనర్చి, దాపరికమేమీ లేకుండా సమీపించాలి. నీ వంటి పతితజీవికి ఆత

డెట్లు సహాయపడగలడనే భయసందేహాలను వదలిపెట్టాలి.
తన సామీప్యమును చేరిన కోట్లకొలది జీవులకు సహాకరించిన
ఆతడు నీ ఒక్కనిని దిగవిడిచి ఊరకుంటాడా ? ఆతడు ఏ విధ
మైన తారతమ్యభేదాలనుగాని పాటించేవాడుకాడు. కావున,
నీ ప్రార్థన లన్నింటిని ఆతడు తీర్చగలడని తుదకు నీవే తెలు
సుకొనగలుగుతావు. నా స్వీయానుభవాన్నిబట్టి నేనీమాటలు
చెప్పుతున్నాను. ముందు భగవంతుని రాజ్యాన్ని తెలుసుకుని
అందున స్థానప్రాప్తిపొందు ; అటుపిమ్మట సర్వసిద్ధులూ
నిన్ను వరిస్తాయి. యంగిండియా, 4-4-'29, పే. 111.

అన్ని పరీక్షాసమయాలలోను ఆతడు నన్ను కాపాడి
వున్నాడు. నా శోధనలన్నిటిలోను-అవి ఆధ్యాత్మికములైనా,
న్యాయవాదివృత్తికి చెందినవైనా, సంస్థానిర్వహణానికి సం
బంధించినవైనా, రాజకీయవిషయికమైనవైనా, — దేవుడే
నాకు రక్షకుడైనాడని నేను నొక్కి చెప్పగలను. ఆశలన్నీ
అడుగంటిన వేళ, "సాహాయ్యాలు విడనాడిన వేళా, సౌఖ్యాలు
దూరమైన వేళా" ఎక్కడనుంచో, నాకు తెలియకుండానే,
ఏదో ఒక విధంగా సహాయం దిగివస్తుందని నేను గమనిం
చాను. భక్త్యారాధనా ప్రార్థనములు మూఢవిశ్వాసంకాదు.
అవి ఆహారపానీయములకంటె, విశ్రాంతి విహారాలకంటె వాస్త
వికమైన చర్యలు. అవే కేవలవాస్తవికములనీ, మిగిలినవన్నీ
అవాస్తవికములనీ అన్నప్పటికీ అది అతిశయోక్తికాదు.

అటువంటి ఆరాధన అయినా, ప్రార్థన అయినా వట్టి
వాగ్ధాటీవిహారంగాని, రిత్తముఖస్తుతిగానికాదు. అది హృదం

తరంనుంచి పొంగిపొరలే నిర్ఝరిణీసమానం. అందువల్ల మనము మన హృదంతరంలో "ప్రేమతప్ప యింకేమీలేద" న్నంతగా హృదయపారిశుధ్యమును గడించి, హృద్వీణా తంత్రులన్నిటినీ సమశ్రుతిలో వుంచుకుంటే, అవి తమంత తామే "పులకీకృతనాదరూపమై, కనుచూపుల కందరానివై" తాదాత్మ్యసిద్ధి పొందగలవు. ప్రార్థనమునకు మాటలతో పనిలేదు. ఇంద్రియజ్ఞానపూర్వకమైన ప్రయత్నమేమీ దానికి అవసరంలేదు. హృదయోద్రిక్తతలను తప్పక ప్రక్షాళన మొనర్చగల ఏకైకసాధనము ప్రార్థనయే అని నేను నిస్సందేహంగా చెప్పగలను. అయితే దానితో అపారమైన భక్తి ప్రపత్తులు సమ్మిళితమై వుండాలి.

ఆత్మకథ, 1949, పే. 86

నా బ్రతుకున కింతవరకును చేయూతగా నిలిచివున్నది ప్రార్థన ఒక్కటే. అదే లేనియెడల నేను చాలాకాలం క్రితమే పిచ్చివాడినైపోవలసింది. ఇంతవరకూ నేను నాబహిరంగ జీవితంలోనూ, ఆంతరంగిక జీవితంలోనూ ఎన్నెన్ని దుర్భరవేదనల ననుభవించి వున్నదీ నా "ఆత్మకథ" మీకు నివేదించగలదు. అవి నన్నెన్నిసార్లో తాత్కాలిక నిస్పృహలో కూలద్రోసాయి. అయినా, నే నిప్పుడు వాటినుంచి విముక్తి పొందగలిగానంటే, దానికి ప్రార్థనామహత్వమే కారణభూతం. అసలు నా జీవితంలో సత్యానికి వున్నస్థానం ప్రార్థనకు లేనేలేదని ఇప్పుడు మీకు చెప్పవచ్చును. కాని ఆ ప్రార్థన లేనిదే సుఖంలేని దీనస్థితిలో నేను పడిపోయివున్న

ప్పుడు, కేవలం నా అవసరంకొద్దీ అది నా జీవితంలో ప్రవేశించింది. అటుపిమ్మట, దేవునిలో నా విశ్వాసం పెరిగిన కొలదీ, నా ప్రార్థనాపిపాసకూడా ఆపరానిదై పోయింది. అది లేనిదే బ్రతుకుదుర్భరమూ, శూన్యమూ అయిపోయినట్లు తోచింది. పూర్వమొకప్పుడు దక్షిణాఫ్రికాలో నేను క్రైస్తవ ప్రార్థనలకుపోయి ఆలకించాను. అవి నన్నేమీ కదపలేకపోయాయి. వారి ప్రార్థనలో నేను లీనంకాలేకపోయాను. వారు దేవునికి ప్రాధేయపడ్డారు. నే నా పనిచేయలేకపోయాను; ఎంత ప్రయత్నించినా అదినాకు చేతకాలేదు. మొదట నా జీవితం దేవునిలోనూ, ప్రార్థనలోనూ అపనమ్మకంతోనే ప్రారంభమయింది. కొంత వయసు గడిచేవరకూ బ్రతుకులో ఏదో లోపించినట్లు ఎన్నడూ అనిపించనేలేదు. కాని ఆ తర్వాతనుంచీ, దేహానికి ఆహారం తప్పనిసరి అయినట్లే, ఆత్మకు ప్రార్థన తప్పనిసరిగా అవసరమని అనిపించసాగింది. నిజానికి ఆత్మకు ప్రార్థన అవసరమైనంతగా దేహానికి ఆహారం అవసరం కానేకాదు. ఎందుకంటే, దేహాన్ని ఆరోగ్యంగా వుంచడానికి తరచుగా నిరాహారాభ్యాసం అగత్యమవుతుంది కాని, ప్రార్థనోపవాసమనేది మాత్రం ఎక్కడాలేదు...... రాజకీయ దిగంతాలను నిరాశ ఆవురించి నన్ను ముంచెత్తిన సమయాలలోకూడా నేను నా ప్రశాంతతను కోల్పోలేదు. నా ప్రశాంతత చూచి ఈర్ష్య పొందినవారిని కూడా చూచాను. ఆ ప్రశాంతి కేవలం ప్రార్థనాఫలితమే అని మీకు నేను నొక్కి వక్కాణించగలను. నేను పాండిత్య

ప్రకర్ష కలవాడినని చెప్పలేను గాని, ప్రార్థనాబలంవున్నవాడి నని మాత్రం అడకువతో విన్నవించగలను. విధానపరిమే యంతో నాకు పనిలేదు. ఆ విషయంలో ఎవరి నిర్ణయం వారికే వదలవచ్చును. అయినా కొన్ని నిర్ణీతమార్గాలు ఏర్పడి వున్నాయి. పురాతన గురూత్తములు త్రొక్కిన అడుగుజాడల ననుసరించి నడవడం ఎక్కువ క్షేమకరం కావచ్చును...... ఇంతవరకూ నా స్వానుభవ సాక్ష్యాన్ని నివేదించాను. దైనిక ప్రార్థనా ఫలితంగా కేవలం అసదృశమై నటువంటి వినూతన మూల్యమొకటి జీవితంలో ప్రవేశిస్తుం దనే సత్యమును ఎవరికివారు స్వానుభవపూర్వకంగా తెలి యుదురుగాక.

యంగిండియా, 24-9-'31, పే. 274.

[ఈ క్రింది అంశం, సబర్మతీ ఆశ్రమంలో జరిగిన వసతిగృహ బాలుర సభకు గుజరాతునుంచి వచ్చిన బాలుర నుద్దేశించి, గుజరాతీభాషలో గాంధీజీ చేసిన ప్రసంగానికి క్లుప్తీకరణం.]

ప్రార్థనయొక్క అర్థాన్ని గురించీ, అవసరాన్ని గురించీ మీరు మాట్లాడమని కోరినందుకు చాలా సంతసిస్తున్నాను.

ప్రార్థనకు మతంలో ఎంత ప్రాముఖ్యస్థానం వున్నదో వ్యక్తిజీవితంలో కూడా అంత కేంద్రస్థానంవుంది. ప్రార్థన విన్నపరూపంలోనైనా వుండవచ్చును, లేదా అంతకంటె విశాలార్థంలో, ఆంతరంగికమైన ధ్యానరూపకంగానైనా వుండవచ్చును. అది ఏ విధంగా జరిగినా, దాని తుదిఫలితం ఒకటిగానే వుంటుంది. అది విన్నపరూపమైనప్పుడు, ఆ విన్న

పం మనయొక్క ఆత్మప్రక్షాళనా పారిశుధ్యాలు చేకూర్చే నిమిత్తమూ, ఆత్మను ఆవరించివుండే అజ్ఞానాంధకారాల నుంచి విముక్తిపొందే నిమిత్తమూ అయివుండాలి. తమలోని ఈశ్వరచైతన్యాన్ని మేలుకొల్పుటకు తపనపొందే ఎవరుగాని ప్రార్థనపై ఆధారపడక తప్పదు. ప్రార్థన అంటే ఉత్త మాటల పరిశ్రమకాని, చెవులకు శ్రమకాని కాదు; సారంలేని సూత్రాలను ఊరకపఠించడమూ కాదు. హృదయంలేని మాటలకంటె మాటలులేని హృదయమే ప్రార్థనకు ఎక్కువ ప్రయోజనకరం. భక్తిభావంతో అంతరాత్మపొందే తపనకు స్పష్టమైన ప్రతిబింబం కావాలి ప్రార్థన. ఆకలిగొన్నమనిషి మంచి భోజనాన్ని ఎలా ఇష్టపూర్తిగా తింటాడో, అలాగే ఆకొన్న హృదయంకూడా హృదయపూర్వకమైన ప్రార్థన అంటే తహతహపడుతుంది. ప్రార్థనయొక్క మహత్తును అనుభూతిపూర్వకంగా తెలుసుకున్నవాడు రోజులకొలదీ తిండి లేకుండా వుండగలడు కాని ఒక్క క్షణమైనా ప్రార్థనలేకుండా వుండలేడని చెపితే, నాయొక్కయు నా మిత్రులయొక్కయు స్వానుభవాన్ని కొలదిగా మీకు తెల్పుతున్నానన్నమాట. నిజానికి ప్రార్థనలేనిదే అంతశ్శాంతి వుండదు.

అలా అయితే మన బ్రతుకులో ప్రతి నిమిషమూ ప్రార్థనలు చేస్తూనే కూర్చోవాలిగదా, అని ప్రశ్నించేవారుంటారు. అందుకు సందేహంలేదుకాని, ఒక నిమిషమాత్ర కాలమైనా బుద్ధిని మనస్సులోకి మరల్చుకుని ఏకాగ్ర

ధ్యానంలో గడపడమే కష్టసాధ్యమైన మనబోటి పాపిష్టి మర్త్యమానవులకు, నిరంతరం ఈశ్వర చేతనాలీనమానసులమై వుండడం అసాధ్యమైన పని. అందుచేత, కొంచెం సేపైనా లౌకికబంధనాలనుంచి విడివడి గడపడానికి, అంటే ఈ మాంసదేహంనుంచి కొంచెంసేపు బయటపడటానికీ ఏకాగ్రచిత్తంతో ప్రయత్నించే నిమిత్తం ఏదో ఒక సమయం నిర్ణయించుకుంటాము. మీరు సూర్దాసు కీర్తన విన్నారు. అది పరమాత్మునితో తాదాత్మ్యానికి తహతహపడే ఒక జీవాత్మయొక్క వేదనాక్రందనం. మన లెక్కకుబట్టి అతడొక పరమభక్తుడు. కాని అతని లెక్కలో తానొక పరమపాపినని భావించి పరితపిస్తాడు. ఆధ్యాత్మికంగా ఆతడు మనకంటె మైళ్ళకొలది అగ్రేసరుడైనా కాని, ఆతడు పరమేశ్వరునితో తనకు కలిగిన క్షణికవియోగమునైనను దుస్సహవేదనగా భావించి, తన అనర్హతకు తన్నుదాను గర్హించుకొని, నైరాశ్యపూరిత హృదయంతో ఆవిధంగా ఆక్రోశించాడు.

నే నింతవరకు ప్రార్థనయొక్క అవసరాన్ని వివరించి, తద్వారా ప్రార్థనయొక్క అంతరార్థాన్నికూడా విశదీకరించాను. మనము మన తోడిమానవులకు సేవచేసేనిమిత్తమే జన్మించాము. పూర్ణమైన మెలకువ కలిగివుంటేగాని, మన మా కార్యాన్ని సరిగా నెరవేర్చలేము. మానవుని వక్షోంతరంలో అంధకారశక్తులకూ అభ్యుదయశక్తులకూ అనంత సమరం చెలరేగుతూ వుంటుంది. అందులో తుదిరక్షణగా

ప్రార్థన అనే పెనుచుక్కానియొక్క ఆధారములేనివాడు అంధశక్తులకు బలిఅయి నశిస్తాడు. ప్రార్థనాపరుడైన వ్యక్తి తనతోనూ, ప్రపంచంతోనూ ఆంతరంగికజీవితంలోనూ, ప్రాపంచిక సంబంధాలలోనూ ప్రశాంతచిత్తతతో మసలుకొనగలుగుతాడు. ప్రార్థనాభావశూన్యమైన హృదయంతో లోకవ్యవహారాలలో మసలేవ్యక్తి తాను దురవస్థపాలు కావడమే కాక, లోకాన్నికూడా దురవస్థపాలుచేస్తాడు. మరణానంతరస్థితి విషయికమైన ప్రయోజనాన్ని అటుంచిచూచినా, ఈ జీవలోకవాసిగా వున్నకాలంలోనే ప్రార్థన మానవునికిగణింప శక్యంకాని లాభం కనిపిస్తుంది. మన దైనికచర్యలలో క్రమపద్ధతి, ప్రశాంతత, నిదానము అలవరచుకొనవలెనంటే ప్రార్థన ఒక్కటే తగిన సాధనం.

అందువల్ల మీరు మీ ప్రతి దివసాన్నీ ప్రార్థనతో ప్రారంభించండి. దాని ప్రభావం సాయంసంధ్యవరకూ నిల్చునట్లు ఆత్మస్ఫూర్తిగా చేయండి. దినాంతమును తిరిగి ప్రార్థనతో ముగించినట్లయితే రాత్రివేళ కలలుగాని, పీడకలలుగాని రాకుండా ప్రశాంతంగా గడుస్తుంది. ప్రార్థనకు ఏ విధానాన్ని అనుసరించాలా అని ఆలోచించి బాధపడకండి. అది ఏ పద్ధతిని చేసినాసరే, భగవద్విషయమైన ధ్యానస్థితిని కలిగించేదిగా వుంటే చాలు. ఏ విధానము ననుసరించినప్పటికి, నోట ప్రార్థనావాక్యములు వెలువడుతుండగా మనస్సు చంచలవిహారం చేయకుండామాత్రం చూచుకోండి.

నే నిప్పుడు చెప్పినదంతా మీకు మనస్సుకెక్కినట్లయితే, మీవసతి గృహనిర్వాహకులు మీ ప్రార్థనా కార్యక్రమం విషయంలో శ్రద్ధవహించి అది ఒక నిబంధనగా చేసే వరకూ ఊరుకోరని నమ్ముతాను. స్వయం నిర్ణయమైన నిబంధనలో బలాత్కారమనేది వుండదు. నిబంధనలేమీ లేనివాడు, అనగా స్వసుఖాభిలాషయే ప్రధానమైనవాడు, ఉద్రేకభావాలకు బానిసైపోతాడు; నియమ నిబంధనలకు బద్ధుడైనవాడు ఆత్మస్వాతంత్ర్యాన్ని అనుభవించగలుగుతాడు. విశ్వసృష్టిలోని సర్వవస్తువులూ, సూర్యచంద్ర తారాగణంతో సహా, కొన్ని సూత్రాలకు, బద్ధమై వర్తిస్తాయి. ఈసూత్రాల యొక్క నిగ్రహ ప్రభావం లేనిదే ఈప్రపంచం ఒక్కక్షణమైనా నడవదు. సోదర మానవుల సేవయే ఆశయంగా పెట్టుకున్న మీరు, స్వయం నిర్ణీతమైన ఏదో ఒక నియమశిక్షణకు లోనుగాకున్నయెడల, భగ్నజీవితులై పోతారు. అట్టి ఆధ్యాత్మికావసరమును తీర్చే శిక్షణము ప్రార్థనయే. నియమ నిగ్రహములే మనలను మృగప్రాయతనుంచి వేరుపరచే లక్షణాలు చతుష్పాత్తులవలె గాక, తలయెత్తి నిదానంగా నడిచే మనుష్యులంకావలెనంటే, మన మీ విషయాన్ని గ్రహించి, స్వబుద్ధి పూర్వకమైన నియమ నిగ్రహాలను అలవరచుకుందుముగాక.

యంగిండియా, 23-1-'30, పే. 25-26.

అసలు ప్రార్థించడం ఎందుకు ? దేవుడనే వాడే కనక ఒకడు వుంటే, జరిగినదంతా అతడికి తెలియదా ? మనం ప్రార్థిస్తేనేగాని దేవుడు తన విధిని నెరవేర్చలేడా ?

నిజమే, దేవునికి మనం జ్ఞాపకంచేయనక్కరలేదు. ఆతడు అందరి అంతరంగాలలోనూ వున్నాడు. ఆతని అను మతిలేనిదే ఏమీ జరగదు. మనం చేసే ప్రార్థన మన ఆత్మ పరీక్ష నిమిత్తమే. ఆతని అండలేనిదే నిస్సహాయులమని మనకు మనమే జ్ఞప్తిచేసుకోవడం అన్నమాట. ఏ ఉద్యమ మైనాగాని ప్రార్థనతోకూడితేగాని సంపూర్ణం కాదు,— అనగా దేవుని ఆశీస్సు వెనకలేనిదే ఏ మానవప్రయత్నం కాని శక్తిసంపన్నం కాజాలదనే స్పష్టజ్ఞానం కలిగివుంటే తప్ప, అది నెరవేరదన్నమాట. ప్రార్థన మనలో వినయ భావాన్ని పెంపొందిస్తుంది. ఆత్మపారిశుధ్య కాంక్షనూ, ఆత్మపరీక్షాబుద్ధినీకూడా రేకెత్తిస్తుంది ప్రార్థన.

హరిజన్, 8-6-'35, పే. 132.

బౌద్ధమతస్థుడైన డాక్టరు ఫబ్రిఅనే ఆయన అబోటా బాదువద్ద గాంధీజీని కలుసుకుని, ఈ విధంగా ప్రశ్నించారు:

"దేవుని మనస్సును ప్రార్థన వల్ల మార్చడం సాధ్యమా? ప్రార్థనవల్ల దానిని తెలిసికొనగలమా?"

"నేను ప్రార్థన చేసేటప్పుడు ఏమిచేస్తానో మీకు పూర్తిగా బోధపరచడం కష్టం," అని, ఇంకా ఇలా చెప్పారు గాంధీజీ. "అయినా, మీ ప్రశ్నకు జవాబు చెప్పడానికి ప్రయత్నిస్తాను. దేవుని మనస్సు మార్పులేనిది; కాని ఆతని దైవత్వం చేతనాచేతనములైన అందరిలోనూ, అన్నిటి లోనూ వున్నది. అంతర్గర్భితమైవున్న ఆదివ్యత్వాన్ని నాలో

ఆహ్వానం చేయడమే ప్రార్థనకు అర్థం. అయితే, నాకు ఆ విధమైన మానసిక విశ్వాసం మాత్రమేవుండి, సజీవమైన అనుభూతి లేకపోవచ్చును. అందువల్ల, నేను స్వరాజ్యమునకో లేక భారతదేశ స్వాతంత్ర్యమునకో ప్రార్థనచేస్తున్నానంటే, ఆ స్వరాజ్య సంపాదనమునకు గాను, కాదా ఏ తత్సంపాదనమునకు నా శర్వశక్తులను ధారపోయుటకుగాను, తగిన బలమునిమ్మని ప్రార్థించడమో, కోరడమో చేస్తున్నానన్నమాట. ప్రార్థనాఫలితంగా నేనట్టి శక్తిని పొందగలనని నా దృఢవిశ్వాసం."

"అయితే దానిని మీరు ప్రార్థన అని పిలవడం సరి కాదు. ప్రార్థించుట అంటే దేనినిగాని ఇమ్మని ప్రాధేయ పడుట లేక బలాత్కరించుట అని అర్థమిస్తుంది." అన్నారు డాక్టరు ఫబ్రి.

"అది నిజమే, నాకు నేనే ప్రాధేయపడుతున్నానని మీరు అర్థం చెప్పుకోవచ్చును. నాకు నేనే అంటే, నేనింకా పూర్ణతాదాత్మ్యం పొందని నా అంతరాత్మకు లేక నాలోని యథార్థమైన వ్యక్తిత్వానికి, అన్నమాట. దీనినిబట్టి, ప్రార్థన అంటే సర్వాంతర్యామి అయిన దివ్యత్వంలో తన వ్యక్తిత్వాన్ని సంలీనం చేసుకొనుటకు మానవుడు పొందే నిరంతర తపన అని వర్ణించుకొనవచ్చును."

"అయితే మరి, ప్రార్థన చేయలేనివారి సంగతేమిటి?" అని అడిగారు డా. ఫబ్రి.

"వినయశీలత అలవరచుకుని, బుద్ధుని గూర్చిన మీ స్వీయనిర్వచనంతో అసలు బుద్ధుని సంకుచితం చేయకండి"

అని వారికి చెప్తాను అని, గాంధీజీ ఇంకా ఇలా అన్నారు.'
"బుద్ధుడు ప్రార్థన చేయగలిగినంత వినయ సంపన్నుడు కానిచో, నాటినుండి ఈనాటి వరకూ ఇన్ని కోట్లజనుల జీవితాలను తనకు వశంవదంచేసుకొన గలిగేవాడే కాడు. మన మనశ్శక్తికి అపారంగా అతీతమై మనలనూ, అవిశ్వాసులైన వారినీ కూడా పాలించే ఒకానొక శక్తివున్నమాట వాస్తవం. అవిశ్వాసులయొక్క సంశయవాదంగాని, తాత్వికపాండిత్యం గాని, వారి జీవితములందలి క్లిష్టసమయాలలో వారికి సహాయపడవు. అంతకు మించినదీ, తమకు బాహ్యమై పోషణ ఒసగగలిగినదీ అగు ఒక శక్తి వారికి అవసరమవుతుంది. అందువల్ల, ఎవరుగాని నన్ను చిక్కుప్రశ్నతో ఎదుర్కొన్నప్పుడు వారికి నే నీ విధంగా జవాబిస్తాను: 'నీవొక సున్నతో సమానమైనంత అల్పత్వం అలవరచుకుంటే తప్ప, నీవు దేవుడన్నా ప్రార్థన అన్నా అర్థంచేసుకోలేవు. నీవెంతటి ఘనుడివైనా, ఎంతటి అపారమేధస్కుడివైనా, ఈ విశ్వప్రపంచ సమక్షాన నీ వొక ధూళికణసమానుడవని తెలిసికొనుటకు తగిన వినయశీలాన్ని అలవరచుకోవాలి. జీవితసంబంధమైన విషయాలలో కేవలం మేధస్సిద్ధమైన భావాలు పనిచేయవు. మనశ్శక్తికి అందరాని ఆధ్యాత్మిక భావన ఒక్కటే సంతృప్తిని ఒసగగలుగుతుంది. ఎంతటి ధనవంతుల జీవితాలలోనైనా క్లిష్టఘట్టాలు తటస్థిస్తూవుంటాయి. ధనం కొనగలిగినవీ, ప్రేమ ఒసగగలిగినవీ సర్వమూ వారిని పరివేష్టించివున్నప్పటికీ, వారి జీవితములందు కూడా దారితెలియక అల్లాడే

క్షణాలు కొన్నివుంటాయి. అట్టి క్షణాలలోనే మనకు దేవుని సాక్షాత్కారం అనుభవ వేద్యమవుతుంది. అప్పుడే మనకు జీవితమార్గంలో అడుగడుగునా దారిజూపి నడిపించే పరమేశ్వరదర్శనం లభ్యమవుతుంది. ప్రార్థన అంటే అదే.''

''అంటే, మీరు చెప్పేది మానసిక భావనకంటె బలవత్తరమైనట్టి మతసంబంధమైన వాస్తవానుభూతి అని నిర్వచించవచ్చుననుకుంటాను,'' అన్నారు డా. ఫ్రబి.

''అదేనండీ ప్రార్థన,'' అని, ఆయన మనస్సుకి బాగా నాటుకునే లాగ నొక్కి జవాబిచ్చారు గాంధీజీ.

హరిజన్, 19-8-'39, పే. 237-38.

ప్రశ్న : ఒకవ్యక్తి, తాను దైవారాధనకు వెచ్చించే కాలాన్ని పేదలసేవకు వినియోగిస్తే, అది యెక్కువ మంచిది కాదా? నిజంగా సేవాపరుడైన వ్యక్తికి, భక్తి పూర్వకమైన ఆరాధనాకార్యం అనవసరం కాదా?''

జవాబు : ఈ ప్రశ్నలో నాకు బుద్ధిమాంద్యమూ, అజ్ఞానవాదమూ (agnosticism) రెండూ కలిసివున్నట్లు స్ఫురిస్తోంది. ఉత్కృష్టకర్మయోగు లెవరూకూడా కీర్తనారాధనములను విడనాడరు. ఆదర్శరీత్యా, పరసేవాపరాయణత్వమే ఆరాధనాసమానమనినీ, అట్టి భక్తులుబాహ్యమైన కీర్తనాదికంలో కాలం వెచ్చించనక్కరలేదనినీ చెపితే చెప్పవచ్చును. అనుభవరీత్యా భజనాదికములు యదార్థ

మైన సేవాచరణానికి సహాయకమేకాక, భక్తహృదయాంత
రంలో భగవత్స్మరణను నిత్యనూతనంగా నిల్పుతాయి.

హరిజన్, 13-10-'46, పే. 357,

## (ఇ) రామనామం

నేను యోగసాధనలు శాస్త్రోక్తంగా ఎన్నడూ చేసి
ఎరగను. నేను అనుసరించే సాధనా విధానం నేను నా చిన్న
నాడు నా దాదిదగ్గర నేర్చుకున్నాను. నాకు దెయ్యాలంటే
భయం వుండేది. "దెయ్యాలూ గియ్యాలూ ఏమీలేవు.
అయినా నీకు భయంవేస్తే రామనామం స్మరిస్తూవుండు,"
అని ఆమె నాకు బోధించింది. బాల్యంలో నేను నేర్చుకున్న
ఈ చిన్నవిషయం తరువాత తరువాత నా మానసాకాశా
న్నంతనీ ఆవరించే పెద్దవిషయంగా పెరిగిపోయింది. నా
కటికచీకటి గడియలను కాంతివంతంచేసే సూర్యబింబంలా
పరిణతి పొందింది. నేను దీనివలన పొందే ఉపశాంతిని
క్రైస్తవమతస్థుడెవరుగాని జీససునామాన్ని, ముస్లింమతస్థు
డెవరుగాని అల్లాపేరునూ, జపించడంద్వారా పొందవచ్చును.
ఇవన్నీ కలిగించే భావస్ఫురణ ఒక్కటే. ఒకే పరిస్థితులలో
అవన్నీ ఒకే ఫలితాలను ఒసగగలవు. అయితే ఆ నామ
స్మరణం కేవలం నోటితో పలికేద మాత్రమేకాక, మన
ఆత్మలో అంతర్గర్భితమైపోవాలి.

హరిజన్, 5-12-'36, పే. 339.

జ్ఞానం పెరిగినకొలదీ, వయస్సు గడిచినకొలదీ అది
(రామనామస్మరణం) నాకు ద్వితీయ స్వభావంలాగ (Second

nature) అయిపోయింది. రోజుకి ఇరవైనాలుగు గంటలూ అది నాపెదిమలపై బాహ్యంగా మెదలకున్నప్పటికీ, హృదయాంతరంలో నిత్యం ఆడుతూనే వుంటుందని చెప్పవచ్చును. అదే నాకు సర్వదా రక్షగా, ఊతగా నిలిచివున్నది.

హరిజన్, 17-8 '34, పే. 213.

రిక్తగా 'రామరామ' అని గొణిగేవారిని కాక, ఆతని సేవలొనర్చి, ఆతని ఇచ్ఛానువర్తులైనవారినే ఈశ్వరకృప ఆవహిస్తుంది.

యంగిండియా, 8-4-'26, పే 132.

పరమేశ్వరుడూ, పరమేశ్వరుని ధర్మశాసనమూ ఒకటే. కావున ఆతని శాసనమును అనువర్తించడమే ఉత్తమమైన ఆరాధన. ఆశాసనంతో సంలీనత పొందిన వ్యక్తికి బాహ్యమైన నామధ్యానం అవసరంకాదు. ఊపిరిపీల్చడంతో సమానంగా మానసిక దైవధ్యానం సహజాభ్యాసమైపోయిన వ్యక్తికి పరమేశ్వరునితో సంపూర్ణతాదాత్మ్యం కలుగుతుంది. అప్పుడాతనికి దైవశాసన జ్ఞానమూ, తదాచరణమూ ద్వితీయ స్వభావసదృశమైపోతాయి. హరిజన్, 24-3-'46, పే. 56.

నిజమైన దైవభక్తికలవాడు ప్రకృతిశక్తులైన పంచభూతములకూలోబడి నడుచుకుంటాడు. అతడా రీతిగా వానికి లోబడివుంటే ఎన్నడును వ్యాధిగ్రస్థుడు కాడు. ఒకవేళ అయినాగాని, ప్రకృతిశక్తుల సహాయంతోనే వ్యాధినివారణ చేసుకుంటాడు. ఈదేహం తనకు కేవలం వాసమాత్రమే అని

తలచువానికి ఈ దేహలోపములను ఏవిధంగాపడితే ఆవిధంగా సరిదిద్దుకోనడం సరిపడదు. ఈదేహమే తన సర్వస్వంగా భావించేవాడు తన దేహలోప నివారణోపాయాలకుగాను భూమ్యంతాల వరకూ అన్వేషణయాత్ర సలపడం సహజమే. కాని ఆత్మ అనేది దేహవాసి అయినా దేహానికి భిన్నమైన దనీ, దేహం నశ్వరమైనా ఆత్మ అనశ్వరమనీ తెలిసినవాడు ప్రకృతిశక్తులు క్షీణతపొందినచో కలతపాలయి విషణ్ణచిత్తుడు కాడుగదా, మృత్యువును సైతము ప్రాణమిత్రునిగా ఆహ్వానిస్తాడు. వైద్యశాస్త్రజ్ఞులకోసంపరుగెత్తకుండా తనవ్యాధులకు తానే వైద్యం చేసుకుంటాడు. ఆత్మచేతనమే తన నిజ నివాసముగా భావించి, ఆతడు మొదటినుంచి తుదివరకూ ఆ ఆత్మారాముని క్షేమమే తన క్షేమంగా భావిస్తాడు.

అట్టి వ్యక్తి తన ప్రతి ఊపిరితోనూ పరమేశ్వరుని నామస్మరణ చేస్తాడు. ఆతని దేహము నిద్రించినా, ఆతని రాముడు మెలకువగానే వుంటాడు. ఆతడు ఏకార్యము చేస్తూ వున్నా, సదా రాముడాతని పజ్జనే వుంటాడు. ఆ పవిత్ర సాంగత్యనష్టమే అట్టి భక్తునికి నిజమైన మృత్యువు.

తన రాముని తనతో నిల్పుకొనుటకుగాను, పంచభూతములు తన కొసగగల్గిన దేమివున్నదో దానినాతడు గ్రహిస్తాడు. అనగా, పృధివ్యాపస్తేజోవాయురాకాశముల నుండి తాను పొందగల లాభమునంతను పొందుటకు తగిన అత్యంత సులభసాధ్యమైన సామాన్యమార్గాలను అవలంబిస్తాడు. ఈ సహాయం రామనామానికి సంపూరకం కాదు; దాని సిద్ధికి

ఒక సాధనం మాత్రమే. అసలు రామనామమునకు సహాయమేమీ అవసరమే లేదు. కాని, ఒక వంక రామనామమును నమ్ముతున్నట్లు చెప్పడమూ, మరొకవంక వైద్యులవద్దకు పరుగెత్తడమూ, ఒకదాని కొకటి పొసగవు.

మతవిషయాలలో పాండిత్యం గల నామిత్రుడొకడు రామనామాన్ని గురించి నేను ప్రకటించిన భావాలను చదివిన పిమ్మట, ఆమధ్య వ్రాసిన ఒకలేఖలో, తరుగు శరీరమును మెరుగునట్లు మార్చివేయగల రసవాదరహస్యం రామనామంలో ఇమిడివున్నదని ఉగ్గడించాడు. ప్రాణశక్తిని పెంపు చేయుటను కూడబెట్టిన ధనసంపదతో పోలుస్తూ వుంటారు. అయితే దానిని నిరత ప్రివర్ధమానమగు ఆత్మశక్తి ప్రవాహినిగాచేసి తుదకు పతనరహిత స్థితిని చేకూర్చే రహస్యం రామనామ ప్రభావంలోనే ఇమిడివున్నది.

రక్తప్రవాహం లేనిదే శరీరం నిలువలేని రీతినే, ఆత్మకును అసదృశమూ పరిశుద్ధమూ అయిన విశ్వాసబలం అవసరం. ఈబలం శరీరం యొక్క అంగదౌర్బల్యాలన్నింటికీ పునరుజ్జీవం కలిగించగలదు. అందుకనే రామనామాన్ని హృన్మందిరంలో ప్రతిష్ఠించుకుంటే పునర్జన్మ పొందినట్లే అని చెప్పబడుతుంది. ఈసూత్రం యువకవృద్ధులకూ, స్త్రీ పురుషులకూ కూడా సమానంగా వర్తిస్తుంది.

ఈనమ్మకం పాశ్చాత్యలోకంలో కూడా కనిపిస్తుంది. క్రైస్తవమత శాస్త్రంలో (Christian Science) ఇది కొంతవరకు దృశ్యమానమవుతుంది.

భారతదేశంలో అనాదికాలంనుంచీ అనుభవవేద్య మైన ఈవిశ్వాసానికి వైదేశికాధారాలు వెదకి చూపవలసిన పనిలేదు. హరిజన్, 29-6-'47, పే. 212.

నా భావనలోని రామనామానికీ మంత్రతంత్రాలకీ ఏమీ సంబంధం లేదు. హృదయపూర్వకమైన రామనామ జపంవల్ల ఒక అసదృశమైన మహత్తరశక్తి దిగివచ్చి మనకు సహాయంచేస్తుందని ఈ వరలో చెప్పివున్నాను. దానిముందు అణువుబాంబు ఎందుకూ పనికిరాదు. ఈ శక్తి సర్వబాధా నివారిణి. అయితే, రామనామం హృదయగర్భంనుంచి రావాలని చెప్పడం సులభమేకాని, ఆ అనుభవసిద్ధిని పొందడం చాలా కష్టతరమైన విషయమని అంగీకరించకతప్పదు. అయి నప్పటికి, మానవుడు పొందగల అన్నిటికంటె అదే ఉత్కృష్టతరవస్తువన్నమాట మాత్రం వాస్తవం.

హరిజన్, 13-10-'46, పే. 357.

నా రాముడు, మన ప్రార్థనలకు లక్ష్యమైన రాముడు, దశరథుని కుమారుడూ అయోధ్యకురాజూ అయిన చారిత్రక పురుషుడగు రాముడుకాదు. నా రాముడు నిత్యుడూ, జన్మ రహితుడూ, అద్వితీయుడూ అయినవాడు. అతడే నా ఆరాధ్యదైవము. ఆతని అండనే నేను కోరుతాను; మీరునూ కోరవలసినదదే. ఆతడు సర్వులకూ సమానలభ్యుడు. అందు వల్ల, ముసల్మాను మతస్థుడుకాని, తదితరుడెవరుకాని, ఆతని నామమును స్మరించుటకు అభ్యంతరమేమి వుండగలదో నాకు

కనిపించదు. అయినను, వారెవరుగాని దేవుని రాముని పేరి టనే పోల్చుకొనవలెనని బలవంత మేమీ లేదు. తమకు అభ్యాసమైన శబ్దమాధుర్యానికి అపశ్రుతి లేకుండుటకుగాను, వారాతని అల్లా అని స్మరించినా, ఖుదా అని జపించినాకూడా సరిపోతుంది.

హరిజన్, 28-4-'46, పే. 111.

ప్రశ్న : ఒకరితో సంభాషణ జరిపేటప్పుడు కాని, మెదడుతో పనిచేసే సమయంలో కాని, హఠాత్తుగా మనః క్లేశం సంభవించినప్పుడు కాని, హృదయంలో రామనా మాన్ని స్మరించగలమా? అట్టి వేళలలో ఎవరుగాని ఆ పని చేస్తారా? చేస్తే, దాని విధాన మేమిటి?"

జవాబు : రామనామం హృదయంలో ప్రతిష్ఠితమైన వ్యక్తి ఎప్పుడైనాగాని, నిద్రావస్థలోనైనాసరే, నామ స్మరణం చేయగలడనీ అనుభవం తెలుపుతుంది. నామ ధ్యానం అభ్యాసమైపోతే, దాని హృదంతర స్మరణం హృదయ స్పందనమంత సహజసిద్ధమైపోతుంది అట్లు కాని పక్షంలో, ఆ రామనామసాధన ఉత్త యాంత్రికాభ్యాస మనిపించుకుం టుంది. లేదా, అది హృదంతరంలోకి చొచ్చుకుపోకుండా వెలుపలితట్లును మాత్రమే సోకిందన్నమాట. రామనామం హృదయంమీద తన ప్రభుతనుస్థాపనచేసిన పిమ్మట, పైకి నామోచ్చారణ చేయడమనే ప్రశ్నకే అవకాశముండదు. అప్పుడది వాగతీతమైపోతుంది. ఈ స్థితిని చేరుకున్నవారు ఎక్కడో ఏకొలదిమంది మాత్రమో వుంటారని అనుకోవల

సుంటుంది. రామనామానికి ఆరోపితమైన మహత్తుసర్వమూ దానిలో అంతర్గర్భితమై వుంటుందన్నమాట నిస్సందేహం. ఉత్తకోరికవల్లమాత్రమే ఎవరుగాని రామనామాన్ని హృదయస్థితం చేసుకోలేరు. నిరంతరసాధనా, ఓరిమీకూడా అవసరం. ఎక్కడాలేని స్పర్శవేదికోసమని మనుష్యులు ఎంత శ్రమా, ఓరిమీ ధారపోసివున్నారో గమనించండి. భగవన్నామంలో తప్పక అంతకంటె ఐశ్వర్యమైన విలువ ఇమిడి వుంటుంది ; అంతేకాక దాని ఉనికి నిత్యమైనది.

ప్రశ్న : పని తొందరలవల్లగాని, పరిస్థితులవల్లగాని ఒకరు నిర్ణీతపద్ధతిని దైనికప్రార్థనాదులు నెరవేర్చలేకపోతే, అది హానికరమా ? సేవ, తావళము— ఈ రెండిటిలోను దేనికి ప్రాధాన్యత ఇవ్వాలి ?

జవాబు : పని తొందరలెట్టివైనా, పరిస్థితులెంత అడ్డమైనా, రామనామం ఆగడానికి వీలుకాదు. సమయసందర్భాలను బట్టి బాహ్యావిధానం మారవచ్చును. హృదయంలో అది స్థిరస్థానం పొందివుంటే, తులసితావళం లేకపోవడం రామనామానికి అడ్డుతగలదు.

హరిజన్, 17-2-'46. పే. 12-13.

# 28
# ఆశ్రమ దీక్షలు

[1930వ సం॥లో గాంధీజీ, తాను 'యెరవ్డా మందిర్' అని పిలిచే కారాగారంలోనించి సబర్మతీ ఆశ్రమ సభ్యులకు వారంవారం కొన్ని ప్రసంగాలను వ్రాసి పంపుతూవుండే వారు. ఆశ్రమదీక్షలుగా పేర్కొనబడిన సత్యము, అహింస, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, అచౌర్యములను విషయ ములనుగూర్చిన ప్రసంగములు ఈ క్రింద పొందుపరచ బడినవి. ఇవికాక మిగిలిన ఆశ్రమ దీక్షలు- రుచినిగ్రహము, నిర్భీతి, అస్పృశ్యతా నివారణ, భుక్తి శ్రమ, సర్వమత సమత్వం, స్వదేశవస్తు స్వీకారం. గాంధీజీ రచించిన 'యెరవ్డా మందిర్'* అనే గ్రంథంలో ఈ మిగిలిన విషయములను గూర్చిన ప్రసంగములుకూడా ప్రచురితమైనాయి. ప్రస్తుత గ్రంథంలో ఆయాచోట్ల ఈవిషయములను గూర్చిన భాగ ములు కూడా పొందుపరచబడి వున్నవి.]

## దీక్షలవల్ల ప్రయోజనం

దీక్షలను చేకొనుట దౌర్బల్యలక్షణం కాదు; అది బలమునే తెల్పుతుంది. చేయవలసిన దానిని దేనిని లెక్కించ కుండా చేయడమే దీక్ష అనబడుతుంది. అది మనకు బల రక్షకమైన కోటగా ఉపకరిస్తుంది. దేనిని గాని 'సాధ్యమైనంత

* నవజీవన్ పబ్లిషింగ్ హవుస్, అహమదాబాదు వారిచే ముద్రితము. వెల 87 నయాపైసలు, పోస్టేజి వగైరా 13 నయాపైసలు.

లేదు. నిజానికి అది ఆతని విధ్యుక్తధర్మం. అప్పుడు, ఆ విధంగా సత్యాన్ని ఆచరించడంలో ఎవరుగాని ఏదైనా పొరపాటు చేస్తే, అది అప్రయత్నంగానే సరిదిద్దుకొనబడు తుంది. ఏమంటే, సత్యాన్వేషణ అనేది తపస్సుతో కూడు కున్న విషయం. తపస్సు అంటే ప్రాణం పోయినా లెక్క చేయని ఆత్మపరివేదనము. దానిలో స్వార్థపరాయణతకు వీస మంత్రైనా స్థానముండదు. అట్టి నిస్వార్థమైన సత్యాన్వేష ణలో ఎవరుగాని ఎక్కువకాలం దారి తప్పిపోలేరు. తప్పు దారి త్రొక్కగానే అడుగు తడబడుతుంది. తద్వారా తిరిగి సరియైనదారికి వస్తారు. అందువల్ల, సత్యాన్వేషణమే నిజ మైన భక్తిమార్గం. అదే భగవంతుని సూటిగా చేర్చగల దారి.

మనలో యువకులూ వృద్ధులూ, పురుషులూ స్త్రీలూ అందరం కూడా మన మెలకువ కాలమంతా— తుదకు భౌతికదేహం పంచభూత విలీనమైపోయేవరకూ— మన సకల చర్యలలోనూ, పనులలోనూ, ఆటలలోనూ, అన్నపానాదుల లోనూ, అన్నిటిలోనూ సంపూర్తిగా సత్యప్రవర్తనమునే అలవరచుకొని నడచుకుంటే ఎంత అందంగా వుంటుంది! నేను సత్యస్వరూపి అయిన భగవంతుని నా అమూల్య భాగ్యంగా భావిస్తాను. మనలో ప్రతివారికిని ఆతడట్లే అగుగాక. 'యెరవ్డామందిర్' నుంచి, 1945, పే. 1-4.

అపూర్వమైన సాధనా ప్రయోగముల నవలంబించ దలచినవాడు వాటిని ముందుగా తనతోటె ప్రారంభించి

చూడాలి. అదే సత్యమును తెలిసికొనుటకు దగ్గరదారి. నిష్కల్మష హృదయుడైన సాధకుని సర్వదా భగవంతుడు కాపాడుతాడు. ఆత్మకథ, 1948, పే. 429.

సత్యాన్వేషణాపరుడైనవాడు కేవలం ఆచార గౌరవాన్నిబట్టి ఏపనీ చేయకూడదు. తన పొరపాట్లను దిద్దుకొనడానికి సర్వదా సంసిద్ధత చూపాలి. తనలోని లోపమును తెలిసికొన్న వెంటనే, ఎంత కష్టమైనను లెక్కించక దానిని ఒప్పుకొని, పశ్చాత్తప్తుడు కావాలి.

ఆత్మకథ, 1948, పే. 429.

అర్హవిచారణాధికారము గల వ్యక్తిసమక్షాన్ని తన లోపమును పూర్తిగా ఒప్పుకొనుటతోపాటు అట్టి పాపమును తిరిగి ఎన్నడూ చేయనని మాట యిచ్చుటయే నిజమైన పశ్చాత్తాప విధానము. ఆత్మకథ, 1948, పే. 42.

మౌనము సత్యారాధకుని ఆత్మశిక్షణలో భాగమని నేను స్వానుభవపూర్వకంగా తెలుసుకున్నాను. తెలిసిగాని తెలియకగాని, సత్యమును అతిశయోక్తిచేయుట లేక అణచిపెట్టుట లేక సవరణచేయుట అనునది మానవసహజమైన దౌర్బల్యము. దానిని జయించుటకు మౌనము అవసరము. మితభాషి అయినవాడు సాధారణంగా ప్రతిమాటనూ తూచి మాట్లాడునేగాని అనాలోచితంగా మాట్లాడడు.

ఆత్మకథ, 1948, పే, 84.

నాబోటి సత్యాన్వేషణాపరునికి మౌనం చాలాసహాయకారి. మౌనస్థితిలో ఆత్మకు స్పష్టశాంతిలో మార్గం కని

పిస్తుంది. పట్టుదొరకని భావాలుగాని, ఆత్మవంచకములైన ఊహాలుగాని స్ఫాటికస్వచ్ఛమై విడిపోతాయి. మనబ్రతుకే ఒక దీర్ఘమైన సత్యాన్వేషణా ప్రయాణం. అందున పూర్ణమైన ఆత్మోన్నతిని సాధించుటకు ఆంతరంగిక విశ్రాంతి అవసరం.

ఇప్పుడు అది (మౌనం) నాకు భౌతికంగానూ, ఆధ్యాత్మికంగానూ కూడా తీరని అవసరమయిపోయింది. మొట్టమొదట శ్రమభారాన్ని తగ్గించుకొనే నిమిత్తం దానిని అవలంబించవలసి వచ్చింది. అప్పుడు వ్రాతపని సాగించుటకు వ్యవధి కావలసివచ్చింది. అలా కొంతకాలం అభ్యసించిన పిమ్మట దాని ఆధ్యాత్మిక ప్రయోజనం నాకు గుర్తుకువచ్చింది. భగవధ్యానానికి మౌనవ్రతసమయమే ఉత్తమమైనదని మనస్సులో మెరపులాతోచింది. ఇక ఇప్పుడు, నా స్వాభావిక తత్వమే మౌనానికి అనుగుణంగా నిర్మింపబడివున్నట్లు అనిపిస్తూవుంది. హారిజన్, 10-12-'38, పే. 373-74.

## (అ) అహింసలేక ప్రేమభావం

ఈ మర్త్యపంజరంలో చెర అనుభవిస్తూ వున్నంతకాలం సంపూర్ణసత్యాన్ని వాస్తవికం చేసుకోవడం మనకు అసాధ్యం. దానిని మనం భావనద్వారానే దర్శించగలం. అనిత్యమైన శరీరసాధనం ద్వారా నిత్యమైన సత్యాన్ని ముఖాముఖిగా చూడలేము. అందువల్లనే తుదిసాధనంగా మనం విశ్వాసంపైననే ఆధారపడవలసి వుంటుంది.

ఈ మర్త్యదేహంలో పూర్ణసత్యదర్శనం అసాధ్య మన్న విషయమే ఏ పురాతన సత్యసాధకుడినో అహింసా సిద్ధాంత నిర్వచనానికి పురికొల్పివుంటుందని తోస్తుంది. "నాకు నష్టాలు కలిగించిన వారిని సహనంతో చూచేదా, లేక వారిని నిర్మూలించేదా?", అనే ప్రశ్న అతడిని ఎదు ర్కొని వుంటుంది. ఇతరులను నాశనం చేస్తూ పోయినవాడు నిజంగా అడుగుముందుకి పోకుండా అక్కడే వుండిపోయాడనీ, తనకు కష్టాలు కలిగించినవారిని సహనంతో చూచినవాడు తాను ముందుకు సాగిపోడమేకాక కొంతవరకూ మిగిలిన వారిని కూడా ముందుకు తీసుకుపోగలిగాడనీ ఆ సాధకుడు గ్రహించి వుంటాడు. మొదటి నాశనచర్యతో అతడికి తన సాధనాలక్ష్యమైన సత్యము తన బాహ్యమందు లేదనీ, తన అంతరంగంలోనే వున్నదనీ అవగాహన అయివుంటుంది. దానినిబట్టి, తాను ఎంత దౌర్జన్యచర్యకు పాల్పైతే సత్యానికి అంతదూరమవుతానని ఆతడు గ్రహించగలిగాడు. ఆతడు తన బాహ్యంలో వున్నట్లు ఊహించుకొనిన శత్రువుతో సలిపే పోరాటంలో, అంతశ్శత్రువు విషయమై జాగరూకత వహించలేదన్నమాట.

మనలను బాధిస్తున్నారనే హేతువువలన మనం దొంగ లను శిక్షిస్తాము. వారు మనలను వదలిపోవచ్చును; కాని ఆ వెంటనే వారు తమ కార్యకలాపాలను ఇంకొకనిపైన ప్రారంభిస్తారు. ఈ రెండవ బాధితుడు కూడా ఒక మానవ మాత్రుడే. అంటే, మనకే ఇంకొకరూపం అన్నమాట.

ఈ విధంగా మనం ఒక విషమచక్రంలో చిక్కుకుని వున్నాము. అయితే దొంగలు దొంగతనమే తమ ఉపాధిగా భావించడం బట్టి, దొంగలబాధ ఇంకా అలా పెరుగుతూనే వుంటుంది. చిట్టచివరకు దొంగలను శిక్షించడంకంటె సహించడమే నయమని గమనిస్తాము. మన క్షమాగుణం వారిని బుద్ధికి తీసుకురావచ్చును కూడా. వారిని సహించడంద్వారా, ఎంత దొంగలైనా వారు మనకంటె విరుద్ధమైనవారుకారనీ, వారు కూడా మనకు సోదరులూ మిత్రులూ అనీ, వారిని శిక్షించరాదనీ గ్రహిస్తాము. అయితే దొంగలను మనం సహించవచ్చునుగాని, దొంగల బాధమాత్రం సహించరానిదే అవుతుంది. దానిని సహిస్తే మనం పిరికివారి మవుతాము. దీనిని బట్టి ఇంకొక విధ్యుక్తధర్మం స్పష్టమవుతుంది. దొంగలను మన బంధుమిత్రులవలె భావిస్తున్నాము కనక, ఆ బాంధవ్యాన్ని వారు గ్రహించేలాగ చేయాలి. అందుచేత వారిని మనవైపు త్రిప్పుకోడానికి సాధనమార్గాలను అవలంబించడానికి శ్రమపడాలి. ఇదే అహింసామార్గం. ఈ మార్గంలో నిరంతమైన బాధాసహనమూ, అనంతమైన క్షమాసాధనా అవసరమవుతాయి, ఈ రెండు లక్షణాలూ వుంటే, ఆ దొంగ చివరకు తప్పక తన దుర్మార్గాలనుంచి మంచిదారికి మళ్లి తీరుతాడు. ఈ విధంగానే లోకమంతనూ మన మిత్రులుగా చేసుకోడం మనం అభ్యసిస్తాము. తద్వారా భగవంతుని ఆధిక్యాన్ని — అనగా, సత్యాన్ని — అనుభవవేద్యం చేసుకుంటాం. ఎన్నిబాధలు సహించినా, మన మనశ్శాంతి

పెరుగుతూనే వుంటుంది ; మనం ఎక్కువ ధైర్యవంతులమూ, కార్యశూరులమూ అవుతాము; ఏది నిత్యమైనదీ, ఏది అనిత్యమైనదీ ఎక్కువ స్పష్టంగా అవగాహన చేసుకుంటాము ; ఏది మనకు విధ్యుక్తమో, ఏది కాదో తెలుసుకునే వివేచనా జ్ఞానం అలవరచుకుంటాము. మన గర్వం కరిగిపోతుంది ; మనం వినయశీలుర మవుతాము. మన లౌకిక లంపటత్వం తరిగిపోయి, మనలోని దుష్టత్వం రోజురోజుకీ తగ్గిపోతుంది.

అహింస అంటే సామాన్యార్థంలో గోచరించే ప్రాకృత భావంకాదు. జీవహింస చేయకుండుట అహింసలో ఒక భాగమైనమాట వాస్తవమే. కాని అది దానిలో కనీసభాగం మాత్రమే. ప్రతి చెడ్డతలంపు, అనవసరమైన తొందరపాటు, అబద్ధములాడుట, ద్వేష భావం, అపకారబుద్ధి, ఇవన్నీ అహింసాధర్మానికి అతిక్రమణములే అవుతాయి. లోకమంతకూ అవసరమైన వాటిని మనమే పట్టుకు వ్రేలాడడంకూడా అహింసాధర్మానికి భంగమే అవుతుంది. అయితే లోకానికి మన దైనికభుక్తికూడా అవసరమే కావచ్చును.

అందువల్ల దేహధారణంవలన మనకు ఏర్పడిన పరిమితులను తెలిసికొని, మన సాయశక్తులా క్రమక్రమంగా ఆదర్శానికి చేరిక కావడానికి మనం తీవ్రప్రయత్నంచేయాలి.

ముందు చెప్పినదానినిబట్టి, అహింసాధర్మాన్ని అనుసరిస్తేతప్ప సత్యసాధన, సత్యసిద్ధి సాధ్యముకాదని స్పష్టమై వుంటుంది. విడదీసి వేరుపరచడానికి వీలుకానంత పెనకువతో

అహింస, సత్యము సమ్మిళితమై వుంటాయి. అవి ఒక నాణె మునకు రెండువైపులవలె వుంటాయి ; అది కూడా ముద్రలేని మెత్తనివైపులుగల లోహపు బిళ్లవంటిదని తోస్తుంది. దానికి బొమ్మఏదో, బొరుసేదో ఎవరు చెప్పకోగలరు? అయినా అహింసను సాధనముగాను, సత్యమును లక్ష్యము గాను భావించవచ్చును. సాధనము నిజమైన సాధనమైతే అది మనకు అందుబాటులో వున్నదై వుండాలి. కాబట్టియే అహింస మనకు పరమధర్మమవుతుంది. సాధనం విషయంలో జాగరూకత వహిస్తే, లక్ష్యాన్ని మనం వేగంగానో ఆలస్యం గానో చేరుకొనక తప్పదు. ఈ సూత్రాంశాన్ని మనం ఒక సారి గ్రహిస్తే, అంతిమవిజయం నిస్సందేహమన్నమాటే. మనం ఎన్నికష్టముల నెదుర్కొనవలసివచ్చినా, ఎన్నిసార్లు వెనుకకుజారినట్లు కనిపించినా, తానే దైవస్వరూపమగుటచే కేవలమైన ఆస్తిక్యత కలిగిన ఆ సత్యంకొరకు చేసే అన్వేష ణమును మన మెన్నటికీ విడిచిపుచ్చకూడదు.

'యెరవ్డామందిర్' నుంచి, 1945, పే. 5 9.

## (ఇ) బ్రహ్మచర్యములేక ఇంద్రియనిగ్రహం

సత్యంతో ప్రణయబంధం పెట్టుకున్నవాడూ, కేవలం సత్యాన్నే ఆరాధించేవాడూ తన శక్తిసామర్థ్యాలను తదితర మైన దానికి వినియుక్తం చేసినచో, ఆతడు అవిశ్వాసదోషం పాలౌతాడు. అట్టియెడ, 'ఆతడు ఇంద్రియలాలసకు ఎట్లు లోనుకాగలడు? ఎవని వర్తనము స్వార్థరాహిత్య లక్షణలక్షిత

మైన సత్యసాధనకు పూర్ణముగా అంకితమైనదో అట్టివానికి పిల్లలను కనుట, కుటుంబజీవితము గడపుట అను స్వార్థప్రయోజనాలకు వ్యవధియే వుండదు. ఇంతవరకు చెప్పిన మాటల తర్వాత, స్వార్థపరాయణతద్వారా సత్యసాధన అనునది పరస్పర శబ్దవ్యాఘాతంగా తోచకపోదు.

అహింసాదృక్పథంనుంచి చూస్తే, సంపూర్ణస్వార్థరాహిత్యం లేనిదే అహింసాసాధన అసాధ్యమని గోచరిస్తుంది. అహింస అనగా విశ్వవ్యాప్తమైన ప్రేమభావం. పురుషుడు తన ప్రేమనంతను ఒకానొక స్త్రీకి ఇచ్చినపిమ్మటను, స్త్రీ తన ప్రేమనంతను ఒకానొక పురుషునికి ఇచ్చివేసినపిమ్మటను, ఇక యావత్ప్రపంచానికీ కూడా ఇవ్వడానికి వారికి మిగిలినదేమిటి? "మిగిలిన అందరూ గంగలో కలిసినాసరే, మా ఇద్దరి సంగతే మాకు ప్రధానం", అనే దాని అర్థం. విశ్వాసపాత్రురాలైన భార్య తన భర్తనిమిత్తమూ, విశ్వాసపాత్రుడైన భర్త తన భార్యనిమిత్తమూ తమసర్వస్వమూ త్యాగం చేయడానికి సంసిద్ధులై వుండవలసివుంటుంది కనక, అట్టివారు విశ్వప్రేమ అనే ఉన్నతస్థాయిని అందుకోలేరనీ, మానవ సంఘాన్నంతను ఆత్మబంధువులవలె చూడలేరనీ స్పష్టం. ఏమనగా, వారు తమ ప్రేమకు ఒక సరిహద్దుగోడను సృష్టించుకున్నారు. తమ కుటుంబం పెద్దదైనకొలదీ విశ్వప్రేమకు వారు మరింత దూరమైపోతారు. అందువలన అహింసాధర్మానికి లోబడి నడచుకొనదలచినవారు వివాహ బంధ

నంలో పడలేరు. వివాహ బంధనానికి వెలుపల విషయ సంతృప్తి అనేది అసలే వారి వల్లకాదు.

అయితే, ఈవరకే వివాహితులైనవారి సంగతేమిటి? వారు ఇక ఎన్నటికీ సత్యసిద్ధి పొందలేరా? వారు ఇక ఏనాటికీ మానవసంఘ మనే దేవాలయవేదికపై తమ సర్వస్వమును సమర్పితం చేయలేరా? వారికి ఒక ముక్తిమార్గం వుంది. వారుకూడా వివాహం కానివారివలె ప్రవర్తించవచ్చును. ఈ సౌఖ్యస్థితిని అనుభవించినవారు నామాటలను బలపరచగలరు. నా ఎరికలో చాలామంది ఈ సాధనాప్రయోగాన్ని ఆచరణలో పెట్టి లాభం పొంది వున్నారు. వివాహితులైన దంపతులు ఒకరియెడల ఒకరు సోదరసోదరీభావం అలవరచుకోసగలిగితే వారు విశ్వజనీనమైన సేవాధర్మాన్ని ఆచరించడానికి స్వతంత్రులౌతారు. లోకంలోని స్త్రీలందరూ తనకు అక్కచెల్లెళ్ళుగా, తల్లులుగా, కుమార్తెలుగా తలపోసే భావనయే మనిషికి వెంటనే పవిత్రత నొసగి, సంకెలలను త్రెగ్గొడుతుంది. ఇందులో భార్యాభర్తలకు పోయేదేమీ లేదుగదా, అది వారికీ వారి కుటుంబాలకీ కూడా లాభకరంగా వుంటుంది. వారి ప్రేమ మోహకాలుష్యంనుంచి విముక్తమౌతుంది ; అందువల్ల బలతరమౌతుంది. ఈ కాలుష్యం మాయంకాగానే, వారు ఒకరికొకరు ఎక్కువ సహకారకులు కాగలుగుతారు ; అంతేకాక, వారిద్దరిమధ్యా వివాదావకాశాలుకూడా తక్కువౌతాయి. ప్రేమ స్వార్థపరమూ, పరిమితమూ అయినప్పుడే వివాదాలకు ఎక్కువ అవకాశాలు వుంటాయి.

ముందు పైనచేసిన సమాలోచనయొక్క విలువ గ్రహిస్తే, తర్వాత ఇంద్రియనిగ్రహం వలన కలిగే లాభాల విషయం చర్చనీయాంశ మవుతుంది. ప్రాణాధారశక్తిని బుద్ధిపూర్వకంగా విషయసుఖానికి వెచ్చించడం ఎంత తెలివి తక్కువ పని! స్త్రీపురుషుల శారీరక మానసికశక్తులయొక్క పూర్ణపరిణతికి ఉద్దేశింపబడిన దానిని భౌతికసంతృప్తికి ధార పోయుట గొప్ప దుర్వినియోగ మనిపించుకుంటుంది. అట్టి దుర్వినియోగమే అనేక రోగాలకు మూలకారణ మవుతుంది.

ఇతరములైన అన్ని నియమములవలెనే బ్రహ్మచర్యం కూడా మనోవాక్కర్మలలో పరిపాలించవలసిన విషయం. పైకిదైహికనిగ్రహం చూపుతూ, మనస్సులో చెడుతలపులను పోషించే బుద్ధిహీనుడు విఫలసాధకు డౌతాడని గీతావాక్యం. అనుభవజ్ఞానం కూడా ఆ వాక్యాన్ని బలపరుస్తుంది. ఒక దిక్కున మనస్సును తప్పుదారుల పోనిస్తూ, మరొక దిక్కున దేహాన్ని త్రొక్కిపెట్టడం హానికరంకూడా కాగలదు. మనస్సు ఏదారిని పోతే ఆ దారినే చివరికి దేహంకూడా అనుసరించవలసి వుంటుంది.

ఇక్కడ ఒక ముఖ్యమైన తేడా గమనించడం అవసరం. మనస్సులో కలుషభావాలకు మనం బుద్ధిపూర్వకంగా తావొసగడం ఒక విషయం; మనం ఎంతప్రయత్నించినా లొంగక మనస్సు తనంతతానే తప్పుదారి త్రొక్కడం వేరు విషయం. మనస్సుయొక్క దుర్విషయ సంచారాలతో మనం

సహాయనిరాకరణం అవలంబిస్తే, తుదకు విజయం మనదే అవుతుంది.

మన జీవితంలో ప్రతిక్షణం, దేహం మన చెప్పుచేతలలో వున్నా, మనస్సు వుండకపోవడం మనకు అనుభవమవుతూనూ వుంటుంది. ఈ దైహిక నిగ్రహాన్ని వదలకుండానే, దానితోపాటు మనస్సును కూడా వశపరచుకోనడానికి నిత్య సాధన చేస్తూనే వుండాలి. అంతకంటె ఈ విషయంలో మనం చేయగలిగిన ఎక్కువ తక్కువ లేమీలేవు. మనస్సుకి మనం దారివదలితే, దేహమొకవంకా మనస్సింకొక వంకాలాగి, మనం ఆత్మవంచన పాలౌతాము. కలుషభావనలను దరిజేరనీయకుండా నిగ్రహించుకుంటూ వున్నంతకాలం, దేహమూ మనసూ, సామరస్యంతో నడుస్తున్నట్లు భావించవచ్చును.

బ్రహ్మచర్యసాధన కష్టతరమనీ, సుమారుగా అసాధ్యమనీ ఒక నమ్మకం వుంది. ఈ నమ్మకానికి హేతు విచారణ చేసి చూస్తే, బ్రహ్మచర్యం అనేపదం చాలా సంకుచితార్థంలో తీసికొనబడినట్లు స్పష్టమవుతుంది. వట్టి జాంతవ ప్రకోపనిగ్రహం ఒక్కటీ బ్రహ్మచర్య సాధనకు సమానార్థకంగా భావింపబడుతూ వచ్చింది. ఈ అభిప్రాయం అసంపూర్ణమనీ, పొరపాటనీ నాకు తోస్తుంది. సర్వజ్ఞానేంద్రియ నిగ్రహమే బ్రహ్మచర్యం. ఒక ఇంద్రియాన్ని మాత్రమే వశంవద మొనర్చుకుని, మిగినవాటిని స్వతంత్రంగా వదలిన వాడు విఫలప్రయత్నుడు కాకతప్పదు. ఒకవంక లాలసాసూచకములైవ కథలను చెవులతో వింటూ, మోహోజనకము

లైన దృశ్యాలను కన్నులతో చూస్తూ, ఉద్రేక కారకములైన పదార్థములను నాలుకతో చవిచూస్తూ, కామప్రకోప హేతువులైన వస్తువులను చేతులతో స్పృశిస్తూ, మరొకవంక ఆ సమయాన్నే మిగిలిన ఆ ఒక్క ఇంద్రియాన్ని మాత్రం నిగ్రహింప యత్నించడం నిప్పులో చేతులుపెట్టి కాలకూడ దన్నట్లుగా వుంటుంది. అందువలన ఒక ఇంద్రియమును నిగ్రహించుటకు నిశ్చితుడైనవాడు మిగిలినవాటిని కూడా నిగ్రహించుటకు దృఢనిశ్చితుడు కావాలి. బ్రహ్మచర్యమను మాటకు చేయబడిన సంకుచిత నిర్వచనంవల్ల చాలా హాని కలిగిందని ఆదినుంచీ నా అభిప్రాయం. అన్నిదిక్కులా ఒకే సారి మనం ఆత్మనిగ్రహం అవలంబించినయెడల, అది శాస్త్ర పద్ధతిని జరిగిన ప్రయత్న మవుతుంది ; నెరవేరడానికి సాధ్యత కలిగివుంటుంది.

బ్రహ్మచర్యపదానికి మూలార్థం ఒకసారిజ్ఞప్తికి తెచ్చు కుందాం. చర్య అనగా ప్రవర్తనామార్గము అని అర్థం. బ్రహ్మ-చర్య అంటే బ్రహ్మ లేక సత్యమును కనుగొనుటకు అనుకూలమైన ప్రవర్తన. ఈ ప్రతిపదార్థమూలకంగా సర్వేం ద్రియ నిగ్రహం అనే విశిష్టార్థం పుడుతుంది. కామ విష యానికి మాత్రమే పరిమితమైన అసంపూర్ణ నిర్వచనాన్ని మనం పూర్తిగా విస్మరించాలి.

'యెర్వడా మందిర్' నుంచి, 1945, పే. 10-14.

బ్రహ్మచర్యము యొక్క ప్రపూర్ణావలంబన మనగా బ్రహ్మమును తెలియుటయే, అనే జ్ఞానాన్ని నేను శాస్త్ర

గ్రంథపరిశీలనం వల్ల పొందలేదు. అది స్వానుభవఫలితం గానే నాలో క్రమక్రమంగా పెంపొందింది. అటు పిమ్మట కొంత కాలానికి ఆ విషయమై శాస్త్ర గ్రంథావలోకనం చేశాను.

ఆత్మకథ, 1948, పే. 257.

కామేచ్ఛను పూర్తిగా విసర్జిస్తే తప్ప ఈశ్వర సాక్షాత్కారం సాధ్యంకాదు. యంగిండియా, 24-6-'26, పే. 230,

పురుషునికిగాని, స్త్రీకిగాని కామేచ్ఛను నిగ్రహించుటయే ఉత్కృష్టసాధన. కామేచ్ఛను జయిస్తేనేగాని మానవుడు ఆత్మపరిపాలనా సమర్థుడు కాలేడు. ఆత్మపరిపాలనా శక్తివుంటేతప్ప స్వరాజ్యంకాని, రామరాజ్యంకానివుండదు. తన్ను దాను పాలించుకోలేనివాడు అందరినీ పాలించడమనేది రంగుపూసిన బొమ్మమామిడిపండులా వంచనా సదృశమూ, అసంతృప్తికరమూ అవుతుంది. పైన చూచుటకు ముచ్చటగా వుండి, లోన గుల్లగా కాళీగావుంటుంది. కామేచ్ఛపై నిగ్రహశక్తిలేని దేశసేవకు డెవరుగాని హరిజనసేవ, సంఘైక్యత, ఖాదీ, గోరక్షణ, గ్రామపునరుద్ధరణ కార్యాలకు నిజమైన సేవ ఏమాత్రమూ చేయలేడు. అట్టి గొప్ప ఉద్యమ కార్యాలకు ఒక్క మానసికశిక్షణ చాలదు; ఆధ్యాత్మిక సాధన, ఆత్మశక్తికూడా అవసరమవుతాయి. ఆత్మశక్తి దైవకృపవల్లనే కలుగుతుంది. కామేచ్ఛకు బానిస అయిన వారికొరకు దైవకృప దిగిరాదు.

హరిజన్, 21-11-'36, పే, 321.

బ్రహ్మచర్యానికి నాయొక్క నిర్వచనాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. ఒక్క ఇంద్రియమునో మరికొన్నిటినో అణచి పెట్టడమనికాక, అన్నిటిపైనను సంపూర్ణప్రభుత్వం కలిగి వుండడమే అని దాని అర్థం. ఈ రెండును మూలంలోనే భిన్నమైన స్థితులు. నా యొక్క ఇంద్రియము లన్నిటిని ఇవాళ అణచిపెట్టగలగవచ్చును; కాని వాటిని జయించడ మనేది యుగాలు పట్టవచ్చును. జయించుట అనగా వాటిని బానిసలవలె నా చెప్పుచేతలలో వుంచుకుని, నా పనులకు ఉపయోగించుట అని అర్థం. నా చెవులలోని పొరను సులభ మైన బాధలేని శస్త్రప్రయోగంవల్ల పొడుచుకుని, తద్వారా శ్రవణేంద్రియాన్ని అణచివేసికొనవచ్చును. కాని ఇది నిష్ప్ర యోజనమైనపని. అనవసర ప్రసంగములన్నను, అసభ్య సంభాషణము లన్నను, దైవదూషణ మన్నను అసహ్యాభావ ముతో మూతవడి, అమర్త్యసంగీతాలాపన మాలకించుటకు తెరచిపెట్టుకొని వుండునట్లు మన శ్రవణేంద్రియమును సుశి క్షిత మొనర్చుకోవాలి. అప్పుడది వేలకొలది మైళ్ళదూర మున వెలివడు శరణార్థుల సుదూరాక్రందనమునైనను విన గలదు. భక్తరామదాసు ఆ విధంగా విన్నట్లు చెప్పుకుంటారు. ఇక జననేంద్రియముల వినియోగమెట్లు? మనకు చెందిన పరమసృష్టికారకమైన శక్తిని మన దేహాలకు ప్రతికృతులను సృష్టించుటనుంచి మళ్లించి, దానిని సకలజీవలోక శ్రేయస్క రములైన నిర్మాణాత్మక కార్యసృష్టికి వినియుక్తం చేయాలి.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 257-58.

## బ్రహ్మచర్యమునకు సాధనములు

ఒక మిత్రు డిలా వ్రాస్తున్నాడు :

'నేను దుర్భరవ్యథలో వున్నాను. ఆఫీసులో వున్నా, రోడ్డుమీదవున్నా, రాత్రయినా, పగలైనా, చదువుకుంటు న్నప్పుడూ, పనిచేస్తున్నప్పుడూ, చివరికి ప్రార్థన చేసుకుంటు న్నప్పుడుకూడా, విషయలాలసాపూరితమైన భావాలు నన్ను ఆవహించి బాధిస్తున్నాయి. దారితప్పి తిరిగే మనస్సును నిగ్రహించడం ఎలాగ ? ప్రతి స్త్రీయెడల మాతృభావం ఎలా అభ్యసించడం ? పవిత్రతమమైన ప్రేమను చూపులలో ప్రసరించడం ఎలాగ ? చెడు తలపులను నిర్మూలించడ మెలాగ ? మీరు బ్రహ్మచర్యంపై వ్రాసిన పత్రికావ్యాసం నా ముందరే వుంది (చాలా యేండ్ల క్రితం వ్రాసినది.) కాని అది నాకు సహాయపడ్డం లేదు.

ఈ పరిస్థితి చాలా హృదయవిదారకంగా వుంది. అలాంటి వేదన పడేవారు చాలామంది వుంటారు. మనస్సు చెడుతలంపులతో నిరంతర సమరం సాగిస్తున్నంత కాలం నిరాశపడనవసరం లేదు. కన్ను నేరం చేస్తే దానితో చూడ కూడదు. చెవి అపరాధం చేస్తే దానితో వినకుండా ఊరు కోవాలి. ఎప్పుడూ క్రిందిచూపులతో నడవడం ఉత్తమం. అప్పుడవి అపమార్గాన్ని పోడానికి అవకాశం వుండదు. అసభ్యసంభాషణలూ, అసహ్యమైనపాటలూ నడిచే చోట్లకు పోవడం మానాలి. రుచులపై పూర్తిగా నిగ్రహం అలవరచు

కోవాలి. రసనేంద్రియాన్ని పూర్తిగా వశంవదం చేసికొన జాలనివాడు ఇంద్రియలాలసను జయించలేడు. రసనేంద్రియ నిగ్రహం కష్టతరమని నాకు తెలుసును. కాని రసనా నిగ్రహాన్ని సాధిస్తే, మిగిలిన ఇంద్రియాలు వాటంతట అవే వశంలోకి వస్తాయి. రసనా నిగ్రహానికి అనుసరించవలసిన విధులలో ఒకటి మసాలా ద్రవ్యములను పూర్తిగా పరిహరించడం. అది సాధ్యం కానప్పుడు, ఎంత తక్కువవాడితే అంత నయం. అంతకంటె కష్టసాధ్యమైన సూత్రమేమిటంటే, మనం తినే తిండి రసనేంద్రియసుఖానికి కాక, కేవల శరీర పోషణానికే అని భావించడం. మనం గాలిని సుఖానికి పీల్చం, ఊపిరి ఆడే నిమిత్తం పీలుస్తాం. దాహం తీరడానికే నీళ్ళు త్రాగుతాం. అట్లే కేవలం ఆకలి తీరడానికే ఆహారం తీసుకోవాలి; కాని చిన్నప్పటినుంచీ మనకు అందుకు విరుద్ధమైన అలవాటు ఏర్పడింది. మన తలిదండ్రులు మన పోషణ దృష్టినుంచి కాక, తమ ప్రేమాతిశయసంతృప్తికోసం మనకు వివిధములైన అభిరుచులు అలవాటు చేశారు. వారిగారాబం మనలను పాడుచేసింది. అందుమూలమున, మన పెంపకము వల్ల కలిగిన దుష్ఫలితాలను మనం ఎదుర్కొనవలసివుంటుంది.

అది అటుండగా, ఇంద్రియసుఖాపేక్షను వశం చేసుకోడానికి ఇంకొక సూక్ష్మమార్గం వుంది. అది దివ్యమైన రామనామధ్యానం. అటువంటి వేరొక మంత్రాన్నిధ్యానం చేసినా చేయవచ్చును.

ఎవరి మనసుకి నచ్చిన మంత్రాన్ని వారే నిర్ణయించు కోవాలి. చిన్ననాటినుంచీ నాకది అభ్యాసం కావడంవల్లా, దానివల్ల నేను బలపోషణలు పొందివున్నందునా, నేను రామనామం సూచించాను. ఏ మంత్రాన్ని నిర్ణయించు కున్నా, దానిని స్మరించేటప్పుడు అందులో మన మనస్సు పూర్తిగా విలీనం కావాలి. ఇతర ఆలోచనలు మన ఏకాగ్రతను భంగంచేస్తూవున్నా, ఆవిధంగా నామస్మరణ అభ్యసిస్తే, చివరకు తప్పక విజయం చేకూరుతుందని నేను నిస్సందేహంగా చెప్పగలను. ఆ మంత్రమే మన బ్రతుకునకుదీప్తి ఒసగుతుంది; బాధలన్నిటినీ తొలగిస్తుంది. అట్టిపవిత్రమైన మంత్రాలను లౌకిక లాభాలకు ఎన్నడూ వినియుక్తం చేయ కూడదు. కేవలం నీతిమార్గావలంబనకు మాత్రమే వాటిని ప్రయుక్తంచేస్తే, అద్భుతమైన ఫలసిద్ధి చేకూరుతుంది. ఆ మంత్రాన్ని చిలుకపలుకువలె రిత్తగా ఉచ్చరిస్తే ఏమీ లాభంలేదు. మన ఆత్మను పూర్తిగా అందులో నిమగ్నం చేయాలి. చిలుక దానిని ఉత్త యంత్రంలా పలుకుతుంది. మనం చెడు తలపులను దరిజేరనీయకుండుటకునూ, అట్టి ఫల సిద్ధి ఆ మంత్రశక్తివల్ల చేకూరగలదనే పూర్ణవిశ్వాసం తోనూ, నామస్మరణం చేయాలి.

యంగిండియా, 5-6-'24, పే. 186-87.

బ్రహ్మచర్య దీక్షాపాలనకు ప్రథమనియమం రసనేంద్రియనిగ్రహం. రుచిసుఖాపేక్షను పూర్తిగా నియమబద్ధం చేయడమనేది ఈ దీక్షాచరణంలో నాకు చాలా సహాయ

పడింది. అందువల్ల నేనిప్పుడు నా ఆహారవిధాన ప్రయోగా లను, ఒక్క శాకాహారదృష్ట్యామాత్రమే కాకుండా, బ్రహ్మ చర్య దృక్పథంనుంచి కూడా సాగించగలుగుతున్నాను. ఈ ప్రయోగాల ఫలితంగా బ్రహ్మచారిఅగువాని భోజనం మిత మైనదిగాను, సామాన్యమైనదిగాను, వాసనద్రవ్యరహితం గాను, సాధ్యమైనంతవరకు అపచనంగాను వుండవలెనని గమనించాను.

అప్పుడే కోసినపండ్లు, కాయపప్పులూ బ్రహ్మచారికి ఉత్తమాహారములని నేను ప్రయోగసాధనలో గడిపిన నా ఆరేండ్ల అనుభవంవల్ల తెలుసుకున్నాను. నేను ఈ విధమైన ఆహారంమీద గడిపిన కాలంలో విషయవాంఛావిముక్తి అనుభూతమైనంతగా ఆ ఆహారవిధానం మారిన తర్వాత అను భూతం కాలేదు. నేను దక్షిణాఫ్రికాలో పండ్లు, పప్పులు మాత్రమే ఆహారంగా గడిపిన కాలంలో, బ్రహ్మచర్యపాల నకు బ్రహ్మప్రయత్నం ఏమీ అవసరంలేకుండానే కొన సాగించగలిగాను. అంతేకాక, నేను పాలు తీసికొనడం ప్రారంభించినది మొదలు అది మరింత కష్టసాధ్యం అవుతూ వచ్చింది.

బ్రహ్మచర్యానికి బాహ్యసాధనంగా యోగ్యాహార, మితాహారనియమాలు ఎంత అవసరమో, నిరాహారనియమం కూడా అంత అవసరం. ఇంద్రియలాలస చాలా బలవత్తర మైనది. అన్ని దిక్కులనుంచీ, పైనుంచీ క్రిందనుంచీ, నొక్కి పెట్టినగాని అవి చెప్పుచేతలకు లొంగవు. నిరాహారంవల్ల

ఇంద్రియాలు దుర్బలమవుతాయన్నమాట అందరికీ తెలిసిన విషయమే. అందువల్ల, ఇంద్రియనిగ్రహార్థం ఆచరించబడిన నిరాహారనియమం చాలా ఉపకరిస్తుందని నిస్సందేహంగా చెప్పగలను. కొందరి విషయంలో ఉపవాసం నిరుపయోగమవుతుంది. ఉత్త బాహ్యమైన నిరాహారాభ్యాసంతో నిగ్రహం సిద్ధించగలదనే అభిప్రాయంతో వారు శరీరాన్ని మాత్రం మాడ్చి, మనస్సుకి షడ్రసోపేతమైన విందుభోజనం పెడతారు. వారి మనస్సు ఎంతసేపూ, ఉపవాసం పూర్తికాగానే ఏమి తిందుమా, అనే విషయాలను గురించే ఆలోచిస్తూ వుంటుంది. అట్టి ఉపవాసం రసనేంద్రియమునుగాని, విషయలాలసనుగాని నిరోధించుటకు సహకరించదు. పస్తుపడివున్న శరీరంతో మనస్సుకూడా కలిసివస్తే తప్ప, అనగా శరీరానికి నిరాకరింపబడిన వస్తువులయెడల మనస్సుకూడా అయిష్టతను అలవరచుకుంటేనే, నిరశనచర్య లాభకరమవుతుంది. ఇంద్రియలాలసత్వానికి మనస్సే మూలకందము. దైహికంగా ఉపవసిస్తున్న మనిషి మానసికంగా లాలసాప్రకోపితుడగుటకు వీలుండుటవలన, నిరశనాభ్యాసం పరిమితప్రయోజనాన్ని మాత్రమే కలిగివుంటుంది. అయితే, బ్రహ్మచర్యమునకు విషయవాంఛా నిర్మూలనం అవశ్యకర్తవ్యమైతే విషయవాంఛా నిర్మూలనమునకు ఉపవాసం అవశ్యసాధనమని మాత్రమే చెప్పవచ్చును.

పైన వివరించినరీతి నిబంధనలయొక్క ఆవశ్యకతను నేను దినదినం అధికాధికంగా అనుభూతం చేసుకుంటు

న్నాను బ్రహ్మచర్యసాధనకు ఏ విధంగా అవధిలేదో, అట్లే విసర్జనాసాధ్యమైన విషయాలకున్నూ అంతులేదు. అట్టి బ్రహ్మచర్యం పరిమిత ప్రయత్నసాధ్యమైనదికాదు. అనేకుల కది కేవలం ఒక ఆదర్శంగానే నిలిచిపోవలసివుంటుంది. బ్రహ్మచర్యం పరమాశయంగా కలవాడు నిత్యం తన లోపాలను మననం చేసుకుని, తన హృదయంలో మూలమూలలా దాగివున్న లాలసలను వెదకిపట్టుకొని, వాటిని వదలించుకొనుటకు నిరంతరయత్నం సలుపుతాడు. భావసంచారం సంపూర్తిగా ఇచ్ఛాధీనం కానంతవరకు, పూర్ణబ్రహ్మచర్యం అలవడలేదన్నమాటే. అప్రయత్నపూర్వకమైన ఆలోచనా ప్రసారం మనస్సుయొక్క గుణం. కావున ఆలోచనలను అణచిపెట్టడమంటే మనస్సుని అణచిపెట్టడమన్నమాట. గాలిని అణచిపెట్టుటకంటె స్వభావచంచలమైన మనస్సును త్రొక్కిపెట్టుట ఎక్కువ దుష్కరమైన పని. అయినప్పటికీ, మనలో అంతర్యామిగావున్న పరమేశ్వరుని ప్రభావమే మనోనిగ్రహాన్ని సుసాధ్యం చేయగలదు. అది కష్టసాధ్యం కావడంబట్టి కేవలం అసాధ్యమని ఎవరూ భావించ నవసరం లేదు. అది మహోన్నత లక్ష్యం. అట్టి లక్ష్యసిద్ధికి మహోన్నత ప్రయత్నం అవసరం కావడంలో ఆశ్చర్యమేమీలేదు.

నేను దక్షిణాఫ్రికానుంచి భారతదేశానికి వచ్చిన పిదపనే, అట్టి బ్రహ్మచర్యం కేవల మానవప్రయత్నంవల్ల సాధ్యంకాజాలదని తెలుసుకున్నాను. అంతవరకూ, సకలో

ప్రదేశాలనూ నిర్మూలన మొనరించుటకు ఒక్క ఫలాహార సేవనం చాలునని అపోహపడుతూ వచ్చాను. అందువల్ల, నేనిక చేయవలసినదేమీ లేదుకదా అని సంతోషపడుతూ వచ్చాను.

వచ్చే అధ్యాయం నా యొక్క క్లిష్టసాధనావిషయిక మైనదిగా వుంటుంది కనక, ఇక్కడ ఇంతకంటె వివరించ వలసిన పనిలేదు. బ్రహ్మజ్ఞానం నిమిత్తం బ్రహ్మచర్యం అవలంబించేవారు, తమ ప్రయత్నంలో తమకువున్న ఆత్మ విశ్వాసంతో సమానంగా ఈశ్వరవిశ్వాసం కూడా కలిగివున్న పక్షంలో, నిరాశపొందవలసిన కారణంలేదని మాత్రం ఈ లోగా స్పష్టపరచగలను. పరమేశ్వరుని నామప్రభావమూ, పరమేశ్వరుని కృపాకటాక్షమూ మాత్రమే మోక్షసాధకునికి చిట్టచివరి ఆధారం. ఆత్మకథ, 1948, పే. 256-60.

ఉద్రేకాలను అణచుకొన గోరేవారికి మాంసాహారం అయోగ్యమనే విషయం అనుభవజ్ఞానంవల్ల రుజువైనదే. శీలనిర్మాణం విషయంలోగాని, దైహిక నిగ్రహం సందర్భం లోగాని, ఆహారనియమాలకు అతిశయప్రాధాన్యం ఇవ్వడం పొరపాటవుతుంది. యోగ్యాహారం ముఖ్యమే; అశ్రద్ధ వహించవలసినది కాదు, అయితే, ఆహారవిషయంలో నిర్నియమంగా వుండి ఇష్టతృప్తిని విచ్చలవిడిచేయడం ఎంత తప్పో, ఆహారంలోనే మతమంతా ఇమిడివున్నట్లు భారత దేశంలో సామాన్య ప్రచారంలోవున్న అభిప్రాయంకూడా అంతే తప్పు. యంగిండియా, 7-10-'26, పే. 347.

## బ్రహ్మచర్యసాధనకు సోపానములు

దాని ఆవశ్యకతను గుర్తించడమే అందుకు మొదటి మెట్టు. తర్వాతది క్రమాగతమైన ఇంద్రియ నిగ్రహం. బ్రహ్మచారికి రసనేంద్రియ నిగ్రహం తప్పనిసరిగా అవసరం. సుఖానికి కాక, ప్రాణపోషణకు కావలసినమాత్రమే భుజించాలి. నిర్మలమైన దృశ్యాలనే చూడాలి; కలుషదృశ్యాలు ఎదురైతే కండ్లుమూసుకోవాలి. అందుకనే దానివైపూ దీనివైపూ చంచల వీక్షణాలు పరపుతూ నడవడంకంటె, భూమివైపు చూస్తూ అధోవీక్షణాలతో నడవడం మర్యాద ప్రవర్తనగా పరిగణింపబడుతుంది. ఆ విధంగానే బ్రహ్మచారి అశ్లీలమూ, అపరిశుద్ధమూ అయిన దేదీ వినడు; ప్రకోపహేతువులైన గాటు వస్తువులను వాసనచూడడు. కృత్రిమమైన అత్తరు ద్రావకాదుల సువాసనలకంటె పరిశుభ్రమైన మృత్తికాగంధం ఎంతో మధురతరమైనది. బ్రహ్మచర్యసాధకుడు మెలకువ గడియలలో కరచరణాలకు కూడా పని కల్పించాలి. అప్పుడప్పుడు నిరాహారాభ్యాసం కూడా అనుసరించాలి.

మూడవమెట్టు పరిశుద్ధమైన సాంగత్యం— శుద్ధమనస్కులైన మిత్రులతోనూ, శుద్ధభావప్రతిపాదకములైన గ్రంథాలతోనూ గడపాలి.

ఆఖరుదీ, అనల్పమైనదీ, ప్రార్థన. అతడు ప్రతిదినం పూర్ణహృదయంతో రామనామాన్ని జపించి, దైవకృపావృష్టి కొరకు వేడుకోళ్లు సమర్పించాలి.

వీటిలో ఏవిగాని సర్వసామాన్యులైన స్త్రీ పురుషుల కెవరికీ కష్టసాధ్యమైనవి కావు. అవి అతి సులభమైనవి. అయితే వాటి సౌలభ్యమే మనకు సంభ్రమహేతువవుతుంది. పట్టుదలవున్నచోట దారి సులభగోచరమే అవుతుంది. సాధారణంగా మనుష్యులకు పట్టుదలలోపించడంవల్లనే వారు నిష్ఫలంగా ప్రాకులాడుతారు. ఎక్కువ స్థాయిలోనో తక్కువ స్థాయిలోనో ప్రపంచమంతా బ్రహ్మచర్యంపైన లేకనిగ్రహ సూత్రపాలనంపైననే ఆధారపడివున్న సంగతినిబట్టే, దాని ఆవశ్యకతనూ సాధ్యతనూ గ్రహించవచ్చును.

యంగిండియా, 29-4-'26, పే 157-58.

పతంజలి అయిదు విధ్యుక్త ధర్మాలను నిర్వచించి వున్నాడు. ఈ యుగానికి అనుకూలంగా వుండగలందులకు గాను, ఆ అయిదు విధులును పదకొండు విధులుగా పెంచబడ్డాయి. అవి ఏమనగా, అహింస, సత్యము, అచౌర్యము, బ్రహ్మచర్యము, స్వార్థరాహిత్యము, భుక్తిశ్రమ, రసనానిగ్రహం, భయరాహిత్యం, సర్వమతసామరస్యం, స్వదేశ వస్తుస్వీకారం, అస్పృశ్యతానివారణం.

ఈ విధులన్నీ కూడా సమాన ప్రాధాన్యత కలిగినవే అని జ్ఞప్తివుంచుకొనడం మంచిది. ఒకటి భంగమైతే, అన్నీ భంగమైనట్లే. కావున ఈ విధులన్నీకలిసి ఒకే శిక్షణగా భావించడం ఆవశ్యకం. దీనినిబట్టి బ్రహ్మచర్యం యొక్క సంపూర్ణమైన అర్థమూ, విలువా అవగాహన చేసికొనవచ్చును.

హరిజన్, 8-6-'47, పే. 180

## జనన నిరోధము

జనన నిరోధంయొక్క అవసరాన్ని గురించి రెండు రకాల అభిప్రాయానికి ఏమీ అవకాశంలేదు. కాని అందుకు యుగయుగాలనుంచీ ప్రచారంలోవున్న ఏకైకవిధానం ఆత్మ నిగ్రహము లేక బ్రహ్మచర్యము మాత్రమే. దానిని ఆచర ణలో పెట్టినవారికి అది అపారలాభం కలిగించే సర్వశక్తివంత మైన దివ్యౌషధం. వైద్యశాస్త్రజ్ఞులు, జనన నిరోధానికి కృత్రిమసాధనాలను తయారుచేయుటకు బదులుగా, ఆత్మ నిగ్రహవిధానాన్ని కనిపెట్టినచో మానవజాతియొక్క కృతజ్ఞ తకు పాత్రులౌతారు. దైహికసంయోగము సంతానాన్ని పొందుటకేకాని, సుఖతృప్తికి ఉద్దేశింపబడినదికాదు. సం తానాభిలాష లేని సంయోగము అపరాధమనిపించుకుంటుంది.

కృత్రిమపద్ధతులు నేర్పడం అవినీతికి బహూకృతి సమ ర్పించినట్లుగా వుంటుంది. అవి స్త్రీపురుషులను విచ్చలవిడి చేస్తాయి. ఆ పద్ధతులకు ఇప్పుడొసగబడుతూవున్న గౌరవ స్థానం ప్రజాభిప్రాయబలంవల్ల వ్యక్తులపై ఏర్పడివున్న నిరో ధాలను అతి త్వరితంగా సడలింపజేయుటకు సాధనభూత మవుతుంది. కృత్రిమపద్ధతుల అనుసరణ నిర్వీర్యతనూ, నర ముల దౌర్బల్యమునూ కలిగిస్తుందని నిస్సందేహంగా చెప్ప చ్చును. ఆ విధంగా, రోగంకంటె దాని నివారణోపాయం ఎక్కువ అపాయకరంగా పరిణమిస్తుంది. తమ చేతలయొక్క ఫలితాలనుంచి తప్పించుకొనుటకు ప్రయత్నించుట అపరా

ధమూ, అవినీతీకూడా అవుతుంది. ఎక్కువ తినేదానికి కడుపు నొప్పి, ఉపవాసము అనుభవించడమే చాలా మంచిది. రుచి సౌఖ్యాన్ని అనుభవించి, దాని ఫలితాలను తప్పించుకొను టకు మందులు మాకులు తినడం అతడికి లాభకరం కాదు. విషయసుఖాన్ని అనుభవించి, తత్ఫలితాలను నిరాకరించడం మరీతప్పు. ప్రకృతి తిరుగులేనిది. తన నియమాలను ఆ విధంగా తప్పిన వారిపై పూర్తిగా పగతీర్చుకుంటుంది. నైతికనిగ్రహాలవల్లనే నైతికఫలితాలు కలుగుతాయి. మిగి లిన నిరోధపద్ధతులన్నీ అవి ఉద్దేశింపబడిన ప్రయోజనాలను అవే నిష్ఫలం చేస్తాయి. కృత్రిమపద్ధతుల అవలంబనకు మూలసమర్థనం ఇంద్రియ సుఖానుభవాన్ని జీవితావసరంగా భావించే వాదన. అంతకంటె తప్పువాదన ఇంకొకటుండదు. జననాలను నిబంధించడానికి ఉత్సాహపడేవారు ఆ పనికి పూర్వీకులు ఏర్పరచివున్న న్యాయసమ్మతమైన విధానాలను పరిశీలించి, వాటిని తిరిగి ప్రచారంలోకి తేవడానికి ప్రయ త్నించవలసినదని నా విజ్ఞప్తి. వారు ఈ విషయంలో చేయ దగిన ప్రారంభకృషి కావలసినంత వారిచేతులలోనేవుంది. జనసంఖ్య పెరుగుదలకు అల్పవయోవివాహాలు ఒక ప్రధాన కారణం. నిర్నిరోధసంతానాభివృద్ధి అనే దోషానికి నేటి కాలపు జీవితవిధానంకూడా చాలావరకు కారణం. ఈ కార ణాలను పరిశీలనచేసి, తగిన చర్యలు తీసుకుంటే, సంఘం నైతికంగా ఉన్నతస్థితికి వస్తుంది. ఉత్సాహోన్మాదులు తొం దరపాటుతో ఈ విషయాలను అశ్రద్ధచేసి, కృత్రిమపద్ధతులను

సామాన్యప్రచారంలోకి తెచ్చిన యెడల, నైతికపతనం తప్పదు. అనేక ఇతర కారణాలవల్ల ఈవరకప్పుడే దుర్బలమై పోయిన సంఘజీవితం ఈ కృత్రిమ విధానంవల్ల మరింత దౌర్బల్యపూరితం అయిపోగలదు. అందువల్ల, ఈ కృత్రిమ పద్ధతులను అనాలోచితంగా ప్రోద్బలపరుస్తున్నవారు ఈ విషయమై పునర్విమర్శ చేసుకుని, తమ విపత్కరమైన ఉద్యమాన్ని నిలుపుజేసి, అవివాహితులనూ వివాహితులనూ కూడా బ్రహ్మచర్యావలంబనమునకు ప్రోత్సహించడం శ్రేయస్కరంగా వుంటుంది. అది ఒక్కటే జనన నిరోధసాధనకు శ్రేష్ఠతమమూ, నీతివంతమూ అయిన విధానం.

యంగిండియా, 12-3-'25, పే. 88-89.

## (ఈ) నిరాస్తిపరత్వము లేక పేదరికము

ఆస్తి అనే మాటలో భవిష్యత్తులో రాగల అవసరాలకు నిలవచేసుకోవడమనే అభిప్రాయం గర్భితమైవుంది. సత్యసాధకుడూ, ప్రేమసూత్రానుసారీ అయినవాడు రేపటి నిమిత్తం ఏమీ మిగుల్చుకొనరాదు. దేవు డెన్నడూ మరు దివసానికి నిలవజేయడు. ఆ క్షణానికి కేవలం కావలసిన దానికి మించి సృష్టిచేయడు. అందువల్ల మనం దేవునిదయ మీద నమ్మకం పెట్టుకున్నవారమైతే, ఆతడు మనకు ఏదినానికి సరిపోయే దైనికభుక్తి (అనగా అప్పటికి అవసరమైన సర్వమూ) ఆ దినానికి తానే దయచేయగలడని విశ్వసించాలి. అట్టి విశ్వాసంమీద ఆధారపడి బ్రతికిన భక్తులూ, సాధ

కులూ ఆ విశ్వాసానికి రుజువును స్వానుభవపూర్వకంగా పొందివున్నారు. పరమేశ్వరుని దివ్యశాసనం ప్రకారంమాన వునికి దినదినమూ ఏకదినభుక్తిని పొందుటకు మాత్రమే హక్కు వున్నది కాని అంతకు మించిలేదన్న సంగతి తెలి యకపోవుట వల్లను, ఆ విధిని అనుసరించకపోవుట వల్లను సంఘంలోని అసమానతలూ, వాటి ఫలితములైన విధి దుర వస్థలూ తటస్థించి వున్నవి. ఒకవంక ధనికులవద్దచేరిన అధ నపు ద్రవ్యసముదాయం వారి అవసరాలకు మించివుండుట వల్ల అశ్రద్ధపాలై దుర్వ్యయమౌతుండగా, రెండవ వంక లక్షలాది మానవులు తిండిలేమికి బలిఅయి ప్రాణాలుకోల్పో తున్నారు. ప్రతి ఒక్కరూ కేవలం తమ అవసరమైనంత మాత్రమే కలిగి వుండుటకు సంతృప్తులైవుంటే, ఎవ్వరూ లేమి పాలుకారు; అందరూ సంతృప్తితో బ్రతుకుతారు. ఇపుడున్న పరిస్థితిలో పేదలతో సమంగా ధనికులూ అసం తృప్తితో తపిస్తున్నారు. పేదవాడు లక్షాధికారి కావాలని కోరితే, లక్షాధికారి కోటీశ్వరుడు కావాలనే కోరికతో బాధ పడుతున్నాడు. లోకమంతటా సంతృప్తి భావాన్ని పరి వ్యాప్తం చేయాలంటే ధనికులు ముందుగా నిరాస్తిపరత్వ సిద్ధాంతాన్ని అమలులో పెట్టాలి. తమ స్వంత ఆస్తులను సామాన్య పరిమితిలో వుంచుకోడంవరకూ వారు దిగితే తిండిలేని వారికి సులభంగా తిండి కలుగుతుంది. అప్పుడు ధనికులతోపాటు పేదలుకూడా సంతృప్తి భావాన్ని అలవర చుకుంటారు. నిరాస్తిపరత్వమనే ఆదర్శాన్ని సంపూర్ణంగా

ఆచరించదలిస్తే పక్షులవలెనే మనిషికూడా తలదాచుకొనడానికి ఇళ్లు అవసరంలేకుండా, వస్త్రాచ్ఛాదనాలతో పనిలేకుండా, రేపటిదినం తిండికి ఇవాళ కూడబెట్టుకొనకుండా జీవించడానికి సంసిద్ధుడు కావాలి. అప్పుడు దైనిక భుక్తి మాత్రమే అతడికి అవసరముంటుంది. దానియొక్క లబ్ధికి కూడా తనపైకాక పరమేశ్వరునిపైననే ఆధారపడాలి. ఆ పరమాశయం ఎక్కడో ఏమహానుభావునికో ఒకనికి సాధ్యం కావచ్చును కాని, అందరికీ కాదు. మనవంటి సామాన్య సాధకులు ఇంత అసాధ్యంగా కనిపించే ఈ ఆదర్శాన్ని ఏ విధంగా ఆచరించగలరా అని భయపడనవసరంలేదు. దానిని పరమాశయంగా దృష్టిలో వుంచుకొని, ఆ ఆదర్శకాంతిలో మనకు చెందిన ఆస్తులను విమర్శపూర్వకంగా పరిశీలించుకొని వాటినితగ్గించుకొనుటకు ప్రయత్నిస్తే చాలు. నాగరకత అంటే అవసరాలను గుణించి పెంచుకోడం కాదు. దాని మూలర్థాన్నిబట్టి చూస్తే, అవసరాలను బుద్ధిపూర్వకంగానూ ఇష్టపూర్వకంగానూ తగ్గించుకొనడమే దాని అంతర్గతభావం. ఈ విధానమే సుఖసంతృప్తులను పెంపొందించ గలుగుతుంది; సేవాసామర్థ్యాన్ని అధికం చేస్తుంది.

ఈ విధంగా సంపూర్ణ పరిత్యాగం అనే ఆదర్శాన్ని చేరుకుంటాం. శరీరం నిలిచివున్నంతకాలం, సేవాచరణమే దాని పరమార్థమని తెలుసుకుంటాం. అప్పుడు భుక్తికిబదులు సేవాచరణమునే ఊతగర్రగా చేసుకుని జీవిస్తాము. తింటున్నా

 త్రాగుతున్నా, నిద్రిస్తున్నా మేల్కొనివున్నా, అన్నిటికీ సేవాచరణమే లక్ష్యభూతమవుతుంది. అట్టి మనో వైఖరి మనకు నిజమైన సౌఖ్యాన్ని తీసుకువస్తుంది. చిట్టచివరకు పరమానందసంధాయకమైన ఈశ్వర సాక్షాత్కారం కలిగిస్తుంది. ఈ దృక్పథంనుంచి మనమందరమూ ఆత్మపరిశీలనం అలవరచుకుందుము గాక.

ఈ నిరాస్తి పరత్వమనే సూత్రం బాహ్యవస్తువులకే కాక అంతర్భావాలకి కూడా వర్తిస్తుందని జ్ఞప్తివుంచుకోవాలి. మేధస్సును నిష్ప్రయోజనకరమైన విషయజ్ఞానంతో నించుకున్నవాడు ఈ అమూల్యసూత్రాన్ని ఉల్లంఘించినవాడవుతాడు. పరమేశ్వరుని దిశకు త్రిప్పనివీ, పరమేశ్వరునికి దూరంచేసేవీ అయిన ఆలోచనలు మన సాధనా మార్గానికి ఆటంకములౌతాయని తెలుసుకోవాలి.

'యెరవ్డామందిర్' నుంచి, 1945, పే. 23-26.

కొంతపాటి దైహికస్వాస్థ్యమూ, సౌకర్యమూ అవసరమేకాని, ఆ స్థాయికి మించినవన్నీ సహాయకమగుటకు బదులు ఆటంకాలుగా పరిణమిస్తాయి. అందువల్ల పరిమితిలేకుండా అవసరాలను పెంచుకొని, వాటిని సంతృప్తిపరచే నిమిత్తం అవస్థపడడం భ్రమప్రమాదములతోకూడుకున్నదని తెలుసుకోవాలి. అవి కేవలం దైహికమూ మానసికమూ అయిన లాలసగా దిగజారిపోకుండా జాగ్రత్తపడుటకుగాను మన దైహికావసరాలనూ కూడా ఏదో ఒక పరిమితిరేఖను దాట

కుండా గట్టిగా అదుపులో పెట్టుకోవడం చాలా అవసరం. మానవసేవమీదనే సర్వశక్తులనూ కేంద్రీకరించి, ఆ ఆదర్శానికి ప్రతిబంధకం కాని రీతిగా ప్రతి వ్యక్తీ తన దైహిక, సాంస్కృతిక పరిస్థితులను ఏర్పాటు చేసుకోవాలి.

హరిజన్, 29-8-'36, పే. 226.

నేను నిరాస్తిపరుణ్ణి. అయినప్పటికీ నేను బహుశా లోకంలోకల్లా ఐశ్వర్యవంతుడినైనట్లుగా భావించుకుంటాను. నా స్వవిషయంలోగాని, నా ప్రజాహితకార్యనిర్వహణంలో గాని నేనెన్నడూ లేమిని అనుభవించకపోవడమే దానికి రుజువు. నా ప్రజాహిత కార్యాలనిమిత్తం నావద్ద చివరిపైసా కూడా అయిపోయిన పరిస్థితులు చాలా ఎదుర్కొని వున్నాను. ఆయా సమయాలలో ఏ మాత్రమూ అనుకోని దిశలనుంచి నాకు ధనసహాయం చేకూరుతూ వచ్చింది. ఈ విధంగా దైవిక సహాయం లభించడం గమనించినప్పుడు నాలో వినమ్ర భావమున్నూ, పరమేశ్వరుని యెడలను పరమేశ్వరుని దయా స్వభావము యెడలను విశ్వాసమున్నూ పొంగిపొరలింది. నా జీవితంలో ఏనాడుగాని సంపూర్ణమైన నిస్సహాయస్థితి ఏర్పడినప్పటికీ, ఈ విశ్వాసం చెక్కుచెదరకుండా నిలువగలదని చెప్పగలను. అందువల్ల, నేను నా ఆస్తినంతనూ విసర్జించినందుకు లోకంనవ్వితే, అది నాకేమీ లోపంగా భావించను. నాకు మాత్రం ఈ నిరాస్తిపరత్వం తప్పక లాభకరమైనట్లే భావిస్తాను. నేను అనుభవించే సంతృప్తి ఇతరులెవరికైనా సాధ్యమేమో చూచుకోమంటాను. అదే

నాకున్న అమూల్యసంపద. అందుకని బహుశా, నేను ప్రబో
ధించేది పేదరికమైనా, నా ధనికత కేమీ లోపంలేదనిచెపితే
అది పొరపాటు కాదేమో అనుకుంటాను.

'దిస్ వజ్ బాపు', కర్త : ఆర్. కె. ప్రభు, 1954, పే. 120.

రాతియుగంకంటె ఉక్కుయుగం ఎక్కువ ఉన్నతిని
సూచిస్తుందన్న మాట. నా దృష్టినుంచి సందేహాస్పదమైన
విషయం. అట్టి ఉన్నతితో నాకు పనిలేదు. మనయొక్క
మేధశ్శక్తి, తతిమా అన్ని శక్తులూకూడా వినియుక్తం
కావలసినది కేవలం ఆత్మోన్నతిని సాధించుటకే అని
గ్రహించాలి. యంగిండియా, 13-10-'21. పే, 325,

## (ఉ) అచౌర్యం (అస్తేయం)

సత్యజ్ఞానమూ, ప్రేమభావమూ కలిగివున్నట్లు ఒక
వంక ప్రకటిస్తూ, ఆ సమయాన్నే మరొకవంక చౌర్యబుద్ధితో
వర్తించడమనేది అసంబద్ధమైనపని. అయినా మనలో ప్రతి
ఒక్కరమూ తెలిసిగాని, తెలియకగాని అంతో ఇంతో
చౌర్యబుద్ధితో వర్తిస్తూనే వున్నాము.

మనకు అవసరంకాని వస్తువును ఇంకొకరి వద్దనుంచి
వారి అనుమతితో పుచ్చుకున్నాగాని, అది చౌర్యమే అవు
తుంది. మనకు అవసరంకాని ఒక్కవస్తువునైనాసరే పొంద
కోరడం తప్పు. సాధారణంగా ఇటువంటి చౌర్యబుద్ధికి భుక్తి
లక్ష్యంగా వుంటుంది. నేను నాకు అవసరంకాని పండ్లను

సేవించినా, కేవలం అవసరమైన మితికి మించి వాటిని సేవించినా కూడా అది చౌర్యమే అవుతుంది. మనకు మనయొక్క నిజమైన అవసరాలను గురించిన పరిజ్ఞానం ఎల్లప్పుడూ వుండదు. అందున మనలో చాలామంది అనవసరంగా మన అవసరాలను పెంచుకుంటూ వుంటాం. తద్వారా మనకు తెలియకుండానే చౌర్యం ఆచరించినవాళ్లం అవుతూ వుంటాం. ఈ విషయమై తగినంత యోచనచేసి చూసుకుంటే మన అవసరాలలో చాలా భాగం తగ్గించుకోగలుగుతాము. అచౌర్యసూత్రం విషయమై సాధనచేసే వ్యక్తి తన అవసరాలను క్రమక్రమంగా తగ్గించుకోనడానికి ప్రయత్నిస్తాడు. లోకాన్ని ఈ క్షణం పీడిస్తూవున్న సకల దారిద్ర్యాలకూ ఈ అచౌర్య సూత్రంయొక్క ఉల్లంఘనలే మూల కారణం.

ఇంతకంటె సూక్ష్మతరమైనదీ, మానవత్వానికి పతన హేతువైనదీ ఇంకొకరకం చౌర్యం వుంది. ఇతరులకు చెందిన దేనినిగాని తనకు కావలెనని కోరడంగాని, దాని యెడల లోభదృష్టి కలిగివుండడంగాని మానసిక చౌర్యం అనిపించుకుంటుంది.

అచౌర్యసిద్ధాంతాన్ని పాలించదలచుకున్న ఏవ్యక్తిగాని భవిష్యత్తులో తాను చేయగల ఆర్జనవిషయమై ఏ మాత్రం పట్టించుకోడు. భవిష్యత్తు విషయికమైన ఈ పాపిష్టి ఆందోళనయే అనేక చోరకార్యాలకు మూలకారణం. ఇవాళ ఒక వస్తువు కావాలని కోరిక పుడుతుంది ; రేపు దాని సంపా

దనకై చర్యలు ప్రారంభిస్తాము; వీలైనంతవరకు న్యాయమైన పద్ధతిని ప్రయత్నిస్తాము; అవసరం కలిగితే కుటిల విధానాలను అనుసరించుటకు వెనుదీయము. భౌతికవస్తువులవలెనే మనోభావాలనుకూడా చౌర్యం చేయడానికి వీలుంది. అహంభావసంతృప్తి కొరకు నిజంగా తన బుర్రలో పుట్టని ఒక మంచి భావం తనకే తోచినట్టు చెప్పుకునే వారుంటారు. అట్టి పని భావచౌర్యం అవుతుంది. లోకచరిత్రలో అట్టి భావచౌర్యం పాలైన పండిత ప్రకాండులు చాలామంది కనిపిస్తారు.

అందున అచౌర్యసూత్రాన్ని ఆచరణలో పెట్టదలచుకున్నవాడు అడకువ, ఆలోచన, మెలకువ కలిగి, అవసరాలనూ, అలవాట్లనూ వీలైనంతవరకు తగ్గించుకొనుటకు యత్నించాలి.

'యెరవ్డా మందిర్' నుంచి, 1945, పే, 19-22,

మనమందరమూ కూడా ఒక విధంగా చోరులమే అని నా సూచన. నాకు తక్షణావసరంకానిది ఏది నేను సంపాదించినా, కలిగివున్నా, అది నేను ఇంకొకరినుంచి దొంగిలించినట్లే. ప్రకృతి మనయొక్క దైనికావసరాలకు సరిపోయినంత మాత్రమే దినదినమూ సృష్టిచేస్తుందనీ, అందులో ప్రతి ఒక్కరూ కేవలం తనకు అవసరమైనంతమాత్రమే పాలుపంచుకున్నయెడల ఈ లోకంలో దారిద్ర్యం అనేది వుండదనీ, ఈ లోకంలో ఎవరుగాని తిండిలేని హేతువున ప్రాణాలు వదలవలసిన పనిలేదనీ నేను ధైర్యంగా చెప్పగలను. కాని

ఎంతకాలమైతే ఈ అసమానత వుంటుందో అంతకాలమూ మనం చౌర్యంచేస్తున్నామనే అర్థం. నేను సమాజవాదిని కాను. ఆస్తిపరులను నిరాస్తిపరులొనర్చాలనే అభిప్రాయం నాకు లేదు. అయితే మనలో ఎవరైతే ఈ అంధకారపరిస్థితిలో వెలుగును చూడగోరుతారో వారు ఈ సూత్రాన్ని వ్యక్తిగతంగా అనుసరించవలసి వుంటుందని మాత్రం నొక్కి చెపుతాను. నేను ఎవరి ఆస్తులనుగాని ఊడలాగివేయవలెనని కోరను. అట్లు కోరితే అహింసా సూత్రాన్ని ఉల్లంఘించినవాడినవుతాను. ఎవరైనా నా కంటె ఎక్కువ కలిమికలవారుంటే, దానిని వుంచుకోమంటాను. కాని నా జీవితవిధానానికి సంబంధించినంతవరకు, నేను నా అవసరానికి మించినది ఏ మాత్రంగాని కలిగివుండడానికి సాహసించనని చెప్పుకుంటాను. మన భారతదేశంలో ఒంటిభోజనంతో దినం వెళ్లబుచ్చేవారు ముప్పదిలక్షలమంది వున్నారు. మీరూ, నేనూ, అందరమూ వివేకబుద్ధితో వర్తించదలిస్తే, మన అవసరాలను తగిన రీతిగా సర్దుకొని, ఇష్టపూర్తిగా పస్తుండి అయినా, వారందరికీ పోషణ, తిండి, గుడ్డా కలిగేలాగ చూడవలసివుంటుంది.

మహాత్మాగాంధీ ప్రసంగాలు, రచనలు, పే. 384.

మనం అహింసాత్మకంగా జీవించదలిస్తే మానవులలో కల్లా దీనదరిద్రుడైన వ్యక్తికూడా భాగస్వామికానేరనిది ఏదిగాని మనం పొందడానికి ఆశించకూడదు.

'సిలోన్‌లో గాంధీజీతో', కర్త: మహాదేవదేశాయి, 1928, పే. 132.

# ఏడవ విభాగం

# నా మతగమ్యాలు

## 29

## మతం అన్ని జీవితరంగాలకూ వర్తించాలి

ఈ రోజులలో సర్వరంగాలలోని మానవోద్యమాలనూ సప్తస్వర సమ్మేళనంలాగున విడదీయరాని పరస్పర సంబంధంగల ఏకస్వరూపంగా భావించవలసి వుంటుంది. వాటిని సాంఘికమనీ, రాజకీయమనీ ప్రత్యేకమైన మత విషయిక కార్యక్రమ మనీ వేరువేరు సొరుగులలో సురక్షితంగా బంధించి వుంచడానికి వీలులేదు. మానవకార్యకలాపాలతో సంబంధం లేకుండా వేరే మతమనేది ఏమి వుంటుందో నాకు తెలియదు. మత మనేది మిగిలిన అన్ని కార్యోద్యమాలకూ నైతికమైన పునాది ఒసగుతుంది. మతం లేనిదే సర్వ కార్యాలూ పునాదిలేని నిర్మాణాలై పోయి, జీవితమంతనూ వట్టి 'అర్థంలేని వ్యర్థసటాటోపం'గా పరిణమింప జేస్తాయి.

హరిజన్, 24-12-'38, పే, 393.

మనము సత్యాహింసలను వ్యక్తిపరమైన ఆచరణ లక్ష్యాలుగా మాత్రమేకాక, కూటాలకూ సంఘాలకూ రాజ్యాలకూ కూడా ఆచరణీయమగునట్లు చేయాలి. కనీసం అది నా స్వప్నం. దానికి వాస్తవరూప మొసగే ప్రయత్నంలోనే నా జీవితం గడుపుతాను; దాని నిమిత్తమే నా ప్రాణాలు విడుస్తాను. నా విశ్వాసబలం దినదినమూ నూతనసత్యాలను

కన్గొనుటకు నాకు సహాయపడుతుంది. అహింస ఆత్మలక్షణం; అందువ అది సర్వులూ సర్వజీవిత వ్యవహారాలలోనూ ఆచరణీయంగా భావించదగినది. అన్ని శాఖలల్లోనూ అది ఆచరణ సాధ్యంకాని పక్షంలో దానిలో ఏమీా వాస్తవ మూల్యం లేదన్నమాట.

హరిజన్, 2-3-'40, పే. 23.

## 30

# సాంఘిక రంగంలో—

## అందరు మానవులూ సమానులే

నా అభిప్రాయంలో జన్మరీత్యాగాని, ఆర్జనరీత్యాగాని ఒకరికంటె ఒకరికి ఆధిక్యత ఏమీా లేదు. నేను కేవలమైన అద్వైత సిద్ధాంతాన్ని నమ్ముతాను. నా అద్వైత నిర్వచనంలో ఏ పరిస్థితిలోగాని, ఏ విధమైన తరతమభేదానికిగాని ఏ మాత్రంగాని స్థానం లేదు. అందరు మనుష్యులూ కేవలం సమానులుగా పుట్టారని నా పూర్ణవిశ్వాసం. భారత దేశంలోగాని, ఆంగ్ల దేశంలోగాని, అమెరికాలోగాని, ఎవరు ఎక్కడ పుట్టినా — ఏ పరిస్థితులలో పుట్టినా — ఒకరు ఎట్టి ఆత్మను కలిగివుంటారో అందరూ అట్టి ఆత్మలనే కలిగి వుంటారు. ఈ విధంగా సర్వమానవులయొక్క అంతర్గత సమానతలో నాకు నమ్మకం వుండబట్టే, మన పాలకులలో చాలామంది గర్వంతో తమకు ఆపాదించుకునే ఆధిక్యతా సిద్ధాంతాన్ని నేను ఎదుర్కొంటున్నాను. ఈ ఆధిక్యతా సిద్ధాంతాన్ని నేను దక్షిణాఫ్రికాలో అడుగడుగునా ఎదుర్కొని

పోరాటం సలిపాను. ఆ అంతర్గత విశ్వాసంవల్లనే నన్ను నేను తోటీపనివానితో, నూలువడుకువానితో, నేతపనివానితో, కృషికునితో, కూలివానితో సమాన మొనర్చుకుని ఆనందిస్తాను. జన్మతః కాని, అనంతరార్జితజ్ఞాన హేతువునగాని, తమకు ప్రత్యేకాధిక్యతను ఆపాదించుకునే బ్రాహ్మణులను కూడా ఎదుర్కొని పోరాడాను. ఏ వ్యక్తిగాని తన తోడి మానవునికంటె తనకు ఆధిక్యతను ఆపాదించుకొనుట నేను అమానుషంగా భావిస్తాను. ఏ వ్యక్తిగాని ఇతరులకంటె తనకు ఆధిక్యతను ఆపాదించుకొనగానే, ఆతడు తన మానుషత్వాన్ని కోల్పోతాడు. ఇది నా అభిప్రాయం.

యంగిండియా, 15-12-'33, పే. 3

రూపాలు అనేకం, కాని వాటన్నిటికీ అంతరాత్మ ఒక్కటే. సర్వవ్యాప్తమూ మూలకందమూ అగు సమైక్యత యొక్క ఆలింగనంలో ఈ బాహ్యస్వరూపాలన్నీ ఇమిడి వున్నప్పుడు వాటిమధ్య తరతమభేదాలకు ఏ విధంగా తావుంటుంది? ఈ సత్యం దైనందిన వాస్తవజీవితంలో అడుగడుగునా గోచరమవుతూవున్న విషయమే. ఈ అంతర్గర్భితమైన సమైక్యభావాన్ని నిరూపించడమే అన్ని మతములకు పరమావధి.

హరిజన్, 15.12-'33, పే. 3.

## వ్యక్తిత్వము ; సాంఘికబాధ్యత.

వ్యక్తిస్వాతంత్ర్యాన్ని నేను విలువగానే పాటిస్తాను; కాని మానవుడు ప్రధానంగా సంఘజీవి అన్నమాట మరవ

డానికి వీలులేదు. మానవుడు తన వ్యక్తిత్వాన్ని సంఘం యొక్క ప్రగతిసాధనకు అనుకూలంగా సర్దుకుంటూవుండడం ద్వారానే, ఆతడు తన ప్రస్తుతస్థాయికి పెరిగివున్నాడు. నిర్ని రోధపూర్వకమైన వ్యక్తిత్వం అడవిజంతువులు అనుసరించే చట్టం. మనం నేర్చుకోవల్సినది వ్యక్తిస్వాతంత్ర్యానికీ సాంఘిక నియమనిబంధనలకూ మధ్యేమార్గం. యావత్సంఘ సంక్షేమసాధనార్థమై సాంఘికనియమాలకు ఇష్టపూర్తిగా కట్టుబడివుండడమనేది వ్యక్తికీ, ఆతనికి మాతృక అయిన సంఘానికీ కూడా శ్రేయస్కరమవుతుంది.

హరిజన్, 27-5-'39, పే. 144.

ఏ ఒక్క నీతిసూత్రంగాని కేవలం వ్యక్తి క్షేమానికీ ఉద్దేశింపబడినదిగాగాని, అందువల్లనే సంతృప్తిపొందునదిగా గాని వుండదు. అట్లే, దానికి ప్రతిగా, ఏ ఒక్క నైతిక సూత్రోల్లంఘనయొక్క దుష్ఫలితాలుగాని అందుకు కారణ భూతుడైన వ్యక్తితోపాటు ఇతరులనేకులపైన కూడా ప్రత్య క్షంగానో పరోక్షంగానో ప్రసరించకుండా వుండవు. కావున ఒక వ్యక్తియొక్క మంచిచెడ్డలు కేవలం ఆతని వ్యక్తి సంబంధమైనవిగా మాత్రమే భావించడానికి వీలులేదు; నిజానికి అవి సంఘం యావత్తుకీ అవసరమైన విషయాలుగా పరిగ ణించబడాలి. అంతేకాదు, అవి యావత్ప్రపంచానికీ కూడా అవసర విషయాలే అవుతాయి.

ఎథికల్ రెలిజియన్, రచన: ఎం. కె. గాంధి, పే. 55.

సర్వమానవకోటిలోనే కాక సర్వజీవకోటిలోనూ కూడా సమైక్యభావం అంతర్గర్భితమైవున్నదని నా నమ్మకం. దానిని బట్టి, ఏ ఒక్కవ్యక్తి ఆత్మోన్నతిని ఆర్జించినా అది లోక మంతటికీ ఔన్నత్యదాయకమవుతుందనీ, ఏ ఒక్కవ్యక్తి పతనమైనా అది లోకమంతటికీ ఎంతోకొంత పతన హేతువుగా పరిణమిస్తుందనీ నేను నమ్ముతాను.

యంగిండియా, 4-12-'24, పే. 398.

# 31

## ఆర్థిక రంగంలో - ప్రేమయే ప్రాతిపదిక

మానవుడు ఆత్మఅనే చాలనశక్తితో నడిచే ఒక యంత్రంవంటివాడు. ఆ యంత్రముచేత వీలైనంత ఎక్కువ పని చేయించవలెనంటే భృతివల్లగాని, బలాత్కారంవల్ల గాని జరగదు. ఆ జీవికి చాలనకారకమైన ఇచ్ఛాశక్తిని లేక అంతరాత్మను, దానికి స్వభావానుగుణమైన ప్రోద్బలహేతువులతో, అనగా అనురాగభావాలతో శక్తివంతం చేసినప్పుడే ఆ ఫలితం చేకూరుతుంది. ఈ విషయంలో ఈ క్రింది సార్వత్రికసూత్రం వర్తిస్తుంది. ఒక అధికారినీ ఒక సేవకుణ్ణీ ఉదాహరణగా తీసికొని, వారిలో శ్రామికశక్తీ వివేచనా ఒకానొక పరిమాణంలో వున్నవని అంచనావేసుకుని, వాటివల్ల అత్యధికఫలితం సిద్ధించవలెనంటే, వారిరువురి మధ్యను విరోధభావంవలన కంటె అనురాగభావంవల్లనే అది ఎక్కువగా సాధ్యపడుతుంది. నిస్వార్థప్రవర్తనకే ఎక్కువ ప్రతిఫలం

చేకూరుతుంది. సేవకుని కృతజ్ఞభావాన్ని తనకు లాభసాటి చేసుకునే స్వార్థబుద్ధితో ఆతనియెడల దయాభావాన్ని ప్రదర్శిస్తే—నీకు తగిన ప్రతిఫలంగా—ఆతని కృతజ్ఞతారాదు, నీ దయాభావానికి విలువాదక్కదు. ఆర్థికలాభాపేక్ష లేకుండా ఆతని యెడల దయాప్రవర్తన చూపినప్పుడు, ఆర్థిక ప్రయోజనాలన్నీకూడా స్వతసిద్ధంగానే చేకూరుతాయి. ఇతర సందర్భాలలోలాగునే ఇక్కడ కూడా 'తన ప్రాణం దక్కించుకోనవలె ననుకునేవాడు దానిని పోగొట్టుకుంటాడు; తన ప్రాణం కోసం లెక్కచేయనివాడు దానిని పొందుతాడు'.

తరచుగా ఒక వ్యాపారసంస్థలో ఒక యువకుడు పనికి ప్రవేశించగానే, అతడు గృహావాతావరణానికి దూరమైపోతాడు. ఆతని పనిపాట్లలో సలహాల నొసగేందుకు ప్రక్కని తండ్రి వుండడు కాబట్టి, ఆతని అధికారియే అతడికి పితృతుల్యుడు కావాలి. అధికారి ఆ విధంగా పితృభావం అవలంబిస్తే, ఆతడు తన అధికారానికి లోనై పనిచేసేవారిని అదుపులోపెట్టే సందర్భాలలో, తన కొడుకే తన క్రింద పని చేసే అవసరం కలిగితే అతడిని ఏ రీతిగా చూస్తానో అదే రీతిగా వీరందరినీ చూస్తున్నానా లేదా అని ఆత్మపరీక్ష చేసుకొన గలుగుతాడు.

ఒక ఓడనాయకుడు తన ఓడ బ్రద్దలైనప్పుడు నావికులందరూ క్షేమంగా బయటపడిన తర్వాతనే తాను ఓడను వదలే రీతిగానూ, లేదా, ఓడలో తిండినిలవ తరిగి సౌమ పరి

స్థితి వచ్చినప్పుడు, ముందుగా నావికులకు పంచి, తర్వాతనే తన భాగం తీసుకునే ఓడనాయకుని రీతిగానూ, పరిశ్రమాధికారి కూడా, వ్యాపారపు చిక్కు లేర్పడినప్పుడు, హాని సాధక బాధకాల విషయంలో తన పనివారతో సమంగా పాలుపంచుకోవాలి. నిజానికి, వారికి ఎక్కువ బాధకలుగకుండా తానే ఆ ఆపత్తులో ఎక్కువపాలు పంచుకోవాలి. అనగా, కాటకసమయంలోగాని, ఓడ బ్రద్దలైనప్పుడుగాని యుద్ధంలోగాని, ఒక తండ్రి తన కొడుకు నిమిత్తం ఏవిధంగా స్వార్థత్యాగం చేస్తాడో ఈతడున్నూ ఆరీతిగా ప్రవర్తించాలి.

ఈ విషయాలు చాలా విచిత్రమైనవిగా తోచవచ్చును. ఇవి విచిత్రంగా తోచడమే అన్నిటికన్నా విచిత్రమైన విషయం. ఎందుకనగా, ఇవి వాస్తవిక పరిస్థితులకు సార్వకాలికంగా వర్తించే సత్యసూత్రాలు.

రస్కిన్ యొక్క 'అన్టు దిస్ లాస్ట్'కు గాంధీజీ వ్యాఖ్య, 1951,
పే. 8-11, 21-23.

## న్యాయసమ్మతమైన ఆర్థికశాస్త్రం

నిజమైన ఆర్థికశాస్త్రం ఎంత ఉన్నతమైన నైతిక సూత్రాలకుగాని విరుద్ధంగా వుండనేరదు. ఆ విధంగానే నైతికశాస్త్రమున్నూ మంచి ఆర్థికప్రయోజనాలకు దారిజూపునట్టిదై తేతప్ప, నిజమైన నైతికశాస్త్ర మనిపించుకోదు. ధనదేవతారాధనమునే ప్రచారమొనర్చి, బలవంతులు దుర్బలులను దోచుకొనేందుకు మాత్రమే సహకరించే ఆర్థికశాస్త్రం

కుటిలమూ, ఘోరమూ అయిన శాస్త్ర మవుతుంది. అది మృత్యుకారకము. సత్యమైన ఆర్థికశాస్త్రం, సాంఘికన్యాయ సూత్రాలను ప్రతిపాదించి, దుర్బలులతో సహా సర్వులకూ శ్రేయోదాయకమై, సభ్యజీవితానికి మూలాధారంగా వుంటుంది.

హరిజన్, 9-10-'37, పే. 292.

ఈ నూతన దృక్పథం అవలంబిస్తే, మనకు లభ్యమైన దంతా మనమే దక్కించుకొనుటకు బదులు, సర్వులకూ సమంగా దక్కనిది మనం పొందడానికి నిరాకరిస్తాము.

యంగిండియా, 3-9-'25, పే, 304.

నేను ఒక మనిషికి ఇవ్వదగినంతకూలీ యిస్తే, నేను అనవసర సంపత్తిని కూడబెట్టడానికి వీలుండదు. తద్వారా అనవసర సౌఖ్యాలకి దుర్వ్యయం చేయడానికీ, లోకదారిద్ర్యాన్ని పెంచడానికీ వీలుండదు. పైగా నావద్ద న్యాయమైన కూలీపొందిన పనివాడు తన క్రిందివారియెడల న్యాయంగా ప్రవర్తిస్తాడు. ఈ విధంగా, న్యాయప్రవాహం ఎండిపోకుండా, ముందుకు పోయినకొలదీ ఎక్కువెక్కువగా బలం నేకరించుకుంటుంది. అట్టి న్యాయశీలతను పెంపొందించుకున్న దేశం సుఖప్రదంగానూ, శ్రేయోవంతంగానూ వుంటుంది.

దీనినిబట్టి చూస్తే, జాతి జీవితానికి పోటీవిధానం మంచిదని చెప్పే ఆర్థికవేత్తల మాట పొరపాటని తేలుస్తుంది. పోటీవల్ల శ్రామికుని శ్రమ అక్రమమైన చౌకధరకు అమ్ముడుపోతుంది. దాని ఫలితంగా ధనికులు మరింత ధనికులౌతారు.

పేదలు మరింత నిరుపేదలై పోతారు. చిట్టచివరకు ఈ పద్ధతి దేశానికి నాశనకారక మవుతుంది. పనివాడు తన సామర్థ్యాన్ని బట్టి న్యాయమైన భృతిపొందాలి. అప్పటికీ ఒక విధమైన పోటీ వుంటుందికాని, ప్రజాసుఖమూ, కార్యకౌశలమూ పెరుగుతాయి. ఏమంటే, అప్పుడు వారు ఒకరిపై ఒకరు తక్కువపాట పాడనవసరం వుండదు. అందుకుబదులు, పనులు సంపాదించుకోడానికి క్రొత్త విషయాలలో కౌశలం ఆర్జించుకుంటే సరిపోతుంది. ప్రభుత్వోద్యోగశాఖలలో తరగతుల వారీగా జీతాలు ఏర్పరిచే విధానంలోని రహస్యం ఇదే. అభ్యర్థి ఒకే పనికి తక్కువజీతానికి చేస్తానని పోటీ చేయడు; ఇతరులకంటె అధిక యోగ్యతలను చూపుకుంటాడు... ...కాని వ్యాపారరంగంలోనూ, పరిశ్రమలలోనూ పోటీ ఎక్కువ. దానికి ప్రతిఫలంగా మోసము, కాపట్యము, చౌర్యము ఆ రంగాలలో ఎక్కడ చూచినా విచ్చలవిడి అయిపోయాయి. చెత్తవస్తువులు తయారవుతున్నాయి. పరిశ్రమాధికారి, శ్రామికుడు, కొనుబడిదారు— ఎవరి ఆందోళన వారి ప్రత్యేకలాభాలకే అవుతూవున్నది. ఈ పరిస్థితి మనుష్యుల పరస్పర వ్యాపారా లన్నింటినీ విషపూరితం చేస్తున్నది. శ్రామికులు పస్తుండి సమ్మెలు చేస్తున్నారు. పారిశ్రామికులు పరమచోరు లైపోతున్నారు. కొనుబడిదారులుకూడా నైతిక ప్రవర్తన కోల్పోతున్నారు. ఒక అన్యాయం కావలసినన్ని ఇతర అన్యాయాలకు దారితీస్తుంది. తుట్టతుదకు యజమాని, పనివాడు, కొనుబడిదారు అంతా సుఖం కోలుపోయి, భ్రష్టత

పాలౌతున్నారు. పర్యవసానం, ప్రజాసంపత్తియే సంఘువినష్టికి హేతుభూత మవుతున్నది.

సమాన న్యాయంమీద ఆధారపడినదే నిజమైన ఆర్థిక శాస్త్రం. ప్రజలు ఎంత న్యాయంగానూ, నీతిగానూవుండడం నేర్చుకుంటే అంత సుఖవంతు లౌతారు. మిగిలిన దంతా వ్యర్థప్రయోజనమై, సూటిగా వినాశానికి దారి జూపుతుంది. వంకరదారినో టొంకరదారినో డబ్బుచేయడమే పరమార్థమని బోధించడంకంటె ప్రజాహానికరమైన దింకొక టుండదు.

రస్కిన్ 'అన్టు ది లాస్ట్'కు గాంధీజీ వ్యాఖ్య, 1951, పే, 50-53,

## ఆర్థిక సమానత

సంఘ నిర్మితి విషయంలో నా అభిప్రాయం ఇది. మన మందరమూ జన్మతః సమానులు అంటే సమానావకాశాలకు అర్హులమని నా భావం. కాని అందరూ సమాన సామర్థ్యం కలవారై వుండరు. సామర్థ్యంలో సమానంగా వుండడం ప్రకృతిరీత్యా అసాధ్యం. ఉదాహరణకి, అందరికీ ఒకే ఎత్తూ, ఒకే రంగూ, ఒకే తెలివితేటలు మొదలైనవి వుండవు. అందువల్ల సహజసిద్ధంగా కొందరికి ఆర్జనవిషయంలో ఎక్కువ సామర్థ్యం వుంటుంది ; కొందరికి తక్కువ వుంటుంది. బుద్ధికుశలత ఎక్కువ కలవారికి ఎక్కువసామర్థ్యం వుంటుంది ; వారు దానిని ఆర్జనకు వినియోగించ గలుగుతారు. వారు తమ కుశలతను సద్బుద్ధితో వినియోగిస్తే, ప్రభుత్వ సంపదను పెంచినవారౌతారు. అట్టివారు ఆ సంపదకు

ధర్మకర్తలుగా తప్ప, ఇతరమైన అధికారం కలిగివుండ రాదు. అధిక మేధావి అయినవాడు అధిక ఆర్జనచేయడానికి నేను అనుమతిస్తాను ; ఆతని బుద్ధి కుశలతను అరికట్టను. ఒక తండ్రియొక్క ఆర్జనపరులైన కొడుకు లందరి ఆదాయమూ అందరికీ చెందిన ఆ కుటుంబ మూలధనంలో కలిసినట్లే ఈ ఆర్జనాకుశలుని అదనపు ఆదాయం ప్రభుత్వ ప్రయోజనాలకు వినియుక్తం కావాలి. యంగిండియా, 26-11-'31, పే. 368.

సమపంపకము (equal distribution) యొక్క సరి యైన భావం ఏమిటంటే, ప్రతి మనిషీ తనయొక్క సహజ మైన అవసరాలను తీర్చుకొనడానికి తగిన జీవనాధారం కలిగి వుండాలి ; అంతకు మించి కలిగివుండరాదు. ఉదాహరణకి, ఒక వ్యక్తికి జీర్ణశక్తి దుర్బల మవడంచేత పాతికపౌను రొట్టె పిండి మాత్రమే అవసరమై, మరొకనికి పౌనుపిండి అవసర మైతే, ఆ ఇరువురునూకూడా తమ అవసరాలను తీర్చుకొన గల పరిస్థితిలో వుండాలి. ఈ ఆదర్శాన్ని ఆచరణలోకి తేవలె నంటే సంఘవ్యవస్థ యావత్తూ పునర్నిర్మితం చేయవలసి వుంటుంది. అహింసాసూత్రబద్ధమైన సంఘవ్యవస్థ ఈ ఆద ర్శమును తప్ప వేరొక ఆదర్శమును చేపట్టజాలదు. ఈ పరమ గమ్యమును మనం పూర్తిగా అందుకొనజాలకపోవచ్చును ; కాని దానిని మనసులో వుంచుకుని, దానికి చేరిక అగుటకే నిరంతరయత్నం సలుపాలి. మనం గమ్యానికి ఎంత ఎక్కువ చేరికైతే అంత ఎక్కువ పరిమాణంలో మనకు సంతృప్తి,

సౌఖ్యం చేకూరగలవు; అంత పరిమాణంలో అహింసా ధార్మికమైన సంఘవ్యవస్థను రూపొందించుటకు తోడ్పడిన వారమవుతాము.

ఇప్పుడిక అహింసా విధానంద్వారా సమపంపకం అమలులోకి తెచ్చే మార్గాలను గురించి ఆలోచిద్దాం. దానికి మొదటిమెట్టుగా, ఈ ఆదర్శానికి తన బ్రతుకు అంకిత మొనర్చుకొన్నవాడు, తొల్దొలిని తన వ్యక్తిజీవితంలో అందుకు అవసరమైన మార్పులను తెచ్చుకోవలసివుంటుంది. భారతదేశపు దారిద్ర్యాన్ని జ్ఞప్తిలో వుంచుకొని, ఆతడు ఇష్టపూర్తిగా తన స్వంత అవసరాలను కనీసపరిమాణానికి తగ్గించివేసుకుంటాడు. ఆతని ఆర్జన నిజాయితీ అయిన పద్ధతులపైననే ఆధారపడినదై వుంటుంది. భావిలాభాలకు నిలవ చేసే వ్యాపారపద్ధతులు విసర్జిస్తాడు. ఆతని నివాసంకూడా ఈ నూతనజీవితవిధానానికి తగిన స్థాయిలోనే వుంటుంది. ప్రతి జీవితరంగంలోనూ ఆగ్రహ నిగ్రహం అలవరచుకుంటాడు. ఆతడు తన వ్యక్తిజీవితంలో సాధ్యమైన మార్పులన్నీ చేసుకున్న పిమ్మటనే తనతోడివారికీ, పొరుగువారికీ ఈఆదర్శాన్ని బోధించగలస్థితిలో వుంటాడు.

ఈ ధనపంపకపు సూత్రం మూలంలో ధనికుల అదనపు సంపత్తివిషయికమైన ధర్మకర్తృత్వ సిద్ధాంతంమీదనే ఆధారపడుతుంది. ఏమంటే, ఈ సిద్ధాంతం ప్రకారం వారు తమ పొరుగువారికంటె ఒక్క రూప్యమైనా అదనంగా కలిగి

వుండరాదు. దీనిని సాధించడం ఏ విధంగా సాధ్యమవు తుంది. అహింసాత్మకంగానా? లేక, ఆ ధనికుల ఆస్తులను లాగికొనవలసిందేనా? ఈ పనికి సహజంగా దౌర్జన్యం అవసర మవుతుంది. ఈ దౌర్జన్యచర్య సంఘానికి శ్రేయస్కరం కాదు. తద్వారా ధనార్జనా కౌశలంగల ఒకవ్యక్తిని సంఘం కోల్పోతుంది. అందువల్ల అహింసామార్గమే ఎక్కువ మంచి దని స్పష్టమవుతుంది. ధనికుని ఆస్తులు ఆతని చేతులోనే వుంటాయి. అందులో సహేతుకంగా అవసరమైనంత తన స్వప్రయోజనానికి వినియోగించుకుంటాడు. మిగిలిన దంతా సంఘావసరాలకు వినియోగించుటకు దానికి తానే ధర్మకర్తగా వుంటాడు. ఈ సమాలోచనలో ధర్మకర్త అగువాడు. నిజా యితీ కలవాడై వుంటాడని విశ్వసించబడింది.

ఒకవేళ ఎంత ప్రయత్నించినా ధనికులు నిజమైన అర్థంలో పేదవారికి ధర్మకర్తలుగానూ, సంరక్షకులుగానూ వర్తించక, అందువల్ల పేదలు ఇంకా ఇంకా త్రొక్కుడు పడి ఆకలిబాధకు ప్రాణాలుకోల్పోయే దుర్భరస్థితివస్తే చేయ వలసిన దేమి? ఈ చిక్కు ప్రశ్నకు సమాధానం వెదకడం లోనే దౌర్జన్యరహిత సహాయనిరాకరణ, అహింసాత్మక శాసనోల్లంఘునము అనే ప్రక్రియలు నాకు స్ఫురించివున్నాయి ఈ విధానములే యోగ్యమైనవీ, తిరుగులేనివీ అనే నిర్ణయా నికి వచ్చాను. సంఘంలోని పేదవర్గాల సహకారం లేనిదే ధనికవర్గాలు సంపత్తిని కూడబెట్టలేరు. ఈ సంగతి పేద

వారందరికీ అవగాహన అయి, ప్రచారమైతే, వారు బలపడ తారు. తమను తిండిలేక మాడిపోయే పరిస్థితికి తెచ్చిన కఠోరమైన అసమానతల బారినుండి అహింసామార్గంద్వారా విముక్తులగు పద్ధతిని నేర్చుకొనగలుగుతారు.

హరిజన్, 25.8.'40, పే 260-61.

## అహింసాత్మకమైన ఆర్థికనిర్మాణం

భారతదేశం అహింసాపద్ధతిని పరిణతి పొందవలెనంటే చాలా విషయాలలో వికేంద్రీకరణ విధానం అవలంబించ వలసివుంటుందని నా సూచన. తగినంత బలప్రయోగం వలన తప్ప కేంద్రీకరణ పద్ధతిని నిలబెట్టడంకాని సాగించడం కాని అసాధ్యం. హరిజన్, 30-12-'39, పే. 391.

పరిశ్రమాగారాలతో కూడిన నాగరికతలో అహింసా విధాన పూర్వకమైన సంఘనిర్మాణం జరగదు. స్వయంపో షకమైన గ్రామజీవితంతోకూడిన సభ్యతలోనే సాధ్యమా తుంది. నా భావనలోని గ్రామీణ ఆర్థిక విధానంలో ఇతరు లను నష్టపరచి లాభాలుపొందే పద్ధతికి (exploitation) ఎంత మాత్రం స్థానముండదు. కాబట్టి అహింసాత్మక విధానం అవలంబించడానికి ముందర గ్రామపునర్నిర్మాణ విషయంలో మనస్సు లీనం చేసుకోవాలి. హరిజన్, 4-11-'39, పే, 331.

సాముదాయిక పరిమాణంలో నిర్మితమైన పారిశ్రామిక విధానంలో పోటీపద్ధతి, అమ్మకపు అవకాశాలు అనే సమ స్యలు ఇమిడివుంటాయి కాబట్టి, గ్రామీణులదోపిడీ తప్పదు.

అందువల్ల గ్రామజీవితం స్వయంపారిశ్రామికపద్ధతిపై నడిచి, ముఖ్యావసరములైన వస్తువుల నిర్మాణం గ్రామాలలోనే చేసుకొనగలగాలి. ఈ విధమైన పద్ధతిని అనుసరించినప్పుడు గ్రామీణులు స్వయంగా నిర్మించుకొనగలిగిన ఆధునిక పారిశ్రామిక యంత్రాలూ, పనిముట్లూ వినియోగించుటకు అభ్యంతర ముండనవసరంలేదు. అయితే అవి ఇతరులను దోచుకొనేవిగా వుండరాదు.

హరిజన్, 29-8-'36, పే. 226.

పారిశ్రామికత, విస్తృత వస్తునిర్మాణం అనే పద్ధతులు ఈ మధ్యకాలంలో పుట్టినవి. అవి ఎంతవరకు ఏ విధంగా మన సుఖజీవన పరిణతికి సహాయకములైనవీ మన మెరగము; కాని, అవి వాటి వెనువెంటనే రెండు ప్రపంచ సంగ్రామాలను (ముడిపదార్థాలకు, మార్కెట్లకు) తీసుకువచ్చాయని మాత్రం కనిపిస్తూనే వుంది.

ది హిందూస్థాన్ స్టాండర్డు, 6-12-'44.

## సర్వోదయం మన ఆదర్శం

"అధికతమ సంఖ్యాకుల అధికతమ అభ్యుదయం" అనే ప్రయోజనాత్మకమైన సూత్రాన్ని అహింసాసాధకుడు అంగీకరించలేడు. అతడు సర్వులయొక్క అభ్యుదయానికీ పాటుపడి, ఆ ఆదర్శాన్ని అందుకొనే ప్రయత్నానికే తన ప్రాణాలు సమర్పిస్తాడు. ఆ విధంగా ఇతరులు బ్రతికేనిమిత్తం తాను మరణించడానికైనా సంసిద్ధుడౌతాడు. తన మృతివల్ల ఆతడు

తనకూ ఇతరులకూ కూడా సేవచేసినవా డవుతాడు. సర్వుల యొక్క అభ్యుదయంలో అధికతమసంఖ్యాకులు కూడా ఇమిడి వుంటారు. అందువల్ల అతడూ, ప్రయోజనసూత్రానుసార కుడూ, తమ తమ కార్యక్రమాలలో చాలా అంశాలలో కలుస్తూవుంటారు. కాని ఒకానొక స్థితికి వచ్చేసరికి వా రిరు వురూ విడిపోవలసిరావడమే కాక, పరస్పర విరుద్ధమైన దిశ లకు సాగవలసివస్తుంది. ప్రయోజనవాది, ఆతని సూత్ర స్వభావాన్ని బట్టియే ఎప్పుడుగాని ప్రాణత్యాగందాకా పోడు. ఆదర్శవాది ఆత్మత్యాగానికి సర్వదా సంసిద్ధుడై వుంటాడు.

యంగిండియా, 9-12-'26, పే. 432.

మనము పరమేశ్వరునికి ప్రతిరూపములుగా సృష్టింపబడి వున్నట్టయితే, మన ఆదర్శం కొలదిమంది అభ్యుదయంగాని, అధికసంఖ్యాకుల అభ్యుదయంగాని కాజాలదు. సర్వుల యొక్క అభ్యుదయమే మన పరమావధి అవుతుంది.

మహాత్మాగాంధీ ప్రసంగాలు, రచనలు. 1933, పే. 350,

# 32

# రాజకీయరంగంలో-ప్రేమద్వారా స్వాతంత్ర్యం

నా భావనలోని ప్రజాస్వామ్యంలో, అహింసాత్మక విధానంద్వారా స్థాపితమైన ప్రజాస్వామ్యంలో, సర్వులకూ సమాన స్వాతంత్ర్యం వుంటుంది. ప్రతివ్యక్తీ తనపై తానే ప్రభువుగా వుంటాడు.

ప్రభుత్వంతో గాంధీజీ ఉత్తరప్రత్యుత్తరాలు, 1942-44, పే, 173.

సత్యమైన ప్రజాస్వామ్యం లేక ప్రజాస్వరాజ్యం అసత్యపూరితమూ, దౌర్జన్యపూర్వకమూ అగు సాధనముల ద్వారా చేకూరదు. అట్టి పద్ధతులయొక్క ఫలితంగా ప్రతికూలపక్షములన్నింటినీ, వాటిని అణగద్రొక్కుటద్వారానో లేక నిర్మూలనం ద్వారానో, తొలగింపజేయడం జరుగుతుంది. అట్టి చర్య వ్యక్తిస్వాతంత్ర్యానికి తావొసగదు. నిష్కళంకమూ, కల్తీ లేనిదీ అయిన అహింసాత్మక విధానం కింద తప్ప వ్యక్తిస్వాతంత్ర్యానికి పూర్ణమైన అవకాశం ఏర్పడదు. హరిజన్, 27-5-'39, పే. 143.

## సర్వాధికార ప్రభుత్వం కూడదు

జాతీయ జీవితాన్ని జాతీయ ప్రతినిధులద్వారా పరిపాలించుట అనియే రాజకీయాధికారం అనేదానికి అర్థం. జాతీయ జీవితం దానికదే నడిచిపోగల పరమోన్నత స్థితికి పరిణతి పొందితే, అప్పుడు ప్రతినిధులద్వారా పాలనకూడా అనవసరం కావచ్చును. అట్టి పరిణతస్థితి జ్ఞానయుక్తమైన అరాజకరాజ్యం అవుతుంది. అట్టి రాజ్యంలో ప్రతి వ్యక్తీ తనకు తానే పాలకుడౌతాడు. అతడు పొరుగువానికి తాను ఆటంకము కాని రీతిని ఆత్మపాలన చేసుకుంటాడు. అందువల్ల, ఆదర్శ రాజ్యంలో ప్రభుత్వం అనేది వుండదు కనక, రాజకీయ అధికారం అనేదికూడా వుండదు. కాని ఆదర్శం ఎన్నడూ జీవితంలో పూర్ణంగా రూపం పొందదు. అందుకే "అతి స్వల్పంగా పాలించేదే అత్యుత్తమ పరిపాలన" మని చెప్పిన థోరో భావుకుని సుభాషితం స్మరణీయం.

యంగిండియా, 2-7-'31, పే. 162.

ప్రభుత్వాధికారం అధికతరం కావడం అనేది నేను చాలా ఆపత్కరమైన విషయంగా భావిస్తాను. దానివలన ఒకవంక స్వంతలాభాలను తగ్గించే సత్ఫలితం కలిగినా, మరొకవంక ఉన్నతికి మూలకందమైన వ్యక్తిత్వాన్ని నిర్మూలించడం ద్వారా అది మానవజాతికి అత్యంత హానికరంగా పరిణమిస్తుంది.
దిమోడరన్ రివ్యూ, 1935, పే.413.

కావున నేను మాటలద్వారానూ చేతలద్వారానూ రాజకీయ స్వపరిపాలన మనునది— అనగా స్త్రీ పురుషులతో కూడిన ప్రజానీకంయొక్క స్వయం పరిపాలనము— వ్యక్తిగత స్వపరిపాలనముకు విరుద్ధ స్వభావముకలది కాదనిన్నీ, అందువల్ల దానిని సాధించుటకుకూడా వ్యక్తిస్వపరిపాలనకు లేక ఆత్మనిగ్రహానికి అవసరమైన సాధనములే ప్రయోగార్హములనిన్నీ చూపుటకు ప్రయత్నించి వున్నారు.
సిలోన్‌లో గాంధీజీతో, రచన : మహదేవ దేశాయ్1928, పే.93.

## అహింసాత్మక రాజకీయ నిర్మాణం

నిజమైన ప్రజాస్వామ్యపాలన కేంద్రంలో ఒక ఇరవై మంది పైనికూర్చుని చేస్తే అయేదికాదు. అడుగు నుంచి ప్రతి గ్రామప్రజలున్నూ దాని నిర్మాణంలో పాల్గొనవలసి వుంటుంది.
హరిజన్, 18-1-'48, పే. 519.

అసంఖ్యాకమైన గ్రామాలతోకూడిన ఈ సమాఖ్య ఒక దానికంటె ఒకటి విస్తృతమైన వలయాలతోకూడుకొని వుంటుంది. ఈ వలయాలు ఒక దానిపైన ఒకటి కాకుండా, ఒక దానికి చుట్టూ ఇంకొకటిగా విస్తృతమై వుంటాయి.

జీవితం స్థూలత్రిభుజంవలె నేలమట్టాన పునాదిగలిగి, శిఖరం ఆకాశమంటేలాగ వుండదు. అది జలవలయాలతో కూడిన సముద్రంలా వుంటుంది. వ్యక్తి గ్రామానికి ప్రాణమిస్తాడు. గ్రామం గ్రామ సమాఖ్యావలయానికి ప్రాణమిస్తుంది. ఈ విధంగా తుదకు దేశం సర్వమూ ఒకే జీవితవలయమై, అందలి వ్యక్తులు ఆధిక్యగర్వితులుకాక వినమ్రశీలురై ఆ గంభీరమైన వలయాకృత జీవితసముద్రంలో అవిభిన్న వ్యక్తులుగా జీవిస్తారు. ఈ వలయాకృత జీవితసమాఖ్యలోని వెలుపలి వలయం లోపలి వలయాలను తన శక్తితో ఒత్తిడి చేయునదిగా వుండదు. తనలో గర్భితమైన వలయాలకు బలమొసగి, వాటినుంచి తానూ బలం పొందుతుంది. ఈ భావన అంతా శుద్ధస్వాప్నికమూ, ఆదర్శప్రాయమూ అని నన్ను హేళన చేసేవా రుండవచ్చును. (ప్రఖ్యాతగణితజ్ఞుడైన) యూక్లిడ్ నిర్వచించిన బిందువు (Point - సున్న) మానవరచనకు అసాధ్యమైనదైనాగాని ఏ విధంగా అమరమైన విలువగలిగినదో, అదేవిధంగా నేను గీసిన ఈ చిత్రం కూడా మానవ జాతి జీవితానికి మార్గదర్శకంగా ఉపకరిస్తుంది. ఈ సత్యమైన ఆదర్శచిత్రానికి సంపూర్ణమైన వాస్తవరూపం ఒసగడం అసాధ్యమైనప్పటికీ భారతదేశం దీనినే అనుసరించవలసినదిగా కోరుతాను. మనకు కావలసినదేదో ముందుగా మనస్సులో చిత్రించుకుంటేతప్ప, దానికి చేరికగా జీవితాన్ని రూపొందించుకోవడం సాధ్యంకాదు. భారతదేశంలోని ప్రతిగ్రామం ఒక ప్రజారాజ్యంగా రూపొందిననాడు, నా ఆదర్శం రూపొందిందని భావిస్తాను. అప్పుడు నేను చిత్రించినరీతిగా చిట్టచివర మొట్టమొదలుతో సమానమై వుంటుంది; అనగా, చివరివా

రొకరూ మొదటివారొకరూ అనే అసమానత వుండనే వుండదన్నమాట. హరిజన్, 28-7-'46, పే. 236.

అహింసాత్మకమైన స్వరాజ్యసమాఖ్యలో ఎవరుగాని ఎవరియెడలగాని శత్రుభావం కలిగివుండరు. ప్రతిస్త్రీ, ప్రతి పురుషుడూ సర్వుల అభ్యుదయానికీ తమ తమ విధ్యుక్త ధర్మాలను నెరవేరుస్తారు. అందరూ వ్రాయనూ చదవనూ నేర్చినవారై వుంటారు. వారిజ్ఞానం దినదిన ప్రవర్ధమానం అవుతుంది. అనారోగ్యాలూ, వ్యాధులూ వీలైనంతవరకు నిర్మూలింపబడతాయి. ఎవరూ దారిద్ర్యం పాలుకారు. శ్రామికులకు ఎప్పుడూ పనివుంటుంది. అట్టి రాజ్యంలో జూదరితనం, త్రాగుడు, అవినీతి, వర్గద్వేషం అనేవివుండవు. హరిజన్, 25-3-'39, పే. 65.

## జాతీయత ; అంతర్జాతీయత

నా దేశభక్తి స్వార్థసంకుచితం కాదు. ఏ ఇతర దేశానికి బాధాకరంకాకుండా అందరి మంచినీ కోరే సూత్రాలపై ఆధారపడి వుంటుంది. నేను భావించే భారత స్వాతంత్ర్యం ఎన్నడుగాని లోకానికి విపత్కరంకాదు. యంగిండియా, 3-4-'24, పే, 109.

నేటి మన దేశభక్తి భావం ఏవిధంగా వ్యక్తి కుటుంబానికి ప్రాణమొసగాలనీ, కుటుంబం గ్రామానికీ, గ్రామం మండలానికీ, మండలం రాష్ట్రానికీ, రాష్ట్రం దేశానికీ ప్రాణ మొసగాలనీ చెపుతున్నదో, అదే విధంగా ఒకదేశం అవసర మైతే ప్రపంచ శ్రేయస్సుకోసం ప్రాణమొసగే నిమిత్తం

స్వతంత్రం కలిగినదై వుండాలి. అందువలన మన దేశ స్వాతంత్ర్య భావంలో జాతిద్వేషానికి అవకాశంలేదు.

భారతగ్రామాలలో గాంధీజీ, రచన: మహాదేవ దేశాయ్, 1927, పే. 170.

రాజ్యాలు నిర్మించుకున్న సరిహద్దుల వెలుపలి ఇరుగు పొరుగువారికి మనం సహకారం చూపడానికి అపారమైన అవకాశం వుంది. ఆ సరిహద్దులు దైవ నిర్మితాలు కావు.

యంగిండియా, 31-12-'31, పే 427.

నేను దేవుని ఏకత్వాన్ని సంపూర్ణంగా విశ్వసిస్తాను; అందువల్లనే సర్వమానవ సమైక్యభావాన్ని కూడా విశ్వసిస్తాను. మన శరీరాలు భిన్నమైతే ఏమి? మన ఆత్మ ఒక్కటే. సూర్యకాంతిప్రసారగుణంద్వారా కిరణరూపకమైన వైవిధ్యం పొందినా, వా టన్నిటికీ మూలాధారం ఒక్కటేగదా!

యంగిండియా, 25-9-'24, పే. 313.

నా మతవిశ్వాసమూ, దానిపై ఆధారపడిన నా దేశ భక్తీ యావజ్జీవలోకాన్నీ తమ ఆలింగనంలో ఇముడ్చుకుంటాయి. ఒక్క మానవులతో సోదరత్వమూ, సమైక్యతా అలవరచుకొనుటతో నేను సంతృప్తి పొందను. నేలపై ప్రాకే అల్ప ప్రాణులతో సహా సర్వజీవ లోకంతోటీ సమైక్యత పొందాలని ఆశిస్తాను. నేలమీద ప్రాకే పురుగులతో కూడా సమైక్యత కోరుతానంటే మీరు విడ్డూరపడ నవసరం లేదు. అవీ నేనూ ఒక పరమేశ్వరుని కుటుంబంలో జన్మించాము. అందువల్ల ఏయే విభిన్న రూపాలలో జన్మపొందినప్పటికీ, సర్వజీవరాశిలోనూ ఏకత్వం గర్భితమై వున్నదని వేరుగా చెప్పనవసరం లేదు. యంగిండియా, 4-4-'29, పే. 107.

# ఎనిమిదవ విభాగం

# నా హిందూధర్మము

## 33

## దాని సారాంశమగు పరిత్యాగము, సమర్పణము

[క్విలాన్‌లో జరిగిన ఒక బహిరంగసభలో గాంధీజీ ఒక ఉపనిషన్మంత్రమును తీసికొని, అందలి హిందూమతవిశ్వాస సారాంశమును మొదటిసారి ఉద్ఘాటించారు. తదుపరి ఇతరచోట్ల జరిగిన సభలలో ఆ సర్వతోముఖమగు మంత్రమున గర్భితమైన అంతర్భావములను సులభమైన వ్యాఖ్యలతో విశదీకరించారు. విపులవ్యాఖ్యలేకుండా ఆ మంత్రంయొక్క భావార్థాన్ని గురించి తొలిదినం క్విలాన్‌లో గాంధీజీ చేసిన ప్రసంగం ఈ క్రింద పొందుపరచబడినది.]

హిందూమత సారమునంతను గర్భితమొనర్చుకున్నట్లుగా నేను భావించే ఒక విశిష్ట మంత్రమును ఈనాడు మీకు పఠించి వినిపించబోతున్నాను. మీలో చాలామంది ఈశోపనిషత్తు పేరు వినివుంటారు. చాలా సంవత్సరాల క్రితం నేను దానిని సవ్యాఖ్యానంగా భాషాంతరీకరణరూపంలో చదివున్నాను. యెరవ్డా జైలులో వుండగా దానినంతను నేను కంఠస్థం చేసుకున్నాను. అప్పుడింకా నన్నది పూర్తిగా ఆకర్షించలేదు. గత కొలది మాసాల ఈమధ్యలో నన్నది పూర్తిగా వశం వదం చేసుకున్నది. హఠాత్తుగా ఎందువలనగాని ఉపనిషత్తులూ, ఇతర మతగ్రంథాలూ అన్నీ ఒకసారిగా కాలి ధూళిపాలైపోయినా, ఈ ఒక్క శ్లోకము మాత్రం హిందువుల కంఠగతమై మిగిలితే చాలు, ఆ ఒక

శ్లోకం ద్వారానూ హిందూమతం చిరస్థాయిగా జీవించివుండ గలదని నా కిప్పుడు ప్రగాఢమైన విశ్వాసం ఏర్పడింది.

ఇక ఈ మంత్రం నాలుగు భాగాలుగా విడుతుంది. మొదటి భాగం— ఈశావాస్యమిదం సర్వం, యత్కించ జగత్యాం జగత్. దీనికి, నా అనువాదం ప్రకారం, — ఈ విశ్వసర్వస్వమందు మనకు కనిపించే అన్నిటిలోనూ పరమేశ్వరుడు పరివ్యాప్తుడై వున్నాడు— అని అర్థం. తర్వాత, రెండవ భాగం, మూడవ భాగం కలిసి వుంటాయి. ఈ వాక్యంలో —తేనత్యక్తేన భుంజీదా. దీనిని రెండుగా విభజించి, అనువదిస్తాను— దానిని త్యజించు; దానిని అనుభవించు— అని. ఈ అర్థాన్నే ఇస్తూ, ఇంకొక అనువాదం ఇలా వుంది — ఆత డొసగినది అనుభవించు — అని. అలా చెప్పినా, అదిన్నీ రెండు భాగాలౌతుంది. ఇక నాల్గవభాగం చాలా ముఖ్యమైనది మిగిలింది — మా గృధః కస్యస్విద్ ధనం. దాని అర్థం— ఎవరి ధనసంపదలకుగాని లోభపడకు— అని. ఈ ఉపనిషత్తులోని మిగిలినదంతా ఈ మొదటి మంత్రానికి వ్యాఖ్యానం— అనగా, దాని సంపూర్ణమైన అంతరార్థాన్ని విశదీకరించే ప్రయత్నం.

ఈ మంత్రం సమాజవాదులయొక్క, సామ్యవాదులయొక్క మధనకూ, తత్వవేత్తలయొక్క, ఆర్థికవేత్తలయొక్క తపనకూ కూడా సంతృప్తికరమైన సమాధానం ఇస్తుందని నాకు తోస్తుంది. హిందూమతస్థులు కానివారి ఆశయాలను

కూడా ఇది సంతృప్తిపరచగలదని చెప్ప సాహసిస్తాను. నా మాట నిజమని నా నమ్మకం. అది నిజమైతే, హిందూ మతంలో ఈ మంత్రానికి అనుగుణంకానిదీ, వ్యతిరేకమైనదీ ఏది కాని మీరు అంగీకరించవలసిన అవసరం లేదు. బాటను నడిచిపోయే సామాన్య మానవుడికి కావలసినదీ, కోరదగినదీ అయిన ప్రబోధ మింకేమిటి? — ఈ యావజ్జీవకోటికీ అధినేత, కర్త, పరమేశ్వరుడు అయినవాడు సకలవిశ్వవ్యాప్తుడుగా వున్నాడన్నమాట తక్క? ఈ మంత్రంయొక్క ఈ మొదటి ముక్కలోని భావాన్ని సూటిగా అనుసరించే వుంటాయి మిగతా మూడు ముక్కలున్నూ. పరమేశ్వరుడు తన సృష్టి సర్వస్వంలోనూ పరివ్యాప్తుడై వున్నాడన్న మాటను నీవు నమ్మినచో, ఆతనిచే ప్రసాదితముకాని దేనినిగాని నీకు అనుభవయోగ్యం కాదని నీవు నమ్మవలసివుంటుంది. ఈ లోకంలోని మానవకోటి అంతా ఆతని సృష్టిలో భాగమే అయి వుండుటచే, ఏ ఒక్క మానవునికి చెందిన దేనినిగాని నీవు ఆశించరాదని స్పష్టపడుతుంది. నీవును ఆ అసంఖ్యాకమైన సృష్టిలో భాగస్వామివని తలిస్తే, ఆ ప్రకారం నీకు చెందిన సర్వమూ త్యజించి, ఆతని పాదములకడ సమర్పణచేయవలసి వుంటుంది. దానిని బట్టి, సర్వత్యాగం అనే క్రియ కేవలం బాహ్యరూపకమైన విసర్జనము మాత్రమే కాక, ఆంతరంగికంగా రెండవ లేక నూతనమైన జన్మతో సమానమని అర్థమిస్తుంది. ఆ క్రియ అజ్ఞానంతో చేసినదికాక, బుద్ధిపూర్వకమైనదే కదా. అందున అది పునరుజ్జీవనహేతు వౌతుంది.

ఇక, దేహిఅయినవానికి అన్నపానాలూ, వస్త్రాలూ అవసరం కాబట్టి, అట్టి త్యాగసమర్పణక్రియ లొనర్చినవాడు తన అవసర సంతృప్తికి ఆ పరమేశ్వరునే ప్రార్థించవలసి వుంటుంది. త్యాగానికి సహజప్రతిఫలంగా పరమేశ్వరుడు అతనికి వాటిని ఒసగుతాడు. ఇంతటితో ఆగక ఆ మంత్రంయొక్క చివరి పాదం ఇంకా మహత్తరమైన మరొక సందేశాన్ని ఇస్తుంది— "ఒక దేహికి చెందిన దేనిని గాని నీవు ఆశింపకు"—అని. ఈ మంత్రోద్దిష్టమైన భావాలను నీవు ఆచరణలో పెట్టిన మరుక్షణం నీవు జ్ఞానవంతుడవైన ప్రపంచ పౌరుడివై, సర్వజీవుల యెడల మైత్రిభావం కలిగి, ప్రశాంతజీవనం గడుపగలుగుతావు. ఇహాపరాత్మకమైన మన పరమోత్కృష్టాశయాలనన్నిటినీ ఈ మంత్రం సంతృప్తి పరుస్తుంది.

[ఇంకొక సభలో గాంధీజీ ఈ శ్లోకమునే మన హృదయాల నెదుర్కొనే సంక్లిష్టతలకూ, సందేహాలకూ పరిష్కారమొసగే బీజమంత్రంగా వర్ణిస్తూ వివరణం చేశారు.]

ఈశోపనిషత్తులోని ఈ ఒక్క శ్లోకాన్ని జ్ఞప్తివుంచుకొని, మిగిలిన మతగ్రంథాలన్నీ మరచిపొండి. ఇష్టమైనవారు మతగ్రంథసముద్రంలో మునిగి ఉక్కిరిబిక్కిరి కావలెనని వుంటే తప్పకుండా కావచ్చును. పండితులైనవారికి-వారైనా అడకువా, జ్ఞానమూ కలవారైతే - అవి ప్రయోజనకరం కావచ్చును. కాని దారినిపోయే పామరజనులను భవసాగరాన్ని తరింపజేయుటకు ఈ ఒక్క శ్లోకమూ వుంటే మరేమీ అవసరం లేదు.

"ప్రభువగు పరమేశ్వరుడు ఈ విశ్వమందలి సర్వస్వమునను పరివ్యాప్తుడై వున్నాడు. కావున మీకుగల సర్వము త్యాగమొనర్చి పరమేశ్వరార్పణం చేయండి. తిరిగి పరమేశ్వర ప్రసాదముగా మీకు లభించిన దానిని చేకొని, దానిని అనుభవించండి. ఇతరుల సొత్తును లోభించకండి."

హరిజన్, 30-1-'37, పే. 415.

నేను గతరాత్రి క్విలాన్‌లో జరిగిన సభలో హిందూ మత సందేశాన్ని గూర్చి చేసిన ప్రసంగ విషయమై మరి కొంచెము ముచ్చటించే నిమిత్తం ఈ సమావేశంలో* మీ అందరినీ కొలది నిమిషాలు ఆగి వినగోరుతాను.

ఈ మంత్రమును రచించిన మహర్షి దానిలో దైవమునకు 'ఈశ' శబ్దమునే వాడివున్నాడు. 'ఈశ' శబ్దం పరిపాలకుడని అర్థమిస్తుంది. ఈశ్వరుని పాలనాధికారంలో లేనిదేదిగాని ఉన్నట్లు చెప్పలేదు. మనకు కనిపించే అన్నిటా దేవుడు పరివ్యాప్తుడై వున్నట్లు ఆ మహర్షి చెప్పాడు. ఇందలి మిగిలిన భావములన్నీ ఈ మూలభావాన్ని అనుసరించే వుంటాయి. ఆ ప్రకారమే ఋషీశ్వరుడు "సర్వమునూ త్యజించు" అని అంటాడు. అనగా, ఈ విశ్వములోగల ప్రతి వస్తువును; మనకు నివాసమైన ఈ అల్పమైన భూగోళమునే కాక, విశ్వసర్వస్వమంతను త్యజించు, అని దాని అర్థం.

---

* 17-1-'37 తేదీని తిరువాన్నూరులోని హరిపద్ వద్ద గాంధీజీ ఒసగిన ప్రసంగం నుంచి.

మనం ఈ విశ్వసర్వస్వంలోని అల్పాల్పమైన అణువులవంటి వారము కనుక ఇది నాదనుకోవడం కంటె హాస్యాస్పద మైనది వుండదు కాబట్టి, దానిపై మన అధికారమును త్యజించమంటున్నా డన్నమాట. తర్వాత ఋషి ఏమంటు న్నాడంటే— ఆత్యాగానికి ప్రతిఫలం "భుంజీథః"— అనగా, "నీకు ఎంత అవసరమో అంతా అనుభవించు" అని అర్థం. ఇక్కడ "అనుభవించు" అని భాషాంతరం చేసిన మాటలో గూఢార్థం వుంది. దానిని "ఉపయోగించు" లేక "భుజించు" మొదలైన మాటలలో కూడ అనువదించవచ్చును. అందు వల్ల, నీ పెంపుకి అవసరమైన దానికి మించి పొందరాదనే భావం దానిలో ఇమిడి వుంది. కావున, ఈ అనుభవించుట కాని, ఉపయోగించుటకాని, రెండు నిబంధనలకు పరిమితమై వుంటుంది. ఒకటి త్యాగకర్మ. అదే భాగవతకారుడు చెప్పి నట్లు "కృష్ణార్పణమస్తు సర్వం" అనే దృష్టితో అనుభవిం చడ మన్నమాట. ప్రతిదినం ఉదయమే, భాగవత ధర్మం అనుసరించే అందరూ తమ మనోవాక్కర్మలను కృష్ణార్పణ మొనర్చాలి. ఆ విధంగా దైనికత్యాగవిధి లేక ఆత్మ సమ ర్పణం ఒనర్చిన పిమ్మట కాని, దేనిని ముట్టుటకు గాని, ఒక గ్లాసు నీరైనా త్రాగుటకు గాని, అధికారం లేదని భావిస్తారు. అట్టి త్యాగచర్య, ఆత్మసమర్పణం చేసిన వానికి తత్ఫలితంగా తన దైనికావసరాలకు కావలసినవున్న అన్న పానాలకు, దసన నివసనాలకు హక్కు కలుగుతుంది. అందు చేత, అనుభవించుట కాని ఉపయోగించుటకాని త్యాగ

ఫలితమని అర్థం చెప్పుకున్నా, లేక, త్యాగ నిబంధనకు లోబడి అనుభవించవలెనని అర్థం చెప్పుకున్నా, మన అస్తిత్వానికి— మన ఆత్మకు— త్యాగమే మూలసూత్ర మవుతుంది. ఇంతటితో మంత్రోక్తమైన భావం ఇంకా పూర్తికాలేదేమో అన్నట్లు ఆ వెనువెంటనే ఋషీశ్వరుడు మరొక ముక్క చెపుతాడు: "మరొకని సొత్తు ఆశించబోకు" అని. ప్రపంచంలోని సర్వ తత్వశాస్త్రాలూ, మతాలూ చెప్పే సత్యమంతా ఈ మంత్రంలో గర్భితమై వున్నదని నా అభిప్రాయం.

ఇప్పుడు ఈ మంత్రార్థం నేటికాలపు పరిస్థితులకు ఏ రీతిగా వర్తిస్తుందో చెపుతాను. విశ్వమంతటా పరమేశ్వరుడు పరివ్యాప్తుడై వున్నాడన్నప్పుడు—అనగా, బ్రాహ్మణుడూ భంగీ, పండితుడూ పాకీపనివాడూ, ఎరుూవా పెరయా— ఎవరు ఏవర్గానికి చెందినవారైనా—వారందరిలోనూ కూడా పరమేశ్వరుడు పరివ్యాప్తుడై వున్నప్పుడు, ఈ మంత్రం ప్రకారం వారందరిలోనూ ఒకరు అధికులూ కారు, ఒకరు అల్పులూ కారు; అంతా కేవలం పరస్పర సమానులే అవుతారు. కారణం, ఈ అందరిని సృష్టించినదీ ఒకడే సృష్టికర్త కనుక.

నేనిప్పుడు పఠించిన ఈ మంత్రం మన పురుషులు, స్త్రీలు, పిల్లలు, అందరియొక్క హృదయ పేటికలలోను పవిత్రంగా ప్రతిష్ఠితం కావలెనని నా కోరిక. నేను భావించే రీతిని దీనిలో సర్వహిందూమతసారమూ అంతర్గర్భితమై వున్నదని తలిస్తే, ప్రతి దేవాలయద్వారాన శిలాక్షరాలలో ఈ మంత్రమును అంకితమొనర్చ వలసినదని కూడా నాకు తోస్తుంది.

హరిజన్, 30-1-'37, పే. 407-08.

ఈ మంత్రాన్ని శ్రుత మొనర్చుకొనిన ఆ ఋషీశ్వరుడు పరమేశ్వరుని సర్వవ్యాపకత్వాన్ని ఉగ్గడించే ఉత్కృష్ట భావంతో ఆగలేదు. ఆయన ఇంకా ఇలా అన్నాడు. 'దేవుడు సర్వవ్యాపి కాబట్టి ఏవస్తువుగాని నీకు చెందినది కాదు; నీ శరీరమైనను నీదికాదు. నీకు కలిగిన సర్వానికీ దేవుడే సర్వాధికారి. ఆతని ప్రభుతకు తిరుగులేదు, అడ్డులేదు.' కావున ఏహిందూమతస్థుడు కాని ఈ విధమైన త్యాగచర్యను-దీనినే క్రైస్తవ పరిభాషలో "పునరుజ్జీవనము లేక ద్వితీయ జననం" అని అంటారు- చేయవలెనంటే, తాను అజ్ఞాన హేతువువల్ల తనకు చెందినదిగా భావించే సర్వమున్ను త్యజించి, దానిని ఈశ్వరునికి సమర్పణ చేయవలసి వుంటుంది. ఈ విధమైన త్యాగ, సమర్పణములు గావించినందుకు ఫలితంగా ఆతనియొక్క తిండి, గుడ్డ, ఇల్లు మొదలైన అవసరాలను తీర్చేభారమును దేవుడే వహిస్తాడని చెప్పబడింది. దీనిని బట్టి, ఈ విధమైన త్యాగ, సమర్పణలనే నిబంధనలను అనువర్తించినప్పుడే, జీవితావసరాలను అనుభవించేందుకు మనం అర్హులమవుతామని చెప్పబడింది. లౌకిక, లంపటములలో చిక్కుకొని, జీవితపు కేంద్రసత్యమైన ఈ త్యాగ సమర్పణములను విస్మరించకుండుటకు గాను, వాటిని మనం దినంనుంచి దినానికి చేస్తూనే వుండాలి. అన్నిటికీ మకుటాయమానంగా ఋషీశ్వరుడు ఇంకా ఇలా అన్నాడు. "ఎవరి సొత్తును గాని ఆశించకు", అని. ఈ మంత్రోక్తమైన సందేశం ప్రతి మానవ హృదయంలోనూ గర్భితమైవున్న అత్యున్నతపిపాసను-

అది లౌకికమైనా, పారలౌకికమైనా కూడా— తీర్చేందుకు ఉద్దేశింప బడినట్లుగా నేను భావిస్తాను. నేను ప్రపంచ మత గ్రంథ సముదాయంలో ఎంత వెదకినా ఈ మంత్రానికి మించిన సత్యం ఏమీ నాకు దొరకలేదు. నేను చదివిన మతసాహిత్యం— అది ఎంత కొలదిపాటి అయినా— అంతా తిరిగి స్మరణకు తెచ్చుకొని చూస్తే, వాటన్నిటిలోనూ ఏ మాత్రం మంచివున్నా అది ఈ శ్లోకభావంనుంచే పుడుతుం దని నాకు తోస్తుంది. విశ్వసోదరభావం కావాలంటే— మానవసహోదరత మాత్రమే కాక సర్వజీవ సహోదరత అయినా— అది నాకు ఈ మంత్రంలో గోచరిస్తుంది. ప్రభు వగు పరమేశ్వరునిలో— వివిధ విశేషణభూషితుడైన అత నిలో— అచంచల విశ్వాసము కావలెనంటే, అది నాకు ఈ మంత్రం ఉపదేశిస్తుంది. సర్వం పరమేశ్వరాధీనం చేసికొని, ఆతడే మన అవసరాలను తీర్చేభారం వహిస్తాడనే విశ్వాసం కోరితే— అదిన్నీ నాకు ఈ మంత్రంలో కరతలామలకమవు తుంది. ఆతడు నా తనువులోని, మీ అందరిలోని, నరనరం లోనూ అధినివేశుడై వుండడంబట్టి, సర్వజీవకోటి యొక్క సమానతాభావమున్నూ నాకు ఇందులో స్పష్టగోచరమవు తుంది. ఈ సమభావనిరూపణా సామ్యవాదసిద్ధాంతుల అభీ ప్సితాలను కూడా సంతృప్తిపరచడానికి సమర్థమైనదని భావి స్తాను. భగవంతునికి చెందిన ఈ సృష్టిసర్వస్వంలో ఏదిగాని నాదనే అహంభావానికి స్థానం లేదని ఈ మంత్రం నాకు బోధిస్తుంది. నాకుగాని, ఈ మంత్రాన్ని విశ్వసించే ఎవరికి

గాని, జీవితం ఒక పరమసమర్పణం కావలసివుండుటచే, అది తోడి జీవకోటియొక్క సంసేవనమునకు అంకితమై వుండవలసిన దన్న మాటను వేరుగా చెప్పబనిలేదు.

నా మతసారం ఇదే; హిందువులమని పిల్చుకునే అందరికీ ఇదే మతసారంగా భావింపబడదగినది. నా క్రైస్తవ ముసల్మాను మిత్రులకున్నా, తమ తమ మతగ్రంథాలన్నీ వెతికినా, ఇంతకు మించిన సత్యమేదికాని గోచరించదని కూడా ఉగ్గడించి చెప్పగలను.

హిందూమతం పేరిట నడిచే మూఢవిశ్వాసాలూ అవీ అనేకం వున్నాయన్నమాట నే నెరుగనిదికాదని తెలుపుతున్నాను. ఆ మూఢ విశ్వాసాలూ మొదలైనవి హిందూ మతాన్ని కపటాచ్ఛాదనంగా ఉపయోగించుకుని లోక ప్రచారం పొందుతున్నవని తలచుకొన్నప్పుడు నాకు చాలా బాధ కలుగుతుంది. అయినా ఉన్నదున్నట్లుగా చెప్పకొనక తప్పదు. ఈ మూఢవిశ్వాసాలలోకల్లా చెడ్డది అస్పృశ్యత అని చెప్పడానికి నే నెప్పుడూ సందేహించలేదు. ఇవన్నీ వున్నప్పటికీ, నేను హిందూమతస్థుడననే చెప్పకుంటాను. ఏమంటే, ఈ మూఢనమ్మకాలన్నీ హిందూమతంలో భాగమని నేనే మాత్రం నమ్మను. హిందూమత మూలసూత్రాలను పరిశీలిస్తే, అది, ఇప్పుడు మీకు నేను ఉగ్గడించి వివరించిన సత్యానికీ, నేను ఉదహరించిన ఈ మంత్రానికీ ప్రతికూలమైనది ఏదికాని హిందూమతానికి చెందినది కాదని తోసివేయవలసినదిగానే బోధిస్తాయి.

హరిజన్, 30-1-'37, పే. 410.

గీతాధర్మాన్ని అనుసరించేవాడు సర్వవస్తువులను సంతోషంతో విసర్జించడానికి సాధన చేస్తాడు. ఈ సంతోషం అనేది గీతాపరిభాషలో 'సమత్వం' అని పిలువబడుతుంది. గీతయొక్క పరిభాషలో సంతోషం అనేదీ, సుఖం అనేదీ అసంతోషానికీ, అసుఖానికీ వ్యతిరేకార్థకం కాదు. ఆ ద్వంద్వస్థితికి అతీతమైనది. గీతాసాధకునికి సంతోషమూ, అసంతోషమూ రెండూ వుండవు. ఆ ద్వంద్వాతీతమైన సమతాస్థితి సిద్ధించినప్పుడు అసుఖమనేది వుండదు, సుఖమనేదీ వుండదు, అపజయమనేదీ వుండదు, లేమి అనేదీ వుండదు, మమకారమనేదీ వుండదు.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 250.

మనము మన మృతికి— అది ఎవరికి ఎప్పుడు తటస్థించినా సరే— విచారించని కళను అలవరచుకోవాలి. మన మృతికి ఏ క్షణమూ భయపడని స్థితి అలవరచుకున్నప్పుడు, పైన చెప్పిన పరిస్థితి సిద్ధిస్తుందనుకుంటాను. మన జీవిత పరమార్థాన్ని ప్రతిక్షణం నిర్వహిస్తున్నామనే ఆత్మవిశ్వాసం చేకూరినప్పుడు, మనకు మృత్యుభీతి పూర్తిగా సడలిపోగలదని అనుకుంటాను.

మీరాకు బాపూ వ్రాసిన లేఖలు, 1949, పే. 301.

# 34
# దేవాలయము — విగ్రహారాధనము

ఉత్త విగ్రహం నాలో భక్తిభావం కలిగించదు. కాని విగ్రహారాధనము మనుష్య స్వభావంలో భాగమని నేననుకుంటాను. మనలో స్వభావతః సాంకేతిక రూపకల్పన చేసే బలవత్తర ప్రవత్తి ఒకటి వున్నది. ఇతర స్థలాలకంటె (church) దేవాలయంలో మనకు ఎక్కువ చిత్తశాంతి ఎందుకు కలగాలి? విగ్రహాలు ఆరాధనకు సహాయకరమైన ఉపకరణాలు. ఏ హిందూమతస్థుడు కాని విగ్రహమే దేవుడని అనుకోడు. విగ్రహారాధన ఒక పాపంగా నేను భావించను.

యంగిండియా, 6-10-'21, పే. 318.

నేను, నా అవగాహన ప్రకారం నిజమైన అర్థాలలో, ఒకవంక విగ్రహారాధకుడిననీ, మరొకవంక విగ్రహవిచ్ఛేదకుడిననీ, భావించుకుంటాను. విగ్రహారాధనకు మూలకందమైన భావానికి నేను విలువనిస్తాను. మానవజాతి అభ్యున్నతికి అది చాలా సాధనభూతమైనది. ఈ మన జన్మదేశాన్ని నలుగడలా ఆవరించి ప్రపూతమొనరించే వేలాది పవిత్ర దేవాలయాలన్నింటినీ నాశం పాలుకాకుండా కాపాగలడ శక్తికొరకు ఆశిస్తాను.

తాను అనుసరించే దైవారాధనా విధానం ఒక్కటే తప్ప తదితర విధానాలన్నీ నిరర్థకములని ఈసడించే మూర్ఖమైన ద్వేషోద్రేకంలో ఇమిడివున్న సూక్ష్మతరమైన విగ్రహా

రాధనాభావాన్ని నేను ఖండిస్తాను. ఈ అర్థంలో నేను విచ్ఛేదకుడినౌతాను. ఒక చక్కని చిన్న రాతిబొమ్మలోనో, స్వర్ణవిగ్రహంలోనో దేవుని స్వరూపాన్ని చిత్రించుకునే స్పష్టమైన, స్థూలమైన విగ్రహారాధనకంటె ఇది చాలా సున్నితమైన గుణంగల ద్వేషవిషంతో నిండిన విగ్రహారాధనమని వర్ణించవలసి వుంటుంది.

యంగిండియా, 28-8-'24, పే. 284.

ఆలయాలలో విగ్రహాలుండాలా లేదా అనేది మనో వైఖరిపైనను, అభిరుచిపైనను ఆధారపడిన విషయం. నేను హిందూ దేవాలయాలనూ రోమన్ క్యాథలిక్ ఆలయాలను, వాటియందు విగ్రహము లున్నవిగదా అన్న హేతువున అవి తప్పక చెడ్డవీ, మూఢవిశ్వాసంతో కూడినవీ అనిగాని, మసీదులునూ ప్రొటెస్టెంటు ఆలయాలునూ విగ్రహములు అందు లేవనే హేతువున మంచివనీన్నీ మూఢవిశ్వాసరహితము లనిన్నీగాని పరిగణించను. ఒక శిలువబొమ్మకాని, ఒక పుస్తకంకాని ఒక సాంకేతికరూపమైపోయి, విగ్రహం వలె ఆరాధనార్హమూ, అందువల్ల మూఢవిశ్వాసమూ అయిపోవచ్చునుకూడా. మరొకవంక బాలకృష్ణుని బొమ్మయొక్క లేక మేరీ కన్య చిత్రంయొక్క ఆరాధన మూఢవిశ్వాసరహితమైన భక్తిభావానికి ఆలంబనగా ఉపకరించవచ్చును. అది ఆరాధకుని హృదయవైఖరిపై ఆధారపడివుంటుంది.

యంగిండియా, 5-11-25, పే. 378.

"హిందూమతము ఏకేశ్వరారాధనమును చేపట్టిన యెడల క్రైస్తవమతమూ హిందూమతమూ సహకార భావంతో భారతదేశానికి సేవ చేయగలుగుతాయి" అని అన్నాడు క్రైస్తవ పాధిరీ.

"అట్టి సహకారం జరిగితే చూడాలని నాకూ చాలా వుంది" అని జవాబిచ్చి, ఇంకా ఇలా అన్నారు గాంధీజీ. "దానికి నాకు నా పరిష్కారసూత్రం వేరే వుందనుకోండి. కాని మొట్టమొదట, హిందువులు బహు దైవాలను పూజిస్తారనీ, విగ్రహారాధకులనీ మీరు చెప్పిన వర్ణన నేను అంగీకరించను. నేను స్వచ్ఛమైన హిందువుననే నా నమ్మకం. కాని నే నేమాత్రమూ బహు దైవాలను నమ్మను. నా చిన్నతనంలోనైనా నా కెప్పుడుగాని అట్టి నమ్మకం లేదు. అలా నమ్మమని చెప్పి నా కెవరూ బోధించనూ లేదు."

"ఇక విగ్రహారాధన విషయంలో, ఏదో ఒక రూపంలో అది లేకుండా ఎవరికీ నడవదు. తాను మసీదును దేవునికి నివాసమని భావించి ముసల్మాను మతస్థుడు దాని రక్షణకు తన ప్రాణాలైనా ఇస్తాడెందువల్ల? క్రైస్తవుడు చర్చికి (ఆలయానికి) ఎందుకు వెళ్లడం, బైబిలుమీద ప్రతిజ్ఞలు పడుతూ వుండడం ఎందుకని? వీటికి నా అభ్యంతరం వుందని తలచకండి. తర్వాత, మసీదులూ, గోరీలూ కట్టే నిమిత్తం చెప్పరాని ధనసంపదలు దానధర్మాలుగా ఇవ్వడం విగ్రహారాధనకాక ఏమవుతుందంటారు? మరి, రోమన్

క్యాథలిక్ మతస్థుడు మేరీకన్య సమక్షంలోనూ, (క్రైస్తవ) భక్తుల విగ్రహాల ముందరా— రాతిపైననో, క్యాన్వాస్ గుడ్డ పైననో, గాజుఫలకాలపైననో గీయబడిన ఉత్త ఊహాచిత్రాల ముందర— మోకరిల్లినప్పుడు చేస్తున్నదేమిటి ?"

"కాని," అని అడ్డుతగిలి, ఫాదిరీగారు ఇలా అన్నారు. "నేను మా తల్లిగారి బొమ్మను భద్రపరచుకుని, దానిని గౌరవభావంతో ముద్దిడుతుంటాను. కాని దానినిగాని, భక్తుల చిత్రాలను గాని ఆరాధించను. నేను దైవారాధనం చేసేటప్పుడు దేవుని సృష్టికర్తగానూ, సర్వమానవులకూ అతీతునిగానూ సంభావన చేస్తాను."

"ఆ ప్రకారమే మేము ఆరాధించేదిన్నీ రాతినికాదు; ఆ రాతిబొమ్మకాని, ఆ లోహవిగ్రహంకాని ఎంత మొరటు రూపంలో వున్నా, వాటిద్వారా మేము ఆరాధించేది ఆ పరమేశ్వరుణ్ణే."

"అయితే గ్రామీణులు రాయినే దేవునిగా పూజిస్తారు గదా ?"

"అది పొరపాటు. దేవునికంటె తక్కువైనదాన్ని దేన్నీ వారు పూజించడం లేదని నేను చెపితే నమ్మండి. మీరు మేరీకన్యముందు మోకరిల్లి, ఆయమ సహకారం కోసం ప్రాధేయపడునప్పుడు, చేస్తున్నదేమిటి ? ఆయమ ద్వారా మీకు దేవునితో పరిచితి కలిగించమని కోరుతారు. ఆ విధంగానే హిందూమతస్థుడున్నూ రాతి విగ్రహంద్వారా

దేవునితో సంపర్కం పొందడానికి ప్రయత్నిస్తాడు. మీరు మేరీకన్యయొక్క మధ్యవర్తిత్వాన్ని ఆశించడం నేను అర్థం చేసుకుంటాను. ముసల్మానులు మసీదులో ప్రవేశించగానే భక్తిపారవశ్యం పొందుతా రెందుకు? ఏమి, ఈ విశ్వమంతా మసీదు కాదా? మనపైన సర్వత్రా ఆవరించివున్న విశాలమైన నీలాకాశమంటపం సంగతేమిటి? అది మసీదుకంటె తక్కువదా? అయినా నేను ముస్లిములయొక్క మనోవైఖరిని అర్థంచేసుకుని, సానుభూతి చూపగలను. అది దేవుని సంస్పృశించుటకు వారి విశిష్టమార్గం. ఆ నిత్యుడైన పరమేశ్వరుని సన్నిధానమును చేరుటకు హిందువుల మార్గం హిందువులకున్నా వున్నది. మన దైవసాన్నిధ్య సాధనకు వాహనములు వేరువేరైనా, అందువల్ల ఆ పరమేశ్వరుడు వేరుకాజాలడు.

హరిజన్, 13-3-'37, పే. 39-40.

ఆదర్శానికి విశిష్టరూపకల్పన చేయడమనే అర్థంలో విగ్రహారాధన అనేది మానవ స్వభావంలోనే గర్భితమైవున్న గుణం. అది భక్తిసాధనకు విలువైన ఒక ఉపకరణం కూడా. మనము దివ్యమూ, పవిత్రమూ అయినదిగా భావించే ఒక గ్రంథానికి పూజ సల్పినా అది విగ్రహారాధనా సమానమే అవుతుంది. మనము దేవాలయమును గాని, మసీదును గాని భక్తిభావంతో ప్రవేశించడమే ఒక విధమైన విగ్రహారాధన అవుతుంది. అంతేకాక, పరిమితమూ, సంకుచితమూ అగు అవగాహనాశక్తితో జన్మించి వున్నందున మానవుడు వేరు

విధంగా వర్తించలేదు కూడా. చర్చిలలోనైనా, మసీదులలోనైనా, దేవాలయాలలోనైనా, చెట్టుపుట్టలకైనా స్వార్థ ప్రయోజనాలను ఆశిస్తూ మ్రొక్కుబడులూ, ముడుపులూ, ప్రార్థనలూ సల్పడం మాత్రం ప్రోత్సహించదగిన విషయం కాదు. స్వార్థపూర్వకమైన మ్రొక్కుబడులూ, ప్రార్థనాదికములూ చేయడానికీ విగ్రహారాధనకూ కార్యకారణ సంబంధం ఏమీలేదు. విగ్రహ సముఖాన్ని చేసినా, అదృశ్యమానమైన దైవంముందు చేసినా, వ్యక్తిపరమైన స్వార్థ ప్రార్థనము ఎల్లప్పుడూ చెడ్డదే. యంగిండియా, 26-9-'29, పే. 320.

## ఆలయాలలో ఆరాధన

శ్రీరామచంద్రుని ఆరాధించే నిమిత్తం ఏ హిందువు గాని ఆలయానికి పోవలసిన పనిలేదు. అయితే ఆలయంలోని విగ్రహసముఖమునగాని రామధ్యానం చేయలేనివానికి అది తప్పనిసరి అవుతుంది. అట్టివానికి ఆతని రాముడు ఆలయంలోనే కనిపిస్తాడు. ఇతరచోట్ల కనిపించడు. అది ఆతని దురదృష్టమంటే అనవచ్చునేమోకాని, అసత్యమనడానికి వీలులేదు. ఆ విధమైన అమాయికభక్తిని నేను భంగపరచుటకు ఇచ్ఛగించను.

హైందవభక్తులు ఆరాధించే శ్రీకృష్ణుడు పూర్ణ పురుషుడు. విమర్శకులు ఆతనిలో ఏ లోపము లెంచినా, ఆతని ఉత్కృష్టత ఒక వీసమైనా తరగదు. లక్షలాది రామభక్తులూ, కృష్ణభక్తులూ ఆయా నామధ్యానం ద్వారా జీవన్ముక్తులై

వున్నారు. ఈ అద్భుత ఫలితం ఏ విధంగా సిద్ధిస్తున్నదీ నాకు తెలియదు. అది గూఢ రహస్యం. అది ఋజువుపరిచేందుకు నే నెప్పుడూ ప్రయత్నించలేదు. నా హేతుజ్ఞానమూ, నా హృదయమూ దేవునియొక్క ఉత్కృష్టతరమైన గుణమూ, నామమూ, 'సత్య'మని చాలాకాలం క్రితమే గుర్తించి వున్నప్పటికీ, ఆ సత్యానికి నేను 'రామ' అని పేరు పెట్టి పిల్చుకుంటున్నాను. నా అంధకారమయమైన క్లిష్ట క్షణాలలో ఆ పేరు ఒక్కటే నన్ను రక్షించింది, రక్షిస్తున్నది. అది నా చిన్ననాటి అభ్యాసఫలితం కావచ్చు; తులసీదాసు నాపై చల్లిన మచ్చుమందు ప్రభావం కావచ్చు. ఏది ఏదైనా, ఇది ఒక చెక్కు చెదరని బలవత్తరమైన నిదర్శనం. ఈ వాక్యాలు వ్రాస్తున్నప్పుడు చిన్ననాడు మా యింటి ప్రక్కనవుండే రామాలయానికి ప్రతిదినం నేను పోతూవుండే దృశ్యం నా స్మృతివీథిలో మేల్కొని సంచరిస్తున్నది. అప్పుడు నా రాముడు ఆ ఆలయంలో అధివసించాడు. అనేక భయాలనుంచీ, పాపాలనుంచీ నన్ను రక్షించాడు. ఆవిగ్రహం యొక్క పూజారి చెడ్డవాడు కావచ్చును. అతని చెడ్డను గురించి నాకేమీ తెలియదు. ఆ ఆలయంలో చెడ్డపనులు జరిగివుండవచ్చును. అవికూడా నాకేమీ తెలియవు. అందువల్ల అవేమీ నన్ను ముట్టవు. నా విషయంలో చెప్పే ఈ మాటలు కోట్లకొలది హిందువు లందరికీ కూడా సమానంగా వర్తిస్తాయి. మానవజాతిలో అంతర్గర్భితమైన హృదయ పిపాసను ఆదేవాలయారాధన సంతృప్తం చేస్తుంది. దానిలో

లోపాలుంటే వాటిని సంస్కరించవచ్చును. కాని మనుష్యు లున్నంత కాలం అది మాత్రం వుండితీరుతుంది.

హరిజన్, 18-3-'33, పే, 6.

క్రైస్తవులకు చర్చిలు ఎట్టివో హిందువులకు దేవాలయములు అట్టివి. చర్చిలకు అమాయిక భక్తిభావంతోపోయే పామరజనులకు ఎట్టిఆధ్యాత్మిక ప్రయోజనం కలుగుతున్నదో ఆలయాలకు ఆ విధంగానే పోయే హిందువులకున్నూ అట్టి ప్రయోజనమే కలుగుతున్నది. హిందువునకు ఆలయం లేకుండా చేస్తే, ఆతని జీవితంలోకల్లా అత్యంతము విలువైన వస్తువును తొలగించినట్లవుతుంది. చాలా హిందూ దేవాలయాలు మూఢనమ్మకాలకీ, పాపాలకీకూడా తావలమైనాయన్న విషయంలో చాలావరకు నిజం లేకపోలేదు. ఆ విషయాన్ని బట్టి ఆలయసంస్కరణం అవసరమని తేలుతుందే గాని, ఆలయాల విలువ తగ్గదు.

హరిజన్, 11-2-'33, పే. 2.

నేనెరిగినంతవరకు దేవాలయం, మసీదు, సైనొగాగ్, అగియారీ మొదలైన వివిధ నామములలో ఏదో ఒక పేరుతో బరగే దైవగృహం ఒకటి లేకుండా నడిచే మతంకాని, మత శాఖకాని వున్నట్లు కనిపించదు. జీససుతో సహా గొప్ప మత సంస్కర్తలందరిలోను వాటిని నిర్మూలించినవారుకాని, అవసరం లేదని చెప్పినవారుకాని ఒక్కరూ వున్నట్లు నిదర్శనం లేదు. వా రందరూకూడా ఆలయాలలోనూ, సంఘం

లోనూ ఏర్పడిన అవినీతులను తొలగించవలెనని మాత్రమే ప్రయత్నించారు. వారిలో అందరూ కాకపోయినా, చాలా మంది ఆలయములనుంచి తమ సందేశ ప్రచారం కొనసాగించి వున్నారు కూడా. నేను ఆలయాలకు పోవడం చాలా సంవత్సరములుగా మానుకున్నాను. అందువల్ల అంతకు పూర్వం కంటె మంచివాడినైనానని మాత్రం నే ననుకోను. మా అమ్మగారు శరీరధార్ఢ్యం వున్నంతకాలం ఆలయానికి పోవడం ఎన్నడూ మానలేదు. నేను ఆలయాలకు పోవడం మానుకున్నవాడినైనా, నా కంటె మా అమ్మగారే బహుశా ఎక్కువ భక్తురాలని భావిస్తాను. ఈ ఆలయాలయొక్క, చర్చిలయొక్క, మసీదులయొక్క ఆలంబనద్వారా కోట్లాది జనులయొక్క భక్తివిశ్వాసాలు పోషణ పొందుతున్నాయి. వారిలో అందరూ మూఢవిశ్వాసులూ, మతోన్మాదులూ కారు. మూఢ విశ్వాసమూ, మతోన్మాదమూ వారు మాత్రమే గుత్తకు పుచ్చుకున్న విషయాలు కావు. ఈ దుర్గుణాలు మన అందరి మనస్సులలోనూ, హృదయాల లోనూ కూడా వేరు పాతుకుని వుండవచ్చును.

ఆలయాలు అనవసరమనడం దేవుడు, మతము, ఇహలోకవాసము అనవసరమని చెప్పినట్లే వుంటుంది.

హరిజన్, 11-3-'33, పే. 5.

సంస్కర్త అయినవాడు ప్రధానంగా పాటించవలసినది అంతఃపరివర్తనయే కాని, బాహ్యరూపాలలో మార్పు

తెచ్చుటకాదు. మొదటి మార్పు తీసుకువస్తే, రెండవది దానికదే చేకూరుతుంది. మొదటిది మారనిచో, రెండవది, ఎన్నిమార్పులు తెచ్చినా, ఉత్త శవమందిరంలా వుంటుంది. 'మాసోలియం' (శవాలయం) ఎంత అందమైనదైనా, అది ఒక గోరీయేగాని మసీదు కానేరదు. పవిత్ర స్మరణాంకితమైన బంజరు స్థలమైనను దేవాలయ సమానమై వర్ధిల్లవచ్చును.

హరిజన్, 29-4-'33, పే. 6.

వైష్ణవమత చిహ్నమైన పంగనామంలో ఏదో అసభ్యమైన అర్థం వున్నదంటుం దావిడ ('మదర్ ఇండియా' అనే గ్రంథంలో మిస్ మేయో) నేను పుట్టుకతో వైష్ణవుణ్ణి. నేనీ వైష్ణవాలయాలకు వెళ్ళిన రోజులు బాగా జ్ఞాపకంవున్నాయి. మాది పూర్వాచారపరాయణమైన కుటుంబం. నేను కూడా చిన్నప్పుడు ఆ నామం మొగానపెట్టుకునేవాణ్ణి. కాని నేను గాని మా కుటుంబంలోని ఇతరు లెవ్వరుగాని ఈ సర్వసాధారణమైన చక్కని చిహ్నంలో ఏవిధమైన అసభ్యసూచన గాని ఇమిడి వున్నట్లు ఎరగం. నేను ఈ వ్యాసరచన చేస్తూ వున్న ఈ మద్రాసు నగరంలోని వైష్ణవబృందాన్ని ఈ విషయమై అడిగాను. ఈచిహ్నానికి ఆపాదింపబడిన అసభ్యమైన అర్థాన్ని గురించివారికికూడా ఏమీ తెలియదన్నారు. అట్టి అర్థం దానికి ఏనాడుగాని లేదని ఋజువుపరచడానికి నేనిదంతా చెప్పడం లేదు. ఇవాళదాకా అమాయికంగా మనం అందరం ఆచరించే అనేక ఆచారాలలో అట్టి అసభ్యసూచనలకు అవకాశమున్నదన్నమాట లక్షలాది సామాన్య

జనానీకం ఎరగనే ఎరగరని మాత్రం నేను చెప్పగలను. శివలింగంలో అసభ్యసూచన వున్నదన్నమాట నేను మొట్ట మొదట ఒక మిషనరీల పుస్తకంలో చదివి తెలుసుకున్నాను. ఇప్పటికీ నేను శివలింగాన్ని చూచినప్పుడు, దాని ఆకారం లోగాని, దానిని చూచినప్పుడు కలిగే మనోవైఖరిలోగాని ఏ విధమైన అశ్లీలతా నాకు గోచరించదు. ఒరిస్సాలోని ఆలయాలలో అశ్లీల శిల్పవిగ్రహాలున్నట్లు కూడా నేను ఒక మిషనరీల పుస్తకం ద్వారానే తెలుసుకున్నాను. నేను పూరీ వెళ్ళినప్పుడు వాటిని చాలా అయిష్టంగానే పరిశీలించాను. కాని ఆ ఆలయాలను దర్శించుటకు పోయే వేలాది యాత్రికులు ఆ విగ్రహాలలోని అశ్లీలతను గుర్తించియే వుండరని కూడా నాకు తెలుసును. అచ్చట చేరే ప్రజలు అశ్లీలతను చూచే బుద్ధితో వచ్చివుండనందున, అది వారి దృష్టినే ఆకర్షించవని చెప్పగలను. యంగిండియా, 15-9-'27, పే. 311.

## 35

## అవతారములు

నా కృష్ణునికి చారిత్రక పురుషుడైన ఎవరితోటీ సంబంధం లేదు. తన గర్వానికి భంగం కలిగిందని చెప్పి ఇతరులను చంపిన కృష్ణునికిగాని, హైందవేతరులు స్త్రీలోలుడైన బాలునిగా వర్ణించే కృష్ణునికిగాని నేను తలవాల్చను. పూర్ణపురుషుడై అవతరించిన నా భావనలోని కృష్ణభగవానుని నేను విశ్వసిస్తాను. ఆతడు అన్నివిధాలా సంపూర్ణముగా

దోషరహితుడు. ఆతని ప్రేరణయే గీతారచనకు మూల కందము. ఆతడు లక్షలాదిజనులకు జీవితాదర్శప్రేరేపకుడు. మహాభారతకావ్యం ఆధునికచరిత్ర పుస్తకములవంటి గ్రంథ మనీ, మహాభారతంలోని ప్రతిముక్కా వాస్తవంగా జరిగినదనీ, మహాభారతంలోని కృష్ణుడు ఆతనికి ఆపాదింపబడినచర్యలన్నీ నిజంగా చేసివున్నాడనీ నాకు రుజువుపరచగలిగితే, నన్ను హిందూసంఘంనుంచి వెలివేసినా లెక్కించక, నేను ఆ కృష్ణుడు అవతారపురుషుడుకాడని తిరస్కరించడానికి వెనుదీయను. కాని నా దృష్టికి మహాభారతం ప్రధానంగా గొప్పధార్మిక గ్రంథం. అందలి చాలా ఘట్టాలు పారమార్థికభావాలకు ఉదాహరణపూర్వకమైన కల్పితగాథలనీ, అది చారిత్రక రచనగా ఏ మాత్రం ఉద్దేశింపబడినదికాదనీ నా అభిప్రాయం. అది మన అంతరంగాలలో జరిగే నిరంతర ద్వంద్వసంగ్రామాన్ని వర్ణించే ఊహాకథనం. అందలి ఘర్షణలను స్పష్టంగా కళ్లకుకట్టించే నిమిత్తం బాహ్యసంగ్రామరంగంలోని మనుష్యుల చర్యలుగా కల్పించి అభివర్ణితమైనాయి. అంతేకాక ఇప్పుడు వ్యవహారంలోవున్న మహాభారతగ్రంథం అసలు మూలానికి సరియైనదని కూడా నేను నమ్మను. అసలు మాతృకకు అనేకమైన మార్పుకూర్పులు చేయబడివున్నట్లు కూడా నా నమ్మకం.

యంగిండియా, 1-10-'25, పే 336.

ఏదో ఒక విశిష్టమైన మానవసేవ ఒనర్చిన వ్యక్తిని హిందూమతస్థులు అవతారపురుషునిగా భావిస్తారు. నిజానికి

దేహధారణ మొనర్చిన యావజ్జీవలోకమూ పరమేశ్వరావ తారమే అని చెప్పవలసి వున్నప్పటికీ, ప్రతిసజీవవ్యక్తినీ అవ తారపురుషునిగా భావించడమనేది ఆచార వ్యవహారంలో లేదు. తన తరంలో ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక జ్ఞానంతో వర్తించిన వ్యక్తిని ముందుతరములవారు అవతారపురుషు నిగా భావించి పూజిస్తూవుంటారు. ఈ రీతిగా వ్యవహరించ డంలో నాకు తప్పేమీ కనిపించదు. ఈ పని దేవునిఆధిక్యత నేమీ తగ్గించదు. సత్యానికి తద్వారా ఆపత్తేమీ సంభ వించదు. "ఆదాము దేవుడు కాదు; కాని ఆతడు దైవాంశ సంభూతుడు" అని ఉర్దూభాషలో ఒక సుభాషితం వుంది. ఆరీతిగానే ఎవరైతే ఎక్కువ ఆధ్యాత్మికంగా వర్తిస్తారో వారిలో ఆ దైవాంశ ఎక్కువగా వుంటుందని చెప్పవచ్చును. ఈ రీతి సమాలోచన ప్రకారమే హిందూమతంలో కృష్ణుడు అందరికన్నా పూర్ణుడైన అవతారపురుషుడని భావింప బడతాడు.

ఈ అవతార సంబంధమైన విశ్వాసం మానవుని ఉత్కృష్టమైన ఆధ్యాత్మికపిపాసకు నిదర్శనమని నా అభి ప్రాయం. తనలో దైవాంశాసిద్ధిని సాధించుకుంటే తప్ప మానవునికి ఆత్మశాంతి చేకూరదు. ఈ స్థితిని చేరుకొన యత్నించుటకంటె కోరదగిన ఉత్కృష్టసాధన వేరొకటిలేదు. ఇదే ఆత్మసాక్షాత్కారం.

యంగిండియా, 6-8-'31, పే. 205-06

దేవు డొక వ్యక్తి కాడు. ఆతడు అప్పుడప్పుడు మానవ రూపం దాల్చి భూమికి అవతరిస్తూ వుంటాడని చెప్పడం అర్ధసత్యం వంటిది. అవతారపురుషుడైనవాడు పరమేశ్వరునికి చేరికైన వర్తనము కలవాడని మాత్రమే దాని అర్థం. సర్వాంతర్యామి అయిన భగవంతుడు ప్రతి మనిషిలోనూ అధివసించివుంటాడు కాబట్టి, వారందరూ అవతారపురుషులే అన్నా అనవచ్చును. అయితే ఇది దరిలేని వాదన అవుతుంది. రాముడు, కృష్ణుడు మొదలైనవారిలో మనము దైవాంశను ఆపాదిస్తున్నాము. కనుక వారు అవతారపురుషులనబడుతున్నారు. నిజానికి వారు కేవలం మానవభావనా సంజనితులైన వ్యక్తులే. వారు వాస్తవంగా ఒకప్పుడు జీవించి వున్నారా లేదా అనే విషయం మానవమనస్సులో రూఢమై వున్న వారి చిత్రాన్ని ఏమీ మార్చలేదు. చరిత్రలో గోచరించే రాముని గురించి, కృష్ణునిగురించీ మాత్రమే చిక్కు ప్రశ్నలు పుడుతూవుంటాయి. వాటికి సమాధానాలు చెప్పడానికిన్నీ అన్నివిధాలైన వాదనలూ అవసరపడుతూవుంటాయి.

హరిజన్, 22-6-'47. పే. 200.

# 36

# వర్ణము; కులము

## వర్ణధర్మం

వర్ణమంటే ఒక మనిషిచేసే వృత్తియొక్క పూర్వనిశ్చయమన్నమాట. వర్ణధర్మమనగా ప్రతిమనిషీ తన పెద్దల వృత్తినే జీవనోపాధిసాధనంగా అవలంబించడం. అందువల్ల

వర్ణమంటే ఒక విధమైన పారంపర్యసూత్రమని చెప్పవచ్చును. వర్ణమనేది హిందూమతస్థు లందరి మీదను పైనుంచి బలిమిని ప్రవేశపెట్టబడిన దేమీకాదు. వారి క్షేమానికి బాధ్యులైన ధర్మకర్తలు వారికొరకు ఈ సూత్రాన్ని తెలుసుకున్నారు. అది మానవుడు సృష్టించినది కాదు. అది చిరంతనమైన ప్రకృతి సూత్రం— న్యూటను కనిపెట్టిన భూమ్యాకర్షణ సూత్రంవలెనే స్వతఃసిద్ధంగా నిత్యప్రవర్తితమైవున్న స్వాభావ నిర్వచనం. అది కనిపెట్టబడకముందునుంచీ కూడా భూమ్యాకర్షణసూత్రం ఏ విధంగా పనిచేస్తూనే వుండివున్నదో, ఆ రీతినే వర్ణధర్మంకూడా పనిచేస్తూనేవున్నది. అది కనిపెట్టే అదృష్టం మాత్రం హిందువులకు దక్కింది. కొన్ని భౌతిక ప్రకృతిసిద్ధాంతాలను తెలిసికొని ప్రయోగించుట ద్వారా పాశ్చాత్యజాతులు సులువుగా తమ ద్రవ్యసంపత్తిని పెంచుకొన గలిగారు. అదేవిధంగా హైందవులు ఈ నిర్నిరోధమైన సాంఘిక స్వాభావిక సూత్రాన్ని తెలుసుకోవడం ద్వారా ఆధ్యాత్మికరంగంలో లోకంలోని తదితర జాతు లెవరుగాని సాధించని ఔన్నత్యం సాధించగలిగారు.

వర్ణమునకు కులముతో ఏ మాత్రమూ సంబంధం లేదు. వర్ణమనే కపటవేషంతో విచ్చలవిడిగా సంచరించే ఈ కులభేదరాక్షసుడు నిర్మూలమగునుగాక! వర్ణవ్యవస్థకు ఒసగబడిన ఈ దుష్టాన్వయమే హిందూమతాన్ని, హిందూదేశాన్నికూడా పతనస్థితికి తెచ్చింది. వర్ణధర్మాన్ని సత్యంగా అనుసరించకపోవడమే మన ఆర్థిక, ఆధ్యాత్మికపతనాలకు

ప్రధానహేతువు. వృత్తిలేమికీ, దారిద్ర్యానికీ మూలకారణములలో ఇదొకటి; అస్పృశ్యతాదోషానికీ, మతాంతరతా ప్రాబల్యానికీ ఇదే ప్రధానహేతువు.

ప్రాచీన ఋషులు నిరంతర ప్రయోగపరిశోధనల ఫలితంగా బోధనము, సంరక్షణము, సంపత్సృష్టి, శరీరశ్రమ అనే చతుర్విధ వృత్తివిభజనసూత్రమును కనిపెట్టివున్నారు.

పురాతనకాలంలో స్వయంప్రవర్తితములైన వృత్తి కూటాలు వుండేవి. అవి ఆ వృత్తికిచెందిన అందరియొక్క పోషణకూ బాధ్యతవహించేవిధి వ్రాయబడని శాసనంలా అమలులో వుండేది. ఒక నూరేండ్లక్రితంవరకు వడ్రంగి కొడుకెవడుగాని లాయరువృత్తి యిచ్చినా పుచ్చుకునేవాడు కాదు. ఇప్పుడు ఎగబడుతున్నాడు. కారణం, డబ్బు చౌర్యం చెయ్యడానికి అంతకంటె సులభసాధ్యమైన వృత్తి ఇంకొకటి లేదని గ్రహించడమే.

పురాతనకాలంలో ఒకడు ఇంకొకని వృత్తిలోకి పోటీకి పోవలెననికాని, ధనం పోగుచేయవలెనని కాని దురాశ వుండేదికాదు. ఉదాహరణకు సిసిరో (గ్రీకుచరిత్రకారుడు) కాలంలో న్యాయవాదివృత్తి డబ్బుతీసికొనకుండా కేవలం గౌరవవృత్తిగానే వుండేది. ఒక మేధాశాలిఅయిన వడ్రంగపు పనివాడు తన తెలివితేటలను న్యాయవాదనమునకు కూడా వినియోగించగలిగితే, అది డబ్బుకోసంకాక, గౌరవానికే చేయవచ్చునుకూడా. వైద్యులు ఆ రోజులలో సంఘసేవకులుగా పనిచేసి, వచ్చినదానితో సంతృప్తిపొందేవారు.

ఇప్పుడో, వైద్యవృత్తి ఒక వ్యాపారమైపోయి, తుదకు సంఘా
నికి అపకారంగా కూడా పరిణమించింది. వైద్య, న్యాయ
వాది వృత్తులు కేవలం లోకసేవయే ఆదర్శంగా నడిచిన
రోజులలో అవి ధార్మికవృత్తులుగా భావింపబడి, గౌరవం
పొందేవి.

నేను నా పితరుల వృత్తినే అవలంబిస్తే, అది నేర్చు
కొనడానికి విద్యాశాలకు పోవలసిన అవసరముండదు. ఆ వృత్తి
ద్వారా నా ధనార్జన లేక జీవనోపాధి నిర్ణయమైపోయి వుండ
డంవలన, ఆధ్యాత్మిక శిక్షణం అలవరచుకొనడానికి తగిన
వ్యవధివుంటుంది. సుఖజీవనానికీ, నిజమైన ఆధ్యాత్మిక ధర్మ
సాధనకూ అనుకూలపరిస్థితులను కల్పించగల్గునది వర్ణధర్మమే
అని చెప్పకతప్పదు. ఇతర లౌకికధర్మాలన్నిటికీ ప్రాకులాడి,
ఆత్మజ్ఞానసాధనకు వినియుక్తంకావలసిన శక్తులు వ్యర్థమై,
కేవలధనార్జనకోసం ఆత్మని అమ్ముకోవలసివస్తుంది.

ఈ రోజులలో వర్ణమంటే దురభిప్రాయాలు ఏర్పడి
పోయాయి. వర్ణవ్యవస్థ క్రమంగా సాగినకాలంలో ఆధ్యా
త్మికసాధనకు పూర్ణావకాశం వుండేది. ఈ కాలంలోనైనా
నవనాగరకతకు దూరంగా మిగిలివున్న కొన్నికొన్ని గ్రామ
ప్రాంతాలకు పోయిచూస్తే అచ్చటి పల్లీవాసులైన ప్రజలలో
పట్టణనివాసులకంటె ఎంతటి పారమార్థికచింత, ఆధ్యాత్మిక
జ్ఞానము జీర్ణించివున్నవో గమనించవచ్చును. అప్పుడు నగర
వాసులలో ఆత్మనిగ్రహశక్తి ఎంతగా క్షీణించివున్నదీ తెలు
సుకొనగలుగుతాము.

సంపదను పెంచుకోనడానికిగాను మనం నూతన మార్గాలువెదకి అనుసరించవలసిన పనిలేదు; అది కూడని పనికూడా. పెద్దలనాటినుంచీ సంప్రదాయంగా వచ్చినవృత్తులనే, అవి స్వచ్ఛాదర్శంతో మిగిలినంతవరకూ, అనుసరించడం శ్రేయస్కరం. నా తండ్రి వ్యాపారస్థుడై వుండి నాలో ఒక వేళ క్షత్రియగుణాలే కనక ద్యోతకమైతే, అప్పుడు నేను జీవనోపాధికై కులవృత్తిఅయిన వ్యాపారమునే నిల్పుకుని, దేశరక్షణ అవసరమైన సమయాలలో ధనాపేక్షలేకనే క్షత్రియధర్మాన్ని చేపట్టి, సైనికునిగా పనిచేయవచ్చును.

యంగిండియా, 24-11-'27, పే. 390-91, & 395.

నా నిర్వచనప్రకారమైన వర్ణాశ్రమము సంఘంయొక్క మత, సాంఘిక, ఆర్థికవిషయికములైన అవసరము లన్నిటిని తృప్తిపరచగలదు. సంఘం అంతా ఆ ధర్మాన్ని అనుసరించడం ద్వారా ఆధ్యాత్మికోన్నతి సాధనకు కావలసినంత విశ్రాంతి, అవకాశాలు కలుగుతాయి. ఆ విధంగా మతవిషయికమైన పురోభివృద్ధికి అది అనుకూలిస్తుంది. ఈ ధర్మాన్ని అనుసరించడం ద్వారా సాంఘిక దురాచారాలు తొలగడమే కాక, ఒకరి వృత్తికి మరొకరు పోటీపడి విధ్వంసంచేయడమనేది కూడా తొలగుతుంది. వర్ణాశ్రమ ధర్మంకింద సంఘంలోని వ్యక్తులకు హక్కు-భుక్తములకంటె విధులు ప్రధానమైనవిగా భావింపబడుటచే సంపత్తి పంపకమనేది, సంపూర్తిగా ఆదర్శప్రాయంగా కాకపోయినా, ఎక్కువ న్యాయసమ్మతంగా

జరుగుతుంది. ఈ ధర్మాన్ని ప్రజలు పాటించకుండా, విధు లకు బదులుగా హక్కు-భుక్తములకే ప్రాధాన్యత ఒసగి, స్వార్థలాభోద్దేశంతో ఇష్టంవచ్చిన వృత్తులకు ఎగబడడంవల్ల వర్ణసంకరపరిస్థితి ఏర్పడి, తుదకు సంఘవ్యవస్థ తారుమారై పోతుంది. ఈ వర్ణవ్యవస్థలో తండ్రుల వృత్తులను పిల్లలు అనుకరించుట అనేది ఏమాత్రం ఒత్తిడివల్ల జరగదు. వేలాది సంవత్సరాలనుంచి వర్ణధర్మం, బాహ్యమైన ఒత్తిడివలన కాక, సంప్రదాయికమైన అభ్యాస, విశ్వాసాలవల్లనే కొన సాగివున్నది. చిరకాలానుభవంవల్ల వర్ణధర్మమును విధిగాను, న్యాయవిధానముగాను అంగీకరించి ప్రజానీకం దానిని ఇష్ట పూర్వకంగా అవలంబించివున్నారు. ఈ నాడు ఆధర్మమును ఎరుగని దేశాలు దానికి వ్యతిరేకమైన పద్ధతులను అనుసరిం చడం మూలంగా దుష్ఫలితాలను అనుభవిస్తున్నారు. ప్రస్తుతం నాగరక దేశాలుగా భావింపబడుతూవున్న సంఘ వ్యవస్థలలో ఏదిగాని సమాన భావప్రతిపాదకమైన సంతృప్తి కర పరిణతిని చేరుకొని వుండలేదు.

హరిజన్, 4-3-'33, పే. 5.

నేను వివరించిన వర్ణవ్యవస్థలో ఏ వ్యక్తికిగాని మాన సికమైన ఉన్నతపరిణతిని సమార్జించుకొనుటకు ఎట్టి ఆటంక ములుగాని వుండవు. వర్ణవ్యవస్థలో, కేవలం డబ్బుకోసం ఏ వృత్తికిపడితే ఆ వృత్తికి ఎగబడి పోటీచేసే పద్ధతికిబదులు, కుటుంబంయొక్క సాంప్రదాయకవృత్తిని విడువకుండా అవ లంబించడమొక్కటే విధ్యుక్తమైన నియమంగా వుంటుంది.

తద్వారా నేడు మన సంఘజీవితంలోని సంతోషమునూ, సౌందర్యమునూ నిర్మూల మొనరిస్తూవున్న అనారోగ్యకరమూ పరస్పర వినాశనకరమూ అయిన ఈ పోటీపద్ధతి తొలగిపోతుంది. హరిజన్, 29-7-'33, పే 8.

వర్ణమనేది జన్మనుబట్టి నిర్ణయమవుతుంది; కాని దాని బాధ్యతలను (obligations) అనుసరిస్తేనే అది నిలుస్తుంది. బ్రాహ్మణులైన తల్లిదండ్రులకు పుట్టినవాడు బ్రాహ్మణుడని పిలవబడతాడు; కాని ఆతడికి వయసు వచ్చేసరికి బ్రాహ్మణుని గుణాలు ఆతని స్వభావంలో ద్యోతకంకాని యెడల అతడిని ఒక బ్రాహ్మణుడని పిలువనవసరం లేదు. ఆతడు బ్రాహ్మణత్వంనుంచి పతనమైనా డన్నమాట. ఆ విధంగానే బ్రాహ్మణవర్ణంలో పుట్టని వాడొకడు తన ప్రవర్తనలో బ్రాహ్మణధర్మములను ప్రదర్శించినట్లయితే, అతడు అడకువవలన తనకు అర్హత లేదనినప్పటికీ బ్రాహ్మణుడుగా పరిగణింపబడతాడు.

ఈరీతిగా నిర్వచితమైన వర్ణధర్మం మానవ నిర్మితమైన తాత్కాలికసంఘటన కాక, మానవకుటుంబాన్ని పాలించే నిత్యమైన సార్వత్రికధర్మసూత్రమని తెల్లమవుతుంది. అట్టి ధర్మాన్ని అనుసరించిననాడు జీవితము సుఖప్రదమై, శాంతి సంతృప్తులను వెదజల్లుతుంది; కలహాఘూర్ణలను రూపుమాపుతుంది; పేదరికాన్నీ, దారిద్ర్యాన్నీ పారద్రోలుతుంది; జనసంఖ్యాపెరుగుదల సమస్యను పరిష్కరించ గలుగుతుంది; ఆధివ్యాధులను కూడా అంతమొందించగలదు.

వర్ణధర్మము వ్యక్తిజీవితసూత్రాన్ని విశదీకరించి, వ్యక్తివిధులను నిర్వచిస్తుందేకాని, వ్యక్తులకు ప్రత్యేకహక్కులను ఒసగదు. అందువల్ల ఆధిక్యత, న్యూనత అనే భావాలు వర్ణధర్మానికి సంపూర్ణంగా విరుద్ధమైనవి. అన్నివర్గములూ పరస్పర సమానములైనవే అనీ, సంఘానికి అన్నివర్గములూ సమానావసరములే అనీ గ్రహించాలి. ఈ రోజులలో వర్గములమధ్య హెచ్చు, తగ్గు అనే భావాలు ఏర్పడివున్నాయి. ఈ అభిప్రాయము సనాతన వర్ణవ్యవస్థకు కేవలం విరుద్ధమైనది. మన పూర్వీకులు కఠినమైన తపస్సుయొక్క ఫలితంగా వర్ణధర్మాన్ని కనిపెట్టి వున్నారు. తమ సాయశక్తులా ఆ ధర్మాన్ని అనుసరించడానికి ప్రయత్నించి వున్నారు. ఈ నాడు మన మాధర్మాన్ని తారుమారుచేసి లోకసమక్షాన్ని పరిహాసాస్పదులమైనాము.

వర్ణవ్యవస్థ అనేది ఎవరో ఒక హైందవ ఋషి కని పెట్టిన విధానమైనప్పటికిని, అది సార్వత్రిక ప్రయోగార్హత కలిగిన సాంఘిక ధర్మము. ప్రతి మతమునకును కొన్ని విశిష్టమైన లక్షణములుంటాయి. అట్టి లక్షణమేదిగాని ధర్మసూత్ర కలితమైనదైన యెడల, అది సార్వత్రిక ప్రయోగార్హతను కలిగివుండాలి. వర్ణవ్యవస్థ అనునది అట్టి ప్రయోగార్హత కలిగి వున్నదిగా నేను భావిస్తాను. ఈరోజున లోకానికది అర్థం కాకపోవచ్చును. కాని భావికాలంలో దానియొక్క, విశిష్ట సార్థకతను లోకం గుర్తించవలసిన అవసరం కలుగుతుందని

నానమ్మకం. తాను ఏవృత్తి ధర్మంలో పుడితే ఆవృత్తి ధర్మం ద్వారా ప్రతివ్యక్తీ తనకు విధ్యుక్తమైన సంఘసేవ నొనర్చి, తన బ్రతుకు సార్థకమొనర్చుకొనవలసినదిగా వర్ణ ధర్మం శాసిస్తుంది.

హరిజన్, 28-9-'34, పే 261-62.

## ఒక అమెరికావాసి అగు ఫాదిరీతో సంభాషణ

గాంధీజీ: "నేను తోటీపనివాడినైతే, నా కొడుకు మాత్రం తోటీపనివాడెందుకు కాకూడదు?"

"నిజంగానే? మీరంతవరకూ వెడతారా?"

"ఆ, వెడతాను. నా అభిప్రాయంలో తోటీ పని అంటే ఫాదిరీ పని కంటె ఏమాత్రమూ హీనమైనదిగా భావించను కనుక."

"అది నేనూ ఒప్పుకుంటాననుకోండి. అయితే మరి, లింకనుగారు, అమెరికా రాష్ట్రాలకు అధ్యక్షుడగుటకు బదులు కట్టెలు కొట్టే వృత్తిలోనే వుండిపోవలసిందని మీభావమా?"

"ఏమీ, కట్టెలు కొట్టడం వృత్తిగా కలవాడు అమెరికా అధ్యక్షుడు కాకూడదా? గ్లాడ్‌స్టన్‌గారు కట్టెలుకొట్టేవాడు."

"కాని ఆయన అది తన వృత్తిగా అంగీకరించలేదు."

"అల్లా అంగీకరించినా ఆయనకేమీ లోపమయ్యేది కాదు. నా అభిప్రాయం స్పష్టపరుస్తా వినండి. తోటీవృత్తిలో పుట్టినవాడు తోటీపనియే తనకు జీవనోపాధిగా చేసికొని, అటుపిమ్మట మరే పనులైనాగాని నిర్వర్తించవచ్చును.

కారణం, మీ దేశపు అధ్యక్షపదవిగాని, ఒక న్యాయవాది యొక్క పనిగాని ఎంత విలువగలదో తోటీపనికూడా అంతే విలువగల వృత్తి. నా అభిప్రాయం ప్రకారం అదే హిందూ మతధర్మం. ఇంతకు మించిన సామ్యవాదం ఇంకొకటుండదు. వర్ణధర్మం భూమ్యాకర్షణసూత్రం లాగ పని చేస్తుంది. భూమ్యాకర్షణశక్తినిమించి ఇంకా పైపైకి ఎగిరిపోవడం సాధ్యంకావచ్చునేమోగాని, ఈ వర్ణధర్మాన్ని, దాని పాలన శక్తినీ మాత్రం రద్దు చేయడం అసాధ్యం. అట్టి ప్రయత్నం వృథా అవుతుంది. అదే విధంగా ఒకరిపై కొకరు అధిక్యత పొందడానికి ఎగిరినా అంతే అవుతుంది. బ్రతుకుతెరువును చంపే పోటీవిధానానికి వర్ణధర్మసూత్రం విరుగుడు వంటిది.

హరిజన్, 6-3-'37, పే. 27.

## కులమా ?* వర్గమా ?

మానవుడు సంఘజీవి అగుటవలన ఏదో ఒకవిధమైన సంఘవ్యవస్థను సంఘటితపరచుకొనవలసి వుంటుంది. ఇక్కడ హిందూదేశంలో కులవిధానము పరిణతిపొందితే అక్కడ ఐరోపీయ దేశాలలో వర్గవిధానము పరిణతమయింది. ఈ రెండింటిలోను ఏ వ్యవస్థగాని బహుశా దైవోద్దిష్టమైన

* ఈ సందర్భంలో గాంధీజీ కులం (caste) అనే మాటను వర్ణం అనే మాటతో సమానార్థకంగా వాడారు. కులాలను ఖండించే టప్పుడు గాంధీజీ అందలి అధిక్యతాన్యూనతా భావాన్ని మాత్రమే ఖండిస్తారు. వంశపారంపర్యమైన కులవృత్తులను అనుసరించుటకును ఆయన వర్ణమని వ్యవహరిస్తూ వచ్చారు. దానిని ఆయన పూర్తిగా ఆమోదిస్తారు.

కుటుంబవ్యవస్థ అంత సహజసిద్ధమైనవిగా గోచరించవు. కుల పద్ధతిలో కొన్ని లోపాలున్నవంటే, వర్గపద్ధతిలోనూ ఆపాటి లోపాలు ద్యోతకమవుతాయి.

వర్గవిధానము కొన్ని సాంఘిక సుగుణాలకు పోషక ముగా ఉపకరించివుంటే, అంతకుమించి కాకుంటే అంత పాటిగానైనా కులవిధానమునూ అట్టి ప్రయోజనాన్ని చేకూర్చి వున్నది. కులవిధానంలో ఆధిక్యతాన్యూనతలు ధనికత్వంపైవ ఆధారపడకపోవడం అందలి ఒక ప్రత్యేక విశిష్టత. చరిత్రనుబట్టి చూస్తే ధనం అంత విచ్ఛేదకరశక్తి ప్రపంచంలో వేరొకటి లేదని తెలుస్తుంది. ధనాశ అనేది పవిత్రమగు కుటుంబసంబంధబాంధవ్యాలనైనా విచ్ఛిన్నం చేయగలదని శ్రీ శంకరాచార్యుల వారన్నారు. కుటుంబ వ్యవస్థాసూత్రానికి విస్తృతరూపమే కులం. ఈ రెండూ కూడా రక్తసంబంధంపైనా, వంశపారంపర్యతపైనా ఆధార పడతాయి. పాశ్చాత్య విజ్ఞానశాస్త్రజ్ఞులు పరంపరాగతత్వ మును అపోహగా త్రోసిపుచ్చి, పరిసరప్రభావానికే సర్వ ప్రాధాన్యతను ఒసగడానికి ప్రయత్నిస్తున్నారు. చాలా దేశాలయొక్క వాస్తవికానుభవము ఈ శాస్త్రజ్ఞులయొక్క నిర్ణయాలకు వ్యతిరేకంగా కనిపిస్తుంది. ఇక వారి సాంఘిక పరిసరప్రభావసిద్ధాంతాన్ని పరిగణించి చూచినా, అట్టి పరి సరప్రభావంయొక్క పరిణతికి కూడా, వర్గవిధానం ద్వారా కంటె కులపద్ధతిద్వారానే ఎక్కువ అనుకూల్యత వున్నట్లు సులభంగా రుజువుపరచవచ్చును.

కులభేదభావానికి పునాది ఆధిక్యతాగర్వంకాదు. ఆత్మ సంస్కృతిమార్గాల ఏర్పాటుమీద ఆధారపడి అది సంఘటితమయింది. సాంఘిక స్థిరతకూ, ప్రగతికీ అదే అత్యుత్తమమైన ఏర్పాటు. పరస్పర ప్రేమబంధంపైనా, బాంధవ్య రక్తసంబంధాలపైనా కుటుంబవ్యవస్థ ఏ రీతిగా ఆధారపడి వుంటుందో అదేరీతిగా, ఆర్థిక జీవితప్రమాణంమీదకాక, ఒకే ఒక కల్తీలేని జీవనోపాధిమార్గాన్ని అనుసరించే కొన్ని కుటుంబాల సమామ్నాయంపైన కులం ఆధారపడివుంటుంది. ఒక కుటుంబం ఏ కులానికి చెందాలి అనే విభాగనిర్ణయం ఎవరో కొందరు వ్యక్తుల ఇష్టాయిష్టాలకూ, పక్షపాతదృష్టికీ వదలబడదు. ఆ నిర్ణయం వంశపారంపర్యతా సూత్రంపై మీదనే ఆధారపడుతుంది. అది కేవలం ఒక సంస్కృతి విధానం మాత్రమే అయివున్నందున, ఒక కులానికి జన్మతః చెందివున్న ఒకానొక కుటుంబం, తాను అధికపరిణతమైన జీవితవిధానాన్ని అవలంబించినప్పటికీ తనకు పారంపర్యమైన కులానికే చెందివుండడమనేది న్యాయవిరుద్ధమైనట్లుగా భావించదు. సాంఘికవిషయికమైన మార్పులు చాలా నెమ్మదిగా వస్తాయన్నమాట మన అందరికీ తెలిసిన సంగతే. దానిని బట్టి కులపద్ధతిలో కూడా జీవితవిధానపు మార్పులకు అనుగుణంగా క్రొత్త ఉపకులాల ఏర్పాటుకూడా అనుమతించబడియే వున్నది. మేఘాల స్వరూపాలు ఎంత తెలియకుండా మారిపోతూవుంటాయో, ఈ కులాలలో మార్పులున్నూ అంత సహజంగానూ, సులభంగానూ జరిగిపోతాయి. ఇంత

కంటె చక్కని సామరస్యపూర్వకమైన మానవసాంఘిక వ్యవస్థావిధానాన్ని ఊహించడం కష్టం.

కులభేదమనేది ఆధిక్యతను గాని, న్యూనతనుగాని తెలపదు. అది కేవలం భిన్నమనోవైఖరులనూ, వాటినిబట్టి ఏర్పడే జీవితమార్గాలనూ స్థిరీకరిస్తుంది. కాని క్రమేపి ఈ కులాలమధ్య హెచ్చూ, తగ్గూ అనే భావం రూఢమైపోయి వున్నదన్నమాట కాదనడం నిష్ప్రయోజనం.

యంగిండియా, 29-12-'20, పే. 3.

ఆధునికార్థంలో కులమంటే నాకు నమ్మకం లేదని నేను చాలాసార్లు చెప్పియే వున్నాను. అది సాంఘిక ప్రయోజనంలేనిదీ, ప్రగతినిరోధకమైనదీ అని నా అభిప్రాయం. ఏ వ్యక్తిగాని మరొకవ్యక్తిపై అధికుడనని భావించమనేది దేవుని యెడలా, మానవుని యెడలా కూడా పాపకార్యమవుతుంది. అందువల్ల తాహతుభేదాలకు చిహ్నంగా వర్తించినంతవరకు కులమొక కాలుష్యమే అవుతుంది.

యంగిండియా, 25-3-'33, పే. 3.

మతధార్మికదృష్టినుంచి సర్వమానవులూ సమానులే. పాండిత్యంగాని, మేధశ్శక్తిగాని, ధనంగాని, అవికలిగివున్న వారికి లేనివారిపైన ఆధిక్యతను ఒసగజాలవు.

ది హిందూ, 19-9-'45.

# 37
# అస్పృశ్యత

నాకు ప్రజానీకంయెడలగల ప్రేమభావమే అస్పృశ్యతా సమస్యను నా జీవితంలోకి చాలా చిన్ననాడే ప్రవేశపెట్టింది. "ఈ పిల్లవాణ్ణి నువ్వు ముట్టకూడదు. వీడు అంటరానివాడు," అని మా అమ్మ ఒకసారి అంది. "ఎంచేత?" అని నేను ఎదురు ప్రశ్న వేశాను. అంటరానితనంమీద నా తిరుగుబాటు ఆనాటినుండియే ప్రారంభమయింది.

హారిజన్, 24-12-'38, పే. 393.

అస్పృశ్యత మతాంగీకృతమైన విధికాదు. అది రాక్షస సృష్టమైన (created by Satan) దుస్తంత్రము. రాక్షస శక్తి ఎప్పుడూ తన దుశ్చర్యల నిరూపణ నిమిత్తం శ్రుతి సూక్తాలను ఏకరువు పెడుతుందని ఒక నానుడి వున్నది. కాని శ్రుతిస్మృతులేవిగాని హేతువునీ, సత్యాన్నీ అతిక్రమించలేవు

వేదముల ఆంతర్యము పరిశుద్ధత, సత్యము, అమాయికత, సచ్ఛీలము, వినమ్రత, నిగర్వము, క్షమ, దైవభక్తి— ఇంకా స్త్రీ పురుషులనందరను ఉన్నత మనస్కులుగానూ, ధీరులుగానూ చేసే సర్వగుణాలతోనూ కూడుకున్నటువంటిది. జాతియొక్క పౌరజీవితంలో ఉత్కృష్టమైన పారిశుధ్యకార్యాన్ని నెరవేవారిని కుక్కలకంటె అధములుగా పరిగణించి, వారిమీద ఉమ్మివైచి అవమానపరచడంలో ఉన్నతశీలంగాని, ధీరత్వంగాని ఏమిలేదు.

యంగిండియా, 19-1-'21, పే. 22.

అస్పృశ్యతా దురాచారాన్ని నేనెన్నడుగాని సమర్థ నీయంగా భావించలేకపోయాను. అది సంఘశరీరం మీద మొలిచిన అసహజమైన ఒక విష గ్రంథివంటిదని సర్వదా నా అభిప్రాయం. అది కొన్ని తరాల తరబడిగా మనకు సంక్ర మించి వున్నమాట వాస్తవమేగాని, ఆ విధంగా మనకు సంక్రమించిన దురాచారాలు చాలా వున్నాయి. కన్యలను పడుపువృత్తికి అంకితం చేయడం హిందూమతంలో ఒక భాగమని అనుకోవలసివుంటే నేను సిగ్గుతో క్రుంగిపోతాను. కాని అది మన దేశంలో చాలా చోట్ల అనుసరింపబడుతూనే వున్నది. కాళికాదేవికి మేకలను బలి ఒసగడం కేవలం మత విరుద్ధమైన చర్యగా నేను భావిస్తాను. అది హిందూమతంలో ఒక భాగంగా నేను అంగీకరించను. హిందూమతం యుగ యుగాలనుంచి వర్ధిల్లిన మతం. హిందూస్థానంలోని ప్రజల మతానికి హిందూమతం అనే పేరు కూడా విదేశీయులు పెట్టారు. ఒకానొకప్పుడు పశుబలి ఆచారంగా నడిచివున్న మాట నిజమే. కాని అది అసలు మతమనిపించుకోదు; హిందూ మతమని అసలే అనిపించుకోదు. ఆవిధంగానే మన పూర్వులకు గోరక్షణలో విశ్వాసం ఏర్పడినపిమ్మట ఇంకా గోమాంసభక్షణ విసర్జించకుండావున్నవారిని సంఘబహిష్కృ తులను చేశారని నా నమ్మకం. అప్పుడు ఇరుపక్షాలకును మధ్య తీవ్రమైన ఘర్షణ జరిగి వుంటుందని నా ఊహ. గోభక్షణ మాననివారిపైన సంఘబహిష్కరణ చర్య తీసు కోవడమే కాక, వారి పాపానికి శిక్ష వారి భావిసంతతివారు

కూడా అనుభవించవలసివచ్చినదని ద్యోతకమవుతుంది. ఆ దురభ్యాసం మొట్టమొదట సదుద్దేశంతోనే పుట్టివుండి, తర్వాతకాలంలో ఆచారంగా విస్తరిల్లి, తుదకు మన పవిత్ర గ్రంథాలలోనికి దానిని సమర్థించే శ్లోకాలు అక్రమప్రవేశం పొంది, ఆ దురాచారాన్ని రూఢంచేయడంకూడా జరిగింది. నా ఈ సిద్ధాంతం సరిఅయినా, కాకున్నా, అస్పృశ్యతఅనేది హేతుబుద్ధికే కాక దయ, జాలి, ప్రేమవంటి సహజభావాలకి కూడా సంపూర్ణంగా విరుద్ధమైనదన్నమాటమాత్రం స్పష్టం. గోవును ఆరాధ్యదైవంగా భావించిన మతం మానవులయెడల అమానుషమూ, క్రూరమూ అయిన బహిష్కరణ చర్యను సహించడంగాని, సమర్థించడంగాని నాకు సాధ్యంగా తోచదు. నన్ను చీల్చి చెండాడినాసరే, నేను మాత్రం ఆ దళితవర్గాలను పెరవారిగా భావించడానికి అంగీకరించలేను. నేను హిందూమతాన్ని నా ప్రాణంకంటె హెచ్చుగా భావించడం మూలంగానే అందలి ఈ కళంకమును నేనింత దుస్సహమైన భారంగా భావిస్తున్నాను.

యంగిండియా, 6-10-'21, పే. 318-19.

మనమంతా ఒక్కకుంచెతోటే రంగులు వేయబడి, ఒకే సృష్టికర్త చేతులలో తయారైన బొమ్మలం. మనమంతా ఒకే ఒక పరమేశ్వరుని సంతానం. అందున మన అందరిలోనూ కూడా సమానంగా అపారమైన ఆధ్యాత్మికశక్తులు ఇమిడి వున్నవి. ఒక్క మానవుని అవమానపరచమంటే ఆ ఆధ్యాత్మికశక్తులను అవమానపరచినట్లే; తద్వారా

ఆ ఒక్క వ్యక్తినేకాక లోకమంతనూ కూడా అవమానపరచి నట్లే అవుతుంది.

ఆత్మకథ, 1948, పే 337.

హైందవహృదయంలోనుంచి అస్పృశ్యతాదోషాన్ని ప్రక్షాళనంచేసివేస్తే, ఒక్క భారతదేశంలోని తదితర మత సంఘము లన్నిటిమీదను మాత్రమేకాక, లోకమంతటి మీదనూ కూడా గొప్పప్రభావం చూపగలదని నా దృఢ విశ్వాసం. నాలో ఈ విశ్వాసం దినదినమూ బలపడుతూ వున్నది. కొన్ని లక్షలమంది మనుష్యులవిషయంలో అస్పృ శ్యతాభావాన్ని నా హృదయంనుంచి ఒకసారి తొలగించు కొనినపిమ్మట, మరికొన్నివేల ఇతరజనుల విషయంలో అట్టి భావాన్ని తిరిగి వుంచుకోలేను. హైందవహృదయం తనలో నుంచి గొప్ప, కొద్ది అనే భేదభావాన్ని తొలగించుకున్న నాడు, ఇతర సంఘాలతో సంబంధించిన, లేక, వాటిమధ్య వున్న ఈర్ష్యలూ, అపనమ్మకాలూ కూడా తొలగిపోవడానికి అవకాశ మేర్పడుతుంది. అందు నిమిత్తమే నేను ఈ సమ స్యపై నా ప్రాణం ఒడ్డివున్నాను. ఈ అస్పృశ్యతా నిర్మూ లనానికి నేను జరిపే పోరాటం ద్వారా హిందూమతంలోని స్పృశ్యులకూ అస్పృశ్యులకూ మధ్యనేకాక, హిందువులూ, ముస్లిములూ, క్రైస్తవులూ మొదలగు ఇతర మతసంఘము లన్నిటి నడుమాకూడా సమైక్యతను సాధించుట కొరకై పోరాడుతున్నానని గ్రహించాలి.

హరిజన్, 17-11-'33, పే, 4.

హిందువులకూ హిందువులకూ మధ్యగల అస్పృశ్యత తొలగడమేకాక, హిందువులకూ, క్రైస్తవులకూ, ముసల్మానులకూ, పార్సీలకూ, తదితరులకూ మధ్యకూడా అస్పృశ్యతా భావం వుండకూడదు. ఈ గొప్ప హృదయపరివర్తనం చేకూరిననాడు హిందూ దేశవాసులమంతా ఒకరిమీద ఒకరికి అపనమ్మకంగాని, అనుమానంగాని లేకుండా పరస్పర విశ్వాసంతో కూడిన ఒకే ఒక ప్రజాసమామ్నాయంగా జీవించ గలుగుతాము. వివిధములైన కపట రూపాలతో ప్రత్యక్షమయ్యే ఈ అస్పృశ్యతాదోషమే మన అందరిమధ్యా విభిన్న భావంకలిగించి, మన బ్రతుకులనే అసహ్యమూ, దుష్కరమూ చేసివేస్తున్నది. హరిజన్, 26-1-'34. పే. 4.

అస్పృశ్యతానివారణ అంటే లోకమంతటినీ ప్రేమించడం, సేవచేయడం అని అర్థమిస్తుంది. తద్వారా అది అహింసాసూత్రంలో భాగమైపోతుంది. అస్పృశ్యతా నివారణద్వారా మానవులమధ్యగల గోడలు పెకిలించివేయబడి, వివిధ జీవితవిధానాలమధ్యగల విభిన్నభావాలు నిర్మూలింపబడతాయి. అట్టి అడ్డగోడలు కట్టబడివుండడం లోకమంతటా మనం చూస్తూనే వున్నాం.

'యెరవ్డా మందిర్' నుంచి, 1945, పే. 33-34.

## 38
## గోసంరక్షణ

హైందవహృదయానికి చెందిన సుగుణములలోకల్లా విలువైనది గోసంరక్షణ. గోసంరక్షణలో నమ్మకం లేనివా

డెవడుగాని హిందూమతస్థుడు కావడమే అసాధ్యమనుకుం టాను. ఇది చాలా ఉత్కృష్టమైన నమ్మకం. నా దృష్టిలో గోపూజ అంటే అమాయికతను పూజించడం అన్నమాట. నేను గోవును అమాయికతయొక్క మూర్తీభావంగా తలు స్తాను. గోసంరక్షణ అనగా దుర్బలులయొక్క, నిస్సహాయుల యొక్క రక్షణ అని అర్థమిస్తుంది. ఓరిమితో కూడిన సేవవల్ల, తపస్సువల్ల పెంపొందించుకొనదగిన ఉత్కృష్టభావం గోసంరక్షణ. యంగిండియా, 8-6-'21, పే. 182.

నాకు గోసంరక్షణ అనేది మానవపరిణతిలో బయలు వడిన ఒక అద్భుతభావంగా తోస్తుంది. అది మానవుని తన యొక్క జాతి పొలిమేరను దాటిస్తుంది. గోవును నేను మానవజాతికి దిగువనవున్న సర్వజీవకోటికీ చిహ్నంగా భావి స్తాను. గోవుద్వారా మానవుడు సర్వజీవరాశితోటి ఏకీ భావాన్ని అనుభవించగల్గుతాడు. గోవునకే ఈ దివ్యత్వము ఎందుకు ఆపాదించబడినదీ నాకు స్పష్టంగా గోచరమవు తున్నది. హిందూదేశంలో పూర్వంనుంచీ గోవు మనిషికి అన్నిటికన్నా సన్నిహితమైన జంతువు. గోమాత సకలై శ్వర్యప్రదము. పాలనొసగడమేకాక, గోవు వ్యవసాయకార్య మును సాధ్యమొనరించిన జంతువు. గోవుబ్రతుకు కారుణ్య భావప్రధానమైన కావ్యము వంటిది. పరమసాధువైన గోవు యొక్క ముఖంలో కారుణ్యభావం చిప్పిల్లుతుంది. హిందూ దేశంలోని లక్షలాదిప్రజలకు గోవు తల్లితో సమానమైనది.

గోసంరక్షణ అంటే దైవసృష్టిలోని మూగజీవము లన్నిటి యొక్క రక్షణ అన్నమాట. పురాతన ఋషిఎవరో ఈ రక్షణ భావాన్ని మొదట గోవుకి వర్తింపజేశాడు. సృష్టిలోని తక్కువ వర్గాలకు చెందిన మూగజీవుల ఆక్రోశం మాటలలో వ్యక్తం కాలేనిదగుటచే ఎక్కువజాలిని పురిగొల్పుతుంది. గోసం రక్షణ అనేది హిందూమతము ప్రపంచమునకొసగిన మహిత మైన ఉదారసందేశం. గోవును సంరక్షించే హిందూమత స్థులు మిగిలివున్నంతవరకూ హిందూమతం సజీవంగా నిలిచి వుండగలదు. యంగిండియా, 6-10-'21, పే. 318.

మన శ్రుతిస్మృతులందలి పవిత్ర వాక్యములలోని యాథార్థ్యం అహింసాసత్యాలను ఎంత ఎక్కువగా ఆచర ణలో పెడితే అంతఎక్కువగా అవగాహనకాగలదనే అద్భుత సత్యాన్ని మన పూర్వఋషులు కనిపెట్టారు. ఈ విషయమైన నా విశ్వాసం దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతూవున్నది. సత్యాహింసలను ఎంత ఎక్కువగా అర్థంచేసుకుంటే అంత ఎక్కువగా మనసులో ఆత్మవికాసం కలుగుతుంది. పైన పేర్కొనిన ఋషీశ్వరులే గోసంరక్షణను ప్రతి హైందవునకును విధ్యుక్తధర్మంగా నిర్ణయించి, అది మోక్షసాధకమని ఉద్బో ధించివున్నారు. అయితే కేవలం జంతువులలో ఒక జంతు వుగా గోవును సంరక్షించుటవలన ముక్తిసిద్ధిస్తుందని నేను నమ్మలేను. ముక్తిసిద్ధించడానికి మనలోని మమకారము, ద్వేషము, క్రోధము, మాత్సర్యము మొదలైన దుర్గుణాలను సంపూర్తిగా నిర్మూలన మొనర్చుకొనవలసి వుంటుంది.

అందువల్ల మోక్షసిద్ధి చేకూర్చగలగడానికి గోరక్షణలో మామూలుగా అనుకునేకంటె ఇంకా చాలా విశాలమైన సర్వతోముఖమైనదొకటి ఇమిడివుండి వుండాలి. మోక్షసిద్ధి ప్రాపింపజేసే గోసంరక్షణభావంలో సహజసిద్ధంగా అనుభూతిగల ప్రతిజీవి రక్షణాకూడా ఇమిడివున్నదని బోధపరచుకోవాలి. అందువల్ల ఒక పురుషునికిగాని, స్త్రీకిగాని, శిశువునకైనా సరే, కష్టం కలిగించేలాగ మాట్లాడడంద్వారాగాని, ప్రపంచంలోని అన్నిటికన్నా దుర్బలమూ అధమమూ అయిన జీవికైనాసరే, బాధకలిగించడంద్వారా గాని, అహింసాధర్మాన్ని ఏ మాత్రం భంగంచేసినా అది గోసంరక్షణ భావానికి భంగమే కాగలదనిన్నీ, అది, పరిమాణంలో కాకపోయినా గుణంలో, గోమాంసభక్షణతో సరిసమానమైన పాపకార్యమవుతుందనీ నా అభిప్రాయం.

యంగిండియా, 29-1-'25, పే. 39.

గోసంరక్షణ తనయొక్క విధ్యుక్తధర్మంగా భావించే ప్రతి హిందువూ ప్రతి జీవజంతువుయొక్క రక్షణభారమూ కూడా తనపైవున్నదని గ్రహించాలి. కాని, మొత్తంమీద చూస్తే, ఆతడు తదితర జంతుకోటి రక్షణవిషయంలో విఫలుడై, ఒక్క గోవునే సంరక్షింపజాలినయెడల, అందుకని ఆతని నిందింప పనిలేదని భావిస్తాను. అందున, ఆతడు గోసంరక్షణకార్యమును చేయుట మంచిదా కాదా అన్నదే ఆలోచనీయాంశముగా తేలుతుంది. అహింసాసూత్రంలో నమ్మకమున్నవానికి జంతువులను చంపకుండుట ఒక విధ్యుక్త

ధర్మమైనచో, గోసంరక్షణకార్యము తప్పుపని కాజాలదు. ప్రతి హిందువూ, మతవిశ్వాసి అయిన ప్రతివ్యక్తికూడా ఆవిధంగానే భావిస్తాడు. సామాన్యధర్మంగానే ఏ జంతువునుగాని చంపకుండుట, ప్రత్యేకధర్మంగా గోవును సంరక్షించుట ఒక ఉత్కృష్ట విధి అనడానికి ఇక సందేహించనవసరం లేదు. దీనినిబట్టి గోసంరక్షణను ఒకవిధిగా స్వీకరించివుండుట హిందూ మతంలోని ఒక గొప్ప సుగుణమని అంగీకరించక తప్పదు. అయితే ఇతర జంతువులనుకూడా తన అభయహస్తంక్రిందకు తీసుకొనుటకు అవకాశమున్నప్పటికీ కేవలం గోసంరక్షణతో ఆగిపోయే హిందూమతస్థుడు హిందూమతంలోని ఆ సుగుణమును చాలా స్వల్పప్రమాణంలో ప్రతిబింబించిన వాడౌతాడు. సర్వజంతుకోటికిని గోవు సంకేతంగా భావింపబడి వున్నందున, గోసంరక్షణ అనేది హిందూమతస్థుడు ఆచరించవలసిన కనీసధర్మంగా భావింపబడింది.

గోసంరక్షణ కార్యంలో కొంత స్వార్థంకూడా ఇమిడి వున్నప్పటికీ ఆ సిద్ధాంతం వెనకవున్న వుద్దేశం 'కేవలస్వార్థబుద్ధి' మాత్రం కాదు. అది కేవలం స్వార్థబుద్ధితో కూడినదైతే, గోవులవలన కలిగే ప్రయోజనాలన్నీ ఉడిగిన వెనక, ఇతర దేశాలలోవలె ఇక్కడకూడా దానిని చంపివేయడం జరిగేది. దానివల్ల కలిగే లాభాలన్నీ ఉడిగిన పిమ్మట, దాని పోషణకార్యం ఎంత భారమైనప్పటికీ, హిందూ మతస్థుడెవరుగాని దానిని చంపి వదిలించుకోడు. నిష్ప్రయోజనమూ, వృద్ధమూ అయిపోయిన గోవులపోషణార్థమై ఉదార

హృదయులచే దేశమంతటను నెలకొల్పబడివున్న అసంఖ్యాక మైన గోశాలలు ఈవిషయంలో జరిగే ప్రయత్నాలకు గొప్ప నిదర్శనంగా వర్తిస్తాయి. ఈనాడు ఆ గోశాలలు చాలా పేద స్థితిలో వున్నప్పటికీ, దానినిబట్టి ఆ సేవా కార్యానికి ప్రోద్బలమైన ఉద్దేశంలోని విలువ తగ్గదు.

కావున గోసంరక్షణకు మూలమైన తాత్త్వికభావం చాలా ఉత్కృష్టమైనదని నా అభిప్రాయం. దీనివల్ల జంతు జాలానికి కూడా మనిషితోపాటు సమానస్థాయిని బ్రతికే హక్కు ఏర్పడుతుంది.

యంగిండియా, 11-11-'26, పే. 391-392.

# 39

# నా దృష్టినుంచి హిందూమతంలోని సుగుణాలు

పాశ్చాత్య దేశాలలో భౌతికశాస్త్ర విషయములందు ఏరీతిగా అద్భుతమైన ఫలితాలను సాధించివున్నారో, అదే విధంగా హిందూమతం ఆధ్యాత్మికమూ, ఆంతరంగికమూ, ఆత్మవిషయికమూ అయిన తాత్త్వికవిషయాలలో అంతకు మించిన అపూర్వ ఫలితాలను సాధించివున్నది. అయితే ఆ ఉత్కృష్టఫలితాలవైపు మన దృష్టిపోవడంలేదు. పాశ్చాత్య విజ్ఞానశాస్త్రంయొక్క భౌతికమైన పురోగతి మన కళ్ళను మిరుమిట్లు గొల్పుతున్నది. కాని ఆ పురోగతి నన్నుమాత్రం ఆకర్షించలేకపోయింది. ఉప్పెనగావచ్చిపడే భౌతికవాదాన్ని నిరోధించే ప్రత్యేకవిధిని నిర్వర్తించే నిమిత్తం సర్వజ్ఞుడైన

భగవంతుడే భారతదేశాన్ని ఆ మార్గంలో పురోగమించ కుండా చేశాడేమో అనికూడా అనిపిస్తుంది. ఎవరేమన్నా గాని హిందూమతాన్ని ఇంతవరకూ సజీవంగా నిలపగలిగిన విశిష్టత ఏదో దానిలో వున్నదన్నమాట స్పష్టం. బేబిలోనియా, సిరియా, పెర్షియా, ఈజిప్టు దేశాల నాగరికతలన్నీ తన కళ్లముందరే పతనమైపోయినా, హైందవ నాగరికత మాత్రం ఇంతవరకూ నిలిచివుంది. మీ చుట్టూ ఒకసారి చూడండి. రోము, గ్రీసుల నాగరికత ఏమైపోయింది? రోం అంటేనే ఇటలీదేశంగా భావింపబడిన పురాతన రోమక నాగరికత, గిబ్బన్ చరిత్రకారుడు వర్ణించిన ఆ ఉజ్వలచరిత్ర ఈ నాడు మీా కెక్కడైనా కనిపిస్తున్నదా? ఇక, గ్రీసుదశ చూడండి. లోక ప్రఖ్యాతమైన అట్టిక్ నాగరికత ఈనాడెక్కడ దాగివున్నది? తదుపరి హిందూదేశాన్ని పరికించండి. ఈ దేశపు పురాతనచరిత్ర గ్రంథాలు పరిశీలించి, పిదప మీా చుట్టూ వున్న ప్రస్తుత పరిసరాలను గమనించారంటే, తప్పక మీారు, "నిజమే, పురాతన హైందవ నాగరికత ఇంకా సజీవంగానే వున్నదని అనకుండా వుండలేరు. అక్కడక్కడ పేడకుప్పలుకూడా పేరుకుపోయినమాట వాస్తవమే, కాని వాటి అడుగున ఉత్కృష్టమైన భావసంపద మాటువడిపోయింది. భౌతికపదార్థ విజ్ఞానపథాన్ని కాకుండా ఆధ్యాత్మికజ్ఞానమార్గాన్ని అనుసరించి పరిణతి పొందివుండుటయే హైందవమతం ఈనాటివరకూ నిలిచివుండుటకు మూలహేతువు.

హిందూమతం ద్వారా ప్రచారితమైన వివిధభావాల లోనూ మూకజీవకోటితో మానవుని సమైక్యతను ప్రకటించే భావం చాలా విశిష్టమైనదిగా గోచరిస్తుంది. నా మనస్సుకి గోపూజలో చాలా విస్తృతమైన తత్వం గర్భితమై వున్నట్లు తోస్తుంది. ఇతరులను తమ మతంలోకి కలుపుకునే ఆధునిక ప్రచారభావం హిందూమతంలో లేకపోవడంకూడా నేను చాలా విలువైన విషయంగా భావిస్తాను. హిందూ మతం ప్రచారానికి ప్రాధాన్యం ఒసగదు. "బ్రతుకులోనే మతాన్ని ప్రతిఫలించుకో"మ్మని ప్రబోధిస్తుంది హిందూమతం. నేనూ నీవూ మన బ్రతుకులను మలుచుకొనడం మనచేతిలోని పని. అది చేస్తే, దాని ప్రభావం యుగయుగాలూ ప్రసారితం కాగలదు. తర్వాత, హిందూమతం ఎటువంటి ఉత్కృష్ట వ్యక్తులను సృష్టించిందో చూడండి. రామానుజుడు, చైతన్యుడు, రామకృష్ణుడు, ఇంకా ఎందరో ఆధునిక భక్తాగ్రేసరులు హిందూమతంపైన తమ ప్రభావాన్ని అంకితమొనర్చి వున్నారు. హిందూమతంయొక్క శక్తి ఏమాత్రం విలక్షణం కాలేదు; అది ఎంతమాత్రం నిర్జీవమతంకాదు.

హిందూమతంలోని మరొక విశిష్టాంశము అందలి ఆశ్రమధర్మ చతుష్కం. అటువంటి ధర్మనిర్ణయం లోకమంతటిలోనూ ఇంకెక్కడా కనిపించదు. క్యాథలిక్కు క్రైస్తవులలో బ్రహ్మచారులకు సమానార్థకమైన 'సెలిబేట్సు' అనే ఒక వర్గం వున్నదికాని, అది ఒకసాంఘిక నిబంధనగా లేదు; మన దేశంలో ప్రతిబాలుడును ప్రథమాశ్రమమైన

బ్రహ్మచర్యంలోకి ప్రవేశం పొందవలసివున్నది. ఈ ఆచారం యొక్క ఉత్కృష్టతను వేరుగా ఉగ్గడించ నవసరంలేదు. ఈనాడు మన దృష్టి మలినమైపోయింది; ఆలోచనలు అంతకంటె మలినమైపోయాయి; దేహాలు అన్నిటికన్నా మలినమైపోయాయి. దానికి కారణం మనం హిందూ మతాన్ని తిరస్కరించడమే.

నేనింతవరకూ స్పృశించని అంశం ఇంకొకటుంది. దేహాంతరప్రాప్తి లేక పునర్జన్మ అనునది కేవలం సిద్ధాంతమే కాక, వాస్తవవిషయంగా దానిని ఐరోపీయభావుకులు అంగీకరించనారంభించారని మేక్సుముల్లరుపండితుడు నలుబది సంవత్సరాలక్రితమే వ్రాసియున్నాడు. ఇది సంపూర్తిగా హిందూమతం ద్వారానే లోకానికి వెల్లడైన భావం.

ఈ నాడు వర్ణాశ్రమ ధర్మాలకూ, హైందవతత్త్వానికీ హిందువులే అపార్థముచెప్పి తిరస్కరిస్తున్నారు. ఈ పరిస్థితికి మందు సంస్కరణమేకాని, నిర్మూలనంకాదు. ముందు సత్యమైన హైందవాత్మను మనలో పునర్నిర్మితం చేసుకుంటే, అప్పుడు అది ఆత్మోన్నతి సాధనమైనదీ కానిదీ మనకే తెలుస్తుంది. యంగిండియా, 24-11-'27, పే. 396.

మతసాదృశ్యశాస్త్రంలో (comparative theology) పండితురాలైన ఒక అమెరికా దేశస్థురాలు ఆ శాస్త్రవిషయాలు నిష్పాక్షికంగా పరిశీలన చేసే నిమిత్తం ఇండియాకు వచ్చిన సందర్భంలో గాంధీజీని కలుసుకున్నప్పుడు, హిందూ

మతంయొక్క సారాంశాన్ని క్లుప్తంగా తెల్పమనికోరగా, గాంధీజీ ఈ విధంగా జవాబు చెప్పారు :

"సర్వజీవరాశియు (మానవులేకాక చేతనా ప్రపంచ మంతా) ఒక్కటే ; అనగా, సర్వవిశ్వాత్మకమైన ఒకేఒక చైతన్యపుంజమునుంచి జీవకోటియావత్తూ ఉత్పన్నమైనదనే యధార్థవిశ్వాసం హిందూమతంలో అంతర్గర్భితమైన ప్రధాన విషయం.

ఈ సర్వజీవైక్యతాభావం హిందూమతానికి ప్రత్యేక మైన ముఖ్యలక్షణం. దీనినిబట్టి ముక్తి ఒక్క మానవులకే కాక దైవసృష్టిలోని సకలజీవులకూకూడా సాధ్యమైనదే అను విశ్వాసం ఏర్పడింది. అయితే మానవదేహం ద్వారా తప్ప ముక్తి సాధ్యంకాకపోవచ్చును. కేవలం ఆ హేతువున మనిషి సర్వసృష్టికిని తానే అధినాథుడనని భావించడం పొరపాటవు తుంది. ఆతడు తద్వారా సర్వసృష్టికిని సేవకుడౌతాడు. మనం సర్వమానవసోదరత్వాన్ని గురించి మాట్లాడేటప్పుడు అది మానవునివరకే అనిన్నీ, మిగిలిన జీవలోకమంతా మానవుని ప్రయోజనానికీ లాభానికీ మాత్రమే ఉద్దేశింపబడినట్లున్నూ అనుకుంటూ వుంటాము. ఈ సర్వజీవరాశితోటీ సమాన భావాన్ని అలవరచుకొనుటకు మనం ఎంతైనా త్యాగసాధన చేయవలసివుంటుంది. అంత విశాలమైన ఆదర్శాన్ని సాధించే నిమిత్తం కనీసం కొంతవరకైనా మనం మన అవసరాలనూ, కోరికలనూ తగ్గించుకొనవలసి వుంటుంది. "అవసరాలను పెంచుకొనుమ"ని బోధించే ఆధునిక నాగరికతకు పైన చెప్పిన

సూత్రం కేవలం విరుద్ధమైనదని వేరుగా చెప్పనవసరంలేదు. అవసరాలనూ, కోరికలనూ పెంచుకొనుమని ప్రతిపాదించే వారు తద్వారా మానవుని విజ్ఞానం పెరుగుతుందనిన్నీ, విజ్ఞానం పెరుగుటద్వారా అపరిమితమైన సృష్టిరహస్యాన్ని మరింత ఎక్కువగా తెలిసికొనగల్గుతామనిన్నీ నమ్ముతారు. హిందూమతం దీనికి వ్యతిరేకమైన విశ్వాసాన్ని ప్రతిపాదిస్తుంది. ఏతత్సాధనకు సుఖాలనూ, అవసరాలనూ తగ్గించుకొనవలసినదనీ, కానియెడల అవి విశ్వాత్మతో మన సమైక్యతా సిద్ధికి ఆటంకములు కాగలవనీ హిందూ మతం బోధిస్తుంది.''
హారిజన్, 26-12-'36, పే. 365.

స్వచ్ఛమైన హిందూమత సిద్ధాంతంప్రకారం బ్రాహ్మణుడు, చీమ, ఏనుగు, శ్వపచుడు (కుక్కమాంసం తినువాడు), అంతా సమానులే. మన వేదాంతం అంత ఉత్కృష్టమైనదైనప్పటికీ మన ఆచరణలో అది విఫలమై చెడి, ఈనాడు మన నాసాపుటలకు దుర్గంధాన్ని ప్రసరిస్తోంది. విశ్వమానవ సోదరత్వాన్ని మాత్రమేకాక, విశ్వజీవకోటి సోదరత్వాన్ని ప్రతిపాదిస్తుంది హిందూమతం. ఆ భావంయొక్క ఔన్నత్యాన్ని చూస్తే మన తల తిరిగిపోవచ్చును ; కాని దానిని ఆచరణలో పెట్టుటకు ప్రయత్నం చేయవలసివుంటుంది. మనిషికీ మనిషికీ మధ్య సమానతను మనం మన జీవితాలలో సాధించగలిగిననాడు, మనిషికీ సృష్టిసర్వస్వానికీ మధ్య సమైక్యతను అనుభూతి మొనర్చుకోవడం సుసాధ్యమవుతుంది. ఆ సుము

హార్థం ఆగమించిననాడు భూమండలంలో శాంతిస్థాపన జరిగి, మానవసంఘం మైత్రి భావసంఘటిత మవుతుంది.

హరిజన్, 28-3-'36, పే. 51.

## సనాతన హిందూమతము

ఈ క్రింది కారణాలనుబట్టి నేను సనాతన హైందవ మతానికి చెందినవాడనుగా భావించుకుంటాను.

(1) నేను వేదాలను, ఉపనిషత్తులను, పురాణాలను, హైందవమత గ్రంథాలుగా పేర్కొనబడే తదితర పవిత్ర గ్రంథాలను, తద్వారా అవతార, పునర్జన్మ సిద్ధాంతములను విశ్వసిస్తాను.

(2) నేను ఒకవిధంగా వర్ణాశ్రమధర్మాన్ని విశ్వసి స్తాను; అనగా, ప్రస్తుతం అమలులోవున్న అర్థంలోకాక వైదికార్థంలో విశ్వసిస్తాను.

(3) సామాన్యార్థంలోకాక విస్తృతార్థంలో గో సంర క్షణవిధిని నేను విశ్వసిస్తాను.

(4) విగ్రహారాధనలో నాకు అవిశ్వాసంలేదు.

పైన వేదములను, ఇతరమతగ్రంథాలను పేర్కొన్న ప్పుడు వానిలో ఏవిగాని అపౌరుషేయములని చెప్పకుండా వూరుకున్న సంగతి పాఠకుల గమనికకు తెస్తున్నాను. వేదాలు కేవలం అపౌరుషేయములని నేను నమ్మకపోవడమే దానికి కారణం. బైబిలు, కొరాను, జెండ్ అవెస్తాలుకూడా వేదాలతో సమానంగా అపౌరుషేయములని భావించవలసి

వుంటుందని నా అభిప్రాయం. నేను హిందూమతవిశ్వాసిని కావడానికి ఆయా గ్రంథాలలోని ప్రతిమాటా, ప్రతిశ్లోకం దైవసంభూతమని నమ్మనవసరం లేదు. ఆ మహత్వపూరితమైన గ్రంథాలన్నిటినీ నేను మాతృకలలో పఠించి వుండ లేదు. కాని ఆ పవిత్ర గ్రంథాలలోని మూలసిద్ధాంతాలలో గర్భితమైన సత్యాన్ని నేను అనుభూతిపూర్వకంగా అవగాహన చేసుకున్నానని మాత్రం చెప్పగలను. వాటిపై వ్యాఖ్యానాలు, ఎవరు ఎంతటి పాండిత్య ప్రకర్షతో చేసి వున్నప్పటికీ, అవి హేతువునకును, నీతికిని విరుద్ధంగా కనిపించినయెడల నేను వాటికి బద్ధుడను కాజాలననికూడా చెప్పవలసివుంటుంది.

అహింస, సత్యము, బ్రహ్మచర్యములలో సంపూర్ణ సిద్ధిని పొంది, లౌకికమమకారములను విసర్జించినవానికి తప్ప, వేదాంతజ్ఞానంపై అధికారానికి అర్హతలేదనినుడివే హిందూ మతసూక్తిని నేను పూర్తిగా విశ్వసిస్తాను. గురూపదేశం యొక్క అవసరాన్ని నేను గుర్తిస్తానుగాని ప్రస్తుతయుగంలో సంపూర్ణమైన ఆత్మపారిశుద్ధ్యం, సంపూర్ణమైన ఆత్మజ్ఞానం వున్న గురువులు అరుదగుటచేత జనానీకమందరికీ అర్హమైన గురుసహాయం లభ్యం కాజాలదనీ, అందువలన వారు స్వీయ సాధనమీదనే ఆధారపడక తప్పదనీ తోస్తుంది. హిందూ మతంయొక్క మూలసూత్రాలు అన్ని మతముల మూల సూత్రములవలెనే, మార్పులేనివీ సులభగ్రాహ్యమైనవీ అగుటచే, గురుసహాయము లేనిదే మన మతసత్యాలను తెలుసు

కొనడం దుస్సాధ్యమని భయపడ నవసరంలేదు. దేవుని యందూ దేవుని ఏకత్వమునందూ విశ్వాసమూ, పునర్జన్మలో నమ్మకమూ, ముక్తికాంక్ష, ఇవి ప్రతి హిందూమతస్థుని ఎరికలోనూ వున్న విషయాలే.

నా సహధర్మినియెడల నాకుగల హృదయభావ మెటువంటిదో హిందూమతం యెడల నాకుగల భావంకూడా అటువంటిదని చెప్పటకంటె ఇతరవిధంగా దానితో నాకుగల అనుబంధాన్ని వర్ణించి చెప్పలేను. నా సహధర్మిణి నా హృదయాన్ని స్పందింపజేసినట్లు మరే స్త్రీగాని చేయదు. అయితే ఆమెలో లోపాలు లేకపోలేదు. నాకు కనుపించే కంటె ఎక్కువలోపాలే ఆమెలో వున్నవని తలుస్తాను. కాని ఆమెతో నాకొక విడరాని అనుబంధం వున్నది. అట్లే ఎన్ని లోపాలువున్నప్పటికి, ఎన్ని సంకుచితత్వాలు వున్నాగాని, హిందూమతంతో కూడా నాకు అట్టి సంబంధమేవున్నది. హిందూమతంయొక్క పవిత్రగ్రంథాలలో నాకు పూర్ణ ప్రవేశం వున్నట్లు చెప్పదగినవి ఒకటి భగవద్గీత, రెండు తులసీదాసరామాయణం. ఈ రెండును పఠించినప్పుడు నాకు కలిగే శ్రవణసుఖమూ, ఆనందమూ ఇంక దేనివలనగాని కలగదు. ఒకప్పుడు నేను ప్రాణావసానదశలో వున్నట్లు తలచిన సమయంలో నాకు భగవద్గీత ఒక్కటే మనశ్శాంతి చేకూర్చ గలిగింది. ఈ నాడు మన ప్రసిద్ధదేవస్థానాలలో జరుగుతూ వున్న దుర్నీతులను గురించి నే నెరుగుదును. చెప్పరాని చెడుగులు నేడు వాటిని ఆవరించివున్నప్పటికీ, నేను వాటిని

ప్రేమిస్తాను. నాకు వాటియెడలగల ఒకానొక విశిష్టమైన ఆకర్షణ ఇక వేటియెడలను కలగదు. నేను సంపూర్ణంగా సంస్కరణాభిలాషిని. కాని నా సంస్కరణాభిలాష నన్ను హిందూమతంయొక్క మూలసూత్రాలను నిరాకరించవలసినదిగా ప్రోద్బలపరచదు.

హిందూమతం సంకుచితమైన మతంకాదు. ప్రపంచంలోని అందరు మతప్రవక్తల ఆరాధనకూ అందులో చోటున్నది. సామాన్యార్థంలో అది ప్రచారప్రధానమైన మతం కాదు. అనేక జాతులను హిందూమతం తనలో కలుపుకుని జీర్ణించుకున్నది. కాని ఆ పని అదృశ్యమైన పరిణామక్రమాన్ని అనుసరించి జరిగింది. అందరును వారివారి విశ్వాసానుసారంగా, అనగా వారివారి స్వధర్మానుసారంగా వర్తించవచ్చునని హిందూమతం బోధిస్తుంది. అందువల్ల అన్ని మతములతోను సామరస్యసంబంధాలు ఏర్పడి, శాంతియుతమైన మార్గాన్ని అది కొనసాగిపోతుంది,

యంగిండియా, 6-10-21, పే. 317-18.

## హైందవమతము నిత్యసంవర్ధని

మూలమునందు స్వచ్ఛమూ అకలుషమూ అయివుండి, ప్రవాహమార్గంలో కలుషాలను తనలో కలుపుకొని, ముందుకు సాగిపోయే గంగానదీమతల్లితో హిందూమతాన్ని పరిపోల్చవచ్చును. గంగాప్రవాహినివలెనే హిందూ మతమున్నూ, మొత్తంమీద చూస్తే, లోకశ్రేయస్కరంగా

వర్తిస్తుంది. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క ప్రాంతీయ రూపం దాల్చినా రూపవైవిధ్యంలో గర్భితమైన ఆత్మ పదార్థం ఒకటిగానే నిల్చుకొని వుంది. ఆచారం మతం కాదు. ఆచారాలు మారవచ్చునుగాని మతమనేది మార్పు లేకుండా నిలుస్తుంది.

హిందూమతంయొక్క స్వచ్ఛత ఆ మతస్థుల ఆత్మ నిగ్రహంమీద ఆధారపడి వుంటుంది. తమ మతానికి విప త్కర పరిస్థితులు ఏర్పడినప్పుడల్లా హిందూమతస్థులు కఠిన మైన తపశ్చర్య జరిపి ఆ విపత్తైతువులను పరిశోధించి, వాటిని ఎదుర్కొనుటకు తగిన చర్యలను అవలంబిస్తూనే వచ్చారు. హిందూ శాస్త్రాలు నిరంతరం ప్రవర్ధమాన మవుతూనే వచ్చాయి. వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, పురా ణాలు, ఇతిహాసములు, ఇవన్నీ ఒకే కాలమున పుట్టినవికావు. ఒక్కొక్కటి ఒక్కొక్క కాలములో, ఒక్కొక్క పరిస్థితి యొక్క అవసరాలను తీర్చుటకు పుట్టివుండుటచే, వాటిమధ్య కొంత పరస్పర వైరుధ్యం ప్రదర్శితమవుతూ వుంటుంది. ఈ మతగ్రంథాలు నిత్యసత్యాలను తిరిగి నిర్వచించవు. అవి ఆ గ్రంథాలు రచింపబడిన కాలపరిస్థితులలో ఏరూపంలో ఆచరణలో వుండివున్నదీ మాత్రమే తెల్పుతాయి. ఒకా నొక కాలానికి సరిపోయిన ఆచారం ఇంకొక కాలంలో గుడ్డిగా ఆచరిస్తే, అది ప్రజలను వైఫల్యత అనే రొంపిలో దింపివేయడం జరుగుతుంది. ఒకానొకప్పుడు జంతుబలి ఆచా రంగా వున్నదిగాదా అని, దానిని ఈనాడు పునరుద్ధరించ

వలసిందేనా ? ఏనాడో గోమాంసభక్షణ ఆచారంగా నడిచిం దిగదా అని ఇప్పుడు కూడా మనం ఆ పని తిరిగి చేయవల సిందేనా ? ఒకానొకప్పుడు దొంగతనం చేసినవారికి శిక్షగా చేతులూ కాళ్లూ నరకడం ఆచారమయివుండేది గదా అని ఆ ఆటవికాభ్యాసాన్ని తిరిగి ఈనాడు అవలంబించవలసిందేనా ? బహుభర్తృత్వం ఇప్పుడు పునరుద్ధరణ యోగ్యమవుతుందా ? అతిబాల్యవివాహాలను ఈనాడు ప్రోద్బలం చేయవచ్చునా ? ఒకానొక కాలంలో ఒక మానవకూటాన్ని సంఘదూరులుగా ఒనర్చడం జరిగింది గదా అని, ఇంకా ఈ నాటికీ వారి అమాయికులైన వారసులందరినీ సంఘబహిష్కృతులుగా పాటించడం న్యాయమేనా ?

ప్రవాహం ఆగిపోయి, నీరు పాచిపట్టునట్లు నిలిచి పోవడం హైందవమతస్వభావానికి విరుద్ధమైన గుణం. జ్ఞానం ఏ విధంగా అపారమో, సత్యంయొక్క ప్రయోగసాధ్యతలు కూడా ఆ విధంగానే అనంతం. మనలో మన ఆత్మశక్తులను గురించిన అనుభవజ్ఞానం దినదినం పెరుగుతూనే వుంటుంది. అది అట్లా పెరగడమే మనకు శ్రేయస్కరం. సత్యము నిత్య మైనదైనప్పటికీ, నూతనమైన అనుభవాలు నూతనమైన విధు లను గరపుతూ వుంటాయి. సత్యంయొక్క సంపూర్ణ స్వరూ పాన్ని తెలుసుకోవడం ఎవరి తరం ?

యంగిండియా, 8-4-'26, పే. 131-32.

నేను ప్రపంచంలోని ఇతరమతాలను భక్తిపూర్వకంగా పరిశీలనచేయడం ద్వారానూ, అంతకంటె ఎక్కువగా నా

స్వీయానుభవపూర్వకంగానూ, భగవద్గీతలోని సమన్వయ భావానుసారంగా హిందూమతబోధనలను అనువర్తించుటకు ప్రయత్నిస్తున్నాను. హిందూమతసూత్రాలను బలాత్కారంగా సాగదీయడం కాకుండా, వాటిలో సహజంగా అంతర్గర్భితమైవున్న భావవైశాల్యాన్ని బయలు పరచడానికి యత్నిస్తున్నాను. మతగ్రంథసంపుటాలలో పూడ్చిపెట్టబడినదిగా కాక, తన కన్నబిడ్డతో తల్లి మాట్లాడేలాగున ప్రేమతో మనకు త్రోవజూపే జీవన్మతమాతృకగా హిందూమతాన్ని నేను సంభావిస్తున్నాను. నేను అనుసరిస్తున్నది చరిత్రసమ్మతమైన విధానమేగాని వేరుకాదు. మన పూర్వీకులైన పెద్దల మార్గమే నేను అనుసరిస్తున్నాను. ఆదిలో మన పూర్వీకులు ఒకానొకనాడు క్రుద్ధదేవతలను సంతృప్తి పరిచే నిమిత్తం జంతుబలి ఒసగేవారు. మన పూర్వీకుల పరంపరలో తరువాతి కాలంవారు 'యజ్ఞం' అనే మాటకే వేరు విధంగా అర్థం చెప్పుకుని, బలిచేయవలసినది మన ఆంతర్యంలోని దుస్వభావాన్ని అనిన్నీ, తద్వారా సంతృప్తిపడేది క్రుద్ధదేవతలు కాక, మనలో గర్భితమైన ఏకైకమూ సజీవమూ అగు దివ్య చైతన్యమే అనిన్నీ సమన్వయించి వున్నారు.

హరిజన్, 3-10-'36, పే. 266.

నన్ను లోకాన్ని విసర్జించిన సన్యాసిగా భావించడం పొరపాటు. నా జీవితానికి మార్గదర్శకములుగా పెట్టుకున్న ఆదర్శములను నేను సామాన్య లోకమంతకును స్వీయకరణీయములుగా ప్రతిపాదిస్తూ వున్నాను. ఆ ఆదర్శములు నాలో

క్రమక్రమంగా పరిణతిపొందాయి. అడుగడుగునా ఆలోచ
నతో, విమర్శనపూర్వకంగా, ఇష్టపూర్తిగా నేను వాటిని
అవలంబించడం జరిగింది. నా ఇంద్రియ నిగ్రహమూ,
అహింసావిధానమూ నా ఆత్మసాధన ఫలితాలుగా పుట్టినవి;
లోకాసేవా కార్యక్రమంలో అవి అవసరమైనాయి. దక్షి
ణాఫ్రికాలో నేను గడవపలసివచ్చిన ఒంటరి జీవితంలో
గృహస్థుడుగా అయినా, సంఘసంస్కర్తగా అయినా, రాజ
కీయవాదిగా అయినా ఆయావిధుల సక్రమాచరణమునకు
దాంపత్యజీవిత విషయంలో కఠినమైన శిక్షణమూ, పరస్పర
మానవసంబంధాల విషయంలో— నా స్వదేశస్థులతో గాని,
తెల్ల దొరలతోగాని— అహింసా సత్య సూత్రముల నిర్వక్ర
మైన ఆచరణమూ అవసరమైనాయి. నేను సామాన్య మాన
వులకంటె మించిన వ్యక్తినని కాని, వారికన్న నాకు అసా
మాన్యమైన శక్తిసామర్థ్యములు వున్నవని కాని అనుకోను.
అత్యంత పరిశోధనాఫలితంగా నేను తెలుసుకున్న అహింసా
సూత్రం గాని, ఇంద్రియనిగ్రహాభ్యాసంగాని లోకాతీతమైన
విషయాలుగా నేను ప్రదర్శించడం లేదు. నాతో సమాన
మైన ఆశావిశ్వాసాలు పెంపొందించుకుని, నేను చేసిన రీతి
సాధన చేసినయెడల ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూకూడా నేను
పొందిన ఫలితాలను పొందడం సుసాధ్యమేగాని, ఏమాత్రం
అసాధ్యం కాదని నిస్సందేహంగా చెప్పగలను.

హరిజన్, 3-10-'36, పే. 268.

సత్యము తక్క వేరు దైవము లేదన్నది నా జీవితాను భవమంతా ఏకరీతిగా నాలో పురికొల్పిన విశ్వాసం. ఆ సత్యమును నిరూపించుటకు అహింసామార్గముతప్ప వేరుమార్గము లేదన్న విషయం ఈ గ్రంథంలోని ప్రతి పుటలోను పాఠకునికి గోచరము కానిచో, ఈ అధ్యాయము లన్నిటిని నేను వ్రాయుటకు పడిన శ్రమ వృథాఅయినట్లే భావిస్తాను. నా యత్నం సర్వమూ విఫలీకృతమైపోయినాగాని, ఆ లోపము సర్వమూ వాహనమైన నాదే కాని ఆ ఉత్కృష్టసూత్రమునకు చెందినది కాజాలదని చదువరులను గ్రహించగోరుతాను. అహింసాధర్మాచరణ విషయంలో నా ప్రయత్నములు ఎంత హృదయపూర్వకమైన వైనప్పటికి, అవి ఇంకను తగినంత పరిపక్వతను, సిద్ధిని పొందివుండలేదని చెప్పవలసి వుంటుంది. నేను కొలదిపాటిగా, క్షణమాత్రంగా పొందిన సత్యదర్శనము దైనందినం మన కన్నులను మిరుమిట్లుగొల్పే సూర్యకిరణముల కంటె కోటిరెట్లు తేజోవంతమైన సత్యజ్యోతిస్సును వర్ణించుటకు చాలినంత శక్తివంతంకాదు. ఆ బ్రహ్మాండమైన కాంతిలహరియొక్క అస్పష్టకిరణశకలం మాత్రమే నాకు దృగ్గోచరమైనది. కాని నా ప్రయోగాలన్నిటియొక్క ఫలితంగా సంపూర్ణమైన అహింసాసిద్ధిపొందిన పిమ్మటనే సంపూర్ణమైన సత్యదర్శనం కాగలదనిమాత్రం రూఢిగా చెప్ప గలను. విశ్వసృష్టిలోని అల్పాల్ప జీవాన్నికూడా ఆత్మసమంగా ప్రేమించగలిగితేనే విశ్వాత్మకమూ, సర్వవ్యాప్తమూ అయిన ఆధ్యాత్మిక సత్యాన్ని ముఖాముఖీ సంద

ర్శించగలుగుతాము. అట్టి ఆశయాన్ని అభిలషించే వ్యక్తి ఏ జీవితరంగం నుంచిగాని తాను దూరంగా వుండజాలడు. ఆ హేతువువల్లనే నా సత్యాన్వేషణమార్గం నన్ను రాజకీయ రంగంలోనికి తీసికొనివచ్చింది. మతానికీ రాజకీయాలకూ సంబంధం లేదని చెప్పేవారికి మతం అంటే ఏమిటో అర్థం కాలేదని నేను నిగర్వంగానూ, నిస్సంకోచంగానూ ఉగ్గడించ గలను.

ఆత్మపారిశుధ్యం అలవరచుకుంటేగాని సర్వజీవకోటి తోనూ సమైక్యభావం సిద్ధించదు ; ఆత్మపారిశుధ్యంలేనిదే అహింసాధర్మం రిక్తస్వప్నప్రాయమై నిల్చిపోతుంది ; పరిశుద్ధ హృదయులకు తప్ప దైవసాక్షాత్కారం సిద్ధించదు. అందు వల్ల ఆత్మపారిశుధ్యమనగా సర్వజీవితరంగాలలోనూ పారిశుధ్య మని అర్థంచేసికొనవలసి వుంటుంది. పారిశుధ్య మనేది అంటు వ్యాధిలా వ్యాపించే గుణంగలదగుటచే, వ్యక్తిగతపారిశుధ్యం పరిసరాల పారిశుధ్యానికి కూడా దారితీయకతప్పదు.

కాని ఈ ఆత్మ పారిశుధ్యసాధనాపథం చాలా కష్ట తరమైన ఉన్నత పర్వతాధిరోహణమార్గం వంటిది. సంపూర్ణ పారిశుధ్యం సాధించవలెనంటే మనసావాచా కర్మణా సర్వో ద్రిక్తులనుంచీ విముక్తం కావలసివుంటుంది. ప్రేమద్వేషాల వంటి, మమకార తిరస్కారాలవంటి ద్వంద్వవైరుధ్యవాహి నులకు అతీతులం కావాలి. నేనెంత నిత్యనిరంతరసాధన చేస్తూవున్నాగాని నాలో ఆ త్రివిధపారిశుధ్యం ఇంకా వేరు పాతుకొనలేదని నాకు తెలుసును. అందుననే లోకం నన్ను

పొగడినప్పుడు అది నాకు ఉత్కర్ష కలిగించదు; పైగా తరచు అది విషకంటకంలా బాధాజనకమవుతూ వుంటుంది కూడా. బహిర్లోకాన్ని అస్త్రబలంతో జయించడంకంటె, అంతరంగ మందలి అరిషడ్వర్గాన్ని జయించడం నాకు కష్టసాధ్యమని పిస్తుంది. నేను భారతదేశానికి తిరిగివచ్చినది మొదలు నా లోలోపల అడగి మడగి దాగివున్న ఉద్రిక్తలు పైకుబికిన అనుభవాలు నాకు చాలా కలిగివున్నాయి. అది గమనించి నప్పుడు నేను నిరాశోపహతుడను కాకపోయినప్పటికీ, అవ మాన వినమ్రితుడను మాత్రం అవుతూవచ్చాను. అయినను, నా హృదయానుభూతులునూ, నా ప్రయోగసాధనలునూ మాత్రం నాకు ఆశాకరములుగాను, ఉపశాంతిదాయకములు గాను ఉపకరించాయి. కాని నేను ఇంకను క్లిష్టపధాన ప్రయాణించవలసివున్నదని ఎరుగుదును. నేను అల్పాల్ప మైన శూన్యబిందువుతో సమానతను సాధించవలసివున్నది. మనిషి తన స్వతంత్రబుద్ధితో తన తోడిజీవకోటిలో చిట్టచివరి స్థానంలో తాను నిలబడగలిగితే తప్ప, ఆతడు, ముక్తి పొంద జాలడు. వినమ్రభావంయొక్క అంచులను అంటుకొనుటయే అహింస.

ఆత్మకథ, 1948, పే. 615-16.

## 40

## తుదిమాటలు

నాకు ఏర్పడిన అభిప్రాయాలూ, నేను ఏర్పరచు కున్న నిర్ణయాలూ మారనివి కావు. రేపు నేను వాటిని మార్చుకోవచ్చును. నేను లోకానికి సరిక్రొత్తగా నేర్పే

సత్యాలేమీ లేవు. సత్యము, అహింస అనునవి భూధర సమానవయస్కములైన పురాతన సత్యాలే. నేను చేసినదల్లా ఆ రెండిటిని గురించీ వీలైనంత విశాలమైన వేదికమీద ప్రయోగంసల్పి చూడడం మాత్రమే. ఆ కార్యంలో అప్పు డప్పుడు నేను తప్పిదములుకూడా చేసివున్నాను. కాని ఆ తప్పిదములను బట్టి గుణపాఠాలుకూడా నేర్చుకున్నాను. ఆ రీతిగా జీవితమూ, జీవితంలోని వివిధ సమస్యలూ నాకు సత్యాహింసా సూత్రాల అనుసరణలో అన్నివిధములైన ప్రయోగక్రియలుగా పరిణమించాయి.

హరిజన్, 28-3-'36, పే. 49.

సత్యాహింసా సూత్రాలలో నాకు గల విశ్వాసం నిత్యం ప్రవర్ధమాన మవుతోనే వుంది. వాటిని నిత్యం నా జీవితంలో అనుసరించుటకు కృషిసల్పుతూ వుండుటచే నేను కూడా ప్రతిక్షణం ప్రవర్ధమానం అవుతూనే వున్నాను. వాటిలో నాకు నూతనములైన గూఢార్థాలు గోచరిస్తూనే వున్నాయి. దినదినం వాటిని నేనొక వినూతనకాంతిలో చూచి, వాటిలో నవ్యభావాలను దర్శిస్తున్నాను.

హరిజన్, 1-5-'37, పే. 94.

నేను ఏదిగాని వ్రాసేటప్పుడు అంతకుపూర్వం ఆ విష యమై ఏమి చెప్పివున్నాననే సంగతి ఎన్నడూ ఆలోచించను. ఏ సమస్యకుగాని నేను పూర్వం ఒసగిన అభిప్రాయాలతో వైరుధ్యం కలగకుండా చెప్పవలెనని ప్రయత్నించను; ఏ క్షణంలోగాని నా జ్ఞానచక్షువునకు గోచరమైన సత్యానికి

వైరుధ్యం కలగకుండా చెప్పవలెననే ప్రయత్నిస్తాను. తత్ఫ లితంగా నేను ఒక సత్యమునుంచి మరొక సత్యమునకు పెరగ గలుగుతున్నాను. తద్వారా నా జ్ఞాపకశక్తికి శ్రమ తగ్గించు కొనగలిగాను కూడా. అయినా నేను ప్రస్తుత క్షణాన్ని వ్రాసిన భావాలను ఏబదేండ్ల క్రితం నేను ఆ విషయమై వ్రాసిన వాటితో పోల్చవలసిన అవసరాలు కల్గినప్పుడు, ఆ రెండిటికీ అభిప్రాయభేదం నాకేమీ గోచరించివుండలేదు. కాని నాలో అభిప్రాయ వైరుధ్యాన్ని గమనించే మిత్రులు— వారికి నా పూర్వరచనలలో గోచరించే అభిప్రాయాలే ఎక్కువ స్వీకార్యమైతే తప్ప— నా చివరి రచనలలో వారికి ద్యోతకమయ్యే అర్థాలనే స్వీకరించవలసినదని కోరుతాను. కాని వారు ఈ రెండిటిలోనూ ఏదో ఒకటి ఎన్నుకునే ముందు వారి దృష్టికి ఆ రెండిటి మధ్యను గోచరించే స్థూల మైన వైరుధ్యానికి అడుగున అంతర్గర్భితమైన అవిరోధభావం కనిపిస్తుందేమో కొంచెం ప్రయత్నించి చూడవలసినదని నా సూచన. హరిజన్, 30-9-'39, పే. 288.

నా సందేశమూ, నా విధానాలూ, వాటియొక్క మూలసూత్రరూపంలో, యదార్థంగా లోకం యావత్తుకీ ఉద్దేశింపబడినవని నమ్రంగా నేను ఉగ్గడించినయెడల, అది గర్వాహంకృతిగా భావించరని తలుస్తాను.

వ్రాయబడే, ఉగ్గడించబడే హక్కుకంటె భావాలలో స్వతఃసిద్ధంగావున్న శక్తినే నేను ఎక్కువగా విశ్వసిస్తాను.

నేను ప్రాతినిధ్యం వహించే ఉద్యమానికి జీవముండి, అది పరమేశ్వరుని ఆశీస్సు పొందినదై వున్న పక్షంలో, ప్రపంచం లోని వివిధ భాగాలలోనూ నా భౌతికవ్యక్తి ప్రదర్శితం కావలసిన అవసరం లేకుండానే అది సర్వలోకాన్నీ ఆవరించ గల్గుతుందని నా నమ్మకం.

యంగిండియా, 17-9-'25, పే. 320.

నాలో ఏదో ప్రత్యేకమైన దివ్యాంశ వున్నదని నే నేమాత్రం అనుకోను; నే నొక ప్రవక్తననికూడా ఎన్నడూ తలచివుండలేదు. నేను కేవలం పట్టుదలతో కృషిచేసే ఒక అల్పుడనైన సత్యాన్వేషినని మాత్రమే తలుస్తాను. ఈశ్వర సాక్షాత్కారసిద్ధిని పొందుటకుగాను నేను దేనినిగాని త్యాగ మొనర్చుటకుమాత్రం నిత్య సంసిద్ధుడనై వుంటాను.

హరిజన్. 6-5-'33, పే. 4.

నేను నాకు దివ్యత్వం ఆపాదించుకుంటానా ? నేనొక క్రొత్త మతశాఖను స్థాపించదలచుకున్నానా ? అంటూ సిమ్లా నుంచి ఒక విలేఖరి బహుపట్టుదలగా ప్రశ్నిస్తూ వున్నాడు. ఆతని ప్రశ్నకు వ్యక్తిగతంగా లేఖవ్రాసి జవాబొసగివున్నాను. కాని ఆతడు ముందుతరాలవారికీ కూడా నా అభిప్రాయాలు స్పష్టంచేసే నిమిత్తం బహిరంగప్రకటన చేస్తేకాని వల్లకా దంటున్నాడు. నేనేమీ దేవుణ్ణికాదని గట్టిగా అనేక పర్యా యాలు వెల్లడిస్తూనేవున్నానని అనుకుంటాను. నేను కేవలం అడకువతో భారతదేశానికీ, ప్రపంచానికీ సేవచేయడమే

పరమార్థంగా భావించేవాడననీ, అట్టి సేవాపరత్వంలోనే ప్రాణాలు విడువవలెనని కోరుతాననీ మాత్రం బహిరంగంగా ప్రకటించగలను. నాకు ప్రత్యేకమతశాఖ ఒకటి స్థాపించాలని ఏ మాత్రం కుతూహలం లేదు. నేనేమీ క్రొత్తసత్యాలు కనిపెట్టి చెప్పడంలేదు. అందువల్ల కేవలం ఒక మతశాఖ తోటీ, ఒక చిన్న అనుయాయివర్గంతోటీ సంతుష్టిపొందే టంత అల్పసంతోషిని కాను నేను. నేను తెలుసుకున్న కేవల సత్యాన్ని నేను అనుసరించి, దానిని పునఃప్రసారంచేయు డానికి కృషిచేస్తాను. అనేక పురాతనసత్యాలపై నూతన కాంతిని ప్రసారం చేస్తానని మాత్రం చెప్పగలను. ఇది నా పృచ్ఛకుని, అట్టి తదితరులను సంతృప్తిపరచగలదని ఆశిస్తాను.

యంగిండియా, 25-8-'21, పే. 267.



స మా ప్తం.



# అన్యభాషాపదములు

అగియారి : జొరోస్ట్రియను మతస్థుల ఆలయము; పార్సీలు అగ్నిని ఆరాధించే స్థలము.

బటి : ఒక విధమైన లావుపాటి రొట్టె.

భట్టి : చిన్న కొలిమి.

భంగీ : పాకీపని చేసేవాడు, అస్పృశ్యుడు.

ఎఝువా : మలబారు ప్రాంతపు పంచముడు.

కాల్మా : ముస్లిం మతస్థుల ప్రార్థన శ్లోకం.

ఖుదా : ముస్లిం మతంలో దేవుని పేరు.

పెరయా : తమిళదేశపు పంచముడు.

ఫూకా : బలవంతముగా చివరిబొట్టువరకు పాలను చేపునట్లు చేయుటకుగాను ఆవు గుహ్యేంద్రియులోనికి గొట్టమును జొనిపి గాలిని ఊదునటువంటి ప్రయోగము.

జెంద్అవెస్తా: పార్సీలు లేక జొరోస్ట్రియను మతస్థులయొక్క వేదం.



# గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ
# స్టేటు బోర్డు సభ్యులు



అధ్యక్షులు :

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సంచాలక్-సభ్యత్వ కార్యదర్శి :

శ్రీ ఎస్. రామానంద్‌గారు

సభ్యులు :

శ్రీ ప్రభాకర్ జీ

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావుగారు

శ్రీ పి. వి. ఎస్. మూర్తిరాజుగారు

శ్రీ రామకృష్ణదూత్ గారు

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

శ్రీమతి ఆర్. కె. అనంతలక్ష్మిగారు

శ్రీ పాతూరి నాగభూషణరావుగారు

(తత్వప్రచారక్)

శ్రీ ఎ. రామనాధంగారు

(గ్రామసేవక్)

# గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

## సలహాసంఘ సభ్యులు



అధ్యక్షులు :

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు

ఉపాధ్యక్షులు :

ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

కన్వీనరు :

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సభ్యులు :

శ్రీ ఎస్. రామానంద్‌గారు

శ్రీ మోటూరి సత్యనారాయణగారు

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు

శ్రీ తెన్నేటి విశ్వనాధముగారు

శ్రీ కొడాలి ఆంజనేయులుగారు

శ్రీ వి. భానుమూర్తిగారు

శ్రీ కె. కొండయ్యగారు

# గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

## సంపాదక వర్గము

అధ్యక్షులు:

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సంపాదకులు:

శ్రీ తల్లాప్రగడ రామచంద్రరావు (కన్వీనరు)

శ్రీ పైడిమర్రి సత్యనారాయణమూర్తిగారు

సభ్యులు:

శ్రీ ఎస్. రామానంద్‌గారు

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

శ్రీ ముదుగంటి జగ్గన్నశాస్త్రిగారు

శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు

శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు

శ్రీ నండూరి వెంకటకృష్ణమాచార్యులుగారు

శ్రీ స్వామీ సత్యప్రకాశ్‌జీ ఉదాసీన్

# తెలుగులోనికి అనువదింపబడిన
# గాంధీజీ రచనలు

1. ఢిల్లీ దినచర్య
2. నా మతము
3. మన గ్రామ పునర్నిర్మాణము
4. నూతన విద్యా విధానము
5. అంటూ దిస్ లాస్ట్ (సర్వోదయ)
6. సర్వోదయ
7. నవీన విద్యాపథంలో
8. నిర్మాణ కార్యక్రమము

## అచ్చులో నున్నవి

9. పంచాయతీ రాజ్యము
10. సహకార సేద్యము
11. అస్పృశ్యతా నివారణ కార్యకర్తలకు
12. అహింసాత్మక సామ్యవాదము


గాంధీ సాహిత్య ప్రచురణాలయము
(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)
కాకినాడ